# శ్రీ దండకరామాయణము

ఇది

బళ్లారిజిల్లా, రాయదుర్గము తాలూకా, కలుగోడు గ్రామము

కరణం అశ్వత్థరావు చే

రచింపఁబడియె

చెన్నపురి :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.



వెల రు 3—8—0

# శ్రీ దండక రామాయణము

ఇది

బళ్లారిజిల్లా, రాయదుర్గము తాలూకా, కలుగోడు గ్రామము

కరణం అశ్వత్థరావుచే

రచింపఁబడియె

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

# విజ్ఞాపనము



తొలుదొలుత నే నీదండకరామాయణమును వ్రాయఁదలఁచు కొన్నప్పుడిది యింతవఱకు సాగి తుదముట్టుననియుఁ, గవిపండితవరుల హస్తముల కెక్కునంతటి యర్హత గాంచు ననియు నేమాత్రమును దలఁచియుండలేదు. కాని, తుద కిది యిట్టి యాకృతివహించుటెల్ల శ్రీరామచంద్రుని పరమానుగ్రహముకతమున ననియే భావింతును. అంతకును నాతఁడే ప్రేరకుఁడును, కారకుఁడును నై నాచే దీని నిర్వహింపించె నని మఱిమఱి తలపోసి యాతనికి బహుళ భక్తిపూర్వకనమశ్శతంబు లర్పింతును.

తొలినుండియు నాపైఁ దమ సహజ నిర్వ్యాజవాత్సల్యమును నెఱపి నాగ్రంథముల సరిచూచుచువచ్చిన శ్రీ కవిభూషణ, కప్పగల్లు సంజీవమూర్తిరావుగారు నా యీరామాయణముపట్లను శ్రద్ధవహించి సాంతముగఁ దిలకించి దోసముల సరిదిద్ది నాకు మహోపకార మొనర్చిరి. వారు నాసమీపబంధువులు. నా హితైకాభిలాషులు. మృదుమధుర మహితకవితా రచనావిచక్షణులు. వారికి నాకృతజ్ఞతా పూర్వక నమస్కారము లొనర్చెద.

ముక్కుమొగమెఱుఁగనివారిపై నైనను దమయవ్యాజప్రేమను నెఱపుట పెద్దలనైజ మనుటకు నిదర్శనముగ శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు నాగ్రంథము నెంతో యోపికమెయిఁ బరిశీలించి, యందలి బాగుల నెత్తిచూపియు, నోగుల చూసియుఁ జూపక సమర్థింపనోపియు పీఠిక వ్రాసి న న్ననుగ్రహించిరి. వారికి నాహృదయపూర్వక నమస్కృతులు.

ఇంకొకనిదర్శనముగా నించుక జంకు గొంకులతో నాగ్రంథ మును దమయొద్ద కనిపినంతనే కేవల కావ్యసృష్టిపై దృష్టినుంచి నాకును నసుబోటివారికిని గ్రంథరచన కెంతయో ప్రోత్సాహమొదవులాగున నాపుస్తకముపై తమయమూల్యాభిప్రాయముల వ్రాసి యనిపి నన్నాద రించిన పండితాఖండలులును విమర్శకాగ్రేసరులును, మహాకవి శేఖరులును అగు మహనీయుల కందఱకును నా పెక్కునమోవాకములు. వీరంద ఱిట్లు నన్ననుగ్రహించుటకు నాగ్రంథమునందలి పసకంటెను, వారికి శ్రీరామచంద్రునిపైఁ గలభక్తియే కారణమైయుండునని భావింతును.

రామాయణగ్రంథప్రాశస్త్యవిషయములయ్యు, దండకచ్ఛందస్సును గూర్చియు పండితులే తమ యమోఘాభిప్రాయముల వ్రాసొని యున్నారు. అంతకంటె నే నింకేమి నుడువగలను? శ్రీరాఘవేంద్రుని చరణయుగళమున కర్పించుటకుఁ దగిన యొకచిన్ని పూవుగ నిది భావింపఁ బడునేని నేను కృతకృత్యుఁడను.

శ్రద్ధవహించి ముద్రాపకులతో నుత్తరప్రత్యుత్తరముల జరిపి పనిగొనుచుండిన శ్రీ బి. కె. గురురాజరావు, బి. ఎ., బి. యల్., (వకీలు) గారికిని, ముద్రణవిషయార్థమై నావెంట మదరాసునకువచ్చి తగుసహాయ మొనర్చిన బ్రహ్మశ్రీ కావ్యతీర్థ విద్వాన్ రావాడ వెంకట రామశాస్త్రిగారికిని, విరామములేక పనులుండియు నాప్రార్థన నంగీకరించి సొగసార నీగ్రంథముద్రణ మొనర్చియిచ్చిన భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిని వందనశతంబు లర్పించుచున్నాఁడను.

క. అ.

## గ్రంథముద్రణము: ధనసహాయము.

## శ్రీరామకార్యముపట్ల ప్రజలభక్తిశ్రద్ధలు.

దాదాపు రెండుసంవత్సరములకు బూర్వమే 'దండకరామా యణ' రచన ముగిసినది. కాని గ్రంథముద్రణవిషయమై పాలుపోక,

ఇంత చేయించుకొన్నవాఁ డంతకు నోపఁడా, అసుధైర్యము గల్గి యుండియు, పురుషప్రయత్నమాత్రముగ ధనసహాయమునకై తగు వారితో ప్రస్తావించితిని. ప్రస్తావించినదే తడవుగ మిత్రులు శ్రీ వు. యల్లప్పగారు రు. 80-0-0 లును, శ్రీ కెంగరాజయ్యగారి బసయ్య రు. 150-0-0 లును, నాకిచ్చి మిగతసొత్తును సేకరింప, నాకోరినప్పుడంతయు పలుతావులకు నావెంటవచ్చి సాయపడిరి.

ఇది యిట్లుండగా, ఆంధ్రాంగ్లేయవిద్యావిశారదులగు శ్రీ యం. వి. లక్ష్మీపతి, బి. ఎ. గారు నాగ్రంథమువిషయ మెక్కడనో విని, వ్రాత ప్రతిని నాసుండి తెప్పించుకొని చదివి గడచినసంవత్సర మాశ్వయుజ శుద్ధసప్తమినాఁడు సన్మానించి రాయదుర్గమునఁ దమ స్వగృహమున ప్రముఖులఁజేర్చి, దండకరామాయణమును నాచేఁ జదివించి, గ్రంథ ముద్రణార్థము రు. 116-0-0 నొసంగి సన్మానించి తమ ఆంధ్రభాషాభిమానమును బ్రకటించిరి. అపారముగ సన్మానదరించి నూతనగ్రంథ రచనకు మిగులఁ బ్రోత్సహించి అప్పుడప్పు డావిషయమై నన్ను హెచ్చరించుచువచ్చిరి.

అదే నవరాత్రులలో ప్రియమిత్రులు శ్రీకోదండరామాచార్యులవారు బెలోడుగ్రామములో తమ స్వగృహమున 'శ్రీరామ సప్తాహము' జరుపుచుండి నన్నక్కడి కాహ్వానించి, స్వామిసాన్నిధ్యమున నాగ్రంథమునుంచి పూజించి శ్రీరామపట్టాభిషేకమునాఁడు నాచే నారామాయణమును చదివించి విని శ్రీరామప్రేరణయైన దనిచెప్పి గ్రంథముద్రణకని రు 20-0-0 ల నా కొసంగి శ్రీరామభక్తిని వెలి బుచ్చిరి.

ఆంధ్రాంగ్లేయభాషాకోవిదులు రాయంపల్లె శ్రీ. యన్. శేషాద్రి గారు రాయదుర్గం రైల్వేస్టేషనులో నొకనాఁడు ముచ్చటించుచు వారి తాతగారగు కీ॥ శే॥ శ్రీమాన్ తాతాచార్యులవారి పేరట రు 100-0-0 లొసంగి రామాయణగ్రంథముద్రణ కుపయోగించుకొండని సెలవిచ్చిరి.

శ్రీయుమిత్రులు శ్రీకలుగోడు పా. తిమ్మారెడ్డిగారు గుప్తదానము శ్రేష్ఠము గనుక పేరుప్రకటించుకొనన తమకిష్టములేదని విన్నవించి రు 40-0-0 లొసంగిరి.

పితృపాదులగు శ్రీభూపసముద్రం కరణం గుండూరావుగా రుచితముగా గ్రంథముద్రణకని యేబదిరూప్యము లొసంగి శ్రీరామార్పణ మనిరి.

గొల్లపల్లి కరణము (నామేనల్లుడు) చి॥ స॥ శ్రీ నరసింగరావు రు 100-0-0ల నోటొకటి నాచేతనుంచి 'శ్రీరాములకు నాసేవ' అని హస్తములు మోడ్చి నమస్కరించెను.

విఖ్యాతులగు శ్రీ. కె. బాలప్పగారు శ్రీకోదండరామాచార్యుల వలన నాగ్రంథము విషయము విని వారితో రు 80-0-0 లం బంపి శ్రీరామకార్యము నెడల తమకుఁ గలభక్తివిశ్వాసముల వెల్లడిచేసిరి.

శ్రీమద్రామాయణ నిత్యపారాయణ వ్రతనియతు లగు K. T. శ్రీనివాసాచార్యులు బి. ఎ., బి. యల్., (ప్లీడరు) గారు నారామాయణమును చదివించి విని గ్రంథమును గొని చని ప్రసిద్ధపురుషు లగు శ్రీకౌకుంట్ల కేశన్నగారితో గ్రంథమువిషయమై ప్రస్తావించి ఆర్థికముగ సహాయమపేక్షించి వారి సమ్మతినిబడసి నాకు జాబువ్రాసిరి. శ్రీయుతులు కేశన్నగారు వెంటనే రు 100-0-0 మనియార్డరుద్వారా నాకుఁ బంపిరి.

శ్రీ పెరుమాళ్ల చనమల్లప్పగారు, శ్రీ వేముల హనుమంతప్ప శ్రేష్ఠిగారు, శ్రీ నాగలాపురం రుద్రగౌడుగారు, చెఱి నూరు రూప్యము లొసంగిరి. పూజ్యులు శ్రీగుమ్మఘట్ట వేంకటేశ్వరశాస్త్రులు రు80-0-0లు, శ్రీరాచేపల్లి గోవిందప్పగారు రు 80-0-0 లు నొసంగిరి.

శ్రీమంతులు జయంతి ఈశ్వరప్పశ్రేష్ఠిగారు, చింతనూరు నాగయ్యశ్రేష్ఠిగారు, జయంతి రుద్రయ్యశ్రేష్ఠిగారు, పోలేపల్లి రుద్రయ్యశ్రేష్ఠి

(గోనభావి) ప్రభృతులు తమతమ భక్తికొలఁది దీన పాలుగొనిరి. మఱి కొందఱు మహనీయులు శక్తికొలఁది సహాయ మొనర్చిరి.

అసమవిక్రమవిరాజితులగు హనుమజ్జాంబవదాదులతోపాటు ఉడుతయు భక్తినెఱపి కృతార్థత నందలేదా? శ్రీరామసేవ కెల్లరును సమానులే! నిజశక్తితో భక్తిని ప్రకటించుశ్రద్ధయే భగవంతునకు పరమప్రియము!

శ్రీకలుగోడు ప. గోవిందప్పగారు ధనసహాయార్థమై తమపరిచితులయొద్దకు నాతోపాటువచ్చి శ్రీరామకార్యమున పాల్గొనిరి. శ్రీకౌకుంట్ల లచ్చెన్నగారు (జుంజరాంపల్లె) స్వపరహస్తములతో సహాయ మొనర్చిరి.

పూజ్యపాదులు శ్రీ నీలకంఠరావుగారు, శ్రీపాటీలు వీరభద్రగౌడుగారు, శ్రీవీరభద్రారెడ్డిగారు నన్ను తమతాళ్లకెరగ్రామమున కాహ్వానించి సంతోషమున మిగుల సాయమొనర్చిరి.

సహజౌదార్యస్వభావులగు మన్మిత్రులు శ్రీ గోనభావిపాటీలు పాపరెడ్డిగారు నాయభిమతము నాదరించి రు 200-0-0ల నొసంగి సత్కరించి తమసత్స్వభావమును దెలియఁజేసిరి.

మఱికొందఱు దైవభక్తులు విశ్వాసవితరణములతో ద్రవ్యమిచ్చి ధర్మబుద్ధిని వెలయించిరి. ఆయందఱిపేర్ల నిందువెంట బ్రకటించియున్నాఁడను. ఆయెల్లదాతృసత్తములఁ బ్రత్యేకప్రత్యేకముగ నొకొక్కరిఁ బేర్కొని హృదయపూర్వకమగు నాయభివందనము లర్పించి వారల కాయురారోగ్యైశ్వర్యములొసంగి మనుప శ్రితజనావనుండగు శ్రీరామచంద్రమూర్తిని భక్తిపురస్సరంబుగఁ బ్రార్థించుచున్నాఁడను.

నవనాగరకతాప్రభావ మెల్లెడల నిండి నిగనిగలాడుచుండు ఈకాలమునందును, భారత భాగవత, రామాయణాది ఆర్యుల మత ధర్మ పురాణగ్రంథములయెడల పూజ్యభావ ముంచి భక్తిశ్రద్ధలు

చూపు భాగవతోత్తము లెందఱో మనదేశమున నింకను లేకపోలే దనియు, అట్టి ఆస్తికశిఖామణులనామములఁ గర్ణానందముగ వినఁగోరు సజ్జను లెందఱో నేఁటికి నీభారతావని గలరనియు, జనసామాన్యమునకు దైవమునందుభక్తి, సత్కార్యములందాసక్తి, సద్గ్రంథపఠనమునందనురక్తిఁ గలుగఁజేయుట కిట్టి దాతృత్తములనామముల ప్రచురణ మెంతేని యావశ్యక మగుననియు, నాస్తికజనులచిత్తములు సంస్కరింపఁబడుటకు నిట్టి సత్పాత్రదానముల ప్రచురణ మొకమంచిసాధనముగఁ బరిణమింపవచ్చు ననియు భావించి దీని నిట్లు ప్రకటించితిఁ, గాని సహాయకుల సమ్మతిపైననుగాదు వారిని సంతోషపెట్టుటకునుగాదు.

ఇంతసహాయము శ్రీరామప్రేరణముననే జరిగినది. అది అట్టిపనికే వినియోగింపఁబడుచున్నది. నేనుకాని, ఏతత్సహాయకులుకాని ఇందుప నిమిత్తమాత్రులేమఁడీ!

ఇట్లు చేకూరినధనము 'దండకరామాయణము' 'అనుభవామృతము' అను గ్రంథద్వయముద్రణ కుపయోగింపఁబడు నని ధనసహాయ మొనర్చినదాతలకు, నాసవినయ విజ్ఞాపనము.

ఇట్లు,
సుజనవిధేయుఁడు
కలుగోడు అశ్వత్థరావు
గ్రంథకర్త.

కలుగోడు
25-6-49

# ధనసహాయమొనర్చిన దాతృోత్తములు



| | | |
|---|---|---|
| 1. | శ్రీ పాటీలు, పామరెడ్డిగారు, గోనభావి | 200-0-0 |
| 2. | ,, కె. బసయ్య, కలుగోడు | 150-0-0 |
| 3. | ,, యం. వి. లక్ష్మీపతిగారు బి. ఎ., రాయదుర్గం | 116-0-0 |
| 4. | ,, పయ్యావుల కేశన్నగారు, కౌకుంట్ల | 100-0-0 |
| 5. | ,, యస్. శేషాద్రిగారు, యినాందార్, రాయంపల్లె | 100-0-0 |
| 6. | ,, పాటీలు వీరభద్రగౌడుగారు, తాళ్లకెర | 100-0-0 |
| 7. | ,, కరణం నరసింగరావుగారు, గొల్లపల్లె | 100-0-0 |
| 8. | ,, వేముల, హనుమంతప్పశ్రేష్ఠిగారు, రాయదుర్గం | 100-0-0 |
| 9. | ,, పెరుమాళ్ చనమల్లప్పగారు, రాయదుర్గం | 100-0-0 |
| 10. | ,, పాటీలు, రుద్రగౌడుగారు, నాగలాపురం | 100-0-0 |
| 11. | ,, కె. బాలప్పగారు, రాయదుర్గం | 80-0-0 |
| 12. | ,, గు. వెంకటేశశాస్త్రిగారు, రాయదుర్గం | 80-0-0 |
| 13. | ,, పుష్పశెట్టి, యల్లప్పగారు, కలుగోడు | 80-0-0 |
| 14. | ,, రాచేపల్లి గోవిందప్పగారు, వెంకటంపల్లి | 80-0-0 |
| 15. | ,, జయంతి ఈశ్వరప్పశ్రేష్ఠిగారు, రాయదుర్గం | 50-0-0 |
| 16. | ,, కరణం గుండూరావుగారు, భూపసముద్రం | 50-0-0 |
| 17. | ,, జుంజరాంపల్లె గ్రామంనుండి | 50-0-0 |
| 18. | ,, చిదునూరు నాగయ్యశ్రేష్ఠిగారు, రాయదుర్గం | 40-0-0 |
| 19. | ,, పాటీలు తిమ్మారెడ్డిగారు, కలుగోడు | 40-0-0 |
| 20. | ,, పాటీలు వీరభద్రారెడ్డిగారు, తాళ్లకెర | 40-0-0 |
| 21. | ,, పో. రుద్రయ్యశ్రేష్ఠిగారు, గోనభావి | 40-0-0 |
| 22. | ,, కు. కంపళి చిన్నబీరప్ప-మారప్పగార్లు, రాయదుర్గం | 40-0-0 |
| 23. | ,, గొం. తిమ్మప్ప-యర్రంపల్లె | 30-0-0 |
| 24. | ,, లిం. గాని బొమ్మయ్య, కలుగోడు | 30-0-0 |
| 25. | ,, కౌకుంట్ల లచ్చన్నగారు, జుంజరాంపల్లె | 25-0-0 |
| 26. | ,, పాటీలు తిమ్మారెడ్డిగారు, తాళ్లకెర | 25-0-0 |
| 27. | ,, బండిరామప్పగారు, రాయదుర్గం | 25-0-0 |
| 28. | ,, కె. నారాయణరెడ్డిగారు, రంగసముద్రం | 25-0-0 |

| | | |
|---|---|---|
| 29. | ,, కూ. హనుమంతప్పశ్రేష్ఠిగారు, వెంకటంపల్లె | 25-0-0 |
| 30. | ,, కోదండరామాచార్లుగారు, జేలోడు | 20-0-0 |
| 31. | ,, జయంతి రుద్రయ్యశ్రేష్ఠిగారు, రాయదుర్గం | 20-0-0 |
| 32. | ,, ఆర్. గురుస్వామిగారు, రాయదుర్గం | 20-0-0 |
| 33. | ,, పట్టె, గంగప్పగారు, రాయదుర్గం | 20-0-0 |
| 34. | ,, జి. గో. గారి రామచంద్రప్పశ్రేష్ఠిగారు, రాయదుర్గం | 20-0-0 |
| 35. | ,, కూ. అంజనప్పగారు, రంగుచేడు | 20-0-0 |
| 36. | ,, కూ. తిప్పేస్వామిగారు, రంగుచేడు | 20-0-0 |
| 37. | ,, పూ. సంజీవప్పగారు, వెంకటంపల్లి | 20-0-0 |
| 38. | ,, క. అయ్యప్పగారు, కలుగోడు | 20-0-0 |
| 39. | ,, కొ. దేవన్నగారు, వెంకటంపల్లి | 20-0-0 |
| 40. | ,, శే. గౌరయ్యశ్రేష్ఠిగారు, రాయదుర్గం | 20-0-0 |
| 41. | ,, రెడ్లపల్లి, భీమప్పగారు, వెంకటంపల్లి | 20-0-0 |
| 42. | ,, కాలువ, చిన్నచిత్తయ్య, కలుగోడు | 20-0-0 |
| 43. | ,, చి. స. గారి పాలయ్య, రంగుచేడు | 20-0-0 |
| 44. | ,, కొ. గారి లక్ష్మయ్య, రంగుచేడు | 20-0-0 |
| 45. | ,, కొ. గారి రుద్రప్ప, రంగుచేడు | 20-0-0 |
| 46. | ,, గొల్ల, చెల్లారప్ప, గొల్లలదొడ్డి | 20-0-0 |
| 47. | ,, కొ. రం. గారి మారయ్య, రంగుచేడు | 20-0-0 |
| 48. | ,, పి. సంజీవరావు, కలుగోడు | 15-0-0 |
| 49. | ,, వెం, రా. గారి సూరయ్య, రాయదుర్గం | 15-0-0 |
| 50. | ,, ఓబయ్యగారి రంగప్ప, రాయదుర్గం | 15-0-0 |
| 51. | ,, చిన్నపల్లెక్కిరెడ్డి, తాళ్లకెర | 15-0-0 |
| 52. | ,, చిం, రామప్ప, రంగసముద్రం | 15-0-0 |
| 53. | ,, చి. హనుమంతప్ప, కలుగోడు | 10-0-0 |
| 54. | ,, చి. రామప్ప, కలుగోడు | 10-0-0 |
| 55. | ,, కా. సుబ్బయ్య, కలుగోడు | 10-0-0 |
| 56. | ,, కూ. రామక్రిష్ణప్ప, కలుగోడు | 10-0-0 |
| 57. | ,, గొం. హనుమంతప్ప, యర్రంపల్లి | 10-0-0 |
| 58. | ,, మలశెట్టి రంగప్ప, చెలిమేపల్లి | 10-0-0 |
| 59. | ,, బంగి గంగప్ప, రాయదుర్గం | 10-0-0 |
| 60. | ,, కుమ్మరతిప్పయ్య, రాయదుర్గం | 10-0-0 |
| 61. | ,, నాగశెట్టి, గంగప్ప, రాయదుర్గం | 10-0-0 |
| | | 1916-0-0 |

# పీ ఠి క

శ్రీకలుగోడు అశ్వత్థరావుగారు నాకింకను సాక్షాత్తుగా పరిచితులుగారు. ఐనను ఈరామాయణమునకు పీఠిక వ్రాయుమని నన్ను ఒత్తిడిచేసి తమయుదారహృదయమును వెలువరించినారు.

నే నెఱిఁగినంతలో ఇది క్రొత్తత్రోవ; మఱియు సాహసకార్యము. దండకచ్ఛందస్సు సంస్కృతవాఙ్మయమందే చాల ప్రాచీనము. తెలుఁగులో దానివ్యాప్తి ద్విపదవలె, పండితులకంటె సామాన్యజనుల సాహిత్యమం దెక్కువ. దానికి ముఖ్యమైనకారణము దానినడక స్పష్టముగా లయబద్ధమై విన్నమాత్రాననే వెనువెంట నృత్యముచేయుబుద్ధి నుద్రేకింపఁజేయఁగల్గుట. దానిని చదువుకొనుచున్నప్పుడు, అర్థభావము లెట్లుండినను, మనహృదయాలలో ఏదోయొకనిర్లక్ష్యత, పొగరు, నిండు కడుపుఁదనము—ఇటువంటి అనిర్వచనీయము, అసంలక్ష్యక్రమమును అగుఉల్లాసమొకటి అనుభవమునకు వచ్చును. సీసము, ద్విపద, అక్కర, మొదలగు దేశీయచ్ఛందస్సులలో కొంతసందేహముతో కుంటుచు నడచిన ఖండజాతినడక ఐదుమాత్రలగణగతి దీనిలో సర్వాధికారముతో విజృంభించును. పట్టిగతిచేతనే తెలుఁగువారిహృదయములను ఇంతగ మారగొన్న, కొనఁగల, వేఱొక్కచ్ఛందస్సు నే నెఱుఁగను. కనుక నే నన్నయభట్టారకుఁడు మొదలుగా మహాకవులును, అల్పకవులును, ఇంచుమించుగా అందఱును బరిగ్రహించి యనుగ్రహించినారు. కాని స్పష్టమై నిర్దయమైన దీనిలయప్రాకారరేఖలలో అర్థభావరచనలను స్వాతంత్ర్యముచాలక, వారందఱును స్తుతివర్ణనమొదలగు ఖండవిషయములకుమాత్రము దీనిని క్వాచిత్కముగా నుపయోగించిరి కాని దీర్ఘకావ్యరచనకు ఎత్తుకొనలేదు. శ్రీరామచరిత్రవంటి పెద్దకథను ఇందులో రచించి నిర్వహించినవారు నాకు శ్రీఅశ్వత్థరావుగారొక్కరే కానవచ్చినారు.

నిరోష్ఠ్యాదినియమాలతో ఇట్టికావ్యమును రచించుటవంటిదే ఇదిగూడ. రగణమయమగుటచే ఈపూర్వులో అదికాక యతగణ

ములు రెండే సాధ్యములు. అనఁగా ఛందస్సునఁ గల యెనిమిదిగణా లలో ఐదుగణములు పనికిరావన్నమాట! రెండులఘువులు చేరికగా నుండ వీలులేదు. గురువులకంటె లఘువులే యెక్కువగాఁగల తెలుఁగు భాషలో ఈనియమ మెంత తొందరనిచ్చునో యూహింపవచ్చును. అసలు రామకథ చెప్పుచు దశరథుఁడు భరతుఁడు జనకుఁడు మొదలగు ప్రధానవ్యక్తులనుగూడ అనామధేయులనుగాఁ జేయవలసియున్నాఁడు కవి. కొన్ని పేళ్లు కొంతస్వరూపపాటనికిని లోఁగవలసియున్నవి. అశోక వనము 'అశోకావని'గా, విభీషణుఁడు 'విభీషుఁడు'గా, ఈగ్రంథములో మార్పడియుండుట చూడవచ్చును. ఇట్లైనను కవిగారు ఇంతదీర్ఘముగా ఇంతసరసముగా, ధారాళముగా నిర్వహించియుండుట చాలవిస్మయా వహమైనవిషయము.

ఆమహాకవి వాల్మీకిమహర్షి యమృతరసనారంగమున ఏస్థిర ముహూర్తమున శోకము శ్లోకమై శ్రీరామకథారూపమున తాండవింప నారంభించెనోకాని నాఁటినుండి నేఁటివఱకు ఆచరిత్రసుధలో ప్రేలద్దని కవి మనదేశములోఁ గానరాకున్నాఁడు.

"యది క్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్య చరితం,
గుణై రేతావద్భిః జయతి పునరన్యో జగతికః.

అని భట్టమురారి అనర్ఘరాఘవమున తనచాపల్యమును సమర్థించు కొన్నాఁడు. అది తక్కిన అందఱుకవుల సాహసమునకును సమాధానము గాఁజాలును.

కథ ఎంతపవిత్రమైనను పురాణమైనను ప్రమాణభూతమైన్నను దానిని ఉన్నదున్నట్లు తూ. చా. తప్పక అనువాదముచేయుటలో తృప్తి తక్కువ. యథారుచిగా యథాశక్తిగా చేర్పులు తీర్పులు చేయకయుం డలేము. ఇది మనుష్యులకు సహజమైన నిర్మాణోద్రేకపుఫలము. కాళి దాసుమొదలుగా మహాకవులు అందఱును ఇంచుమించుగా ఈపని చేసినవారే. శ్రీరామకథలో వాల్మీకితరువాత ఇట్లు జరిగినమార్పులు సమకూర్చి, వానికి ప్రోత్సాహకములైన భారతీయుల కళానీతిధర్మదృ ష్టులను చర్చించుట యొకఘనకార్యము. అది యట్లుండనిత్తము. ప్రకృ తము శ్రీఅశ్వత్థరావుగారిరచనలోఁగూడ అట్టిస్వాతంత్ర్యము అందందు

తళుక్కనుచున్నది. వాల్మీకినే ప్రధానముగా ననుసరించుచున్నను రంగనాథునిరామాయణము మొదలగునవికూడ వీరిరచన కుపకరించినవి. ఇందు ప్రధానముగాఁ గానవచ్చు ఉపకథలకును కథాభేదములకును ఆకరములేవో కవిగారే సూచింపవలసియున్నది. అవి యట్లుండఁగా వాల్మీకిరచనలో సూక్ష్మముగా వీరు చేసినకొన్నిమార్పులు వీరిదృష్టివైశిత్యమును వెలువరించుచున్నవి. మచ్చు లొకటిరెండు.

(౧) దశరథునిమృతికి కైకేయి యెప్పుడుగాని దుఃఖించినట్లు వాల్మీకి స్పష్టముగా వచింపలేదు. సవతిమత్సరము పుత్రవాత్సల్యమును మంథరబోధనచే ఆమెహృదయమును కొంతకఠినముచేసినవిగాని భర్తమృతికి కన్నీరైనను విడువనంతటి అసతికాదుగదా ఆమె! ప్రస్తుతకవిగారు అందఱికన్న నెక్కువగా కైకచే ఏడిపించి ఆపాత్రమును కొంత పోషించినారు. తరువాత భరతుఁడువచ్చి చూచువేళకు ఆమె 'హర్షంబునన్ బొంగుచు' ఉండె ననుటగూడ ఆపాత్రపోషణకు వన్నెనే తెచ్చినది.

(౨) మారీచునివెన్నంటిన శ్రీరాముని క్షేమము విచారించుటకై లక్ష్మణుని అనరానిమాటలాడి సీత తఱిమినప్పుడు అతఁడు చాల నొచ్చి వదినెను 'ధిక్ త్వామద్య ప్రణశ్య త్వమ్' ఛీ నీవు పాడయిపో'—(వా. రా. అర. ౪ౕ- ౩౧) అని కటువుగా తిట్టినట్లు వాల్మీకిరచన. అశ్వత్థరావుగారిలక్ష్మణుఁ డంతతెగించి మాటలాడుపాఁడు కాఁడు. 'తల్లీ! ఇటులే చెల్లునే తిప్పుగా నన్ను భావింప ? గానిమ్ము నీకున్ బంచభూతమ్ములే ప్రోచు ! జాగ్రత్త ! నేఁ బోయివత్తున్' అనిమాత్రము 'దేహంబు కంపింపఁగా, నీరు నేత్రంబులన్ రాలఁ గేల్మోడ్చి' పల్కి వెడలిపోయి నాఁడు.

(౩) వాల్మీకి హనుమంతు నెంత గొప్పవ్యక్తిగా నిరూపించియున్నను ఒక్కచోమాత్రము పచ్చికోతిగానే చిత్రించినాఁడు. అతనిగొప్పతనమంతయు సంపాదితమేకాని సహజమైనది కపిత్వమే యనియే వాల్మీకి సమాధానము. సీతకై రావణుని యంతఃపురమంతయు వెదకునప్పుడు రాత్రి రావణునిప్రక్కలో నిద్రించుచున్నమందోదరిని చూచి దాని

సౌందర్యమునకు భ్రాంతుఁడై సీతమ్మనే చూచితి ననుకొని హనుమంతుఁడు.

'ఆస్ఫోటయామాస చుచుమ్బపుచ్ఛం
ననన్దచిక్రీడ జగౌజగామ
స్తమ్భానరోహ న్నిపపాత భూమౌ
నిదర్శయన్ స్వాంప్రకృతిం కపీనాం'

(రా. సుం. ౧౦ - ౫౪)

సహజమైన తనకపిత్వమును చూపుచు "తోకను జాడించెను; ముద్దుగొనెను; సంతసించెను; గంతులువేసెను; పాడెను; పాటాడెను; కంబాలెక్కెను; క్రిందికిదూఁకెను."

ఈగ్రంథమున హనుమంతుఁడు మందోదరి "దివ్యసౌందర్య రేఖల్ విలోకించి యన్నాతియే సీత కానోపునం చెంచి లో నుల్లముల్ గాత్ర మాపాదముల్ జల్లనన్ నీరు గ్రమ్మన్ విచేష్టుండునై నిల్చి 'హా! సీత దుష్టాత్ముఁడౌ రావణున్ గూడె నింకేల నాసాహసం, బేల శ్రీరాము యత్నంబు" అని గాబరామాత్రము చూపి గౌరవము నిల్పుకొన్నాఁడు.

ఇట్టివన్నెలు చిన్నెలు ఇందందు చూడవచ్చును. గ్రంథమాద్యంతము కవిగారికిఁగల శ్రీసీతారామభక్తికి నిదర్శనముగా నున్నది. దీనిని యథార్థముగా చవిగొని ఆంధ్రులు గ్రంథకర్తగారిప్రయత్నము సఫలము చేయుదురుగాక!

మైసూరు
వ్యయ ఆశ్వయుజ
శు ౧౫

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ.

# పండితాభిప్రాయములు

**ANDHRA UNIVERSITY**

FROM WALTAIR

SIR C. R. REDDY, KT; DATE 16—4—1947

*Vice Chancellor*

అయ్యా,

మీరుపంపిన "దండకరామాయణము"ను చదివినాను. రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు మొదలగు మహనీయులు మీపాత్తమునుగూర్చి చక్కగా ప్రశంసించి యున్నారు. కాబట్టి నేను దానిగుఱించి ఎక్కువచెప్ప నవసర ముండదు.

మీరు రచించిన "దండకరామాయణము" ఆంధ్రవాఙ్మయమున క్రొక్కదుసొబగు చేకూర్చినదని చెప్పుటలో నేమాత్రము నతిశయోక్తిలేదు.

మీ "దండకరామాయణము" క్రొత్త తరహా గ్రంథము; గమనింపదగినది.

ఇట్లు

కే. రామలింగారెడ్డి.

---

కింకవీంద్రఘటాపంచాన, బాలసరస్వతి, బాలకళానిధి,విమర్శకాగ్రేసర, కళాప్రపూర్ణ పండితకవిశిరోభూషణేత్యాది బహుళబిరుదాంచితులును, శతశతావధాన కవితాసామ్రాజ్యచక్రవర్తులును, నగు

## శ్రీ శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు.

ఆ యీ దండకరామాయణమును నేను "ఇతిశ్రీ"గా సర్వమును జదివి చూచితిని. కథలో నక్కడక్కడఁ గొలది పాటిమార్పులు కలవు. ఆమార్పులుకూడఁ బాలహృద్యముగా నున్నవి. ఒక్క తగణముతో యావత్తుగ్రంథమును నడిపించుటలో నున్నకష్టమెట్టిదో కవు లందఱకిని దెలిసినదే. పీఠికాకర్త దానిని వ్యాకరించెను. కనుక విస్తరింపవలసినది లేదు.

ద్రాక్షాపాకముగాఁ నూటికిఁ దొంబదిభాగములును, దక్కినపదిభాగములును గదళీపాకముగను నిండలిరచన యున్నట్లు నాకుఁ దోఁచినది. రచన యావత్తు వాల్మీకము ననుసరించి ప్రవర్తించినను, దాని కియ్యది "మక్కికిమక్కి" తెలుఁగుమాత్రము కాదు. (మక్కికి మక్కి యన్నటుల మార్చిన కావ్యము శ్రావ్య మెట్లగుఁ?)

ఈగ్రంథకర్తకు దెలుఁగుకవికిఁ గావలసినంత గీర్వాణసాహిత్యముకూడ నున్నట్లు గ్రంథములోని భాగములుకొన్ని తెల్పుచున్నవి.

విభీషణ, గంధమాదన, లోనగునవి తగణమయమగు దండకములో నిముడక విభీష, గంధమాద అని కవి వాడెను. పీఠికాకర్తలు సమర్థించిరి. నాకుమాత్రము రుచింపక మార్గాంతరము సూచించితిని. శాస్త్రరీతిని సమర్థింప వీలుగా నున్నను, శ్రుతికటువుగా నుంటచే నట్లూనర్చితిని ఇదితప్పు సర్వమునకును పీఠికాకర్తలయభిప్రాయముతో నేకీభవించుచున్నాను.

అనేకులు కైకొన్నయితివృత్తమే యైనను కొన్నివిశేషము లందు నూతనములు కలవు. రచన నిర్దుష్టము. ఈకవి మిక్కిలి ధన్యుఁడు; మాన్యుఁడు.

భక్తజనకల్పకంబగు శ్రీరామచంద్రుఁ డీగ్రంథకర్తకు సర్వవిధములగు శ్రేయస్సులను బ్రసాదించు నని నేను విశ్వసించుచున్నాను.

వెం॥ శా॥ శతావధాని.

క్షీరసాగరం—బెజవాడ.

---

శ్రీమహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ, కవిసార్వభౌమ,
ఆంధ్రవ్యాస, అభినవ శ్రీనాథ, వేదవిద్యావిశారద,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు,
సుదర్శనభవనము,
రాజమహేంద్రవరము.

శ్రీకరణము అశ్వత్థరావుగారు: రచించినదండకరామాయణము (వ్రాతప్రతి) నేను అక్కడక్కడ జదివితిని. దీనిపై పెక్కురుపండితుల యభిప్రాయములు గలవు. నన్నును గోరుటంజేసి నే నిట్లు వ్రాయుచున్నాను.

పూర్వకవులు రచించినగ్రంథములుండ వానిని మఱియును వ్రాయుచున్నపు డేదే నొకవిశేష ముండును. గ్రంథమంతయు నొక్కదండకముతోడ వ్రాయుటయే యిట విశేషము. రసద్రాక్షపాకము లభించెనా?...

మధురముగా నున్నది.

అక్కడక్కడఁ జిన్నిచిన్ని దోషములు కన్పట్టుచున్నవి. అవి సవరించి ముద్రించుటొప్పునని నామనవి.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

శ్రీ మహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
## డాక్టరు: చిలుకూరి నారాయణరావుగారు,
ఎం. ఎ., పి. హెచ్. డి, ఎల్. టి.,

"శ్రీరామచంద్రునిచారిత్రము నెవ్వ రెన్నిగతులఁ రూపించినఁ గ్రాలదే."
ఇది దండకరూపమున రచింపబడిన రామచంద్రునిచరిత్రము.

నూతనపక్కి; అపూర్వకవిభావితము. భాష సరళము, సులభము; గతి లలితము; రీతి మధురము. ఇంతకంటె వ్రాయనక్కరలేదు.

చిలుకూరి నారాయణరావు.

---

శ్రీమహామహోపాధ్యాయ, విద్యావారిధి, అవధాన శిరోమణి,
## కాశీకృష్ణాచార్య, (గుంటూరు.)

మహాశయా!

ఆశీరాద్యుభయకుశలోపరి సాంప్రతము. శ్రీరస్తు॥ శ్రీమతియు చిరంజీవినియుఁ సౌభాగ్యవతియుఁ నగు మాభారతీదేవికంఠంబునఁ దొలుదొల్త నాయాశీఃకుసుమమాలికల ప్రేమపురస్సరంబుగ నర్పించి పిమ్మట మీభారతినిగుఱించి నాయాశయమును దెల్పుదును.

సుమారేబదియేండ్లకుఁబయినుండియుఁ బలువురుకవులు తమగ్రంథములను మదీయవిమర్శనాభిప్రాయార్థము నాకడకుఁ బంపునభ్యాసము గలదు. మొదటిమొదటివారికైతలు ధారాశుద్ధి, మృదుమధురశైలి, ఝుటితిరసస్ఫూర్తి, విలక్షణభావ ద్రాక్షాపాకాదుల నొప్పియుండి, స్వపరిశీలనార్థము నన్నుఁ బ్రోత్సహించుచుఁ, జూచినకొలఁదిఁ జూడవలయునను నుత్సాహమును గల్గించి, నాకుఁ గడుంగడుసంతసముఁ గల్గఁజేయుటయేగాక, కొంతజ్ఞానాభివృద్ధినిఁగూడ నొసంగినవి. కాని యిటీవలఁ గొన్నికైతలు తమసమాజపిశాచనారికేళపాకాదులచే నాతల బ్రద్దలుగొట్టి, పరగ్రంథవిమర్శనాభిప్రాయదానాదులనుండి నన్ను సన్యసింపఁజేసినవి.

మీదండకరామాయణాశ్వత్థేశశతకముల యెడలఁగూడ నాకట్టివిరక్తియే కల్గి మీగ్రంథము నాకుఁ జేరినదిమొదలు సుమారిరువదిదినములవఱకు దానిని దెఱచియైనచూడనైతిని. "స్వార్థములేని పరార్థప్రయత్నము పరమాత్మకు నుండదు" అను న్యాయమున మీరు నాసజాతీయులగుటచే స్థాలీపులాకన్యాయమునగనైన, మీకైత నొకమారు మాత

మని తలంచి యానాఁడె 5 పుటలఁ జూడఁగల్గితిని. వార్ధకకార్యాతిపాతాదులచే నవి చ్ఛిన్నముగఁ జూడలేనైతిని. కాని సాన్తమొనర్చ్వఱకు మీకైత న స్వీడలేదు.

మీశతకమును జదివినపుడు "అభినవవేమన" బిరుదమునకు మీ రర్హులని యేరికేనిఁదోఁచకపోదు. పండితపామరోభయమనోహరమగు మీదండకరామాయణము, మీకు జన్మకవులని చాటుచున్నది. కైక, జటాయువు, కబంధుఁడు, మారుతిమున్నగువారి కథాసందర్భములలోని యౌచిత్యాదు లతిరమణీయములు. నాజన్మలో నేను విమర్శించి అభిప్రాయ మొసఁగిన మాధ్వగ్రంథము మీదిమాత్రమే. అందుచే మీగ్రంథ మేమాత్రము ప్రథమత్వమునకుఁ దీసిపోదు. "సృష్టిరాద్యేవ ధాతుః" అనుసూక్తికి లక్ష్య మగును.

శ్రీరామమహత్వమునకు దండకాయనము ప్రథమకారణ మగుటచేఁగాబోలు "దండకరామాయణ" మను పేరున గ్రంథ మొనర్చుటకు, అశ్వత్థేశుఁడు మీకు సహజప్రతిభ నొసంగెనని నాయాశయము. ఇతిశమ్.

క. శ్రీభారతి మీకు సకల, సౌభాగ్యము లొసఁగ వదన సదనగ యగుచున్
శోభిలెఁ, గవితాప్రతిభా, శోభీ! అశ్వత్థరాయ సుజనవిధేయా!.

కాశీ కృష్ణః.

---

## 'కవిసామ్రాట్' శ్రీవిశ్వనాథ సత్యనారాయణ ఎం. ఏ, గారు.

రామాయణములు తెలుఁగుభాషలో ననేకము లున్నవి. ఇంకను కవులు వ్రాయుచునే యున్నారు. పెద్దనదులు, చిన్ననదులు, వర్షానదులు, గ్రీష్మనదులు ఎన్నిచొచ్చినను నిండని సముద్రమువలె యీరామాయణము నందలియాకర్షణ యనంతముగా నున్నది.

దండకము లనేకవిధములు సర్వతగణమైన దండకము సామాన్యమైనది. ఈఛందస్సునే పుచ్చుకొని అశ్వత్థరావుగారు రామాయణమంతయు వ్రాయుట కథకును భావమునకునుమాత్రమే ప్రాధాన్యమీయదలచినట్లున్నది. ఏదేనొక్కఛందస్సు పుచ్చుకొని సర్వకావ్యమును వ్రాయుటకు కవి కొక్కశక్తి కావలయును. అట్లు సర్వకావ్యము వ్రాసి పూర్తిచేయుటవలన నీకవి కీశక్తి యున్నదని నిశ్చయమగుచున్నది.

కవితాశక్తు లనంతములు. ఒకడు కొద్దిపద్యములనుమాత్రమే వ్రాయగలడు. మరి యొకడు వానిని రసవంతముగగూడ చేయగలడు. మరియొకడు పెద్దగ్రంథమును వ్రాయును. దానిలో గుణము లేకపోయినను, అది పెద్దగ్రంథమగుటయే గుణము. మరి యొక డంతపెద్దగ్రంథమును వ్రాసి, సన్నయ్యలిక్కన్నలవలె పరమశిల్పభూములుగా చేయును. ఇది యనంతమైనశక్తి. ఇట్లే యీకవితాశక్తిలో తరతమభావము లెన్నియో

యుండును. అట్లే యొకమహాకావ్యమును ఒకటే ఛందస్సుమీద నడుపుట యొకవిలక్షణ మైనశక్తి.

ఈయన ప్రధానముగా రామకథనే తీసికొనెను. ఉపకథలను పరిత్యజించెను. ఒకటి రెంటిని తీసికొన్నను, అల్పాల్పముగా స్పృశించి వదలిపెట్టెను. అని యూరకొనలేదు. తనకు వీలైనచోటనెల్ల క్రొత్తకల్పనలు చేయుచునే యుండెను. దశరథుడు కైకేయీ సౌధమునకు పోవునపుడు చేసిన యంతఃపురవర్ణన, ఆంజనేయుడు లంక తగులబెట్టినపుడు రాక్షసులు పడిన గగ్గోలు చాల స్వతంత్రముగ నందముగ నున్నవి. ఇట్టి యనేకకల్పనలు కలవు.

ఈయనభాషయు సాధువుగా నున్నది. ఒడిదుడుకులులేనిభాష ప్రసన్నతా గుణము ప్రధానమైనభాష అల్పదోషము లెవ్వరికైన నుండవచ్చును.

ఈకవి యింకోధికమహాగ్రంథములు వ్రాసి, చిరాయుష్కుడై సంపద్వంతుడగుగాక!

విశ్వనాథసత్యనారాయణ,

బెజవాడ.

---

"ఆంధ్రవాల్మీకి, కళాప్రపూర్ణ, అభినవవ్యాస"

శ్రీజనమంచి శేషాద్రిశర్మగారు.

దండకరామాయణము:—ఇది మ॥రా॥శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారిచే రచియింపఁబడినది. పేరుచేతనే యర్థము స్పష్టముచేయుచున్నది. పద్యాత్మకములుగను, గద్యాత్మకములుగను, శ్రీరామచంద్రకథను రచించి మహానందమునొందినవారు కలరు, ద్విపదకావ్యముగా రచించినవారును గలరు.

బాలకాండము మొదలు యుద్ధకాండముదనుక దండకముగా వీరు కథను నడిపించిరి. ఓపికమై సొంపుగాఁ బాఠకులకు శ్రమ మొదవకయుండ రచించి వీరు ధన్యులైరి. శ్రీరామ చంద్రుని నిర్మలశీలమును దెలుపుకావ్యమును బఠించువారికిఁ గొదవయుండదని నావిశ్వాసము. వేదపాఠమువలె పరమపవిత్రత్వము నాపాదించు నీయుత్తమోత్తమ కావ్యమును రచించి కవి కృతార్థుఁడయ్యెనని భావించుచున్నాఁడను. ఇట్టియుత్కృష్టగ్రంథముల రచించి జన్మసార్థకమగునట్లు చేసికొందురుగాక! శైలి సలక్షణము, సులలితపద సంగ్రథితము. దీనిం జదివి భక్తులు తరింతురుగాక.

ఇట్లు,

జనమంచి శేషాద్రిశర్మ.

---

## సుప్రసిద్ధ విమర్శకాగ్రేసరులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, తిరుపతి.

ఉద్దండధారగల 'దండకరామాయణమును' స్థాలీపులాకన్యాయమున చదివి చూచితిని. శ్రీ యనంతకృష్ణశర్మగారు, అస్మద్గురువర్యులు వెంకటశాస్త్రిగారు వెల్లడించిన పరితోషమునకు బలే యని తోడుపలుకుటకంటె నే వెల్లడింపఁదగిన యభిప్రాయభేదములేదు.

గ్రంథకర్తగారు రచనపుసొంపును, ఔచితిని జక్కఁగా ఎఱిగినవారు. కాన కొఱఁత కానరాలేదు. మృదంగధ్వనికి విజ్జోడుగాకుండ భావానుకూలముగా నర్తకియడుగుజాడ సాగినట్లు, దండకచ్ఛందముతో పదవిన్యాసము, భావప్రసారమునకు ననుగుణముగా ననిగా నీగ్రంథమున సాగినవి.

గ్రంథమెల్ల దండకముగానుండుట యిది యొకక్రొత్తతీరు.

కవికౌశలమును గొండాడుచు నీదండకరామాయణమునకు సహృదయలోకము స్వాగతము చెప్పగలదని తలఁచుచున్నాను.

వే. ప్రభాకరశాస్త్రి.

---

"మహాకవి, కవిసింహ, అవధానిపంచానన" విద్వాన్,

## శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రులుగారు.

(ప్రొద్దుటూరు)

పూజ్యులు కలుగోడు అశ్వత్థరావుగారు రచించిన శ్రీదండకరామాయణము' చదివి మిగుల నానందించితిని. ఈనాఁటిరచనలలో దీనిప్రత్యేకత ముమ్మూర్తుల గోచరించి నా కత్యంతాశ్చర్యము కలిగించినది. దండకచ్ఛందము ,విపులకావ్యరచన, రామాయణమే కథావస్తువగుట, ఇవియే ముమ్మూర్తులు.

మానవుని బ్రతుకు తెరువులోఁ గారుమొగిల్లు క్రమ్ముకొని తెరవెనుక దివ్యజ్యోతి దృగ్గోచరము కాకపోవుటతో ఆయతి యల్పమై, భవిష్యత్తు భావదూరమై నెలకొన్న నిర్వేదమో విశ్రాంతిలోఁ దొంగిచూచిన వెట్టిశృంగారమో కవితావస్తువై భావాలాపనమే ఆత్మానందమే కావ్యప్రయోజనమైన యీకాలములో రామాయణము కావ్యవస్తువగుట వింతకాదా! ఇది రామనామమహత్త్వమో దానిని ఛందోబద్ధముఁ జేసిన వాల్మీకితపోబలమో కావచ్చు. కావుననే రామాయణము కావ్యప్రపంచమున ననంతావతారముల సాక్షాత్కరించుచున్నది.

"యదిక్షుణ్ణం. పూర్వై రితిజహాతిరామస్యచరితం
గుణై రేతావద్భిర్జయతిపునరన్యోజగతికః."

అను భట్టమురారిసవాలు విన్నాఁడేమో దానియాంతర్యమును గన్నాఁడేమో, అశ్వత్థరాయఁడు. ధీరసాహసముతోఁ గలము చేతఁబట్టి

"ఉత్పత్స్యతే మమతు కోపిసమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ."

అన్న భవభూతివలె రామాయణరచన సాగించినాఁడు.

ఆయుపువలె నాత్మశక్తియు, దీక్షాదక్షతలవలెఁ దీరిక యోపికలును దగ్గిపోయి "మనకు మహాకావ్యములు రచించుకాలము గడచిపోయినది" అని పెద్దలుకూడ నను కోవలసిన యీదినములలో అశ్వత్థరాయఁడు మహాకావ్యముల సృష్టింపఁ గలిగినాఁడు. ఇది సాహసమేయైనను దీనితో నాహారపుష్టియు నాత్మతుష్టియు సాధించి, కొలతబత్తెముతో గుటికలు మ్రింగవలసిన, యీరోజులలో "రాయలనాఁటి రాయలసీమవాసి" యనుపించు కొన్నాఁడు. పరిణతశక్తులైన ప్రాచీనకవులతోఁ బందెముచఱచి రామాయణమహార్ణవము బారలువైచి యీఁదినాఁడు. వింతయేమనఁగా: దండక మూఁతగా గుండియ బిగఁబట్టి ఒంటిచేతనీఁది ఒడ్డుత్రొక్కుట అపును. ఈరామాయణగానమున దండకచ్ఛందము శ్రుతి పెట్టుకొనుటలో నీయన గండతన మొంతేనిగలదు. సంస్కృతచ్ఛందమగు దండకము గీర్వాణకావ్యములందే విరళప్రచారము గలది. తెలుఁగుకవులు నడుమగనే వాడు కొన్నారు. అదియు స్తుతివర్ణనాదులందే. కారణము దానిపోకడ లట్టివి. దానియుద్ధత గమనములోఁ దత్తద్రసానుగుణమైన భావాలాపనము పదబంధమున నొదిగించుకొనుట చిన్నపనికాదు. అల్పానుభవము చాలదు. ఇది మత్తగజమును సర్కసులో నృత్తము చేయించుటవంటిది. రామాయణమువంటి విపులకావ్యమును దుదిమొదలుగ దండకచ్ఛంద మున నడిపి దరిత్రొక్కుటలో అశ్వత్థరాయఁడు మహాప్రాణత దక్కించుకొన్నాఁడు. ఒడుదుడుకులకు మెడవంపని యొకయుద్ధతవ్యక్తి ప్రతికూలపరిస్థితులలో నెట్లు నడచునో యీరచనమున స్పష్టముగాఁ జూడవచ్చును. ఈమహాప్రమాణమున నెగుడుదిగుడులలోఁ జిక్కుచీఁదరలలో నెచ్చటనైనఁ గాలుబెడిసినచో వ్రేలుమడిగినచో నది వింతగాదు. "గచ్ఛతస్ఖలనం నదోషాయ" యనుట పెద్దలెఱుఁగనిది కాదు.

ఎట్టుత్రిప్పినను య, ర, త గణములకంటె వేఱుగతిలేని యీబంధమునందు, జన కుఁడు, దశరథుఁడు, భరతుఁడు ఇత్యాది నామముల యిమిడిక సంభవముగాదు. అయినను ఈయన పేరులు త్రుంచి గుణములు పెంచి దండలు గ్రుచ్చినాఁడు. కథానాయకునితో గవియు దండకసంచారమును చేసినపు డాయనయనుభవము లీయన కెట్లుతప్పును? కను కనే ఆయన సీతతో, సింహాసనమునఁ బట్టాభిషిక్తుఁ డగుచుండఁగా నీయనయు నమల

కీర్తితో నాంధ్రసారస్వతమున సుప్రతిష్ఠితుఁ డగుచున్నాఁడు. ఇందు విశేషమేమనగా: రాముఁ డాదివిష్ణువు. అతనికి ధనుర్ధరుఁడై నలక్ష్మణుఁడు వెంట నున్నాఁడు. హనుమజ్జాంబవదాదు లాజ్ఞాకరులు పెక్కురు. ఈయనలో! ఈయన పుణ్యము దొడ్డది. పూనికయు దొడ్డది. ధన్యుఁడై నాఁడు.

శ్రీరామనామమువలె దండకరామాయణము శాశ్వతజ్యోతియై ఆంధ్రలోకము నలంకరించుఁగాక! ఆంధ్రసారస్వతమున అశ్వత్థరాయఁడు అర్హస్థానము నందుగాక!

ప్రొద్దుటూరు.
౧౫-౧౧-౧౯౪౬ } గడియారము వెంకటశేషశాస్త్రి.

---

"కవిసార్వభౌమ, చారిత్రకకవిబ్రహ్మ, మహాకవి మార్తాండ"

## శ్రీదుర్భాకరాజశేఖర శతావధానిగారు.

(ప్రొద్దుటూరు)

ఇందలిది రామాయణకథ. రచయిత, బళ్లారిజిల్లా రాయదుర్గమున వెలుఁగోండు "కలుగోడు" గ్రామవాస్తవ్యులు శ్రీ. కె. అశ్వత్థరాయకవిగారు.

శ్రీరామచంద్రుఁడు మహోఘనతఁగాంచిన సూర్యవంశమున కెత్తిన మహావజ్రమయ కిరీటము. మహావీరుఁడు ధర్మనిరతుఁడు ధర్మసంస్థాపకుఁడు విష్ణుని సప్తావతారము. ఈ మహావీరునిగుఱించి యాంధ్రభాషలో వ్రాయఁబడినన్ని గ్రంథను లేభాషయందు నుండవు.

రామాయణముఁ దొలుత నాంధ్రమున వెలయించినవాఁడు భాస్కరుఁడు. ఈయనకవిత్వ ముదాత్తమైనది. రెండవది రంగనాథకృత రామాయణము. అయ్యలరాజు వా రవలివారు. ఇంచుమించుగ నీకాలమందలి విదుషీమణియే మొల్ల. అవ్వల గోపీనాథ కృతరామాయణము. వావిలకొలను జనమంచిరామాయణము లీవలివి, రంగనాథకృత రామాయణము "ద్విపద" కొండవీటి చేద్రాడువలె నుండునందురుకాని, యాయనద్విపద సరసపదసంభృతమై, శ్రావ్యమై, యాకర్షకమై యలరారుచున్నది. తక్కినవారి గ్రంథములు పద్యాత్మకములు. ఉత్తరరామాయణ గాథలలోఁ దిక్కనగారిది కంకంటివారిది పేర్కొనఁదగినవి.

పూర్వాధునికకవు లందఱు రచించిన రామాయణకథనే మఱలఁ జేకొని వ్రాయ నేటికని కొందఱు సందేహింతురు. యవ్వారికి "రాఘవేశ్వరుచారిత్రము నెవ్వ రెన్ని విధులన్ వర్ణించినన్ గ్రాలదే!" యని కంకంటికవియే సమాధానము నెలవిచ్చియున్నాఁడు. అంతతో నాగక,

"ఉ. మానకకర్మభూమిపయి మానుషదేహముతో హితాహిత
జ్ఞానమెఱుంగు బ్రాహ్మణుఁడు చారుకవిత్వము నేర్చి జానకీ
జానికథల్ రచింపక యసత్కథ లెన్ని రచించె నేనియున్
వానివివేక మేమిటికి ? వాని కవిత్వమహత్వ మేటికిన్ ?"

అని నొక్కిచెప్పియున్నాఁడు. ప్రస్తుతకవియు దాను రామాయణకథనే కైకొన్నను, ఛందఃప్రకారమును మార్చి "దండక" రూపమున దీనిని వెలయించినాఁడు. ఇది దుస్సాధ్యప్రయత్నమే! దండకమంతయుఁ నొక్క 'త'గణముతోడనే నడపవలయును. దశరథుఁడు, భరతుఁడు, సుబాహుఁడు, లోనగు లఘుబహుళములగు పురుషనామములును మిథిల మొదలగు పుర దేశనామములును నీఛందమున నిముడవు.

ఆ యీ కష్టముచేతనే కాఁబోలు నీకవి రావణానుజుని 'విభీషాఖ్యుఁ' డని ప్రయోగించినాఁడు. 'ణ' వర్ణలోపము గొప్పలోపమే! అచ్చతెనుఁగు గబ్బములు లిఖించినకవులకుఁగూడ నిట్టికష్టములు కలిగియుండుట యెఱుంగుదుము. 'సీతాదేవి' యన వలసినచోట నాఁగేటిచాటిపడంతి యనియు మట్టిపట్టి యనియు నేల బిడ్డ యనియు వాడిరి. కాని 'సీతాదేవి' శబ్దమందలి మార్దవ మాధుర్యములును, శ్రవణసుఖమును శత లక్షాంశమైన నీపేరులకు లేదనుట నిశ్చయము !

ఈకవి పెక్కురామాయణములు శ్రద్ధమై బఠించి, శోధించి కథాంశమును గైకొన్నాఁడు. అయోధ్యాకాండకథ మిగులసరసముగాసాగినది! మంథరా కైకలసంభాషణమును కైకేయీదశరథులవాగ్వ్యధానమును గష్టించి చేకూర్చుకొనఁబడినవి. తక్కిన కథాభాగములు యథాతథముగ సాగినవి. గ్రంథము సులభశైలని సకలజనసుబోధముగ నడచినది!

ఆంధ్రమున "దండకరూప" గ్రంథము లేసికొఱంత నీకవి తీర్చియున్నాఁడు. ఈ నూతనవిధానము ననుసరించిన కవిగారిని మిక్కిలి యభినందించుచున్నాను.

ఇట్లు,
దుర్భాక, రాజశేఖరశతావధాని.

---

## కావ్యతీర్థ విద్వాన్ శ్రీ రావాడ వేంకటరామశాస్త్రులు.

తెలుఁగుపండితుఁడు, మునిసిపల్ హైస్కూలు, బళ్లారి

నాదకళాబిందువులలో బిందువనునది అనభివ్యక్తజగదంకురావస్థకు బీజభూతమైన అఖండము నిర్గుణము అగు పరబ్రహ్మతత్త్వము. ఈ బ్రహ్మతత్త్వముయొక్క అభివ్యక్త

సూక్ష్మస్వరూపమే కళ. ఈకళయొక్క స్థూలస్వరూపమే నాదము. ఈనాదముయొక్క పరిణామవిశేషమే శ్రీమద్రామాయణమహాకావ్యము.

ఇందలియితివృత్తము శ్రీరామచంద్రపరబ్రహ్మముయొక్క మహిమానువర్ణనాత్మక మగుటచే నిద్దానిని మంత్రద్రష్టలగు మహర్షివరేణ్యులు వేదములుఁగా బఠించిరి; వాల్మీక్యాదులు మహాకావ్యముగ నొనర్చి వివిధరీతుల వర్ణించిరి; మహితభాగవతులు నామసంకీర్తనాదుల భజించి మైమఱచిరి. వారు పీ రననేల? ముంగిటిబిచ్చగానిమొదలు మూలింటిముసలమ్మవఱకును రామనామంపుచవి నెఱుంగనివారు లేరనియే చెప్పవచ్చును.

మనదేశమున ననాదిగ నెలకొనియుండు నీవాతావరణమే ఆంధ్రదండక రామాయణ కావ్యావతరణమునకుఁ గారణము. కనుక నచ్చెరంవడ నక్కఱలేదు. కాని నిమిషనిమిషమునకు నుత్పాతశతము లుప్పతిల్లునిక్కాలమున మన్మిత్రమును మహాకుటుంబియునగు శ్రీ అశ్వత్థరావుగారు మనఃక్షోభము నేమాత్రము నందక మాన్యగ్రంథరచనల నతాకికానందము ననుభవించుచుండుటమాత్రము వింతగ నున్నది. ఇంతేకాదు. ఏకొన్నిరచనములకో అనువుగనుండుదండకము నందఁగాఁ గొని నానారసాశ్రయమగు రామాయణకథను ఉడివోని నుడికారములసొంపు పెంపొంద ఒడుదుడుకులులేక నడిపించుట వింతలలో వింత యనునట్లున్నది.

గ్రంథకర్తగారు నేను ఏకమండలవాసుల మగుట నొకయింటివారమే. కావున నీవిషయమున నింతకంటె మిక్కుటముగ ముచ్చటింపఁజాల. అయినను నీదండకరామాయణము కుకవితండములకుఁ గాలదండమై ముక్తిపథమున నడయాడు పాఠకలోకమునకుఁ గైదండయై, నలుగడల గడలుకొన్న కవికీర్తిని గొలుచు మానదండమై, తన నామైకదేశమును సర్వవిధముల సార్థకపఱచి వఱలుఁగాత మని పరమేశ్వరుఁ బలుమఱుఁ బ్రార్థింతు.

రావాడ వేంకటరామశాస్త్రి.

---

## కవిభూషణ శ్రీకప్పగల్లు సంజీవమూర్తిరావుగారు,(బళ్లారి.)

ఉ. శ్రీరఘురామపావనచరిత్రములోని మహత్వ మెట్టిదో
యారయరాదుగా! బహుజనాళిమనంబులఁ జూఱకొన్న యా
చారుకథాక్రమంబునకుఁ జక్కనియాకృతు లెన్నియిచ్చి యే
తీరున వ్రాసినన్ దనివి తీరదుపో, సుకవీంద్రకోటికిన్. 1

సీ. పద్యకావ్యాకృతుల్ వహియించి పెక్కుఱ హృదయ మాకర్షించి ముదము నించె
ద్విపదకావ్యాకృతిన్ వీధివీథులఁ బ్రాఁకి యూరూరఁ బలువుర నుద్ధరించె
గద్యకావ్యాకృతుల్ గైకొని కృపమీఱ నాబాలవృద్ధుల నాదరించె
నాటకాకృతుల రంగస్థలిన్ విహరించి కనువారి నానందవనధి ముంచె

గీ. పాటరూపున గాయకునోట వెడలి, శ్రోతలను భక్తిపారవశ్యుల నొనర్చి
నన్ని తానై రహించురామాయణంబు, జనులపాలిటి యమృతరసాయనంబు. 2

క. నిండారుమహిమ నయ్యది, పండినవయసుగల ముక్తిపథగాముల కై
దండ యయి నడపనో యన, దండకరూపమున నిపుడు తరలెన్ వెలికిన్. 3

చ. ఇది సరళంబునై మిగుల హృద్యమునై రసబంధురంబునై
సదమలభావపూర్ణమయి సత్పద గుంఫితమై సువర్ణనా
స్పదమయి కర్ణపేయమయి పండితపామరలోకగణ్యమై
పొదలుచుఁ దన్నుగన్నకవిపుంగవుకీర్తికిఁ గీర్తి కూర్పదే. 4

క. జలజాయతాక్షుకరుణన్, కలుగో దశ్వత్థరాయకవికృతమై భా
సిలు దండకరామాయణ, మలరుత మారవి శశాంక మవనీస్థలిపై. 5

కప్పగల్లు సంజీవమూర్తిరావు.

## "అభినవభట్టనారాయణ" పాతాళభేది సుబ్రహ్మణ్యకవి.

విద్వాన్ పి. ఒ. యల్; సీనియర్ ప్రొఫెసర్ ఆఫ్ తెలుఁగు యస్.వి.ఒ. కాలేజి, తిరుపతి.

క. అందందుఁ జూత మని నా, డెందంబునఁ దలఁచి యిది పఠింపం బూనం
బొందుగ నిరుమారులు దీ, నిం దవుల మనంబు పూర్ణనియతిఁ జదివితిన్. 1

ఆ. గద్యకావ్య మనఁగఁ గాదు సరేకదా, పద్యకావ్యమనఁగఁ బట్టు దిద్ది
చంపు వదియుగాదు జానగు క్రొందెల్లు, తగణములను వెలయు దండకంబు. 2

తే. పోల నశ్వత్థరాయని పూన్కియేమొ, యొక్కగణముననే యొప్పుచుండునట్లు
రామచరిత సర్వంబును రమ్యభంగిఁ, దురగధారగ నడపె జాతురి వెలయఁగ. 3

మ. రసభావంబులు గూర్పఁగాఁదలఁచి కమ్రచ్ఛందముల్ పూని, సా
రసమగ్రత్వము పొందసెంచి కవులబ్రంబైన కావ్యంబులన్
బసతో వ్రాసిరి కాని దండకముగాఁ బట్టించిరే యెవ్వరేన్
పసి నశ్వత్థకవీంద్రుభంగి నిదెపో చాతుర్య మన్నం గదున్. 4

చ. కత తొలుకాడకుండ ఘనకావ్యను భావము తప్పకుండ సం
స్తుతులకుఁ బాత్రమై వెలయ సూరులయొాదల లూపఁజాలు నీ
గతి రచియింపఁగా నరిదిగాదె యితోధికవృద్ధి చెంది సం
గతిమెయి నీకవీశ్వరుని కావ్యము లొప్పెడుగాక ధారుణిన్. 5

## కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

'ఉభయభాషాప్రవీణ' ప్రొఫెసర్ ఆఫ్ తెలుగు

(హెడ్ ఆఫ్ ది తెలుగుడిపార్టుమెంటు) యస్. వి. ఒ. కాలేజి తిరుపతి.

మృదుమధురపదలలితము, లలితాలంకారకలితము నగు దండకరామాయణముం జదివి యమందానందమొందితి. ఇట్టికార్య మపూర్వమగుట నిది యాదికావ్యము. రామభక్తిసామ్రాజ్యాధినేత అశ్వత్థరాయఁ డాదికవియే.

భక్తాగ్రేసరుఁడగు బమ్మెరపోతరాజు భాగవతముంబోలె నాబాలగోపాల మీదండకముం జదివి ధన్యమాగాత.

ఇట్లు,

కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి,

---

## బ్రహ్మశ్రీ కలుగోడు అశ్వత్థరావుగారి సన్నిధికి :

అభినవబాణకవి, ఆశుకవిచక్రవర్తి, కవిసార్వభౌమ, విద్వాన్, గౌరావఝ్ఝల రామకృష్ణశాస్త్రి శతావధాని, మునిసిపల్ హైస్కూలు తెలుఁగుపండితుఁడు, కర్నూలు సీతారామశాస్త్రి శతావధాని, గజ్జలకొండ.

మహాశయా !

శతకంబున్ బఠియించినాము మును మీసామర్థ్య మద్దాన నే
యతిమోదం బిడె; దండకంబు నిపు డూసాంతంబు గన్గొంటి మీ
గతి ద్రాక్షారసమాధురీధురి నశక్యం బిద్ది వ్రాయంగ, భా
రతి యుష్మద్రసనాగ్రరంగమునఁ బూర్ణప్రజ్ఞఁ జూపించెడిన్.
కలికాలం బిది రామచంద్రుకథ నాకర్ణింప రెవ్వార లీ
వల నీదండక మన్న నెల్లరకు నేవంగొల్పె నైన న్భవ
ల్లలితాలంకృతచారు చిత్రకవితాలావణ్యముం గాంచినం
బళి! యెవ్వారు పఠింపకుండెదరు యుష్మత్కావ్య మోధీమణీ.

---

## శ్రీ విద్వాన్, అనుముల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

రిటైర్డు తెలుఁగుపండితుఁడు. మునిసిపల్ హైస్కూలు, కర్నూలు.

శ్రీ కలుగోడు అశ్వత్థరావుగారు రచించిన అశ్వత్థేశశతకమును, దండకరామాయణమును, వారు పంపఁగాఁ బఠించుభాగ్యము నాకు లభించినది. నేటికిఁగూడ నీరామాయణ

సీమకవులలోఁ గానవచ్చు నైలీవైశిష్ట్యము నీరి యీకావ్యద్వయమునందు నైతము స్పష్టముగా గానవచ్చుచున్నది. పూర్వసంప్రదాయసిద్ధమును, నిర్దుష్టమును, మనోజ్ఞము నైన పీఠికవితాఫక్కిక యెంతేని గణనీయమై యున్నది.

తొల్లి మహాకవు లచ్చటచ్చట దేవతాస్తోత్రములకొఱకు మాత్రమే యుపయోగించుచువచ్చిన దండకము శ్రీనాథమహాకవిచేఁ బరదోషోద్ఘాటన ప్రక్రియయం దుపయోగింపఁబడి వింతగొలుప నారంభించెను. తరువాత రాయలసీమం జన్మించిన యొకానొక కవిశేఖరునిచే భాషీయదండక మనుపేర హాస్యరసప్రధానమగుకావ్యరూపమును బొందింపఁబడి పఠితృజనమున కాశ్చర్యముగలిగించినది.

ఇప్పు డీయశ్వత్థరాయకవిగారి యద్భుతప్రతిభావిలాసముచే శ్రీరామకథారూపమును బొంది యీదండకము సకలసుకవిజనాహ్లాదకారియై వెలుఁగొందుచున్నది. మును న్నొకప్పుడు దండకాలంకారభూతమై విరాజిల్లినయాపవిత్రతేజము చిరకాలమున కీయశ్వత్థరాయకవిమూలమున మరల నిప్పుడు దండకాలంకారభూతమై విరాజిల్లుచు నాంధ్రలోకము నానందపరవశము గావించునుగాక !

అనుమల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

---

## న మ శ్శ్న త ము.

### విద్వాన్: కవికిశోర శంకరప్రదాద్, శ్రీభవానీశంకరకుటీరము.

చదివితి మీదు రామకృతి సాంతము; జాను తెనుంగులైన యూ
పదములసొంపు, భావరసవాహినిలీయదనాలు, భారతీ
వదనమునుండి వెల్వడిన భాతిని దోఁచెడి యెట్లువ్రాసిరో
కద! రససిద్ధులౌకవుల గంటము లిట్టివికావె సత్కవీ ! 1

నన్నయతిక్కయజ్వలను నాచనసోమన నెఱ్ఱనాదులన్
గన్న తెనుంగు గౌరవము కావ్యసుమాలపరీమళాకృతిన్
గన్నది; దాని నిల్పఁగల కావ్యము లీయెడ సున్నటంచు నే
మున్న దలంచినాఁడఁ, గని ముగ్ధుఁడనై తిని మీదుసత్కృతిన్. 2

ఇతరులు వోనిమార్గమున నేగుచు రామచరిత్ర దండకా
కృతిఁ గృతిఁజేసి మారుతికిఁ గేల్గవ మోడ్చి యొసంగినారిఁకన్
బ్రతి యెవరయ్య మీ కిటను ప్రాంజలినై యిడుచున్న నా "నమశ్శతము"ను బ్రేమమీఱన్ గొనుచు సంతసము న్బొనరింపుసత్కవీ ! 3

---

## శ్రీ విద్వాన్, బళ్లారి వెంకోబరావుగారు.

బి. ఒ. యల్. ప్రధానాంధ్రపండితుఁడు బోర్డుహైస్కూలు, రామదుర్గం.

సీ. వాల్మీకిమౌనీంద్ర వాక్సుధాకలితమై యాదికావ్యం బన నలరెనెద్ది,
భవభూతిముఖ మహా కవిగణగ్రథిత రూపకరూపముల చేతఁ బ్రబలెనెద్ది,
త్యాగరాయాది గాయకకోటికలవిపంచీనాదరమ్యమై చెలఁగెనెద్ది,
కైవల్యపదసాధకం బయి భక్తుల తారకమంత్రమై తనరె నెద్ది,
ఆ. అట్టి రామవృత్త మతిమధురంబుగ దండకమునవ్రాసి ధన్యుఁడైన
ఈకవీంద్రుగ్రంథ మీతనిప్రతిభయుఁ నాంధ్రభూమియందు నలరుఁగాక! 1

ఉ. వాగనుశాసనాదికవి వర్యసమర్పిత భవ్య కావ్యమా
లాగణితాలిధీధితి సమంచితమై భవ భారతీవధూ
టీగళసీమ, నవ్యప్రకటీకృత రామచరిత్రదండకం
బూగెడుఁగాక దండ యయి యొప్పుచు నారవితారకంబుగన్. 2

సీ. సమధికభావనా శక్తిసంపన్నతఁ బాత్రపోషణమును బాదుకొల్పి
బహువిధాలంకృతి ప్రాంచితవర్ణనం బౌచిత్యయుక్తిచే నలరఁజేసి
మృద్వీకపాకసమిద్ధమంజులశైలి బహురసాన్వితముగఁ బరగఁజేసి
వ్యంగ్యప్రధానభావంబుల వృత్తిరీతుల మధురంబుగా లలి నొనర్చి.
ఆ. ఆంధ్రభాషయందు నలదండకచ్ఛంద, మందు కావ్యమొకటి పొందుపఱచి
తనరుచుండె నితఁడు దండకబ్రహ్మ నా, వ ఙ్మయమ్మునందు వాసికెక్కి.

విద్వాన్ బళ్లారి వెంకోబరావు,

---

తిరుపతి 30-10-47

నమస్తే:—

దండికవిశ్వ మీవిమల దండకరూపము దాల్చి మత్తవే
దండము రాజమార్గమున దర్పమునం గమనంబుసేయున
ట్లుండె నటంచు పూజ్యులు న వోదయమంచు విధాతరాణియున్
మెండుగ మున్గి తేలిరి సుమీ! మదిమెచ్చి ప్రమోదవారిధిన్.

ఇట్లు
భవదాశీర్వచనాభిలాషి.
బి. యస్. రాజు.

# విషయసూచిక.

## బాలకాండము



## అయోధ్యాకాండము

| విషయము. | | పుట. |
|---|---|---|


## అరణ్యకాండము

| | | |
|---|---|---|

## కిష్కింధా కాండము

## సుందరకాండము

## యుద్ధకాండము

విషయము.

శ్రీరామాయనమః.

23-5-46 తేది శ్రీ 'మురుడీ' ఆంజనేయస్వామికి సమర్పించిన

# పద్య పుష్పములు.



ఉ. శ్రీమదనంతభవ్యసురసేవితపాదసరోరుహా! మహా
భీమపరాక్రమా! రిపువిభీషణవిగ్రహా! భక్తపోష! శ్రీ
రామపదాబ్జసంస్మరణలక్ష్యవిభాసితమానసా! గుణ
స్తోమ! మహాత్మ! మానిజనతోష! సదా 'మురుడీ' పురాలయా!. 1

సీ. నీలనీరదకాయ! నిరతసన్మునిగేయ
భవ్యరూపాయ! తుభ్యన్నమోస్తు
అంజనావరపుత్ర! రంజితశుభనేత్ర!
పావనగాత్ర! తుభ్యన్నమోస్తు
రాక్షసకులనాశ! రాఘవపదదాస!
భక్తప్రపోష! తుభ్యన్నమోస్తు
దుష్టశిక్షణదేవ! శిష్టరక్షణభావ!
బ్రహ్మస్వరూప! తుభ్యన్నమోస్తు

తే. రక్ష మాంరక్ష కపిరాజ! రమ్యతేజ!
పాహి మాంపాహి పరమాత్మ! పావనాత్మ!
దేవదేవేశ! జగదీశ! దివిజపోష!
భవ్య'మురుడీ'పురావాస! దివ్యవేష. 2

ఉ. శ్రీరఘురామపాదసరసీరుహభృంగ! దయాంతరంగ! దు
ర్వారదురంతవిక్రమపరాక్రమబాహుబలాఢ్య! భీకరా
కార! పరాత్పరా! సుజనకామితదాయ! దీనరక్షకా!
వీరవిహార! శ్రీకర! కపిప్రవరా! మురుడీ పురాలయా. 3

క. కంటిని నీపదపద్మము
మంటిని నీకృపను నేఁడు మాన్యుఁడనైతిన్
కంటకముల గెంటించుచు
వెంటనె రక్షించు చేయివిడువకు నన్నున్.

మ. అవతారంబును వీడుచో రఘువరుం డానాఁడు నిన్నియ్యెడన్
భువిలో నిల్వఁగఁ జెప్పి తాను జనెఁ బో పోషింప భక్తౌఘమున్
సవిశేషంబుగ; నట్లుగానియెడ నాసర్వేశ్వరుం బాసి యీ
భువిలో నిల్తువె, యిట్లు నీవు 'మురుడిన్' భూరిప్రభావుండవై.

సీ. సంతానమును గోరి చింతించుభక్తుల
వంశవృద్ధి నొనర్చి వఱలినావు
ఐశ్వర్య మాశించి యతిభక్తి సేవించు
వారి సంతాపంబుఁ బాపినావు
వ్యాజ్యంబులను జిక్కి వచ్చి నీమరుఁగును
జొచ్చువారి కభయ మిచ్చినావు
జాడ్యంబుచే నొచ్చి శరణన్న దీనుల
యపమృత్యువును దోలి యఱరినావు

గీ. కొల్చుజనముల రక్షింపఁ బొల్చినావు,
పొల్చి పోషింప దీక్షను దాల్చినావు,
తాల్చి బిరుదంబు, భక్తులఁ బిల్చినావు,
పిల్చి దాసుల వెతఁ దీర్ప నిల్చినావు. 6

శా. సీమంతంబులు జాతకర్మవిధులున్ జెల్వొప్పఁ జేయంచుటల్
ప్రేమన్ బాలురకేశఖండనములున్ బెండ్లిండ్లు పేరంటముల్;
సామాన్యంబుగ నీదుసన్నిధిఁ బ్రజల్ సాగించుటన్ నిచ్చలున్
స్వామీ! పందిరి పచ్చతోరణము కాఁజాలెన్ భవత్స్థానమున్. 7

ఉ. గంటలు చాల మ్రోఁగఁగ నగారులు 'ఢా' మ్మని నాద మియ్య జా
గంటలు మించి 'ఝై'-య్యని యగాధముగ్గా రవళించుచుండ వే

వెంటనె 'ఝల్లరీ'ధ్వని ఘల్లుగఁ జెల్లఁగ వేళవేళలన్
గంటివి నీకు పూజ లిడఁ గంటి మునీశ్వరులు గ్రమ్మ నిమ్ముగన్ 8

శా. వేణీ లడ్డు జిలేబి మోదకములున్ ఖేణైన పోళీలునున్
వే నోరూర్చెడు పూరికల్ వడియముల్ వేరైనమేల్ చక్కిలాల్
జానౌ నిద్దైన లప్పడంబులు, మఱిన్ శాల్యాన్నముల్ పచ్చడుల్
పానీయంబులు భక్ష్యభోజ్యములు సంభావ్యంబులౌ పప్పులున్. 9

శా. శ్రీ రంజిల్లెడు వాంగిభాతులు మఱిన్ జిత్రాన్న దధ్యోదనల్
కూరల్ గాయలు నూరుగాయలు చవుల్ గుల్కారు మేల్చారులే
పారం 'శ్రీహనుమార్పణం' బనుచు నొప్పారంగ వడ్డించి ప్రే
మారం జేతురు నీకు నర్పణము భాగ్యం బన్న నీదే కదా! 10

గీ. భక్తజనపారిజాతమై పరఁగునిన్ను
గొంగుబంగార మని నమ్మి కొలువఁగల్గి
చెడినవారలు లేరు; నిన్ జేరి కొలువఁ
గొఱఁత కల్గునె తమభక్తి కొఱఁత గాని. 11

చ. తలఁపఁగలేను నిన్ను మదిఁ దప్పక నిల్పుచు; నీకు పూజలన్
సలుపఁగలేను; సొమ్ములను చాలఁగ నర్పణ సేయలేను; నేఁ
దెలియఁగ శక్తిహీనుఁడను తెల్పెద నీకొకమాట వేడుఁగాఁ
దలఁపక చిత్తగించి నను ధన్యుని జేయుము మారుతాత్మజా. 12

గీ. నీకు మామఁ గాఁగ నే నెంచి నాఁడను
అల్లుఁడగుము నీవె వల్లె యనుచు
లలి వెలార్చుబిడ్డ కల దొకర్తుక నాకు
అంజనాకుమార! అవధరింపు. 13

ఉ. బాల విశుద్ధమానస విభాసితవర్తన ముద్దులాడి స
చ్ఛీల శుభాంగి దివ్యతరశ్రీమృదువాణి మనోజ్ఞమూర్తి యే
వేళను రాముసచ్చరిత విశ్రుతరీతిఁబఠించు కావ్యక
న్యాలలితాంగి నీ కిడఁగ నాకుఁ గుతూహల మయ్యె నెమ్మదిన్. 14

సీ. నవరసంబుల మించి చవు లూరఁ భాషింప
నేర్చిన జాణ పునీతచరిత
నడకలో నొకవింత నాఁణెంబు గులుకార
బుడబుడనడయాడు పువ్వుఁబోఁడి
సర్వలక్షణయుత సహజగుణోపేత
శృంగారవల్లి నారీమతల్లి
పండితశ్రేష్ఠుల పరతరాశీస్సుల
వెలసినవిఖ్యాత విప్రకన్య
గీ. నీకు తగఁ గట్టియిల్లాలు నాకుఁ బుత్రి
నేఁటికాలంపునీటుల నేర్చి కూడ
నీతి నియమంబుఁ బాయని నిర్మలాత్మఁ
గొమ్మురామాయణాఖ్య యీకొమ్మ! దీని. 15

గీ. పండితశ్రేష్ఠుఁడవు రామభక్తుఁడవును
శిష్టచరితుండ వెంతయు శ్రీకరుఁడవు
సకలసద్గుణాంబుధివి సౌజన్యనిధివి 16
బ్రహ్మచారివి నీకన్నవరుఁడు కలఁడె?

చ. ఎఱుఁగుదు బ్రహ్మచర్యవ్రత మే గణి యంచని నీవు నుంట; నా
తెఱఁగు నెఱుంగు మత్సుతయుఁ, "దీరని పావనభావ మూని త్వ
చ్చరణయుగంబుఁ గొల్చుటయ చాలు మఱేమియు గోర" నంచు నా
తరుణి తలంచెఁ దీర్పవలదా నినుబోఁటికి సాధ్వికోరికల్. 17

గీ. స్వస్తి శుభదివ్యవ్యయనామవత్సరంపు
టుత్తరాయణకాలంబు నుత్తమంబు
మహిఁ వసంతర్తు వై శాఖమాస కృష్ణ
పక్ష సప్తమి యిది గురువాసరంబు. 18

గీ. అరయఁగా నేఁడు వరనిశ్చితార్థ మేచు
వచ్చినాఁడను బాంధవప్రతతిఁ గూడి

విన్నవించితి సంగతి విపులముగను
కన్నియ గ్రహించి నను( గృప( గావు మయ్య. 19

గీ. భక్తసంతతి కోర్కెలు( బడసి మెచ్చి
యిడిన బంగారు వెండిసొమ్మెంతయేని
దండిగా నీదు నెమ్మేని నిండ( దాల్చి
కులుకుచున్నా(డవే పెండ్లికొడుకు వోలె. 20

క. ఘనుడగు వెంకోబార్యున
కును లక్ష్మాంబకును గొడుకు:గుట్టు(డ విప్రుం
డను నే వసిష్ఠ గోత్రు(డ
ననఘా!'అశ్వత్థరావు' నరయుము నన్నున్. 21

గీ. తెలియ శ్రీవ్యాసరాయప్రతిష్ఠితమ్ము
ఉగ్రతరమైన నీదివ్యవిగ్రహమ్ము;
భక్తజనపూర్వకృతపుణ్యవరఫలమ్ము
ముక్తినిలయమ్ము నీ వున్న 'మురుడి' పురము. 22

గీ. మంగళము మంగళము నీకు మారుతీశ!
నిత్యశోభన మగు మునిస్తుత్యపాద!
శుభము లలరుత శాశ్వతవిభవ దేవ!
సతము కల్యాణ మగు భక్తవితతి వరద! 23

శ్రీమురుడీముఖ్యప్రాణేశార్పణమస్తు.



# కృతి సమర్పణము

క. బళ్లారిజిల్లాలో
నల్లారెడు రాయదుర్గ మనుతాలూకన్
జెల్లెడు 'మురడీ' పురి విల
సిల్లెడు వీరాంజనేయ శ్రితజనగేయా!

శా. తానై పొంగుకవిత్వ మన్యమగు ప్రస్తావంబులన్ దించకే
ఖ్యానామోఘము భుక్తిముక్తిప్రద మేతద్రామచారిత్ర మ
త్యానందంబునఁ గూర్చినాఁడ కలుగో డశ్వత్థరాయుండ నేఁ;
దీనిన్ సత్కృప స్వీకరించి హనుమా! దీవించి నన్ బ్రోవుమా!

# శ్రీ మురుడీ ఆంజనేయస్వామి



కృతికర్త　　　　　　　　　　　　　　　　　　కృతిభర్త

క. నుడివెడిని రామకథ నంటు, యెడ నుండుట 'మురుడి హనుమ' డొగి నాకృతికే
నొడివిన జన్మము ధన్యత వడసెనె! యిది నాదు మోసభాగ్యముకాదే!

శ్రీ

శ్రీ సీతారామలక్ష్మణ పరబ్రహ్మణే నమః

# శ్రీ దండకరామాయణము.

## నాంది - ప్రస్తావన

ఓంకారమై - శ్రీ కరాకారమై - సచ్చిదానందసాకార మౌచున్ - త్రిమూర్త్యాత్మకంబై విరాజిల్లు - నశ్వత్థనారాయణస్వామినిన్ - భక్తి హృత్పీఠిపైనుంచి పూజించి;

శ్రీరామ చంద్రున్, గృపాసాంద్రు, భక్తావనున్, దేవదేవేశ్వరున్, శాంతమూర్తిన్, బరేశున్ - మదీయేష్టదైవంబుగా నెంచి సేవించి-

నిర్విఘ్నతన్ సాగి, యీదండకోపాఖ్య రామాయణగ్రంథమున్ బూర్తి నాచేతగావింపఁగా, గొల్చెదన్ - విఘ్ననాథున్' గణాధీశ్వరున్, లోకవంద్యున్ - సురవ్రాతసంభావ్యునిన్ - బార్వతీదేవిగారాముపట్టిన్- మహాదేవపుత్రున్ - గజేంద్రాననున్ ;-

వాణి, బ్రహ్మాణి, గీర్వాణి, శ్రీపద్మపాణిన్, సమస్తామరశ్రేణి సంపూజ్యపాదాంబుజన్ భక్తిసేవింతు - నాకావ్యమున్ దివ్యమై, భవ్యమై నవ్యమైవెల్గ, నాచేతఁ బల్కింప,

శ్రీపార్వతిన్, గౌరి, శర్వాణిఁ, గల్యాణినిన్, భక్తచింతామణిన్, లోకరక్షామణిన్, దేవదేవేశ్వరిన్, దివ్యశక్తిన్, బరంజ్యోతిఁ బ్రార్థింతునే సర్వ సన్మంగళంబుల్ ప్రసాదించి లోకాళినిన్ బాలనన్ జేయఁగన్;-

శ్రీరమాకాంత, విఖ్యాత, లోకైకమాతన్ బునీతన్, సురేంద్రాది సంసేవితన్, లక్ష్మిఁ, బద్మాలయన్, వేదవేదాంతవేద్యన్, మహాదేవి, సద్భక్త

కల్పద్రుమఁ భక్తి భావించెదన్, సంపదల్ కూర్చి మా భారతక్షోణి రక్షింపఁగా నిచ్చలున్ ;-

రామనామామృతస్వాదనాయత్తసంతృప్తచిత్తుండునై యొప్పుచున్- సత్తపోనిష్ఠచేతన్ మహర్షిత్వమున్ గాంచి - శ్రీమించ రామాయణం బాదికావ్యంబుగాఁ గూర్చి, లోకాళికిన్ జేర్చి - లోకైకకల్యాణమున్ జేసి - మేల్ వాసిఁ గన్నట్టి వాల్మీకులన్-భారతీదేవినిన్ వాకులన్ గొన్న సుశ్లోకులన్ - భక్తిభావంబు రంజిల్లఁ బ్రార్థింతు వాక్శుద్ధికై ;-

వెల్గి విష్ణ్వవతారంబుగా - వేదవారాశినిన్ ద్రచ్చి, తత్సారమున్ దేల్చి వేదాంగముల్ వ్రాసి - శ్రీమన్మహాభారతాదుల్ వినిర్మించి, విజ్ఞాన సంపద్విశేషంబు లోకంబునన్ - జల్లి, లోకూర్మిచే నెల్లలోకప్రజన్ బ్రోచు - శ్రీవ్యాసమౌనీంద్రచంద్రున్, జగద్బంధునిన్, విశ్వపూజ్యున్, స్మరింతున్ గరంబుల్ శిరాగ్రంబునన్దాల్చి తత్త్వార్థసంలబ్ధికై ;-

దేవభాషన్ మహాకావ్యముల్ గూర్చి- వైరాగ్యమున్, నీతి, ధర్మంబులన్, లోక్య మాధుర్యత్త్వమున్ జేర్చి, మాకెల్ల విజ్ఞానభాగ్యంబు నందిచ్చి నేమంబుఁ జేకూర్చు శ్రీభోజరాజేంద్రు నాస్థానదేశాష్టదిగ్దంతులన్ దివ్యగీర్వాణ భాషామహాకావ్యనిర్మాణధౌరేయులన్ - గాళిదాసాదులన్ నేఁ దలంతున్ మదిన్ ;-

లీలతో నాడువాక్యంబులే, లక్షణోపేతపద్యంబులై - సత్యచారిత్రమై తీరఁగా - రాజరాజేంద్రసన్మౌళికోటీరమాణిక్య విభ్రాజమానాంఘ్రి నీరేజులై యొప్పి, శ్రీభారతామ్నాయ మెంతో ప్రసిద్ధంబుగా - నాంధ్రమం దాదికావ్యంబుగా - సర్వసద్ధర్మమర్మంబు లేపార, నాచంద్రతారార్కమై వెల్గఁగా వ్రాసి పుణ్యాత్ములై - స్వర్గసౌఖ్యంబు లవ్వారిగా జుట్టఁ గన్నట్టి, నన్నయ్యభట్టారకున్ - దిక్కయజ్వన్-ఘనుం డెఱ్ఱనన్ - భక్తి రంజిల్ల భావించెదన్ :-

రామభక్తున్, మహాత్మున్, గృపాసాగరున్ - లోకమాన్యున్ - మహాధన్యమూర్ధన్యు - నిష్కామయోగిన్ - దపోనిర్మలున్ బూతచారి

త్రునిఁ ;- రాజులఁ రోసి, సంపద్విశేషంబులఁ బాసి, శ్రీకృష్ణచా రిత్ర్యసత్కావ్యముఁ దెల్గునఁ దివ్యమైయొప్పఁగా వ్రాసి - రామా ర్పణంబంచు నర్పించి - ధన్యుండునై - హాళికావృత్తిమై జీవయా త్రఁ ముదంబార, లీలావిలాసంబుగా, ధర్మమార్గాను గుణ్యంబుగాఁ బుచ్చుచుఁ, - భారతీదేవి ప్రత్యక్షమై తన్ను - నోనాయనా! యంచు సంబోధనఁ జేయఁగా విన్న - తన్మూర్తినిఁ గన్ను లారంగఁ గన్గొన్న - సద్భక్తి మీఱఁ, మనంబార సేవించి పూతాత్ముఁడై నున్న - శ్రీరామ భూపాలు నాస్థానరంగంబునందుఁ, గవిస్థానసింహాసనా సీనతాపట్టభద్ర త్వముఁ గొన్న-పుణ్యాత్మునిఁ; మోక్షసామ్రాజ్య లక్ష్మీమనోనాథునిఁ- బోతనామాత్యచంద్రుఁ - మహాసత్కవీంద్రుఁ - మనంబెంచి, సాష్టాంగ దండప్రణామంబు లర్పించి - భావంబు పొంగారఁ, గైవారముఁ జేసి కొండాడెదఁ బాడెదఁ ;-

నూత్ననూత్నంబుగా, దివ్యభూషాద్యలంకారముల్ దీర్చి, శ్రీ కావ్యకన్యామణిశ్రేణినిఁ ముద్దుగాఁ బెద్దఁబోషించి, రాజేంద్రులుఁ గాంచి మోహింప నాస్థానరంగంబు లెక్కించి - మామా ! యటంచాడి వా రెంతయో వేడ, నామోదముఁ జూపి, తా మాదరంబొప్ప, నవ్వారికై దండ లవ్వారికిఁ గూర్చి ; అవ్వార లవ్వారిగా నియ్యఁగా సంపదల్ బొందియుఁ - రాజసన్మాన్యులై మించి, యాస్థానసింహాసనా రూఢతాభాగ్యముఁ గాంచియుఁ - భూరిహోమాభిషేకాదిసద్గౌర వాధిక్యముల్ పొందియుఁ. నిండుభోగంబులఁ దేలి, భూమండలిఁ బూజ్యులై వెల్గియుఁ దెల్గుదేశంబునఁ గావ్యరత్నంబులఁ నించి - తాముఁ యశోదేహముల్ పొంది లోకంబునఁ నిల్వఁగన్నట్టి, శ్రీనా థునిఁ - భాస్కరుఁ - రంగనాథుఁ - ఘనుఁ సోమునిఁ - సూరనఁ - వారికాలంబునందున్న యాయాకవిశ్రేష్ఠులఁ ;-

కృష్ణరాయాఖ్యరాజేంద్రుఁడే మెచ్చి - బంగారపుఁ బళ్లెరంబం దునఁ, వజ్రవైడూర్యమాణిక్యవిభ్రాజమానంబునౌ గండపెండేరముఁ

దెచ్చి తా నిచ్చమై పాదముల్ గడ్గి తోడ్గింపఁగా-పల్లకిన్ దానె పైకెత్తి సన్మానమున్ సల్పఁగాఁ-బ్రీతిఁ దా నెక్కు సింహాసనార్ధంబుపై నిల్పి వెల్గింపఁగాఁ, గుల్కు చారాజు నాస్థానపున్ దివ్యరత్నంబులై; మిత్రరత్నంబులై, ప్రాణరత్నంబులై తేనికిన్;-సంతతం బాంధ్రవాగ్దేవికిన్ బుత్రరత్నంబులై - యాంధ్ర భూమాతృ సౌభాగ్యరత్నంబులై - దేశదేశంబులం 'దాంధ్రి'కే, మిక్కిలిన్ గీర్తిసేకూర్చి; శ్రీభారతక్షోణిలోనన్ గనుల్ త్రవ్వి - దేశీయతావజ్రముల్ దీసి కైఁబూనుచున్, బూన్కిమై సానలన్ దీర్చి - సౌందర్యమున్, శ్రేయమున్, సత్యమున్ గల్గి వెల్గొందఁగాఁ, గావ్యముల్ కూర్చి - యానంద సంవిన్మహాభోగ భాగ్యంబుగా, మాకు వా రియ్యరే! - యాఋణం బేమి సామాన్యమే? వారినామంబు లీరూపునన్ సంస్మరింపంగ, నేకొంత యీతీరు నంచెంచి భావించెదన్:— బెద్దనన్ - దిమ్మనన్ - ధూర్జటిన్ - బట్టుమూర్తిన్-గవిన్ రామభద్రున్ - మహాదత్తుఁడౌ రామలింగున్ - మఱిన్, దక్కునింకెందఱో పూర్వపున్ సత్కవీంద్రాళి -

ఆమీఁద - నిం కిక్కడన్ - నూఱు నిన్నూఱునౌ యేండ్ల నీ మధ్యకాలంబునందుండి యీనాఁటిదాఁకన్ గణింపంగ, బల్దక్షులై - దీక్షమై - చిత్రచిత్రాతి చిత్రంబులై యెం దనర్ఘంబులై దీధితుల్ జిమ్ము మేల్సొమ్ములన్ గూర్చి, యర్పించి; భాషామహాదేవి భూషించి - పోషింపఁగా - నాశ్రయం బిచ్చి దేశీయులౌ రాజు, లాయాజమీన్దారు లేలంగ; - దిగ్దంతికర్ణంబులున్ దద్దరిల్లంగ విఖ్యాతిగాఁ బేర్లు మ్రోగించి - మొన్మొన్ననే భౌతికాంగంబులన్ బోలసంచున్ విసర్జించి, సత్కీర్తిసంశోభితం బౌ లసద్గ్రంథరూపావళిన్ మాకుఁ దోఁషించి, సద్బుద్ధులన్ జెప్పు దివ్యాత్ములన్;

దివ్యసత్కావ్యనిర్మాణధౌరేయతాగణ్యులై - ధన్యులై - లోకసన్మాన్యులై; బల్వయోవృద్ధులై, యోపమిన్ బెద్దయానేవ చాలించి - యేకొద్దియో, చేతనైనంత గావించు, చీ యాంధ్రభూమిన్ గడున్

బూజ్యులై మేనితోనుండుభవ్యాత్ములన్ - సత్కవిశ్రేష్ఠులన్, నిష్ఠమై నేఁ దలంతున్; -

మఱిన్, బోషకుల్ లేని యీకాలమందున్; మహాకావ్యముల్ వ్రాసి విన్పింప, నాలింపఁగానైన నేయొక్కరున్ రానియీకాలమందున్-కవిత్వంబటన్నన్ - గవుల్ పూజ్యులన్నన్ - బ్రజల్ హాస్యమున్ జేయు నీకాలమందున్; దెలుం గన్ననున్ - దెల్గునన్ బండితుండన్న, నేరేరికిన్ లెక్కయేలేని యీకాలమందున్, దగన్‌బొట్టకున్ బట్టకున్, గష్టమై తోఁచు నీకాలమందున్ మహాక్షామదుర్భిక్షముల్ నిండి యెంతున్ నిరాశాపిశాచంబు నల్దిక్కులన్ ఘోరఘోరంబుగా నర్తనల్ సల్పి గర్జించు నీకష్టకాలంబునందున్; మఱిన్ విశ్వసంగ్రామముల్ రేగి పెల్లాఁగి - దేశీయతా - జాతి - వర్ణాంతరావేశయుద్ధంబులున్ లేచి, యూరూరనాబాలవృద్ధంబుగా నాచి - సర్వత్ర దేశంబులందున్ ధనప్రాణమానాభిమానంబులన్ దోచి యిప్డిప్పుడే నిల్చియున్ నిల్వకాందోళనల్ పెంచి తబ్బిబ్బులౌనట్లుగా భూప్రజన్ సల్పి - దుఃఖంబులన్ గూర్చు నీచెడ్డ కాలంబునందున్, - మదిన్ నిస్పృహత్వం బు వేరూనఁగానీక, యాత్మాభిరామంబుగా, నైజ మేపారఁగాఁ, బతులట్లున్ - ఫలవ్రాతముల్ నిండువృక్షంబులట్లున్ - ప్రాదంబుల్ బలెన్ - బూవుల ట్లొప్పుచున్ - దన్యత్వంబునన్, లోకకల్యాణమాత్రం బపేక్షించి, సర్వేశ్వరున్ జూడ్కులందుంచి; - వేడ్కన్ గలం బట్టిచేఁబట్టి - సంసారియామానసంబున్ దగన్ బిట్టుగాఁబట్టి - జోకొట్టుచున్ గావ్యదేహంబులన్ దానిఁ బోనెట్టి - తల్లీనమౌ యోగమున్ బట్టి, - పౌరాణికంబుల్, మహాకావ్యముల్, నాటకంబుల్, ప్రబంధంబులున్, దేశచారిత్రముల్, కల్పనల్, మీఁద నింకేవియో యెన్నియో వ్రాసి - లోకాళి కందిచ్చి - యే'కాని' నేన్ బొందకే రిక్తహస్తంబులన్ దృప్తినిన్ బొందుచున్, తీవ్రపక్కిన్ విమర్శించి కావ్యంబులన్ బండితుల్ ఖండనల్, మండనల్, నేయుచున్ బత్రికల్ నింపఁగాఁ గాంచుచున్ - "వెట్టియుద్యోగమం

దిద్దిసన్మానమా?" యంచున్నైనన్ బనిన్ మానకే, గ్రంథముల్ వ్రాసి - సద్భక్తిచే నాంధ్రభాషాసతీసేవఁ గావించుచున్ నేఁడు వెల్గొందు మాన్యాత్ములన్ - మత్సజాతీయులన్, గౌరవార్థంబుగా హస్తముల్ మోడ్చి ప్రీతిన్ నమోవాకు లవ్వారి కర్పింతు;—

రాబోవుకాలంబునన్ వెల్గఁగానౌ కవిశ్రేణి కెంతో ప్రియం బాడెదన్; వారికిన్ శ్రేయమున్ గూర్పఁగా దేవదేవేశ్వరున్ వేఁడెదన్.

నేను తొల్దొల్త తన్ జూచి మాటాడునాఁ డాదిగా, నొజ్జనై - ప్రీతి మచ్ఛ్రేయమున్ గోరి, చేదోడు వాదోడునై యుండి - నిర్వ్యాజ కారుణ్యమున్ జూపి నాకైతలన్ దిద్ది తీర్చున్; మఱిన్ నాకుఁ బ్రోత్సాహమున్ సల్పు - నీదండకోపాఖ్యరామాయణ గ్రంథనిర్మాణ కార్యంబునం దెంతొ సాహాయ్యమునన్ సల్పి, తా నోపికన్ శ్రద్ధమై గ్రంథ మాద్యంతమున్ జూచి దోసంబులన్ దిద్దితీర్చెన్ - బలారీపురంబందునన్ గాపురంబుండు, శ్రీకప్పగల్ మాన్యు, సంజీవమూర్త్యార్యునిన్-మిత్రునిన్- బంధువున్ - సద్గుణాఢ్యున్-గవీంద్రోత్తమున్, నేఁగలంబెత్తి ప్రార్థింతు నీకావ్యమున్ బూర్తిగావింపఁగా నన్ను దీవింపఁగా!-

గ్రంథమున్ బంపఁగా - నెన్నఁడేనిన్ మొగంబేనియున్ గానకే యుండియున్ గూడ, నత్యాదరంబొప్ప నాగ్రంథమున్ గొంచు - శ్రద్ధన్ స్వకీయంబుగా నెంచి - యెల్లప్పుడున్ గార్యముల్ గల్గియున్ గూడ, నందే విరామంబు పాటించి- సాన్తంబుగా గ్రంథమున్ జూచి శోధించి - భాషా ప్రపోషంబె సద్ధర్మకార్యంబుగా నెంచి, తత్సేవయే దీక్షగాఁగాంచి కావ్యంబునందున్ నిగూఢంబులౌ భావముల్ తీసి చూపించు, చొప్పౌ గతిన్ బీఠికన్ వ్రాసిపంపింపరే! ——గ్రంథప్రాశస్త్యమున్ జాటఁగాఁ జాలు, యేచిన్నెలో - వన్నెలో - యున్న, నవ్వానిఁ బైకెత్తి రూపించు, చా - యీ - యభిప్రాయపత్రంబులన్ వ్రాసి యావెంటనే పంపరే!— పాఠకశ్రేణికిం తెంతయో సాయమున్ జేయుచున్, గావ్యసంవ్యాప్తిఁగాఁ జేసి, తత్కార్తన్ గీర్తిఁ జేకూర్చునిర్వ్యాజబంధుల్ గదా పండితా

గ్రేసరుల్. సద్విమర్శాగ్రగణ్యుల్ సదాపూజ్యు లవ్వారికిఁ నిండుభావం బునఁ నేను కైమోడ్పు లర్పించెదఁ;

భారతక్షోణిలోఁ గైత లేపారిమీఱఁ-గవుల్ గణ్యులై మాన్యులై మించఁగా - భూజనుల్ ధర్మకామార్థమోక్షంబు లోలిఁ దగఁ బొందఁగా; నాల్గుపాదంబులఁ ధర్మ మేపారఁగా; ధాత్రిలోనఁ బ్రజల్ ధర్మబుద్ధిఁ బ్రవర్తించుచుఁ - దండి సౌఖ్యంబులఁ దేలుచుఁ- నిండునూఱేండ్లు జీవింపఁగా; - బిడ్డలా మమ్ము, లోనెంచి - యేతత్కృపాదృష్టి మాపైన సారించి - రక్షింప, సర్వేశ్వరుఁ - దివ్యకారుణ్య సింధుఁ - త్రిమూర్త్యాత్మకుఁ - దేవదేవేశు - నశ్వత్థనారాయణుఁ భక్తిమై మ్రొక్కెదఁ, మ్రొక్కెదఁ, మ్రొక్కెదఁ:—

నేనిటుల్ భక్తిమై దేవతాస్తోత్రముఁ జేసి' యీదేహ మీనేర్చినఁ బ్రోచు నాతల్లినిఁ. దండ్రినిఁ లోన ధ్యానించి, యాసక్తిమై సత్కవిశ్రేణికిఁ మ్రొక్కి, యాచార్యులఁ గొల్చి నేసాదులఁ, సజ్జనానీకముఁ వేదముఁ, ధర్మముఁ విప్రులఁ, సాధ్వులఁ, గోవులఁ ధ్యానముఁ జేసి, 'సర్వేజనాస్సుఖస్తి' యంచుఁ ద్రిశుద్ధంబుగాఁ గోరి నా వ్రాయు, నీదండకోపాఖ్యరామాయణంపుఁ గథారీతి యెట్లన్న;—

శ్రీ

సీతారామలక్ష్మణ పరబ్రహ్మణే నమః.

# శ్రీ దండకరామాయణము

## బాలకాండము

---

### శ్రీనారదవాల్మీకుల సమాగమము.

దండకము:- శ్రీమన్మహాబ్రహ్మహృత్కంజసంజాతుఁడౌ నారదుం డొక్కనాఁడల్లె వాల్మీకిమౌనీంద్రునిం గాంచ నేతేర, నాతండు సద్భక్తిమై నర్ఘ్యపాద్యాదు లర్పించి సేవింపఁ గూర్చుండి వారిర్వురున్, విష్ణులీలాప్రసంగంబులన్ గాలమున్ బుచ్చుచుండంగ, రామావతారప్రసంగంబు రాన్, నారదుం డంతఁ బల్కెన్, మునీంద్రా! పదిన్నాల్గులోకంబులన్ సృష్టిగావింపఁగా ద్రుంపఁగా నోపునారాయణుం డార్తసంరక్షణో పాయపారాయణుండే, యిఁకన్ ముందు - మున్నట్లు - యీధారుణిన్ మానవాకారమున్ గొంచు జన్మించి, రామాభిధానంబునన్ మించి, యాసర్వగీర్వాణులున్ వానరాకారులై పుట్టి తన్ గొల్చునట్లాయమున్ జేయ, దుష్టాళిఁ దూలించి, శిష్టాళిఁ బాలించుచున్, ధర్మమున్ నాల్గుపాదంబులన్ నిల్పి, తానే పదిన్మీఁద నింకొక్కవేయేఁడు లిద్ధాత్రి నాదర్శభూకాంతుఁడై యేలు నంచన్న వృత్తాంత మాలించియున్నాఁడవే? యన్న వాల్మీకి యత్యద్భుతంబంది కౌతూహలస్వాంతతన్ - నారదా! చెప్పవే నాకుఁ, దద్దివ్యవృత్తాంత. మావిష్ణు చారిత్రమున్ విందుగా! వీనులానందమున్ జెందఁగా! - నాదు జన్మంబు ధన్యత్వమున్ బొందఁగా - నంచుఁ బ్రార్థింపఁగా, నారదుం డంత వాల్మీకి కీరీతి రామాయణంబున్ వచింపంగఁ దాఁ బూనె:—

### నారదుఁడు వాల్మీకికి రామాయణ కథను జెప్పఁదొడఁగుట.

త్రేతాయుగంబందునన్, గోసలంబన్న దేశం బొకండొప్పు నద్దానికిన్ ముఖ్యమౌ పట్టణంబై యయోధ్యాపురం బుండు, ధాత్రీపురంధ్రీముఖంబందు జెల్వొందు కస్తూరిబొట్టో యనన్ జూడ్కికిన్ దోఁచుచున్;

డాని నేలెన్ దశస్యందనుం డన్ ధరాధీశుఁ డిక్ష్వాకువంశోద్భవుండున్, మహాధార్మికుండున్, భుజాటోపదుర్దాంతవిక్రాంతుఁడున్, సత్యనిష్ఠుండు ధర్మైకమార్గుండునై తాఁ బ్రజాపాలనం బొప్పఁగాఁ జేయఁగా, మంత్రు లెన్మండ్రు, వారెంతొ సుస్వాంతులున్, దాంతులున్ సద్యశోవంతులున్, విక్రమాటోపదిగ్దంతు లవ్వారలందున్ సుమంత్రుండునా నొప్పునాతండు తన్మంత్రులం దెంతయున్ ముఖ్యుఁడై, తోడుగా - నీడగాఁ గూడి ధాత్రీపరున్ గొల్వఁగాఁ, జెల్వుగా రాజు మున్మూటిపై నేబదుల్ సంఖ్యలొ పత్నులన్ గల్గి తా వెల్గు; నవ్వారలందెల్లఁ గౌసల్య, కైకేయి, మీఁదన్ సుమిత్రాఖ్య, యీముగ్వురే ముఖ్య, లవ్వారిలోఁ - బ్రాయపుం గాంతయై, మోహపుందొంతియై, కంతువిన్నాణపుందంతియై, యింతు లందెల్ల మేల్బంతియై, వెల్గు కైకేయి - విఖ్యాతయై;—

దశరథుఁడు పుత్రకామేష్టి యాగముఁ జేయుట.

యిట్టు లాధారుణీకాంతుఁ డత్యంత సౌభాగ్యసంతుష్టభోగ్యుం డునై యొప్పియున్, దాను సంతానవంతుండు గాకుంటచేఁ, జింతచేఁ వంతచే ఖ్యాతచేతస్కుఁడై - యుండి, వాసిష్ఠమౌనీంద్రునాజ్ఞానుసారం బుగాన్, బుత్రకామేష్టినా జన్నమున్ జేయఁగా, యజ్ఞకుండంబునన్ జాతవేదుండు సంజాతుఁడై పల్కె - 'నోక్ష్మావరా! పాయసంబిద్ది - యాదే వతల్ పంపఁగాఁ గొంచు నేతెంచితిన్ - దీని నీకిష్టులౌ పత్నులన్ ద్రావఁగాఁ జేసినన్, బుత్రులన్ దివ్యచారిత్రులన్ గాంతు వం చాడి యాపాయసంబున్న బంగారపున్ గిన్నె నాకోసలాధీశు హస్తంబునం దుంచ, వేఁగొంచు - 'ధన్యుండ' నంచాడి యాఱేఁడు మ్రొక్కంగ; దీవించి యాదేవుఁడంతన్ దిరోధానమున్ జెందెఁ - గైకొంచు దేవాన్న సంపూర్ణమౌపాత్రనారాజు, తా డాయుచున్ భార్యలన్ జీరి, యాపా సంబందుఁ గౌసల్య కర్ధంబు, శేషార్ధమున్ గైక కీయంగ - వా రిర్వు రొక్కొక్కరున్ నైజభాగంబునందున్ సుమిత్రాఖ్య కర్ధంబు నీయంగ, నవ్వార లద్దాని సేవించి రత్యంతసంప్రీతచేతస్కలై;—

పిమ్మటన్ బ్రహ్మయున్ దేవతానీకమున్‌గాంచి 'మీకై ధరన్ విష్ణువే పుట్టు మర్త్యుండుగాఁ, గాన నాయానతిన్ మీరలున్ వానరానీకమై యుర్విపైఁబుట్టి - ధర్మంబు రక్షింప సాహాయ్యమున్ జేయఁబొం, డింతకున్ మున్నె నేనావలింపన్ జనించెన్‌గదా జాంబవంతుండునా నొక్కభల్లూకనాథుండు! బల్విక్రమస్థానమౌ మీకుఁ దోడంచు వాక్రువ్వఁగా, నట్టులే దేవతల్, కామరూపుల్ - మహాభీమవిక్రాంతులై లక్షలున్ గోటులున్ బద్మముల్ గాఁగ నింతింతగా మించుచున్ - లెక్కకున్ జిక్కకే, చుక్కల ట్లెక్కుడై, దిక్కులన్, గొండలన్ గుట్టలన్ దండికాంతారముల్ నిండి కాపుండఁగా——

### శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులజననము.

సం దయోధ్యాపురంబందుఁ గౌసల్య - కైకేయి - మీఁదన్ సుమిత్రాఖ్యయున్ గర్భముల్ దాల్చి - నిత్యాభివృద్ధిన్ గనన్ - మించు పుత్రాభిలాషన్, దగన్ నిత్యమున్ దేవతాపూజలన్ సల్పుచున్ - భక్తిమై బ్రాహ్మణారాధనల్ చేయుచున్ నాథు సేవించుచున్ గర్భభారంబునన్ శ్రాంతలై కాలమున్ బుచ్చుచుండన్ - నెలల్నిండఁగా నొక్కనాఁ డెన్నఁగాఁ, జైత్రశుద్ధంబునన్ దొమ్మిదౌనాఁడు మధ్యాహ్నమం దొప్పు కర్కాటకంబందు, రఘ్వన్వయాంభోధిసోమున్ - గళాధాము - శ్రీరాముఁ గౌసల్య కాంచెన్ - భవర్ణంబుపూర్వంబుగా, రేఫమధ్యంబుగా, నా తవర్ణాంతమై యొప్పు నామంబువానిన్ గనెన్ గైక యంతన్ సుమిత్రాఖ్యకున్ లక్ష్మణుం - డంచు - శత్రుఘ్నుఁడంచిద్దరున్ బుట్టి, రవ్వేళ గీర్వాణసంఘంబు సంజాతమోదంబునన్ బుష్పవృష్టిన్ దగన్ నిండఁగాఁ జేయఁగా - దుందుభుల్ భూనభంబుల్ ధ్వనింపంగ మ్రోగెన్ - బురిన్ బౌరు లుత్సాహులై యుత్సవంబుల్ గడున్ సల్పి, రా రాజు దా దానధర్మంబులన్ బీదలన్ సాదలన్ దన్పి - గోబ్రాహ్మణానీకమున్ దుష్టిగన్ బుష్టిగన్ మించి పూజించి సేవించె,——

నాయాతఁడేన్ జాతకర్మంబులన్ దీర్చె - నంతఃపురస్త్రీలు తద్బాలు
రన్ నీళులాడించుచున్, రక్షలన్ బెట్టుచున్, మెత్తనౌ నొత్తులం దుంచు
చున్, జోలలోఁ బెట్టి జోకొట్టి యోదార్చుచున్, లాలిపాటల్ లలిన్
బాడి కూర్కొందఁగాఁ జేయుచున్, బ్రీతిమై నొబ్బునన్ గబ్బిచన్గుబ్బలం
దొత్తుచున్ బాలురన్, బ్రొద్దుపోఁబుచ్చుచున్ లాలనన్ జేయఁగా-
వారలున్ మారునిన్ గేరునాకారపున్ సౌరు లేపారఁగన్, దృష్టివిద్యు
ల్లతల్ దిక్కులన్ దీధితుల్ చిమ్మ, నంతంతకున్ వృద్ధిమైనుండి, నైదేండ్లు
కాఁగా, నృపుం డక్షరాభ్యాసమున్ బ్రీతిఁ జేయింపఁగా, నేర్చి రింతిం
తగా వేదవేదాంగముల్ - శాస్త్రముల్ - సర్వవిద్యల్ కళల్; సార్థ
భావంబుతో నెల్లకంఠస్థమౌనట్టు-లాపై ధనుర్విద్య సాంగంబుగా నేర్చి;-
రవ్వారిలో రాముఁడున్ లక్ష్మణుం డిర్వు రత్యంతసౌభ్రాత్ర సద్భావ సం
పూర్ణులై, దేహముల్ రెండు - ప్రాణంబు లేకంబుగా నెంచి వర్తింతు;
రారీతినే కైకపుత్రుండు శత్రుఘ్నుఁడున్ జంటగా నుందు రెల్లప్పుడున్-
బ్రేమ బంధంబునన్ దల్లులున్ దండ్రియున్ నేత్రపర్వంబుగాఁ గాంచు
చుప్పొంగుచుండంగ నామీఁదటన్ ;-

## { విశ్వామిత్రుఁడు, దశరథునిఁ గోరి శ్రీరామలక్ష్మణుల యాగరక్షణార్థము, వెంటఁ గొనిపోవుట. }

కొన్ని యేండ్లేగఁగా, గాధిజుం డొక్కనాఁ డా దశరథాధీశుఁ జేరంగ
రాఁ, గాంచి యాతేఁడు తా దిగ్గునన్ డిగ్గి పెన్ గద్దియన్, మ్రొక్కి-
పాదంబులన్, జక్కఁగా నర్ఘ్యపాద్యంబులందిచ్చి, మౌనిన్ సుఖాసీనుఁ
గాఁ జేసి, తత్క్షేమవార్తాప్రసంగంబుఁ గావించి - 'యేమాజ్ఞ' యంచెం
తయున్ వేఁడఁగా, గాధిజుం డాడు - 'నో రాజ! నే యజ్ఞమున్ జేయఁ
గా నెంచి యాకార్యమున్ బూనఁగా - రాక్షసుల్ రక్తమాంసంబులన్
వైచుచున్ విఘ్నమున్ జేయుచున్నారు, నే యజ్ఞకర్తృత్వమున్ బొం
దుటన్, దుష్టులన్ శాపదగ్ధుల్గఁ జేయంగరామిన్, గడున్ జింతతో
నుండి, నిన్ జేరఁగా వచ్చితిన్ · రామునిన్ బంపునా వెంట, నా రాక్షసా

నీకమున్ ద్రుంపఁగా-జన్నమున్ గావఁగా' - నన్ను, నా రాజు మౌనీంద్ర చంద్రా! పదారేఁడులున్ లేని యీబాలుఁడౌ రాముఁడా - చెక్కులన్ గిరిన్ క్షీరముల్ గారు నీరాముఁడా - దుష్టులౌ దైత్యులన్ జెండఁగా నోపు?- నీబాలునిన్ వీడుమా! చూడుమా! నేనె శస్త్రాస్త్రముల్ దాల్చి, సైన్యంబుతో వచ్చి, యాదుష్టదైత్యాళి నాశంబుఁ గావించి, మీయాగమున్ గాతు - నా కానతీయంగదే? పాపనిన్ బంపఁగా నోప - నేనోప' - నం చాడఁగాఁ, గౌశికుండంత కోపంబు దీపింపఁగాఁ, గన్నులన్ నిప్పులన్ గ్రక్కుచున్, జూచి పల్కెన్ -

మదీయేప్సితంబున్ సమగ్రంబు గావింపఁగా లేవె? నే నెవ్వఁడం చీవు భావించితో? నిన్ను నే నొల్ల - నీరామునిన్ గోరి విచ్చేసితిన్, దోడుగాఁ బంపవా? యొక్కపల్కాడు నిక్కచ్చిగా నంచు గర్జింపఁగా, నావసిష్ఠుండు నిట్లాడు:- 'రాజేంద్ర! యీమౌనికిన్ గోప ముప్పొంగె డిన్, బంపుమా, వేగ శ్రీరామునిన్; జూడఁగా నీమహాత్ముండు తోడుండి కాపాడఁగాఁ, గీడులున్ మూఁడునే? చూడుమా! యంచు బల్కాడఁ బల్ భీతిమైఁ గ్రుంగి భూనాథుఁ డొక్కింత చింతించి, యేమార్గమున్ లేక యుంటన్ విచారించి, తాఁ బంచె శ్రీరామునిన్ లక్ష్మణున్ దోడు గావించి మూర్ధంబు మూర్కొంచు దీవించి, కన్నీళ్లలన్ దెప్పలందుంచి, యామౌనిపాదంబులందున్ శిరం బుంచి, వే లేచి కేల్మోడ్చుచున్-'మీదె భారంబు మౌనీశ్వరా! యంచు బ్రార్థించుచున్ బంచె - నాబాలు రస్త్రంబులన్ దాల్చి వెన్నాడఁగా, మౌని హర్షించుచున్ జేని దీవించి ముందేగె నవ్వారితో-

శ్రీరాముఁడు విశ్వామిత్రునిచే యజ్ఞమును బూర్తి చేయించుట.

ఇట్టు లేగంగ నాకానలో, దాటకానామయా నొక్కరాకాసి, తా నడ్డమై నిల్చి, పెన్గొడ్డలిన్ దాల్చిపాణిన్, వడిన్ బ్రింగ నోరొడ్డ, రా బిడ్డఁ డామౌనియాదేశమున్ బొంది, తాదొడ్డబాణంబు సంధించి వ్రేటే యఁగాఁ, గొండ పడ్డట్టులన్ గూలె ఘోరార్భటిన్ భీమరూపంబునన్;

వార లాపిమ్మటన్ మీఁద ముందేగఁగా, నొక్కచోటన్ సరస్సున్ విలో
కించి, శ్రీరామునిన్ స్నానమున్ జేయఁగాఁజేసి, హస్తంబులన్ నీరమున్
దాల్పఁగాఁజెప్పి, మంత్రంబులన్ దాపసుం డిచ్చె దివ్యాస్త్రముల్ - ఖడ్గ
ముల్ - పాశముల్ - మేల్గదల్ చేర్చి,- 'యోవత్స! యీబాణముల్
దేవతాసాధ్యముల్ ; నీకు నే నిచ్చితిన్ - వీని నీ వొందుటన్ జేసి నీతో
సముల్ కారు దేవాసురుల్, సిద్ధసాధ్యాదులేనిన్ ; బదిన్నాల్గులోకంబు
లన్ మేటివిల్కాఁడ వీ వొక్కఁడే, గా కొరుల్ లేరు - లేరంచుఁ
గొండాడుచున్ ద్రోవ నేతేరఁగాఁ, జేరిరా మౌనిదివ్యాశ్రమం ; బచ్చ
టన్ మౌని దీక్షన్ గొనెన్ - యజ్ఞసంరక్షణార్థంబు, శ్రీరాముఁడున్ -
లక్ష్మణుండున్ ధనుర్ధారులై, రేబవల్ దీక్షమైఁ గాచి రాయజ్ఞవాటిన్
దగన్!-

వచ్చె మారీచుఁడన్ నీచుకోడన్ సుబాహుండు, దైత్యుల్
గడున్ గొల్వఁగా; - రక్కసుల్ రక్తకుంభంబులన్ మాంసఖండంబులన్
బూని, మేఘంబులన్ డాఁగి, యాయజ్ఞవాటిన్ గడున్ గుంభవర్షంబు
గావింపయత్నింపఁగాఁ,- గాంచి కోపంబుదీపింప శ్రీరాముఁ డద్దైత్యమా
యల్ నివారింపఁగానెంచి వాయవ్యాస్త్రమున్ బూని తామేఘవిచ్ఛేదమున్
జేయఁగానేయఁగా - నద్ది మారీచునిన్ దాఁకి ప్రాణంబులన్ దీయ కెన్నే
నియోజనాల్ దాఁకఁ గొంపోయి వారాశిలో వైచినన్ - ముస్గుచున్
వేలుచున్ వాఁడు గట్టెక్కెటో చేరి పాతెన్ ఖలుం డెంతొప్రాణేచ్ఛమై
స్వేచ్ఛమై ; శేషదైత్యాళి నాశంబుగావించి యజ్ఞంబు సాంతంబుగావిం
పఁగాఁ - దాపసుల్ రామునిన్ మెచ్చి దీవించి రత్యంతమున్ ;-

## అహల్యాశాపవిమోచనము

కౌశికుం డంత శ్రీరామునిన్ గాంచి 'యోవత్స! యామైథిలుం
డంపె, జన్నంబు దా సల్పుటన్ మాకు నాహ్వానమున్ - బోదమా
రామ! యచ్చోట శ్రీభర్గకోదండ మొందున్న దారాజుచెంతన్, మహా
చాప మద్దాని నేమేటరుల్ సూటిగా నెక్కిడన్ జాల రీనాఁటికిన్ ;

రాఘవా! దాని నీక్షింపఁగానౌను నీ కయ్యెడన్, బోదమా!' యన్న - శ్రీరాముఁ డౌఁగా కనెన్ - రాసుతుల్ తోడరా - మౌనివర్గంబుతో, గాధిజుం డప్పుడట్టుల్ ప్రయాణంబు సాఁగించి తా నేగఁగా ;-

మార్గమధ్యంబునం దొక్కెడన్ గౌతమర్ష్యాశ్రమంబుండె - నందేఁగఁగా, నొక్కచట్రాయి శ్రీరాము శ్రీపాదసంస్పర్శనంబొంది, కాంతాకృతిన్ వెల్గుచున్ మ్రొక్కి నిల్వంగ, నారాముఁ డాశ్చర్యమున్ బొంది వీక్షించు చుండన్ - మునీంద్రుండు నిట్లాడు :- 'నోరామచంద్రా! యహల్యాసతీరత్న మీనాతి; యాగౌతమర్షీశు నర్ధాంగి - కన్గొంటివే? మున్ను దేవేంద్రుఁ డీభామినిన్ దుష్టకామేచ్ఛమైఁ గూడె - నద్దానికిన్ భర్త కోపించి శాపంబు నీయంగ, నారామ యీరాయిగా మాఱి తాఁ బెద్ద కాలంబునుండెన్ జుమీ! - నేఁడు నీపాదసంస్పర్శనన్ శాప మూడంగ, నారీస్వరూపంబుతో నొప్పె' నంచాడె; నావేళకే గౌతముం డందుఁ బ్రత్యక్షమై - యర్ఘ్యపాద్యంబులన్ భక్తి శ్రీరాముఁ బూజింఁగి, సేవించి, ధన్యుండ నేనైతి, నంచాడి - కొండాడుచున్ భార్యతోఁ బోవఁగా :-

### శివధనుర్భంగము

పిమ్మటన్ గౌశికుం డెల్లరన్ గూడి, కొన్నాళ్ల కామైథిలున్ జేరి, యారాజుచే సత్కృతుండై - సుఖాసీనుఁడై యుండి, శ్రీరామునిన్ లక్ష్మణున్ జూపి, యారాజుతో :- వీరు వీరల్ - మహాత్ముల్ - కనన్ వచ్చి రాభర్గచాపంబుఁ దెప్పింపు మంచన్న, నాతేని యాజ్ఞన్ భటశ్రేష్ఠు లెన్నన్ సహస్రార్ధసంఖ్యాకు లాయాసమున్ బొందు, చాచాప మున్నట్టి యాపేటికన్ బట్టి, వారెల్లరున్ మూపులన్ బెట్టితొట్రాడుచున్, మూల్గుచున్ దెచ్చి, యాతావునన్ డించఁగా, మైథిలుం డాడు నాపేటికన్ జూపి. 'మౌనీంద్ర! దక్షాధ్వరధ్వంసమున్ జేయునాఁ, డుగ్రుఁడై రుద్రుఁ 'డిట్లేల భాగంబు నా కీయ'రం చెత్తె నీచాపమున్ - దేవతల్ భీతిమై 'పాహి' యంచాడ శాంతించి యాదేవుఁ డిచ్చెన్ దగన్ దేవతాకోటికిన్ దీని; నవ్వారి మెప్పించి మాపూర్వవంశోద్భవుం డొక్కఁ డిద్దానిఁ

గ్రైఁబూనె, నట్లావిధిన్ నేఁటికిన్ బూజితంబౌచు నస్మద్గృహంబందు నీచాప ముండున్ :-

మునీంద్రోత్తమా! యొక్కనాఁ డెంచి జన్నంబు నేఁ జేయ దున్నింపఁగా, భూమిలోఁ బేటియొండుండె, నద్దానిలో బాలయొక్కర్తు ముద్దారుటల్ గాంచి మేలంచుఁ జేకొంచు లాలించుచున్ సీతయన్ పేరుతోఁ బెంచితిన్, భగ్నచాపంబు మోపెట్టఁగా నోపు నేదిట్టఁ డాతండె నాపట్టిఁ జేపట్టఁగా నర్హుఁ డౌనంచు సంకల్పమున్ జేసి, యామాట చాటించితిన్. ఛత్రముల్ పంచితిన్, భూనభోభాగముల్ ప్రాఁకె నవ్వార్త-యంతన్ మహాశూరులౌ భూచరుల్ ఖేచరుల్, దేవతల్ - దైత్యులున్ - నిత్యమే యొక్కరో, యిద్దఱో వచ్చి, యీవిల్లు మోపెట్టఁగా యత్నమున్ జేసి, భగ్నాశులై పోదురొఁగాని - యీవీరు లేనిన్ బ్రయత్నింతురేనిన్ గనన్ వచ్చునం చూరకుండెన్ :-

మునీంద్రుండు శ్రీరామునిన్ గాంచి - 'యోవత్స! వింటేకథన్? జూతువా చాప?' మంచన్న, శ్రీరాముఁ డాపేటికన్ డాసి - యామూతఁ బైకెత్తి - చేనంటి వింటిన్ విలోకించి - మౌనీంద్రునిన్ గాంచి - 'మీయాజ్ఞ యైనన్ బ్రయత్నంబు గావింతు నంచాడె ;- నామౌని మందస్మితంబొప్పఁ 'గానిమ్ము - వత్సా!' యనెన్ ; బిమ్మటన్ రాముఁ డావిల్లు చేఁబట్టి లీలాగతిన్, గోపునన్ నారి గూర్పంగఁ దాలాగె, నౌరౌర! యాచేతియందున్న యాచేవ తా నెట్టిదోకాని - యావిల్లుచే పెళ్లునన్, రెండుగాఁ దున్గి చాపంబు భూమిన్ బడెన్ ; ఘోరనిర్ఘాతనాదంబుతో క్షోణి యూటాడె - దిగ్దంతులున్ గ్రుంగె - దిగ్భ్రాంతులై చేష్టలన్ దక్కి, యందాసభాస్తారు లెన్నంగఁ జిత్తర్వుల ట్లామహాత్మ్యంబు నిర్విణ్ణులైయుండి, యంతంతఁ దెల్వొంది శ్రీరామునిన్ మెచ్చి కీర్తించి రాభూచరుల్ ఖేచరుల్ ;-

పిమ్మటన్ మైథిలుం డెంచి యుద్వాహకార్యంబు దీర్పంగ, నాగాధిపుత్రాజ్ఞచే దా నయోధ్యేశుఁ బిల్వంగ శ్రీలేఖతో దూతలన్ బంపె;

నవ్వారలుఁ బోయి యారాజు నీక్షించి, శ్రీలేఖ నందించి, వృత్తాం తముఁ సర్వముఁ దెల్పఁగా, - తేఁడు హర్షాంబుధిఁ మున్గి, యాప త్రముఁ శ్రీవసిష్ఠర్షికిఁ జూపి - యామాని యాదేశముఁ గొంచు, నాయూరఁ జాటించె నవ్వార్త;నావీటిలో సర్వసన్నాహముల్ గల్గి-సామం తులుఁ, మంత్రులుఁ బంధులుఁ, మిత్రులుఁ, మానులుఁ, పౌరులుఁ, భృత్యు, లంతఃపుర స్త్రీలు, నాబాలగోపాలముఁ; - స్యందనంబుల్, విమా నంబు, లాందోళికల్, డోలికల్, వారణంబుల్, మహావాజు లిత్యా దులం దెక్కి; వాద్యంబు లేపారఁగా, వందులుఁ మాగధుల్ స్తోత్రపా ఠంబులఁ జెప్పఁగా, మించుమోదంబునఁ - శీవిమై రాఁగ;-నామైథిలుం డంతలో, బంధుమిత్రాదులుఁ దోడరాఁ,దా నెదుర్కొంచు వియ్యంకునిఁ దెచ్చి, సన్మానయుక్తంబుగా - నర్హ్మసౌధంబునఁ డించ, మోదంబుతో క్షేమవార్తాప్రసంగంబు గావించి హర్షించి రా యుండొరుల్;—

## సీతాకల్యాణము.

వార లంతఁ, ముహూర్తంబు డాయంగ నాహూతులై - పోయి వియ్యంకు లాయిర్వురఁ వేది నాసీనులై యుండి, వేదోక్తిమైఁ బెండ్లి పౌరోహితుల్ తీర్పఁగా, వర్ణనాతీతమై యుండె నావైభవంబె న్నఁగా; - మైథిలుం డంత శ్రీరాముశ్రీపాదముల్ నీళులఁ గడ్గి, యవ్వారి మూర్ధంబునఁ దాల్చి, యాసర్వసర్వంసహారక్షదక్షంబునౌ రాముహస్తంబునఁ వారిపూరంబుతో ధారవోసెఁ, ధరాజాతసీతఁ; దనూజాతయౌ నూర్మిళఁ లక్ష్మణస్వామి కిచ్చెఁ - మఱిఁ దమ్ము కూఁతుండ్రలో నొక్కతెఁ గైకపుత్రుండు చేపట్టఁగా నిచ్చె; నింకొ క్కతెఁ జిన్నిశత్రుఘ్నుఁ బెండ్లాడఁగాఁ జేసె; నెంతో మహావైభవం బొప్పఁగాఁ గార్యముం దీర్చి - మృష్టాన్నముల్ పెట్టి ప్రీతిఁ బ్రజానీ కముఁ దన్పి - గో భూ హిరణ్యాదిదానంబులఁ గొల్లగాఁ జేసి-భూవ ల్లభుం డంపఁ గూఁతుండ్రనల్లుండ్రతో - నంత సంపత్సమృద్ధంబుగా; వెంట దాసీభటస్తోమ మేతేరఁగా నాదశస్యందనుండుఁ-బ్రయాణంబు సాగించె;

### సపరివారముగా దశరథుఁ డయోధ్యకుఁ బ్రయాణముఁ జేయునెడ మిథిలాపురీజనుల సంరంభము.

నావేడ్క నీక్షింపఁగాఁ బౌరు లొప్పారి రా వీథులం దెల్లెడన్; 'బవ్వ సీతమ్మ తా భర్తతో నూరికిన్ - జూడరే! వేగ రారే! యదో పోయెడున్ స్యందనం' బంచు సత్వాదరంబారఁగాఁ, బాఱుచున్ వచ్చి సౌధోపరిప్రాంతముల్ చేరి రాయూరివామాక్షు, లందొక్క తన్వంగి:— లోనన్ భుజింపంగఁ దాభర్తఁ గూర్చుండఁగాఁ బెట్టి, వడ్డింపఁగా వడ్డనం బున్న భాండంబు చేఁబూని, యావేళ 'శ్రీరాముతోఁ బోవుసీతమ్మ' యన్వార్త నాలించి, చేఁ దాల్చునాపాత్ర పైఁ బెట్టియే మాని, యద్దానితో వీథిలోఁ దూరె; - బల్చిత్రమం చెల్లరున్ జూడ నాహేమగాత్రిన్ - మఱొం కొక్క యేణాక్షి, భూషావళుల్ మేనికిన్ దాల్పఁగానుండి, పై వార్త విన్నంత, నాత్రంబునన్ జేసి - సత్తుంచికర్ణం బునన్, మించుటొడ్డాణమున్ గొంతునం దాల్చి యేతెంచెఁ, జంచత్కటాక్షంబులన్ జిమ్ముచందమ్ముగా; - నొక్కపద్మాక్షి, తా నద్దమున్ దువ్వెనన్ జేతిలోఁ బట్టి, గాత్రంబునన్ నామకార్థంబుగా వస్త్రమున్ జుట్టి, కార్యాదరంబో యనన్ - గుచ్చెలన్ జిమ్ముచున్ జెచ్చెరన్ వచ్చెఁ, బంచాస్త్రునుం జేతిచిల్కట్లు గుల్కారఁగా; - నింక నొక్కర్తు, స్నానం బులోనుండి భూజాత నీక్షించునర్తిన్ దగన్ వచ్చెఁ, దాఁ గట్టుపుట్టం బునన్ నీరు వెన్నేఱుగాఁ బాఱఁగాఁ బాఱె రా నంత బాజారులో నీవియున్ జాఱఁ దచ్చిత్రమున్ గాంచి గొల్లంచు గోల్వెట్టగా వీథి, సిగ్గెంచి నెమ్మోము తా వాంచి, యానారి ప్రక్కింటిలో దూరఁగా బాఱె.-

నింకొక్కెడన్ బ్రాయపున్ గన్నె కన్నార్పకే రాము నీక్షించుచుండంగ, నాజాడఁ గన్పెట్టి, బల్ప్రౌఢయొక్కర్తు, వేడాసి, యాబాలికన్ జెక్కుపై టక్కునం జొక్కవ్రేశేసె. నద్దానికిన్ బాధ సూచించు చిన్నేటి దీ హాస్యమం చల్లుచున్ బల్కె; నామాట కాబోటి, ఔనౌనె యొయ్యారి! శ్రీరాము నక్లేటికిన్ జూచెదే? దృష్టిదోషం బగున్

గాదె? యంచాడె - నాచెంతనే యుండి యీచిత్ర మీక్షించువాల్గంటి యొక్కర్తు, "ఔనౌనె గయ్యాళి! యీబాల నిప్లేటికే చెంపవాయింప?- నాధీరుశృంగార మేపారఁగాఁగన్న, మాయట్టి - ప్రాయంబుఁ బోగొట్టు కొన్నట్టివారే భ్రమల్ బొందువా రన్నచోఁ, బ్రాయపుంగొమ్మ - యీయమ్మ - ఆయెమ్మెకానిన్, గడున్ బ్రాంతయై గాంచుటల్ వింతగాఁ దోఁచెనే నీకు? నారీ! నిజంబాడు - నీమానసంబోడదే చూడ, నయ్యు బ్ధిగంభీరు - సమ్మోహనాకారు - నంచన్న, నాటక్కటిల్లాలు తాఁ బక్క నన్ నవ్వి, నల్దిక్కులన్ జూచి, తానొక్కయూర్పార్చి, యాప్రక్కకున్ మెల్లఁగా జాఱె;- నీరీతి, వారెల్ల రత్యంతసంభ్రాంతలై గాంచుచుండంగ నామానవాధీశ్వరుండున్ బ్రయాణంబు సాగించె, వెన్వెంటఁ దద్బంధు- మిత్రప్రధానాదులున్ వచ్చుచుండంగ;-

## పరశురామ గర్వభంగము

నీరీతి వారేగఁగా, మార్గమం దొక్కచో, వచ్చునారైణు కేయున్ విలోకించి వా రంత నిల్వంగ, నాతండు దుర్వారకోపంబు దీపించు నెమ్మోముతో - 'నేడి రాముండు? శ్రీరాముఁ డేఁడీ? యనం గా - వసిష్ఠర్షితో నాయయోధ్యేశుఁడున్ బల్లకిన్ డిగ్గి, యర్ఘ్యంబు పాద్యంబు నియ్యంగ, నద్దాని లక్షింప కారాఘువున్ గాంచి యాభార్గ వుం డాడు :- 'నీరాముఁ డుండఁగ, శ్రీరాము డంచింక నొక్కండ వీ వుంటివా? మేలు మేలాయె - నేనామహేంద్రాద్రిపై నుంటి, ముక్కం టిచాపంబు కేలంటి లీలావినోదంబుగా నీవు ఖండించుటన్ వింటి - నీవంటి బాహాబలోపేతు నీక్షింపఁగా వచ్చుచుంటిన్, ధరిత్రీతలంబెల్ల నీవిక్ర మాటోపమున్ మించి కొండాడఁగా వింటి, మేలైనవిల్కాడ వీవంటి, నిన్ గంటి - నీలావు నే నెన్నఁగా నుంటి, నీ జామదగ్న్యాస్త్రమున్ దెచ్చి తిన్ - గుండియల్ జాఱు నీయస్త్రమున్ గాంచఁగా, నెక్కిడన్ జాలుదే? కొమ్ము - నీవిక్రమం బెంతో చూపింపుమా! పిమ్మటన్ ద్వంద్వయుద్ధంబు నీతోడ నేఁ జేయుదున్ గాక' యంచాడఁగా ;-

నాదళశస్యందనుం డెంతయుఁ భీతుండై, లోట్రుపా టొందుకం ఠంబునఁ బల్కు 'నో భార్గవా! జన్మమా, పావనంబైన యాబ్రహ్మవం శాన; నీవృత్తియా! నిత్యమా సత్తపోనిష్ఠ; నీ కీక్రియల్ చెల్లునే? దేవ! శాంతింప నెంచంగదే! మున్ను క్రోధంబునఁ క్షత్రియానీకముఁ బోరి పల్మారు ధాత్రీతలంబెల్లఁ జేదాల్చి, సర్వస్వముఁ బారిధారాసమే తంబుగాఁ, గశ్యపబ్రహ్మకుఁ బూర్ణదానంబుగావించి, దేవేశుతో నస్త్రస న్న్యాసముఁ జేసియున్నాఁడసంచుఁ బ్రమాణంబు గావించి, యా మీఁద నేకాకివై యామహేంద్రాద్రిపైనఁ దపంబుండుసీ కేటికిఁ-గోరి కల్ నేఁటికిఁ? గోపముఁ మాని మా రాముపైఁ బ్రేమముఁ జూపుమా! మమ్ము మన్నింపుమా! యంచుఁ బ్రార్థించునా ప్రార్థనంబుఁ జెవిఁసోఁకఁ గానీక, తాఁ గ్రుద్ధుఁడై - జానకీనాథునిఁ గాంచి యాజామదగ్న్యుండు భాషించు,-

శ్రీరామ! యీవింతవృత్తాంతముఁ దెల్పెదఁ వింటివా? విశ్వ కర్మాఖ్యుఁ డీ రెండు సృష్టించె - నాముప్పురంబుల్ హరింపంగ, రుద్రుండు కైఁబూనె నొక్కం, డదేవింటినే నీవు ధ్వంసంబు గావించినా; విద్దియిం కొండు - తా, విష్ణువే తాల్చుటఁ వైష్ణవంబయ్యె; నాతండ్రి సాధించె నిద్దాని నెల్లిట్లో, యాపిమ్మటఁ జేరె నన్నిద్ది - యాకార్తవీర్యార్జునుం డఁ మదాంధుండు నాతండ్రినిఁ జంప, నేఁ గోపినై పల్మఱున్ క్షత్ర గోత్రంబు నాశంబుఁ గావించితిన్ దీనిఁ జేఁబూని; యాపిమ్మటన్ రోసి నే జన్నమున్ జేసి, సర్వస్వమౌ ధారుణిన్ గశ్యపబ్రహ్మకున్ బూర్ణదత్తంబు గానిచ్చి, నిశ్చింతతో నామహేంద్రాద్రిపైఁ జేరి, నిష్ఠఁ దపోవృత్తిమై నుంటి - నీలావు నే వింటి - నావెంటనే వచ్చితిన్; గంటివా! వింటిఁ గైకొమ్ము, లే లెమ్మనన్;-

జానకీనాథుఁ డాపల్కు లాలించి, యాస్యంబునన్ జిన్నినవ్వొల్కు శీఘ్రంబు పంకించి - తాఁ దిన్నఁగా భార్గవున్ జూచి పల్కాడెడిన్ - 'వింటి నే, నీకథన్, మేలు మేలౌ పితౄణంబు సాధించుటన్ - మున్నె నే

వింటి నీక్షత్త్రియస్తోమసంహారమున్ - గంటి నీనాఁడు నిన్ - నీదుబింకం బులన్ వింటి, నీబోఁటినిన్ సైపరాదంటి- నేఁదీ భవద్దివ్యచాపం బటంచాడి, యాయస్త్రరాజంబు తా నీవ్వ, చాధీరు తేజంబు నావింటితో లాగి, తాఁ గంటిమంటాడఁగా బాణ మెక్కించి, కోదండమున్ మీటుచున్ - 'బ్రాహ్మణుండౌట నిన్ జంపఁగానొల్ల, నే నెక్కిడంగల్గుటన్ వైష్ణవంబిద్ది తా నూరకే పోవదే ప్రాణముల్ గాచి పాదంబులన్ద్రుంతునా లేక నీయార్జితంబైనపుణ్యంబుపై వైతునా? రెంటిలో నొక్కటిన్ గోరి కొమ్మంచుఁ దెల్పంగ, తా వీర్యహీనుండునై భార్గవుండాడు :-

'శ్రీరామ! నిన్ గానకుంటిన్ గదున్మందభాగ్యుండనై - మించెఁ గాకార్యంబు నింకేమి! నా పాదవేగంబునున్ ద్రుంపఁగాఁ బోకుమా- యీధరిత్రీతలంబెల్ల నాకశ్యపబ్రహ్మకున్ నేను దానంబుగా నిచ్చుటన్ జేసి యిం దుండఁగారాదు, నేనా మహేంద్రాద్రినిన్ జేరఁగాఁబోయెదన్. రామ! నా స్వర్గమార్గావరోధంబు గావింప కయ్యా! యటం చాతఁడున్ వేఁడ శ్రీరాముఁ డారీతిఁ దత్పుణ్యమున్ భస్మమున్ జేయఁగా, భార్గవుం డెంతయున్ ఖిన్నుఁడై పోయె మాహేంద్రమున్ జేరఁగా;-నంత సుస్వాంతుఁడై ధారుణీకాంతుఁడున్ బంధుసర్వస్వసంయుక్తుఁడై చేరెఁ దానాయయోధ్యాపురం బంచు శ్రీశారదర్షి శుఁ డామానికిన్ జెప్పె నీరీతిగా :-

ఇద్ది శ్రీరామపాదాంబుజధ్యాననిష్ఠాగరిష్ఠుండు, విప్రుండు, వాసిష్ఠగోత్రోద్భవుం డార్యవెంకోబరాయాత్మసంజాతుఁడున్ సాధ్వీలక్ష్మాంబికాగర్భసచ్ఛుక్తిముక్తాఫలంబైన అశ్వత్థరాయండు తా వ్రాయు నీదండకోపాఖ్యరామాయణంబందునన్ బాలకాండంబు నర్పించెదన్ గొమ్మిదే ఆంజనేయా! మహావజ్రకాయా! సదారామకార్యప్రియా! ధర్మధౌరేయసద్భక్తగేయా! బుధశ్రేయ! దీనార్త సద్భక్త బంధూ! దయాసింధు! శ్రీవాయుపుత్రా! పవిత్రా! నమస్తే నమస్తేనమః.

బాలకాండము, సమాప్తము.

శ్రీ

శ్రీ సీతారామలక్ష్మణ పరబ్రహ్మణే నమః

# శ్రీ దండకరామాయణము.



## అయోధ్యాకాండము

శ్రీనారదర్షీశ్వరుఁ గాంచి ముందొకథాభాగముఁ దెల్పఁగాఁ బ్రీతి వాల్మీకి ప్రార్థింపఁగా, నారదుం డెంతయుఁ హర్షితస్వాంతుఁడై పల్కె;—

మౌనీంద్ర! యట్లాయయోధ్యాపురంబందు సౌఖ్యంబుగా, రాజపుత్రు ల్దమిఁ గ్రీడలఁ సల్పుచుఁ, రాజకార్యంబులఁ దీర్చుచుఁ గొన్నియేండ్లేగఁగాఁ - గోరి మేనల్లునిఁ గైకసూతిఁ గనఁ, గేకయాధీశుఁడుఁ వార్తఁబుత్తెంచఁగాఁ గైకపుత్రుండు శత్రుఘ్నుతోఁ గూడి తత్పట్టణంబేగి తా నందు సౌఖ్యంబుగా నుండె,—

### శ్రీరామపట్టాభిషేక ప్రయత్నము

నట్లాయయోధ్యాపురంబందునఁ ఱేఁడు, తా నొక్కనాఁ డావసిష్ఠర్షితో మంతనం బాడుచుఁ, రాత్రిఁ దాఁగన్నస్వప్నంబు విన్పించి, తత్కారణంబౌ భయంబుండె నంచాడి, శాపంపువృత్తాంతముఁ జ్ఞప్తికిఁ దెచ్చి, యేనాఁటికే కీడులుఁ మూఁడునో కాన, శ్రీరామపట్టాభిషేకంబు శీఘ్రంబుగాఁ జేయుటే లెస్స యంచెంచి, యాకైకపుత్రుండు శత్రుఘ్నుఁడుఁ లేమి కెంతే విచారించి, యత్నంబులేకుం టచేఁ దద్విచారంబునుఁ మాని, యెల్లుండియే సన్ముహూర్తం బటంచుఁ వసిష్ఠుండు విన్పింపఁగా, లెస్సయంచాడి యారాజు మంత్రిశు రప్పించి,

పట్టాభిషేకార్హసన్నాహముల్ సల్ప నేమించి, శ్రీరాముఁ బిల్పించి యావార్త విన్పించి, తత్సోదరుల్ లేమికిన్ గుందు శ్రీరామునిన్ యోగ్యసంభాషణల్ సల్పి యొప్పించి, యాయూరు శృంగారమున్ సల్పఁగా వార్త చాటించె; నాయంత నాపౌరు లుత్సాహులై, వీథులన్ నేత్రపర్వంబుగా - దివ్యశృంగారముల్ దీర్చి, లీలన్ గృహారామసౌధంబులున్, దేవళంబుల్ వినూత్నంబుగానా నలంకారముల్ సల్పి, తద్వీథు లిర్వంకలన్ గాల్వ లేపార పన్నీరులన్ నిండుగా నించి, రథ్యంబులన్ జక్కఁ జేయించి, పందిళ్లు వేయించి, ధూపంబు ప్రబ్బించి, దివ్యంబుగాఁ దోరణాల్ ప్రేలఁ గట్టించి, భవ్యంబులౌ నైదువన్నెల్ ప్రకాశింప విద్యుత్ప్రభాదీపికల్ వెల్గఁగాఁ జేసి, యెందెందుఁ గాంచన్ సుగంధంబె యేతేరఁగాసల్పి, దేవేంద్రునావాసమున్ మించు సింగారమున్ జేసి, పట్టాభిషేకార్హసంభారముల్ గూర్చు సన్నాహమున్ సర్వులున్ సల్ప;—

## మంథరాకైకలసంభాషణము

వీక్షించి యాసర్వమున్ మంథరాభిఖ్య - తా, దేవతల్ పంపఁగా వచ్చి, కైకేయితో నచ్చుమెచ్చొచ్చు వర్తించుచున్ రామునిన్ గానకున్ బంపునా దేవతాకార్యమున్ దీర్పఁగా గాలమున్ వేచియున్నట్టియాజాణ, యావార్త నాలించి, - 'శ్రీరాముపట్టాభిషేకంబె! యౌరౌర! కాని'మ్మ టంచెంచి, కైకేయినిన్ డాసి, బల్తీవ్రకోపంబునన్ బల్కె;- 'నోకల్కి! కన్గొంటివే? యీపురం బేటికే నేటి కీరితి శృంగారమున్ సల్పఁగా? నీప్రజానీక మి ట్లేటికే, మించి హర్షాంబుధిన్ దేలుచుండెన్? జెలీ! యేటికే, యిట్టిమేల్ పుట్టమున్ గట్టి, బల్సొమ్ములన్ బెట్టి మిట్టాడెదే మట్టి సౌభాగ్యమున్ గంటివే? తెల్పవే, యన్న, నాకైక మోదంబునన్ బల్కె;—

నోమంథరా! కందువా, రేపు శ్రీరాముపట్టాభిషేకం బగున్, దానికే పౌరులున్ సర్వు లంతఃపురస్త్రీలు మే మెల్లరున్ సంబరం బంది

సంతోషముఁ బొంది తత్కాలముఁ వేచియున్నార, మీ వింక వస్త్రాద్యలంకారముల్ దాల్పవే!' యంచు నూరాడు కైకేయి నీక్షించి క్రీఁగంటితోఁ జిట్టుముట్టాడుచుఁ, 'వెఱ్ఱిదానా! బలే కార్యముఁ జేసితే? బుద్ధిలేదే! వినాశంపుకాలంబు నీకౌట లోనెంచవే? జాణవే కైక! నీకింక దిక్కెవ్వరే? రాముఁడే రాజుకా, నీసుతుం డాను భృత్యుండుగా - నీవు కౌసల్యకుఁ దాసివే కావె చింతింపఁగా' నంచుఁ దానాడఁగాఁ, గైక బల్ భ్రాంతయై;—

మంథరా! యేమిమాటాడు దే? రామునా! సద్గుణస్తోమునా! శౌర్యసుత్రామునా? నీవిటుల్ పల్కుటల్? రాముఁడుఁ వేఱు, నాపుత్రుఁడుఁ వేఱునా? వాఁడు కౌసల్యకంటెన్ గడుఁ గూర్చు నాకుఁ; మహాప్రీతిమైఁ దమ్ముఁ జూచు; వాత్సల్య మేపారఁగా భూప్రజన్ బ్రోచుఁ; దాఁ బెద్దలన్ గాంచినన్ భృత్యుఁడై భక్తి సేవించు; సత్యాదరంబొప్పఁగా బీదలన్ సాదరన్ దృష్టిగావించు; మిత్రాళి కిష్టార్థముల్ దీర్చు - నాపట్టియౌ రామునందా, యిటుల్ భేదముల్! ఖేదమౌ నాకు నీవాద మోమంథరా! యెందుకే నిష్ఠురం బాడ శ్రీరాము నంచాడు కైకేయి నీక్షించి యిట్లాడు;—

మంథరదుర్బోధనము

ఓకల్కిరో! వీనులన్ ముల్కులై నాటె నీపల్కు, లారాముపై ద్వేషభావంబు లే దెన్నఁగా నాకు; నేస్వార్థముఁ లేదు నాకారయన్ - నీహితం బెంచి నే నింతగాఁ జెప్పితిన్, వృద్ధరాజున్ గడున్ నమ్మి యిట్లైతి వీ వంచు భావించితిన్ - నీసపత్నీసమీచీనసౌభాగ్యముఁ గోరు నీమౌఢ్యముఁ గాంచి యాశ్చర్యముఁ బొంది లోఁగుందితిన్ - బుత్రు నిర్భాగ్యుఁగాఁ జేయు నీబుద్ధిహీనత్వముఁ గాంచి నిర్విణ్ణనై పోయినన్ గాని, నాచేతనౌ బుద్ధిఁ దెల్పంగ లేకుండు టెంతో యధర్మంబుగా నెంచి, నిన్ డాయఁగా వచ్చితిన్ - గాని నే నిచ్చకంబాడ రాలేదు; లోనమ్ము నామాట - నీమాన - నామాన - యారామపట్టాభిషేకంబు

విఘ్నంబు గావింపకున్నన్, వినాశంపుకాలంబు నీకెన్న నాసన్న మాటల్ యథార్థంబు; చూడన్ భవత్సూనుఁ డా రాముదాస్యంబునన్ గుందు - కౌసల్య భాగ్యబు పండెన్ గదే! - తల్లియై రామభూభర్తకున్, ధాత్రిఁ దాపల్కుపల్కొక్కటే శాసనంబై విరాజిల్లఁగా వెల్గు, కౌసల్య పాదంబులన్ బత్తిమై నొత్తుచున్ - జిత్తమంచాడుచున్ - నీవు నీతోడి పత్నుల్ సదా కూడి కేల్మోడ్చుచున్ సేవలన్ సల్పువారైన నన్నెంచవో;—

రాజు రాముండుకా, దీనుఁడై మ్రొక్కుచున్ రాముచేఁ జిక్కి, మానంబు పోఁదక్కి, నీపుత్త్రుఁడున్ బొక్కునాఁడైన సత్యంబటంచెంచినన్ మెచ్చువే! - 'కైవసం బుండె భూకాంతుఁ డో కాంత నాకేమిటన్ దక్కువే?' యందువే? భర్త నిన్నెంతప్రేమించునో సుంత లో నెంచి యోజించితే! - భ్రాంత! నీభ్రాంతియేకాని యావంతలే దాత్మలోఁ గూర్మి; యెట్లందువా! విందువా? - నీసుతున్ బంపి వేఱూరికిన్, వాఁడు లేనప్పుడా, రాము క్ష్మానాథుఁగాఁజేయ లోనెంచుటల్? ప్రీతియా - రీతియా-నీతియా - యిద్ది? - తా మాటలన్ బ్రీతి నీపైన, బల్కోటలన్ దాఁటమీటున్ గదే బోటి! లోఁగూర్పు నెంతైన గౌసల్యకున్ - నమ్ము నామాట ముమ్మాటికిన్; - జూడుమా! రాముఁడే రాజుకా, లక్ష్మణుం డెన్న సర్వాధికారంబుఁ గైఁదాల్చుగాఁ? గారణం బేమటంచందువా? విందువా?-దేహముల్ రెండుగాఁ బ్రాణ మొక్కండుగా, వారు వర్తించుటల్ నీవు కాదందువా ? కందువా ? లక్ష్మణుండున్ రిపుఘ్నుండు నేకోదరుల్ కారె? - వారిద్దఱున్ రేకైకభావంబుతో కార్యముల్ గొంట యానందువా?...యెట్టిటుల్ గాంచినన్ నీసుతుం డొక్కఁడే వేఱగున్, గైకగర్భంబునన్ బుట్టుపాపంబునన్ జేసి నిర్భాగ్యుఁ డయ్యెన్ గదే వాఁడు? - నీరీతి నానాతి దుర్నీతినే, నీతిగాఁ జూపి బోధించి సాధింపఁగా, గాటమై నాటె నామాట లాబోటిడెందంబునన్; - ధాత్రి సావాసదోసంబునన్ శ్రేష్ఠులున్ భ్రష్టులై పోవరే?-

అప్పు డాకైక దుర్బుద్ధి లోఁదోఁట్టి, నిట్టూర్పుఁ బోఁబెట్టి, కట్టా! చెడెన్ నాదుబల్ కాపురం బంచు, నాకుబ్జపాదంబులన్ బట్టి ప్రార్థించు నీరీతి:-

'నేఁడీన - నిన్ దప్ప నేఁగాన వేఱొక్కతెన్, గాన నావిన్కి- నీచే సు...! మంథరా! ముందు రానున్న కష్టంబులన్ దెల్పినా వీవు బల్ ప్రేమచే; నట్లె నీయుక్తిచే, రాముపట్టాభిషేకంబు మాన్పించి, నాపుత్త్రు మూర్ధాభిషేకంబు గావింపవే! నిన్ను నాజన్మ మున్నంతకాలంబు నేనెంతు' - నంచెంచి ప్రార్థించు నాకైకవాక్యంబు లాలించి యాకుబ్జ:- 'యోమానినీ! నీహితంబెంతునంచున్ ననున్ నమ్మితే? నేఁడు నన్మెచ్చితే? చూడు, నే నొండుపాయంబు బోధింతు - మున్, దేవదైత్యోగ్ర సంగ్రామమునం, దీవు నీభర్తకున్ సాయమున్ జేయ, నాతండు నిన్ మెచ్చి నీ కీయఁడే, తావరంబుల్ తగన్ రెండు; నీయిచ్చ నేకాలమందైననున్ గోరఁగా నీకు స్వాతంత్ర్యమున్ గల్గఁగాఁ జేయఁడే నాఁడె? యీనాఁడు నీతోడుగాఁ గోరుమా నాథు, నీపుత్త్రుమూర్ధాభిషేకంబు గావింపఁగా నొండు; నింకొండు తేపే పదిన్నాలుగేఁడుల్ జటావల్కముల్ దాల్చి రాముం, డరణ్యంబునన్ వాసమున్ సల్పునట్లుంపఁగాఁ గోరుమా! నీవ టంచాడ, నావాక్యముల్ వీనులన్ సోఁక నాకైక కెట్లాయెనో యేమొ, యాకుబ్జ మోమట్టె వీక్షించి యిట్లాడు:—

హామంథరా! యేటిమాటే? ధరాధీశు, నాపుత్త్రుపట్టాభిషేకంబు సేయంగ నేఁ గోరినన్ గోరెదన్ గాని, రామున్ వనంబందునన్ ద్రోయఁగాఁ గ్రూరనై కోర నానోర దెట్లాడునే? అయ్యయో! రామునా - రాజుప్రాణంబుగా వెల్గుశ్రీరామునా - నాతనూజాతుకంటెన్ గడున్ గూర్చు నాప్రేమపున్ రామునా! సద్గుణస్తోమునా! - రామునా, కానకున్ దోలఁగాఁ గోర! నోమంథరా! నేర - నే, నేర; నాపుత్త్రుఁ డారాము దాస్యంబునన్ నిల్చినన్ నిల్వనీ - నేను గౌసల్యకున్ దాసిగా నైనఁ గానీ-మఱే మైననై పోని, యీపాపపున్ గోరికన్ గోరఁ గా నోప.

నేనోప, - నంచెంతయున్ భీతయై కైక యీరీతిగా నాడఁగాఁ గుబ్జ పల్కెన్;—

సతీ! యేటికే భీతవై రీతిలేనట్టి పల్కాడఁగా, నూరకే గోర నేనా వరంబుల్; గనన్ రాముఁడే కానఁ జేరంగఁ బోకున్నచో, నీసుతుం డెట్టులౌ రాజుగాఁ? గోరి వాదింపరే యూరివారల్; - తమిన్ జేరి కౌసల్య తానాసుమిత్రాఖ్యతోఁ గూడి బల్ గోడువెట్టంగ, నీపుత్రుపట్టాభిషేకంబ దెట్లౌనె? - యీవృద్ధరాజెంతయున్ దూఱి వారింపఁడే కార్యమున్ - గాన, శ్రీరాముఁడా కానలన్ జేర, నీకవ్వ లెందుండునే? యెంచఁగా వీరియారాటమున్ గాంచి భీతాత్ముఁడై నీసుతుండే, ధరాభారమున్ దాల్ప శ్రీరాముఁ బ్రార్థించినన్, జేనితోఁ బౌరులున్ జేరి యారామునే రాజుఁ గావింప విశ్వప్రయత్నంబు గావించినన్, మానియై కానలోనన్ బదిన్ నాలుగేఁడుల్ వసింపంగఁ దా దీక్షఁ గైకొన్న శ్రీరాముఁ డామాట పోనాడుచున్ బూనఁ డీధాత్రి; నోమానినీ! కాన, నామాటలో నీటు నొక్కింతపాటింపవే! - యన్న, కైకేయి తా నింత చింతించి యిట్లాడు:-

కైక మంథరదుర్బోధనకు లొంగిపోవుట

నోమంథరా! యెంచ నీమాట సార్థంబుగానుండె నాఁగాని, దీనన్ మహానర్థముల్ గల్గునో యేమొ యంచెంచి భీతిల్లెదన్; రాముఁ డా కానలన్ జేరుచోఁ, బుత్రశోకంబునన్ జేసి ధాత్రీశుఁ డేమౌనొ? యాతండె లేకున్న, నాకేసుఖం బిచ్చు నీరాజ్యసౌభాగ్య? మెన్నంగ నాపుత్రుఁ, డారామభక్తుండు నౌటన్, ననున్ నైచునే? తుచ్ఛమీరాజ్యకం యేల, యయ్యింద్రసామ్రాజ్యమే కాని - కన్నెత్తియైనన్ గనన్ గోరునే? చెప్పుమా, మంథరా! యన్న, నన్నాతి కన్మూసి - యొక్కింత యోచించి - ముద్దారఁగాఁ బల్కె: - నీమాటలోఁ గొంత సత్యంబు లేకుండఁ బో, దైనఁ బూర్ణంబుగా సత్యమే కల్ల, దావృద్ధరాజెన్నఁగాఁ బుత్రశోకంబునన్ గుందినన్ గుందఁగా వచ్చు, నామాత్రనే

మానె? నానాఁటి కాశోకముఁ దీఱె నీనాథుఁడే పారు; నీపుత్రుఁడో, యెంచఁ దోర్ద్దోర్త్త జింతించుఁ గొండంతగా - మీఁద నింతింతగాఁ దగ్గు నీమౌర్ఖ్య మెన్నాళ్లో నిల్చుఁ? ధరారాజ్య మబ్బంగఁ, గొల్లన్నఁ దానంతయున్నా దియే, కైక నీపుత్రుఁడుఁ? భ్రాంతిఁ గోరంతఁ గొండంతంగాఁ జేసి చింతింతువే కాని - యేమంతగా పుట్టిమున్గేఁ! గనఁ సుంతయుఁ గా దనర్థంబు; నీకోర్కెలీడేరు - నీవ్యర్థమౌ యోచనన్ మాని, కార్యార్థమై దీక్షఁ గైఁ బూని, సాధింపుమా రాజ్యముఁ - బూజ్యముఁ బూజ్యవై వెల్గుమా! లె' మ్మటం చాడఁగాఁ, గైక కార్యంబు సాధింపఁగా నెంచి, లోమించునా కాంక్ష దీపింపఁగా వేఱు యోచింపకే పోయి, కోపంపు సద్మంబునఁ- బ్రాతవస్త్రంబు మై దాల్చి, మేఁ సొమ్ములఁ బుచ్చి, ధమ్మిల్లముఁ విచ్చి, కేశంబులఁ జిక్కుగావించి - కోపంబునఁ మించు తాపంబునఁ, నేలపైఁ బండె; - నాకుబ్జ, యీసర్వముఁ గాంచి, నాకార్య మీడేఱె నంచెంచి, హర్షించుచుఁ బోయె;-

దశరథుఁడు కైకేయియింటికి వచ్చుట, కైక యంతఃపురవర్ణనము

అంతఁ, దశస్యందనుం, డందుఁ బట్టాభిషేకార్హకార్యం, బవార్యంబుగఁ, సర్వముఁ శీఘ్రమై సల్పఁగా నాజ్ఞగావించి భృత్యాళి, కయ్యోలగం బంత చాలించి, యావార్తఁ దాముద్దుకైకేయికిఁ ముందుగాఁ దెల్పఁగా, డెంద మాసింపఁగా, నొక్కఁడే కాల్నడఁ జక్కఁగాఁబోయి, యంతఃపురద్వారముఁ దాసి, ప్రాకారవీథిఁ బ్రవేశించి, యాత్రోవ కిర్వంకలందుఁ సుగంధప్రపూర్ణంబులై యొప్పు నానాప్రసూనావళిఁ గాంచి, యందింత వీక్షించి ముందేగి - రుచ్యంబులౌ సత్ఫలవ్రాత మామూలముఁగల్గు భూజంబులఁ దాసి, యందింత కన్వేసి, ముందేగుచో - భవ్యముల్ దివ్యముల్ నవ్యముల్ సల్లతాగుల్మకుంజంబులఁ గాంచి, యవ్వానిపైఁ జూపులఁ మీటి - యామీఁదటఁ వాని నన్నింటినిన్ దాఁటి - యందందు శాఖాళిపైఁ బొందికన్ జేరి, మేల్ రంగు లేపార - పక్షంబు లల్లార్చుచుఁ, గూడి యొండొంట సయ్యాటముల్

సల్పు, నాశారికాకీరవారంబు మోదంబుతోఁ, డంబుగాఁ జేయు నారావముల్ విందుగాఁ బొందుగావించి, ముందేగుచున్ - వేపాదన్ డాఁగు కుందేళులన్,- లేళులన్, - నీళులన్ దేలుచున్ మున్గుచున్ లీలమై నాడు తాఁబేళులన్ - మీఁళులన్, జూడఁగా నిల్చుచున్ - జేరఁగాఁ బిల్చుచున్:-

నేత్రపర్వంబుగాఁ జిత్రచిత్రంబుగా, సార్థమై, బల్ విలాసార్థమై లీల యానాజలక్రీడకార్యార్థమై నిర్మితంబౌచుఁ గెందమ్ము లందమ్ముగాఁ గూడి, స్వాదమ్ములై నారికేళోదకమ్మట్లు, మాధుర్యమొప్పారునీరంబు పూరంబుగా మీఁటి యేపారు కాసారమున్ జేరి, యందెంతయున్ వింత యానాకాంతులన్ గూరి, కుల్కారు రాయంచలన్ గాంచి మోదించి, శీవిన్ జలంబాడ నుంకించు నాబాతులేతెంచు రీతిన్ గనుంగొంచు ముందేగుచున్, మల్లికాచంపకోత్ఫుల్ల పుష్పాంచితంబై విరాజిల్లుసత్పల్లవాక్రాంతమౌ చల్ల పందిళ్ల లక్షించుచున్, బాళిమై హేళిమై కేళిమై కేలు కేలూఁని స్త్రీ పూరుషుల్ లీల నుయ్యాల లూఁగంగ నారీతిఁ గల్పింపఁగాఁ బడ్డవై, దివ్యదివ్యంబులై వెల్గు నానాలతామాలికాడోలికాజాలముల్ గాంచి హర్షించుచున్ మానసానందమై, యందమై, డోలికాబంధమై, దివ్యసౌరభ్యసంబంధమౌ నాలతామందిరంబున్ విలోకించుచున్; జల్లనై యుల్ల ముప్పొంగ రంజిల్లు సీలంపు రాలన్ విరాజిల్లు, నా వేదికానీకమున్ దేకువన్ జేతితోఁ దాఁకుచున్; దోడనే యింపుమైఁ బెంపుదున్ బక్షులన్ జూచుచున్, సొంపుగాఁ బంజరాలందు గుల్కారుచున్, బోజులో కౌఁజులన్, జక్రవాకాల పెన్ జట్టులన్ జూచుచున్ - బావురాపిట్టలన్, బల్కురా చిల్కలన్, గుల్కుగోర్వంకలన్ జేరి యేపార నవ్వాని మైదువ్వుచున్ భీతితో నవ్వి దవ్వేగఁగా నవ్వుచున్; విచ్చి పింఛంబులన్ స్వేచ్ఛమై నిచ్చమై మెచ్చుగా నాడు, నానీలకంఠాళినిన్ బాళిమైబట్టుచున్, దట్టుచున్; జోకమై తీకుమైఁ గూఁకలన్ గీఁకలన్ బెట్టి యాటాడు నాకోకిలానీకమున్ గాంచుచున్ మించి మోదించుచున్ :-

బోవు చిట్టాధరాకాంతుఁ డంతఃపురద్వారమున్ జేరి, లోనన్ బ్రవేశించి, వీక్షించె నచ్చోటఁ దానొక్కెడన్ :- పల్లకీఝల్లరీ లుల్లసిల్లంగ రాల్గుల్లలై పాఱు, జల్జల్లనన్ మేను, మేల్పల్లవుల్ పాడు సంఫుల్లకంజాక్షులన్ ; - గాంచె నింకొక్కెడన్, నీటుగా తంబుఱాల్ మీటుచున్ - మేనగు న్నాటునొందన్ నిరాఘాటమై మేటియాలాపనల్ సూటిగా నోట బాటించు మేల్బోంట్ల! నింకొక్కచోటన్ మృదంగంబు వేభంగులన్ దాళమేళంబు రంజిల్ల, సారంగ జంత్రంబుపైఁ జెంగుచెంగంచు మ్రోఁగంగఁ గాల్గజ్జెలున్ రంగుమై నాట్యపున్ భంగిమల్ ద్రొక్కు నానా కురంగేక్షణానీక; మొండొక్కచోఁ, బూర్ణశ్రీచూర్ణసంకీర్ణమౌ మంచి గంధంబు రంగారుబంగారుపాత్రంబులన్ నిండుగానించు వేదండయానల్; మఱింకొక్కచోఁ, బచ్చకప్రంబు జవ్వాదియున్ సారకస్తూరియున్ గేసరిన్, వాసనల్ బల్గుబాళించు తాంబూలపున్ జుట్టలన్ జుట్టి బంగారపున్ దట్టలన్ బెట్టు పూబోణి నింకొక్కచో, జవ్వనుల్ మవ్వపున్ బువ్వులన్ దివ్యదివ్యంబుగాఁ జేర్చుచున్, మాలికల్ గూర్చుచున్, జెండ్లుగా మార్చుచున్, జిత్రచిత్రంబుగాఁ దీర్చుచున్, బుట్టలన్ దార్చు చంద్రాస్యలన్ !-

భూవరున్ గాంచి వారెల్ల వేలేచి, క్రొక్కార్మెఱుంగుల్ ప్రసారించు క్రీఁగంటిచూడ్కుల్ విలాసంబుగాఁ జిమ్మి, బల్చెక్కుటద్దాల జక్కెంతయున్ జిల్కఁగాఁ గుల్కి, రేవెన్నెలల్ గాయు నాతిన్నసవ్వుల్ తదాస్యంబులన్ దీధితుల్ గ్రమ్మఁ గాఁబమ్మి, యాచిన్ని జాబిల్లివోలెన్ పదార్వన్నెలన్ జిమ్ము మోముల్ కళల్గుల్క - శంఖోపమగ్రీవముల్ నీటుగా మీటి, యాయన్నుమిన్నుల్ సరాగంబుమీఱన్ గరంబెత్తి భక్తిన్, ధరాధీశుమ్రోలన్ జోహారుల్ దగన్ సల్పి వారల్ బిరానన్ బరాకంచుఁ దెల్పన్ నరేశుండు కన్సన్నలన్ మన్ననల్ దెల్పి కొంచెల్లె ముందేగి -

దశరథుఁ డంతఃపురమునఁ గైకను వెదకుట

వీక్షించె నాహంసతల్పంబు, కైకేయిఁ దానయ్యెడన్ గానమిన్ బోయి యాచంద్రభాస్వచ్ఛిలావేదికల్ చూచి, సయ్యాటపట్టుల్ పరీ

క్షించి, యాంరచ్చకట్టల్ నిరీక్షించి, శయ్యాతలంబుల్ విలోకించి, యుయ్యాలలెల్లఁ సమీక్షించి, భూషావస్త్రాలంకారగేహావలోకంబు గావించి, తా నాజలక్రీడగావించు నాగారముల్ చూచి, వీక్షించి రసనాట్య శాలల్-విలోకించి సౌధోపరిప్రాంతముల్ డాసి, యామంత్రతంత్రాధికాలోచనప్రాంగణంబుల్ విమర్శించి, యాభోజనాగారముల్ గాంచి, యెందెందుఁ గైకేగ గనన్ రామికిఁ గుందుచుఁ బోయి, తాఁ గోపగేహంబు వీక్షించె, భూశయ్య మేఁ వ్రాల్చియుఁ సూనముద్రాస్యయై పాఁపపాట్టులఁ రోఁజునా భామినిఁ !-

గాంచి - స్వప్నంబునందుంటినాయంచుఁ దర్కించి, యేమైనసుఁ వ్యాధియో యేమొ? యంచింతచింతించి - యీకాంతకుఁ వ్యాధియేయైన వృత్తాంతముఁ నాకుఁ బుత్తెంపదేలా. యటంచెంచి - భూశయ్య, నాకోపగేహంబునఁ బండుటల్ చూడఁగాఁ, గోపమే కారణం బౌను, వేఱొండుగాదంచు నిర్ధారణఁ జేసి, యేమో ప్రమాదం బటంచెంచి ,- వేగఁ సరాగంబునఁ, నాగవేణిఁ దగఁ బాహుమూలంబునఁ జేర్చి, తాఁ గౌఁగిటఁ గ్రుచ్చి, లోహెచ్చుమోహంబుతో నంకపాళిఁసతిఁ దార్చి, చేనున్న యాహస్తవస్త్రంబుచే నాస్యముఁ దుడ్చి, ఫాలంబునఁ వ్రాలు నాముంగురుల్ నీటుగా గోటితోఁ జిక్కుబోఁదీర్చి-స్వస్థానముఁ జేర్చి, చెక్కిళ్ల వ్రేళ్లూన్చి, మోముఁ బరీక్షించి, యూర్చార్చి, భూరియుగ్మ మల్లార్చి, యోదార్పఁగా నెంచి చింతించి :-

దశరథుఁడు కైకనువిచారకారణం బడుగుట

ఓమానినీ ! మన్మనోహారిణీ! మోహినీ! యేమికల్గెఁ-విచారంబు? నీ కేప్రమాదంబువాటిల్లెనే ? పల్కవే. కల్కిరాచిల్కవే కల్కి ! యే నీచుఁ డేతప్పు నీపట్లఁగావించె ? నాదుష్టు నాపాపి నిర్భాగ్యుఁ జేరోకవె, నఁజూడవే! వాని దండింతు-ఖండింతుఁ జెండింతు శీఘ్రంబు శీర్షంబు ధాత్రీస్థలిఁ ద్రెళ్లిత్రుళ్లఁ; - సరోజాక్షి! నీనోటితో నొక్కమాటాడినఁ జాలు నయ్యింద్రునేనిఁ దరిద్రాధముఁ జేతు ; నీయాజ్ఞ

యైనఁ దరిద్రుండెయౌఁ గాక, కాంతా! కుబేరుండుగాఁ జేతు నోపుండరీ కేక్షణా! నాభుజాదండమం దుండుకోదండదండం బిదేచూడు, వేదండ యానా! పదిఁనాల్గులోకంబులఁ ద్రచ్చి నీపాదపద్మంబులం దుంతు నేఁ దెచ్చి - నీయిచ్చ యే ముచ్చరింపంగదే! చెచ్చెరఁ దీర్తు నోసచ్చరిత్రా! అయో! రీతిలేనట్టియీ ప్రాతవస్త్రం బదేరీతి నీముద్దుమేనంటఁగా సాహసించెఁ! - మహాదివ్యదివ్యాంబరశ్రేణు లేపాపమున్ సల్పె నీయాగ్రహోదగ్రదావానలజ్వాలకుఁ బాలుకా? బాల! యామేటిరత్నాంచితఖ్యాత భూషావళుల్ దోసమేమంతగాఁ జేసెనే త్రోయఁగాఁ? గర్కశంబైన యాభూమిపైనా సఖీ! నీవుపన్నుండుటల్? బాల! నేఁ దాళఁగాఁజాల, వే పల్కవే బోఁటి! యీపాటు నీకేటికే! యన్న - నామాట లాలించి కన్దమ్ములన్ విచ్చి కాంతున్ విలోకించి, యిట్లాడె శోకించి!-

కైక వాక్చాతుర్యముచే, దశరథుని మరలుగొలుపుట

హానాథ! మత్ప్రియనాథా! ధరానేతృనేతా! ప్రతాపాధినాథున్ నినున్ భర్తగాఁ బొందియున్ నే నథాకృతిన్ గుందెదన్ మోహనాంగా! మదీయేప్సితార్థంబు దీర్పంగ నే నుంటినం చంటివే! అంత భాగ్యంబు నాకున్నదే! సత్యమున్ బల్కుదే? బాళి నీవంతగా నాయెడన్ జిల్కుదే! పల్కవే! యన్న - భూనాథుఁ 'డో మానినీ! నా యెడన్ నీకు సందేహ మిట్లుండ నే హేతువో? నాతిరో! మున్ను కన్నావకే నాయుదాసీన భావంబు నీపట్ల? నీకై చితిన్ దూఁకఁగావచ్చినన్ దూఁకెదన్, గోర్కె నే దీర్తు - నీదేర్తు, నోకామినీ! కోరుమంచన్న, నాదాణ వేలేచి, ముద్దారఁగాఁ గౌఁగిటన్ గ్రుచ్చి యావృద్ధు, మాయా విమోహంబులన్ గుప్పి తీపౌచమత్కారపున్ భాషణల్ సెప్పి, యిట్లాడు;-

మన్నాథ! దేవాసురస్తోమసంగ్రామరంగంబునం దీ వటుల్ భంగమున్ బొంద, నాభంగినీక్షించి, నే చెంగునన్ బాణముల్ పూని భంజింపనే శాత్రవానీక? మీవట్టినాభంగి నీక్షించి యుప్పొంగి, నీ వీయవే మోద

మారంగ నాకుఁ వరద్వంద్వముఁ నాథ! నాయిచ్చ నేకాలమందైన నేఁ గోరఁగావచ్చునం చెంతయుఁ స్వేచ్ఛ గల్పింపవేనాకు? నేఁ డావరద్వంద్వముఁ గోరఁగాఁ గాల మాసన్నమయ్యెఁ బ్రియా! యిత్తువే వాని? నీప్రేమకుఁ బాత్రమా ప్రేయసీప్రార్థనం బిప్డు డీడేర్తువే? యంచు లాలించు నామించుబోణిఁ విలోకించి. యాతండు కాంతాకరంబందు వేగఁ గరం బుంచి పల్కాడు నీరీతి:-

ఓమన్మనోహారిణీ! మానినీ! కూర్మి యిల్లాలి కీరాని దేమున్న దే? నీవరం బెట్టి దే తెల్పు - ప్రేమంపుటర్థాంగి యిష్టార్థముఁ దీర్ప లేనట్టి క్రూరుండ నే? పాపినే? అంతదుష్టుండనే కైక! నీ వావరద్వంద్వముఁ గోరికొమ్మిప్డు, నేదీర్తు నిర్ధారమీయాల్కా! లాసూర్యచంద్రుల్ ధరాకాశముల్ దిక్తటాధీశ్వరుల్ సాక్షులున్నారిదే;- నాప్రమాణంబు సత్యంబు సత్యంబు సత్యంబటంచాడె గంభీరసంరంభసంభావ్యవాగ్గుంభనంబుల్ విజృంభింపఁగా;-

## కైక దశరథుని వరములు గోరుట

నట్టు లాపల్కు లాలించి హర్షాంబుధిఁ మున్గి, యిష్టార్థ మీడేరె నంచెంతయుఁ బొంగి, యీభంగి మాటాడు నాకైక, 'ఱేఁడా! వరం బొక్కటఁ, రాముపట్టాభిషేకంబు మాన్పించి, నాపుత్రు మూర్ధాభిషేకంబుగావింపఁగాఁ గోరితిఁ నాథ! - యింకొండు, శ్రీరాముఁ డాదండకారణ్యభాగంబునఁ మౌనివేషంబుతోడఁ బదిఁనాలుగేఁడుల్ చరింపంగ నీ వెల్లియే పంపఁగాఁ గోరితిఁ; భూవరా! నావరద్వంద్వమీరీతివై యుండె, నోసత్యశీలా! మహీపాల! వాగ్దానముఁ దీర్పుమా!' యన్న, నాపల్కు బల్ దారుణంబై ధరాధీశుహృత్పేటికోత్పాటనంబై, కుఠారప్రహారంబున క్లింతయుఁ గాటమై నాట, నాఘాటి సైరింపఁగా లేక నిశ్చేతనుండై ధరఁ మూర్ఛమైవ్రాలె;- నాకాంత భూకాంతుపాటంతయుఁ జూచుచుఁ, సుంతయుఁ జంకకే, చింతయుఁ వంతయుఁ గానకే, భ్రాంతయుఁ గాక స్వార్థంబు సాధించుపెఁ దీక్షుతోఁ, దీక్ష్ణరూక్షేక్షులఁ

జేని నీక్షించుచుండెఁ ;- బళీ ! కామినుల్ స్వార్థ్యముల్ గాబూన నద్దాని నా బ్రహ్మచేనైన మాన్పింపఁగా శక్యమౌనా?-

అట్టాధారుణీకాంతుఁ డొక్కింతకాలంబు నిశ్చేతనుండై ధరన్ బండి, ఆయంతలోఁ దేఱి, తొట్రాడువాక్యంబులన్ బల్కు 'కైకా! వినో దార్థ మీపట్లు శ్రీరామునిన్ గానకున్ బంపఁగాఁ గోరినావంతె; నీపైన నాకుండుప్రేమన్ బరీక్షింపఁగా నెంచి యిట్లాడి తీవంచు భావించెదన్, గాక నాముద్దులయ్యన్ వనిన్ దోలఁగాఁ గోరఁగాఁ గైక నీవంతదుష్టా త్మవే? పాపివే? నమ్మ, నేనమ్మ, వేగమ్మ యీయర్థ మేయేయనర్థంబు గా కుండఁగాఁ బల్కవే' యన్న నాజాణ 'భూపాల! యేలింతగా బేలవై దూలగాఁ, జూడ గూఢార్థ మేమింపునన్ లేదు, ముం దేయనర్థంబుకాఁ బోదు, రాజా! యథార్థంబుగా రామునిన్ గానకున్ బంపఁగా, నాసుతున్ రాజుఁగావింపఁగా నే వరద్వంద్వమున్ గోరితిన్, సూర్యచంద్రగ్రహా నేకసాక్ష్యంబులొప్పన్ బ్రమాణంబు భాషించినా విప్పుడే; యేల యీ చింత వాగ్దానమున్ దీర్పఁగా లెమ్ము, వైళమ్మె, జాగేల సేయంగ నంచా డఁగా ఱేఁడు దిగ్భ్రాంతుఁడై యేమియున్ దోఁపనట్లుండి యావైన, నిట్లాడెఁ :-

దశరథుఁడు కైకకు వరము లిచ్చినందులకై దుఃఖించుట

గట్టా సతీ! యిట్టిబల్ చెట్టయాపట్టు నీమానసం బెట్టులన్ బట్టె? యేదుష్ట యేభ్రష్ట నీ కీవిధానంబు బోధించె? నాపట్టి యేమట్టిదుష్కా ర్యముల్ సల్పె నీకిట్టులన్ దుష్టమౌబుద్ధిలోఁబుట్టె నేఁ డెట్టిపాపంబు నన్ జుట్టి యేకాఱియల్ వెట్టఁగానుండెనో! యేయనర్థంబుకాఁగా నిమిత్తార్థ మీపాటిదౌమాట నీనోటిలోఁ దాఁటెనో? దైవసంకల్ప మెట్లుండెనో! యెంచ నాపూర్వజన్మంపుఁబాపం బదేపాటిదో? కీర్తిదుష్కీర్తు లెవ్వా రికో దీన? సౌఖ్యంబులున్ సంపదల్ చూడ మాయల్ ; క్షణంబుల్ ; తృణంబుల్ కదే! కీర్తిదుష్కీర్తులే శాశ్వతంబై ధరన్ వెల్గు నాచంద్రతారా ర్కమై, సుంత యోజింపు ; స్వార్థంబుకై యిట్లనర్థంబుగావింతురే స్వార్థ

జీవుల్? మఱిన్ దల్లిపిల్లంచునైనన్ గనన్ జెల్లదే? వల్లభా! యుల్లమున్నట్టి పుణ్యాత్మ వీవే పరాభీష్టవిధ్వంసనంబే పరార్థంబుగా నెంచు పాపాత్ము రాలైతివే?-యంచు వాపోవు రాజేంద్రునిన్ గాంచి కైకేయి పల్కెడున్!-

భూనాయకా! యీమదర్థంబులో స్వార్థమన్యార్థమైయుండె నంచం దువే! స్వార్థమెవ్వారిలో లేదు? నాపుత్రుఁ డీరాజ్యమేలంగ నేఁ గోర దుఃఖింతువే! రామునిన్ రాజుఁ గావింపఁగా నెంచి లోనుబ్బితబ్బిబ్బులై పోదువే? ఖేదముం గందువే! యిర్వురున్ బుత్రులే కారె?- మున్నిట్టులే చేయఁగా లేదె? ఆగాధిపుత్రుండు నీరామునిన్ వెంటఁగొంపోవ సైరింపలేనంటివే? చూడ నాపుత్రుఁ డిన్నాళ్లు నిన్ బాసి తా మామగారింటనే నిల్వఁగాఁ దద్వియోగంబుచేఁ గుందవేలా?- అయో! చూడఁగానైనఁ గాంక్షింపవేలా? పతీ! రాముపట్టాభిషేకార్థమై యైనఁ బిల్పింపవేలా? వరంబుల్ ప్రియంబారఁగా నిచ్చినావీవు - నన్ గోరికొమ్మన్న నేఁ గోరికొంటిన్! ధవా! యింతకన్నన్ మ తేమే నెఱుంగన్ - నిజం బెల్ల భారంబునీమీఁదనే యుండెడిన్, బాసనీడేర్చి సత్కీర్తినే కందువో? మాటఁ బోమీటి దుష్కీర్తిఁగైకొందువో? సుంతయోజించి నిర్ధారణన్ సల్పుమీ! యన్న, నాకైక పల్కుల్ ధరాధీశు కర్ణంబులన్ సోఁకఁ దన్మానసం బెంతయున్ స్రుక్క, దుఃఖాశ్రువుల్ ధారలై పాఱఁగాఁ, గర్ణరంధ్రంబులన్ హస్తయుగ్మంబుచే మూసి, హా శ్రీహరీ! యంచు బిట్టార్చి నిట్టూర్చి, కైకన్ గడుం దీక్ష్ణమౌ చూపునన్ జూచి యిట్లాడు;-

ఓచెట్ట! సద్వంశసంజాతవీవంచు నేనెంచి చేపట్టితిన్, గాలసర్పంబు నేఁ గౌఁగిటన్ జేర్చితిన్, గాలకూటంబు సేవించితిన్; - దేవి! కేలంటి కాలంటి నేవేఁడెదన్, దీనునిన్ వృద్ధునిన్ గావవే? పుత్రభిక్షంబు నాకియ్యవే? అయ్యయో! రాముఁ డేమంతగా దోసముల్ చేసె నీవింతవైరంబు సాధింపఁగా? - 'నాథ! నాపుత్రునైకంటె శ్రీరాముపైఁ బ్రీతి నాకెక్కు'వం చెప్పుడున్ బల్కవే? యిట్టిదాకూర్మి నాపట్టిపైఁ?, జూడఁ గౌసల్యనేనిన్ సుమిత్రాఖ్యనేన్ బాసినన్ బాసెదన్

గాని, శ్రీరామునిన్ వీడినన్ నాఁడె నానెత్తిపై శ్రద్ధలేయాడు, నీనానుడుల్ సత్యముల్, మాను మీకోర్కె రాజ్యంబు సర్వంబు నీకిచ్చెదన్, గోరితేన్ బ్రాణమేనిత్తు నారామునిన్ గానకున్ బంపుకార్యంబు మానంగదే! జ్ఞానహీనుస్వుండనైచున్, వరంబిచ్చితిన్ స్త్రీకి, గామాతురుం డౌట నేనింతగాఁ దెచ్చుకొంటిన్ మహాపద్దశన్; గావవే కామినీ! వేఁడెదన్ జూడవే! యంచుఁ బ్రార్థించుభూమీశుపై నుగ్రరూక్షేక్షణంబుల్ ప్రసారించి క్రోధంబు దీపింపఁగాఁ గైక పల్కాడు నీరీతి;

ఓరాజ! ఇక్ష్వాకువంశోద్భవుండీవు, సత్యంబుపాటింపవమా! చూడ సత్యంబె ధర్మంబు, సత్యంబె బ్రహ్మంబు - సత్కీర్తి లోనెంచి సత్యంబు సాధింపుమా! సత్యసంధుండవై వెల్గుమా నాథ? కౌసల్యపైఁ బ్రీతిచే భీతిలో నెంచి యిట్లాడెదే? రాముఁ డాకానకున్ బోవ నింతేలదుఃఖంపఁగా? బుత్రులింకుండరే నీకు? వారెవ్వఁగాఁ గూర్పరే? చాలు నీ మాయమాటల్, ననున్ బ్రాణమల్లెంతు నంచంటివే? నాయ దీస్వల్పమా కోర్కెఁ దీర్పంగ లేకుంటివే? నాయెడన్‌గల్గునీప్రేమ యేపాటిదో నేఁడు కన్గొంటి, నీమోసముల్ కంటి, నిన్నాళ్లు నే భ్రాంతనైయుంటి, నీకింక నాథా! యసాధ్యంబు నన్మోసగింపంగ, నీమోహముల్ బూటకంబుల్ సుమీ! చూఁడు, నీ తీపిమాటల్ ధవా, తేనెపై పూఁతకత్తుల్; ధరానాయకా! విందువా! నాదుసిద్ధాంతమున్ దెల్పెదన్, రాముఁ డాకానకున్ జేరఁగా నారవస్త్రంబులన్ దాల్చితానేగ, నీకన్నులన్ జేఁపునేఁ గాంచి హర్షాంబుధిన్ దేలెదన్, లేనిచో - సత్యవాగ్భ్రష్టుఁడై నీవు దుష్కీర్తిభాయిష్ఠుఁడై లోకనిందన్ బడన్ గందు - నేనింక మాటాడఁగా జాల, నామాటఁ ద్రిప్పంగరా దేరికిన్, నాథ! నాయాన నీయాన వాదాడుటల్ చాలు, నంచామె నిక్కచ్చిగాఁ జెప్ప;-

### దశరథుని పరితాపము

భూనాథుఁడున్ నెత్తిపై కొండపడ్డట్లు నిర్విణ్ణుఁడై నిల్చి, నోరాడకున్న మారాడఁగా లేక, యొక్కింతసేపుండి యామీఁదఁ దెల్వొంది

యంగంబు కంపింప. హా యంచు వావిచ్చి, తా నేడ్చెఁ గన్నీరుమున్నీ రుగా, నోఁదికొంచుఁ శిరం, బయ్యయో! ధర్మపాశంబునఁ జిక్కితిఁ బాపి! దుష్టాత్మురాలా! - అహా! మోసమయ్యెఁ, సుతుఁ రామునిఁ గానకుఁ బంపలేకున్నచో మానవే! నిన్ను దుర్జాతినిఁ రోసితిఁ, బాసితిఁ నిన్నుఁ బొమ్మంచు,మోమూవలఁ ద్రిప్పి, దుఃఖాశ్రువుల్ దోఁగ శోకంబునఁ గుందె, బల్ వెచ్చనౌనూర్పుఁబోఁబుచ్చుచుఁ, దా నెదఁ బాదుకొంచుఁ, గడుఁ బాన్పుపైఁ బొర్లుచుఁ బావురంచేడ్చుచుఁ దీనతఁ, గుందుచుఁ గందు చెంతో :-

దశస్యందనుం డార్తిమైఁ గుంద నీక్షింపఁగా లేకబల్ ఖిన్నుఁడై పోయి యానీరజాప్తుండు గ్రుంకెఁ, బడిఁ జిన్నిమబ్బుల్ భువిఁబర్వె, వే పిల్ల గాడ్పుల్ తగఁ వీచెఁ, బారల్ దిశిఁ దోఁచెఁ, జంద్రుండు నేతెంచె, శుభ్రంబులౌ వెన్నెలల్ గాచె, నంతఁ దశస్యందనుండల్ల కైకేయియుఁ దప్పఁగా నెల్లప్రాణిప్రతానంబు నిద్రించె నా రాత్రి! భూనాథుఁ డా కైక యింటఁ నిరాహారుఁడై నిద్రపోనాడి, దుఃఖాంబుధిఁ దోఁగుచుఁ, మించివాపోవుచుఁ, దన్నుఁ దాఁ దిట్టికొంచుఁ, విధిఁ దూలుచుఁ, కైక కాలంటిప్రార్థించుచుఁ, రామ, రామా! యటం చార్చుచుఁ, మూల్గుచుఁ, జావురాదంచు దుఃఖించుచుఁ మూర్ఛమైవ్రాలుచుఁ, సోలుచుఁ దూలుచుఁ, రోయుచుఁ గూయుచుఁ గాలముఁబుచ్చఁ గాఁ గోడికూసెఁ 'కొకో' యంచు! నక్షత్రముల్ మాసె, నాకాశముఁ వెల్లనై తోఁచెఁ, జంద్రుండు పోఁజూచె, బక్షుల్ ధ్వనుల్ చేసెఁ, దూర్పు ఱ్ఱఁగాఁదోఁచె, నంతంతలో!-

పట్టాభిషేక మండపమునకు వసిష్ఠాదులు వచ్చుట.

రాముపట్టాభిషేకార్థమై యవ్వసిష్ఠుండు సంభారముల్ గొంచు నేతెంచి, సచ్ఛాత్రుఁడై యాసభావేదికఁ డాసె, దివ్యంబులౌ వాద్య ముల్ మ్రోసె శ్రావ్యంబుగఁ, మానులుఁ మంత్రిసామంతులుఁ బౌరు లుఁ సర్వాలాబాలవృద్ధంబుగా వచ్చి రా మండపంబుఁ జొరఁ; స్త్రీలు

ముత్తైదువుల్ మానిపత్నుల్ పురిఁగల్గునాగినుఁలుల్ వచ్చిరొయ్యొయ్యనన్ జేరఁగా వేదికన్; విప్రకంఠంబులన్ వేదఘోషంబులొప్పారె - నంతన్ వసిష్ఠున్ గనుంగొంచుఁ బల్కెన్ సుమంత్రుండు, 'మౌనీశ్వరా! కంటివే వేదికన్, సర్వధాన్యంబులున్ నిండెఁగా!- రాసులై యుండె రత్నంబులున్, వెండిబంగారముల్ దండిగానుండె, దివ్యాంబరాశేషభూషావళుల్ నేత్రపర్వంబులై యొప్పెడిన్, బల్లవంబుల్ సుమంబుల్ కడున్ జెల్లె, శ్రీగంధకస్తూరికాగోరోచనాద్యంబులౌ గంధసామగ్రులున్ గుప్పలై గొప్పఁగాఁగన్ విడంబించె, ఖర్జూరముల్ నిమ్మ నారింజ లంజూరముల్ ద్రాక్షలున్, నారికేళాదులౌ సత్ఫలంబుల్ కనన్ గొండలై చూడ్కికిన్, దోఁచు, భాగీరథీముఖ్యదివ్యన్నదీతోయముల్, గల్గు కుంభంబు లొప్పెన్, సముద్రోదకంబుండె సౌవర్ణభాండంబులన్, క్షీరదధ్యాదిపాత్రంబులవ్వో, అవేచూడు లాజాక్షతల్, గాంచు దూర్వాంకురంబుల్, రథంబయ్యదే, ఖడ్గముల్ జాపముల్ వల్లకీ లవ్వొ, వింజామరా లయ్యవే, దాన మియ్యంగనౌ కన్యకల్ వారలే; ధేనువుల్- సింహచర్మం బదే, భద్రపీఠం బదే; యింక నాకాజ్ఞ యేమంచుఁ గేల్మోడ్చు మంత్రీశ్వరున్ గాంచి పల్కెన్ వసిష్ఠుండు మంత్రీశ్వరా! లెస్స, కూర్పించినావన్నియున్, వేళయయ్యెన్ ·ముహూర్తంబునున్ డాసె, రాఁ డేటికో ఱేఁడు? నీ వేగి తోడ్తెమ్మనంగా, సుమంత్రుండు సంతోషితస్వాంతుఁడై యేగి, యాకైకసౌధాంగణద్వారమున్ జొచ్చి, రాజేంద్రునిన్ డాసి కైవారమున్ జేసె ;—

## సుమంత్రుఁడు దశరథుని మేల్కొలుపుట

'దేవా! మహారాజ! శ్రీసార్వభౌమా! నినున్ గాచుసూర్యుండు సుత్రాముఁడున్, సర్వదిక్పాలకుల్; నిత్యభద్రంబునీ కయ్యెడిన్, సూర్యుఁడేతెంచెఁ బూర్వాద్రిపైకిన్, ముహూర్తంబు నాసన్నమయ్యెన్, వసిష్ఠాదులున్ వచ్చి రాస్థానమున్ జేరఁగన్, రాముపట్టాభిషేకంబు సల్పంగ మీ రాకకై వేచియున్నారు సర్వప్రజల్— మేలుకో రాజరాజేశ్వరా!

దేవ! దివ్యప్రభావా!' యటం చిట్టుకొండాఁడగన్, ఱేఁడుదిగ్భ్రాంతుఁడై నోట నాపాపపున్మాటఁ జెప్పంగలే కెంతయున్ గుందుచున్ బాన్పుపైఁ బొర్లుచుండెన్; విలోకించి యాకైక యామంత్రితోఁ బల్కె 'మంత్రీశ్వరా! ఱేఁడు రేయెల్ల శ్రీరాముపట్టాభిషేకక్రియాయోచనల్ సల్పుటన్ నిద్రలేకుండి యిప్డిప్డె తాఁ బండె, నీ వేగి శ్రీరామునిన్ బంపుమా వేగ యేకాంత మొందుండె నాపుత్రుతో ఱేనికిన్, వేగ బొమ్మన్న—నామంత్రి 'దేవీ! మహారాజు నాజ్ఞాపనంబైనచోఁ బోదునం చాడె, నీమాట లాలించి యారాజు 'మంత్రీశ్వరా! రాము, శ్రీరాము, నారామునిన్ బంపుమా!' యన్నఁ జిత్తంబటం చాతఁడున్ మోదితస్వాంతుఁడై యేగి;—

వీథిన్ జొరన్ రానియట్లెంతయున్ నిండి బల్సందడిన్ సల్పు నానాప్రజానీకమున్ గాంచి, చేసన్నచే సందడిన్ మాన్పి— 'ఱేఁ డింతసేపయ్యు రాఁడేమటంచెంతయున్, బ్రశ్నపైఁ బ్రశ్నలన్ వేయు నవ్వారికిన్ దెల్పి,—"శ్రీరామునిన్ జూడఁ గాంక్షించె భూనాథుఁ డే నిప్పుడే పోయి వేపంపుదున్ నారామునిన్, సైపుఁడీ! కొంతసేపోర్చుఁడీ' యంచు పల్కాడుచున్ స్యందనం బెక్కి వేపోయి, శ్రీరాముసౌధంబు వీక్షించి తద్ద్వారమున్ జేరి, తా స్యందనంబయ్యెడన్ డిగ్గి, లోనన్ బ్రవేశించి, యందున్న యాకంచుకిన్ గాంచి శ్రీరాముతోఁ దన్నెఱింగింపఁగా జెప్ప, వాఁ డేగి విన్పించె వృత్తాంతమున్; 'వేగ మంత్రీశ్వరున్ బంపుమం' చాడె శ్రీరాముఁ, డామాట విన్పింప మంత్రీశ్వరుం డేగి వీక్షించె—శ్రీశ్యామలాంగున్, మహాదివ్యతేజఃప్రభాపుంజవిభ్రాజితున్, శుక్లపక్షేందుహాసున్, ముఖోద్దీప్తిబాలార్కసంకాశునిన్, నీరజాతేక్షణున్, భవ్యదివ్యాంబరున్, భాసితాజానుబాహున్, విశాలాంచితశ్రీలలాటున్, ప్రభోద్దీప్తసంభావితశ్రీకపోలున్, లసన్మేఘవర్ణున్, శుభగ్రీవునిన్, సింహమధ్యున్, ప్రశస్తోరువక్షున్, లసద్భృంగసంకాశనీలాలకున్, దివ్యరత్నాంచితశ్రీకిరీటున్, ధళంధాళధళ్యస్ఫురద్రత్నసౌవర్ణసత్కర్ణభూషోజ్జ్వలున్

హారహీరాంచితగ్రీవు, సౌవర్ణకేయూరసత్కంకణోదారహస్తప్రశస్తున్, లసన్మార్గసంచారు, గోదండదీక్షాగురున్, దివ్యభద్రాసనున్, మోదముద్రాననున్, జానకీపార్శ్వవనిన్, సర్వలోకేశ్వరున్ గాంచి, కేల్మోడ్చికొండాడఁగా, రాముఁ డత్యాదరంబొప్ప నాసన్నమాపీఠమున్ జూపి కూర్చుండఁగాఁ జెప్పెఁ, గూర్చుండి మంత్రీశ్వరుం డాడు;—

## సుమంత్రుఁడు దశరథునికడకు రామునిఁ దోడ్తెచ్చుట

'శ్రీరామ! క్షేమంబె? మాకున్ శుభంబొప్పె నీప్రేమకున్ బాత్రులే మాటచే, రామ! నిన్ జూడఁగా వేఁపు కాంక్షించె, నాతండు కైకమ్మ గారింటఁ దానుండి నన్ బంపె నిన్ బిల్వఁగా— వేగవిచ్చేయు' మం చిట్లు ప్రార్థింపఁగా, రాముఁ డాసీతమోమల్లనన్ గాంచి— 'దేవీ! ననున్ జూడఁగాఁ దల్లియున్ దండ్రియున్ గోరి, రిష్టే కదాయానుపట్టాభిషేకంబునా, కంతకున్ మున్నె నన్ జూచి నాతోడుతన్ ముచ్చటల్ వల్కఁగా, నిచ్చలన్ దెల్పి నన్ హెచ్చరింపంగ నాతల్లి కైకేయి భూనాథునిన్ గోరెఁగాఁబోలు; నాయమ్మకున్ జాలప్రేమంబు నాపైన, నేఁబోయి యాతల్లియిష్టార్థమున్ దీర్చెదన్; నీవు సౌఖ్యంబుగా నుండు, మేవచ్చు నందాఁక నంచాడి తా గద్దియన్ డిగ్గిపోఁబోవఁగా సీత వెన్వెంట నేతెంచి, తా వాఁకిటన్ నిల్చి, శ్రీరాముమోమెంతయున్ దన్వితీరంగ నీక్షించి యిట్లాడు:— మన్నాథ! నీకౌ శుభం, బెల్లదిక్పాలకుల్ నిన్ను రక్షింత్రు నీతండ్రి నిన్ రాజ్యపట్టాభిషిక్తున్ గఁ దాఁ జేయుతన్ బోయి ర మ్మంచు వీడ్కొల్పె; శ్రీరాముఁ డట్లేగఁగా నొక్కచో వేచియున్నట్టిమాలక్ష్మణుం డొయ్యనన్ వచ్చి తా నన్నపాదంబులన్ భక్తి మ్రొక్కంగ, దీవించుచున్ సోదరున్ గౌఁగిటన్ గ్రుచ్చి శ్రీరాముఁ, డామీఁద నాయిర్వురున్ స్యందనం బెక్కి వేంచేసి రాకైకయిల్సేర;—

వారట్లు విచ్చేసి-కైకేయిసద్మంబునున్ జేరి, లోఁజొచ్చి, యచ్చోట వీక్షించి రాదీనుఁడై దుఃఖభారంబునన్ గ్రుంగుచున్ మోమువాడ్వారఁగా, నశ్రువుల్ ధారఁగాఁ గారఁగా సెజ్జపైఁబొర్లు నాతండ్రినిన్;

భక్తిమైఁ దండ్రికిఁ మ్రొక్కి, కైకేయిపాదంబులకు వ్రాలి వే నిల్చి రారాసుతుల్; తేఁడు వీక్షింప కాపుత్రులక, 'రామరామా!' యటం చార్చి తా నేడ్చె; శ్రీరాముఁ డద్దానికిఁ భీతుఁడై 'యేమొకో కారణం' బంచుఁ జింతించి, కైకేయిదిక్కై— 'యిదేమమ్మ భూనాథుఁ డీభంగి దుఃఖించెడిక ? కారణంబుక వచింపంగదే మాత! నాపాపమో? లేక హృద్వేదనాతీతసంతాపమో? యేరిపైనక గడుక గోపమో? లేక యేలోపమో? తల్లి భూవల్లభుం డింతగాఁ దల్లడిల్లంగ నా హేతువుక దెల్పుమా! యన్న, నాదుష్టకైకేయి తా నాసుతుక గాంచి యిట్లాడు- శ్రీరామ! నీతండ్రికేలోపముక లేదు, సంతాపముక గాదు, హృత్తాపమా! లేదు, పుత్రా! ధరాభర్త తా సత్యవాగ్బద్ధుఁడై చిక్కిచింతించెడిక, దాని కేమందువో నీవటంచుక భయంబంది యాసంగతిక నీకెఱింగింపఁగాఁ జాల కిట్లుండె నోపుత్రకా! మంచిదీవన్న చో మంచిదౌనద్ది. కాదన్న చోఁ గాదు, దానక మహాఘంబు ప్రాప్తించుఁ గానక విచారింపుమా! తండ్రినిక గాచెదో? తప్పులోఁ ద్రోచెదో? చెప్పుమా!' యన్న శ్రీరాముఁ డత్యాతురుండై ;—

కైక శ్రీరామునకు దశరథుఁ డిచ్చినవరముల వృత్తాంతముఁ జెప్పుట

అహోమాత! యేవార్తయుక దెల్ప కిట్లేటికిక గాలముక బుచ్చెఁగక ? దెల్పవే, తల్లికిక దండ్రికిక గానిదా రాజ్యమా! యొల్ల,- నాసీతనా? వీడెదక, దేహమా! యొల్ల- సందేహ మిట్లేటికో తండ్రికిక గ్రొత్తనే నేను? నన్గానవే నీవు తల్లీ! నన్నుక దప్పుగా నెంచ నేతప్పు ముక గంటివో? తెల్పవే! డెందముక గుందు నాతండ్రిపాలించఁగాఁ, బల్కుమా!' యన్న, నాఃల్కి యిక్కెవడిక బల్కు - నోనందనా! నీసుహృద్భావముత్కృష్టమై యొప్పె, నోపుత్రకా! నాకు నీతండ్రి కిందొక్కసందర్భ మీనాఁడుకల్గెక జుమీ! యద్దియే యింతకుక హేతువై చెల్లె; నద్దాని నేఁదెల్పెదక, బాలకా! నాకు నీతండ్రి యొక్కప్పు డొ లా నిచ్చియుండెక వరద్వంద్వముక, వాని నేఁ గోరితిక జూడ నీనాఁడు

నీతండ్రి, నందొక్కటిన్- నాసుతున్ రాజ్యపట్టాభిషిక్తున్ బొనర్పంగ; నింకొక్కటిన్- నీవు నేఁడే జటావల్కలమ్మున్ దాల్చి సన్యాసివేషంబునన్ గానకున్ జేరి యందే పదిన్నాలుగేఁడుల్ వసింపంగ నిన్ బంప, నద్దాని నా కిచ్చియున్ నీకుఁ దెల్పంగ వాయోడి శంకించుచున్నాఁడు, వేలెష్ము, వైళమ్మె, నీతండ్రినిన్ సత్యవాక్యులునిన్ జేయుమా! కాన కీ వేగ సన్నాహమ్మున్ సల్పుమా! నాసుతుండే ధరారాజ్యమేలంగనిమ్మా! యశోవంతుఁడై నీవు వెల్గొందుమా! రామ! మారాడుమా! యంచనన్;-

## శ్రీరాముఁడు దశరథు నోదార్చి, తానరణ్యమునకేగెదనని తననిశ్చితమును దెల్పుట

రాముఁ డత్యంతహర్షంబుదీపింపఁగాఁ, జిన్నినవ్వాననాబ్జంబునన్ దోఁపఁగా గన్నులందున్ బ్రసన్నత్వమేపారఁగాఁ- 'దల్లిరో! యింతకా యింతగాఁ గుందెడిన్ దండ్రి? యేభాతిదో హేతువంచెంచి, నే భీతిచే నీధరానేతఁ గన్గొంటి, నోమాతరో! చింతకో కారణంబున్నదే దీన యోజింపఁగా? నంచుఁ దండ్రిన్ దగన్ గౌఁగిటన్ జేర్చి, మోముల్లసన్ దార్చి, భూనాయకున్ లేవఁగా నెత్తి, యాహంసతల్పంబుపైనుంచి యిట్లాడు, 'నాతండ్రి! యిద్దానికా కుందె దీవింతగా? మానుమాశోకమున్, బూనుమా ధైర్యమున్, మేనఁ బ్రాణంబులుండంగ నీమాట నే దాఁటఁగాఁ జూతునే? కైక నాతల్లికాదే! సుతుం డేసు నామాతయిష్టార్థ మీడేర్పరాదే? కనన్ సోదరున్ రాజుఁ గావింపఁగా వానిపైఁగూర్మి నాకుండదే! తండ్రి! కాంతారమున్ జేరఁగా నాకుబల్ప్రేమకాదే? వనిన్ మానులన్ గాంచి భావించి సేవించి, పూజించుటల్ పుణ్యమౌఁగాదె? దుర్మార్గులౌ దైత్యులన్ జెండి శాంతిన్ ధరన్ నిల్పఁగా నాకు వీలయ్యె మేల్గాదె? నాకింత మేల్గోరి నాతల్లి యీసంధిఁ గల్పించెఁ నీతల్లియే నాకు మేల్గూర్పనౌ తల్లిగాదే?

ధరాధీశ! యిక్ష్వాకువంశోద్భవుం డీవు సత్యాధ్వమున్ దప్పినన్ దప్పరే త్రోవలన్ భానుఁడున్ జంద్రుఁడున్, ధాత్రిపై వ్రాలునక్షత్ర

ముల్, దేవ! చింతింపుమా! సుంత, యీకార్యమేమంత? నేఁ గ్రమ్మ
ఱ రానె యాకాననావాసముఁ జేసి? వాఁడెన్నఁగాఁ గాఁడొకో కైక
పుత్త్రుండు నీయందునన్ భక్తిభావంబుతోడన్ బ్రవర్తించుపుత్త్రుండు?
వాఁడెన్నఁగాఁగాఁడొకో నాకు బల్కూర్చుతమ్ముండు? కౌసల్యకున్
వాఁడెగా పుత్త్రులందెల్ల మోహంపుపుత్త్రుండు? నాతండ్రి! దుఃఖింపఁగా
రాదు, యోజింపఁగా రాదు, సంతోష మేపారఁగాఁ బంపుమా నన్నుఁ
బోదున్, బదినాలుగేండ్లేగినన్ వత్తు, నిన్ గొల్తుఁ; బాలింతు నీధాత్రి;
నోతండ్రి! నేనిప్పుడే పోయి యీవార్తఁ గౌసల్యకున్ దెల్పి యామా
తచే నానతిన్ బొంది, భూజాత కల్లే యెఱింగించి యేతెంతునం చాడి,
కైకేయితోఁ బల్కె;—

**శ్రీరాముఁడు తానరణ్యమునకుఁబోవు వృత్తాంతమును దెల్పఁ గౌసల్యయింటి కేతెంచుట**

ఓయమ్మ! కౌసల్యకీవార్త నేఁజెప్పిరాఁబోవునందాఁక నోదార్చుమా
నాదుతండ్రిన్, బ్రియంబాడుమా! తీర్తునీకోర్కె, నిస్సంశయం బిద్ది భా
వింపుమా!' యంచు వాక్రుచ్చి తాలక్ష్మణున్ గూడి పోఁబోవ,హా రామ!
హా పుత్త్రకా! పోదువే? యంచు రాజేడ్వఁగా, వెన్కకున్ రాముఁ
డేతెంచి- 'యోతండ్రి! సైరింపుమా! వత్తుఁ గౌసల్యకున్ జెప్పి- యేమ
య్య! యిట్లాదువే, జ్ఞాని వీ వెన్నఁగా' నంచు నోదార్చి యాతల్లిఁ గైకే
యినిన్ గాంచి 'నాతండ్రి నోదార్చుమా.' యంచుఁ బల్కాడి తానేగె;-
మార్గంబునన్ ఛత్త్రముల్ పట్టువారి న్నివారించె, సూతుండు వే స్యంద
నంబొండు ముందుంచ వల్దంచుఁ దాఁ బాదసంచారియై పోయె, వెన్వెంట
విచ్చేయువారిన్ విలోకించి 'మీరెల్లరున్ నిల్వుఁ డిచ్చోటనే, పోయి
కౌసల్యతో నింతమాట్లాడి నే వచ్చెదన్ వెంటనే' యంచు వారించి,
దుఃఖించుచున్ వెంటవిచ్చేయువారెల్లరన్ నిల్పి, తాఁ బోయె; సౌమి
త్త్రియున్ ఘూర్ణితస్వాంతుఁడై శోకతాపంబులున్ గూడఁగా, నేత్రముల్
రక్తపూరంబులై సూర్యగోళంబులై దోఁపఁగాఁ బిచ్చిపైకొన్నయట్లైనఁ
దానూరకే యన్నవెన్వెంటనే యేగుచుండంగ;—

శ్రీరాముఁ డట్లేగి కౌసల్యయిల్సేరి, కక్ష్యంబులన్ మూఁడిటన్ దాఁటి, వెన్నాడుచున్ దమ్ముఁడేతేర లోఁజొచ్చి తాఁ గాంచె— బల్ భక్తితోఁబుత్రభద్రార్థమై నిత్యమున్ నిష్ఠలన్ గ్రుంగుచున్, మంత్రపూతంబుగా నగ్నినిన్ వ్రేల్చుచున్, బ్రీతి విధ్యుక్తధర్మంబుపాటించుచున్, దైవతారాధనేత్యాదిసత్కర్మలన్ మగ్నయై యున్న సాధ్వీశిరోరత్నమున్- బూతచారిత్రయౌ తల్లిఁ గౌసల్య నీక్షించి, సాష్టాంగదండప్రణామంబుఁ గావింప;—

{ శ్రీరామచంద్రుండు కైకేయివరములసంగతి వినిపింప, శోకించుకౌసల్య నూఱడఁబల్కుట }

నాసాధ్వి యాపుత్రులన్ లేవఁగానెత్తి, బల్మక్కువన్ గౌఁగిటన్ గ్రుచ్చి మూర్ధంబు మూర్కొంచు, మోదాశ్రువుల్ కన్నులన్జాఱఁ గన్గొంచు- 'శ్రీరామ! సౌఖ్యంబె? నేఁడేగదా నీకుఁ బట్టాభిషేకంబగున్ బుత్ర! నీతండ్రి నీకిచ్చెడిన్ సర్వరాజ్యంబు, రక్షింపుమా! భూప్రజన్ బిడ్డలన్ బోలె, నీతల్లులన్ దండ్రినిన్ భక్తిమైఁ గొల్వుమా! తమ్ములన్ బ్రోవుమా! బీదలన్ సాదలన్, ధర్మమున్ న్యాయమున్ గావుమా! సత్యమున్ శీలమున్ గూడుమా! కీర్తిఁబొందంగఁ గాంక్షింపుమా! పుత్ర! పూర్ణాయువున్ బొంది సౌఖ్యంబులన్ దేలుమా! రామ! నా రామ! శ్రీరామ!' యంచాడు నాతల్లి వారించి, యారాముఁ డిట్లాడు- 'ఓమాత! నీ వారయన్ లేదు వృత్తాంతమున్, గైకపుత్రుండు రాజౌను, నేనో- పదిన్నాలుగేఁడుల్ జటావల్కముల్ దాల్చి కాంతారమున్ జేరఁగాఁ బోవలెన్,- గైక భూనాథునిన్ గోరె నిమ్మాడ్కి, మాతండ్రి మాటిచ్చె, నేఁబుత్రుఁడన్ దీర్పఁగాఁ బోవలెన్; నీకుఁ జెప్పంగ నేవచ్చితిన్ దీని, నోతల్లి! దీవించి నన్బంపుమా!' యన్నయావార్త విన్నంత నుల్లంబు జల్లంచనన్, వెల్లనై మోము సొంపెల్లఁ గందన్, గడున్ దల్లడంబంది నిల్వెల్ల నీరై భువిన్ వ్రాలి మూర్ఛిల్లెఁ దా, మూలవిచ్ఛేదమై నేలపైఁ గూలు సాలంబుచందంబునన్ ;—

లేవఁగా నెత్తి శ్రీరాముఁ డాతల్లినిఁ బీఁటఁగూర్చుండఁగాఁ బెట్ట, నాపుత్రునిఁ గాంచి నేత్రంబులఁ నీరుకారంగ, దేహంబు కంపింపఁగా- 'నాయనా! యెట్టిదుర్వార్త నే వింటి? నిన్నేకదా నీవు మూర్ధాభిషిక్తుండవై నాకు మ్రొక్కఁగ భూజాతతో, తమ్ముఁడాలక్ష్మణుఁ గూడి యేతెంతువం చెంచితిఁ, రాజచిహ్నంబులఁ వెల్గు నీమూర్తి నేఁ గాంచ భావించి లోభ్రాంతిమై యుంటి, నోపుత్ర! రేయెల్లఁ బూజించితిఁ గాదె, నాయిష్టదైవంబు నావిష్ణువుఁ? నందనా! యెట్టులఁ బ్రేమందురా? యేరి నే మందురా? నోములఁ నోఁచి నిన్గంటి, నాపుణ్యభాగ్యంబునఁ, బ్రాణమల్లించి నిఁ గాంచు, చెంతో తమిఁ నే మనఁ జాలితిఁ, నావ్రతంబుల్ సెడెఁ, నిష్ఫలుఁ నీటిలోఁ జేరె, నావేల్పుపూజల్ వృథాయాయె, హా పుత్రకా! పుత్రుఁ డీ వుండియుఁ గొడ్డురాలైతి నోబిడ్డఁడా! కాన కీవేగు దన్వార్త విన్నంతనే వ్రక్కలై పోవ దీగుండె పాషాణమో? పాయదే ప్రాణముఁ, ఘోరపాపాత్మురాలౌట, నీదుఃఖముఁ బొంది యింతింతగా నిచ్చలుఁ జావఁగా, బ్రహ్మ తా వ్రాసెనో నాతలఁ? దండ్రి! నీ తండ్రికిఁ, గైకపై మోహమున్నంత మాత్రాన, రాజ్యంబు నైశ్వర్యముఁ సర్వముఁ గూర్పఁగావచ్చుఁ దా నామెకుఁ, గాక నిఁ గానలో ద్రోయఁగా, నీతియే? ప్రీతియే జేనికిఁ? గైక యీరీతి గావింప నేహేతువో? పుత్రకా! మానుమా! కానకుఁ బోవుకార్యంబు, నామాట పాటింపుమా!' యంచు దుఃఖించు నాసాధ్వి దా రోదనంబుఁ సహింపంగఁ దా నోపలేకెంతయుఁ గుందుచుఁ రామచంద్రుండు పల్కెడు:-

## శ్రీరామచంద్రుఁడు కౌసల్యకుఁ, దండ్రియాజ్ఞ తప్పరానిదని విన్నవించుట

ఓతల్లి! సాధ్వీమతల్లీ! మదిఁ మానవే శోకముఁ, నీవెఱుంగంగ రాఁనట్టిధర్మంబులుఁ గల్గునే? మాతరో! తండ్రి మాటిచ్చె, నాతండు నీ కెన్నఁ బ్రాణేశ్వరుండౌ, గనఁ దండ్రివాక్యంబు పాలింపలేనట్టిపుత్రుండు పుత్రుఁడౌనో? తల్లిగర్భంబు చేటొందఁగాఁ బుట్టునిర్భాగ్యుఁడౌఁగాని, నామేనిలోఁ బ్రాణముండంగ నాతండ్రినిఁ సత్యవాగ్భ్రష్టుఁ గావిం

తునా? మాత! నాకెట్టులో తండ్రివాక్పాలనం బట్టులేఁగాదె పత్న్యాజ్ఞ నీకెన్నఁగన్, మీఁ అరానట్టిదౌ ధర్మపాశంబగున్, దల్లి శోకిల్లకే వత్తు నమ్మా! పదినాల్గునౌవత్సరంబుల్ క్షణంబుల్గ నేఁ బుత్తునమ్మా!'— యనన్ బల్కుఁ గౌసల్య:— శ్రీరామ! శ్రీజానకీరామ! నామాట పాటింపవా? నాయనా! తండ్రియాజ్ఞావచస్స్టెట్టిదో, తల్లిపల్కుల్లె మీఁఱంగరానట్టిదౌఁ గాదె? నాతండ్రి! నిన్ బాసి- జీవింప; నీ వేగుటే నిశ్చయంబైనచోఁ, గానకున్ నన్నుఁ గొంపొమ్ము నీవెంట నేవచ్చెదన్, గాక యిందుండఁగానోప, నీచెంత నే నుండినన్ హాయిగానుండుఁ బ్రాణంబులున్ బుత్ర కా! కైకపుత్రుండె, యీధాత్రికిన్ రాజుకానీ— కనన్ గైకతో భర్త సంపత్సమృద్ధంబుగా భోగభాగ్యంబులన్ బొందనీ- నందనా! భాగ్యహీనన్గదా నేను? మాకేటికీభోగముల్ రాగముల్? దూడతోఁ బోవునావట్లు నిన్గూడి కాంతారమున్ జేరెదన్, జూడు మా!' యన్న, నారాముఁ డాతల్లి కిట్లాడు;—

తల్లి! ననుఁ గాన కిట్లాడెదో? నామతం బిట్టిదం చెంచవో? పుత్రధర్మంబుఁ బాటింపవో? తండ్రికై భార్గవుం డమ్మనే చంపఁడే? పత్నిధర్మంబునన్ జూడవో! సాధ్వి ప్రాణేశ్వరున్ బాయఁగారాదు, యోజింపఁగా భర్తసంసేవయే భార్య కెన్నంగ సౌభాగ్యమౌఁ; గాన నీవిందె యుండంగనౌ, నావియోగంబుమైఁ దండ్రి దుఃఖించు, నీవుండి శుశ్రూషలన్ జేసి యాదుఃఖమున్ బాపఁగాఁ జెల్లదే? వృద్ధుఁడమ్మా! యతం డెంచ నాపైమదిన్ బెట్టెనమ్మా! కనన్ నావియోగంబుఁ దాసైఁపఁడమ్మా! ధవున్ జూడుమా! నీదుశ్రేయంబు సౌభాగ్యమాంగల్యముల్ గాచుకొమ్మా! విభున్ బ్రోచుకొమ్మా! ధరానేతయా కైకసూతిన్ గదున్ బ్రీతిమైఁ గాంచుమమ్మా! ధరాజాత నాసీతఁ బోషింపుమమ్మా! సరాగంబునన్ గైక నీక్షింపుమమ్మా! సుమిత్రాసతిన్ బ్రీతిమైఁ జూడు మమ్మా సదా దైవభక్తిన్ బుధారాధనన్ దానధర్మంబులన్, దీర్ఘయాత్రాదిసత్కర్మలన్, భర్తృసేవన్, దగన్ గాలమున్బుచ్చుమమ్మా? నమ

స్కారమమ్మా! యిదే వత్తునమ్మా! యనఁ వారిసంభాషణఁ విన్న సౌమిత్రి లోఁ సైఁపఁగాలేక కోపంబుదీపింప ఘూర్ణిల్లుచుఁ బల్కుఁ దా మేఘగంభీరనాదంబుతో ;—

లక్ష్మణుఁడు, అరణ్యమునకు పోవలదని రామచంద్రునితో పౌరుషములాడుట

రామ! పోఁబోకుమా! నిల్వుమా! హీన మీకార్య మెన్నంగ దైన్యంబగుఁ, బౌరుషంబుండఁగా నొప్పగుఁ, క్షాత్రవీర్యంబుఁ బాటింపుమా! దీనుఁడై కానలోదూరఁగా నేలొకో? ధర్మమే యిద్ది సత్కర్మమే? జ్యేష్ఠుఁడీవుండఁగా, నాకనిష్ఠుండు రాజ్యంబు నేలంగ నేన్యాయమో? తండ్రికా, పిచ్చియెత్తెఁ జుమీ! ధర్మముఁ జూడఁడే? చూడఁగా మాంధుఁడై కైక కిచ్చెఁ వరంబుల్, గనఁ స్త్రీయెడఁ బొంకధర్మంబు గాదండ్రు; పిత్రాజ్ఞయే యందువా? నిన్న మాటీయఁడే నీకు నీసర్వ సర్వంసహఁ బట్టముఁ గట్ట? నీరెంటిలో నొక్కటిఁ దప్పఁగా నాయె, నెట్లైన వాగ్దోషమూతేనికిఁ వచ్చెడిఁ, గాన కీవేగినఁ సత్యశీలుండుగాఁ డెన్న నీతండ్రి; నీవేల యోజింపఁగా నింత? నామాట కాదంచు నా బ్రహ్మరుద్రాదులేవచ్చినఁ నీకుఁ బట్టాభిషేకంబు నేఁజేతు నాచేతులారంగ, సైరింప కాకైకపుత్రుండు వారింపఁగావచ్చినఁ వ్రచ్చెదఁ జెచ్చెరఁ మచ్ఛరశ్రేణిచే, బౌరుషంబిచ్చుసర్వస్వముఁ, దైవమంచాడుదీనుండు, తేజస్వియో- పౌరుషంబెంచ, నేఁ బౌరుషం బేర్పడఁజూపెదఁ బోకుమా! రామ! యంచాడ ;—

శ్రీరామచంద్రుఁడు, లక్ష్మణునకు బుద్ధిసెప్పి, తా నరణ్యమున కేగఁ గౌసల్యచే ననుజ్ఞఁబడయుట

శ్రీరాముఁ డాశ్చర్యముఁ బొంది యాతమ్మునిఁ గాంచి 'యోలక్ష్మణా! నీకు నున్మాదమో? యాసుమిత్రాసతీసూతివో? కావో! నీతండ్రి నీరీతి దూషింపఁగాఁ బాపమౌఁగాదె? నాతండ్రియే యిచ్చె- నాతల్లి కాంక్షించె - నేఁబుత్రుఁడఁ దీర్తుఁ బిత్రాజ్ఞ, నింకెవ్వ రేమన్న నేమౌన, ఖల్ భ్రాంతి మీకేటికిఁ? సత్య మీపల్కుటంచాడి కౌసల్య

నీక్షించి భాషించు- 'నోతల్లి! నా కీయవే యాజ్ఞ, నేఁ బోవలెన్ శీఘ్ర మే యన్న, నాసాధ్వి- 'హానందనా! పోదువే? పుత్ర! నీమాట సత్యంబు, ధర్మానుగుణ్యంబునౌఁ జుమ్ము! పిత్రాజ్ఞఁ దీర్పన్ దగున్ బుత్త్రుఁడున్, బత్నియున్ భర్తయాజ్ఞానుసారంబు వర్తింపనౌ, నందనా! పొమ్ము, నేనిచ్చితిన్ సమ్మతిన్, బుత్ర! నిన్ గానలో సూర్యుఁడున్ జంద్రుఁడున్ బ్రహ్మరుద్రాదు, లాయష్టదిక్పాలకుల్, భూనభంబుల్, దివారాత్రపక్షాయనంబుల్, మఱిన్ వత్సరంబుల్ సురల్, వేదముల్ ధర్మముల్ గాచు, సప్తర్షులున్ మానులున్ బ్రోతు రెల్లప్పుడున్, గట్టితిన్ రక్ష, నోపుత్రకా! సర్వసన్మంగళాశీస్సు లేపారుతన్ నీకు, నోనందనా! పోయి సౌఖ్యంబుగా వచ్చి నాకున్ బునర్దర్శనం బిమ్మటం చాడి తాఁ గన్నులన్ నీళులన్ నించె; నాతల్లి వీడ్కొల్పుంచు రాముండు సౌమిత్రితోఁ గూడి సీతాసతీసౌధమున్ జేరఁగా నేగ;—

శ్రీరామచంద్రుఁడు, తా నరణ్యమునకుఁ బోవ, సీతాదేవి ననుజ్ఞ గోరుట

నాసీత శ్రీరామ పట్టాభిషేకోత్స వోత్సాహ సంరంభిత స్వాంతయై యుండి. యారామునిన్ దవ్వులన్ గాంచి, విభ్రాంతయై యిట్లు చింతించె— 'ఱేఁ డేటికో రాజచిహ్నంబులన్ మానె? ఛత్రంబులన్ బట్టరే? చామరాల్ వీవరేమో? భటుల్ రారుగా, ముందుగా! స్యందనం బెక్కఁడే! కాల్నడన్ వచ్చు నేమోకదే! కీడదేమోకదే? దైవమా!' యంచు యోజించుచుండంగ, విచ్చేసె శ్రీరాముఁడున్, వే యెదుర్కొంచుఁ బ్రాణేశ్వరున్ మ్రొక్కి 'దేవా! యిదే మిట్లు సన్నాహశూన్యంబుగా వచ్చినా రన్న, నారాముఁ డాసీతతో నాడు మందస్మితం బొప్పఁ; గాంతా! వినన్ లేదొకో, నేఁటివృత్తాంతమున్? గైకపుత్త్రుండు రాజౌట,- నే మానినై కానలో నుండఁగావచ్చుటల్; మున్ను నాతండ్రి తా నిచ్చియుంటన్ వరద్వంద్వమున్, దల్లి కైకేయి కాంక్షించె నీరీతి, నాతండ్రి యిచ్చెన్, సుతుం డేను నేఁడే పదిన్నాలుగేఁడుల్ జటాభారమున్ దాల్చి కాంతారమున్ జేరఁగాఁ బోవలెన్, గాంత! నీసమ్మతిన్

బొందఁగా వచ్చితిన్, బోదు నేఁ గాన, కీవ త్తలన్ బత్తిమైఁ గొల్వుమా! మామ సేవింపుమా! నీమఱందుల్ గుణాఢ్యుల్ సతీ! వారలన్ భ్రాత లట్లెంచి పోషింపుమా! గొప్పవంశంబునన్ బుట్టినావీవు, సద్ధర్మముల్ దప్ప వెప్పాటునన్, దేవి! భూభర్తయాజ్ఞైకపుత్రుండు, దూషింపఁగా రాదు నాపాటుకై చింతమై నాతనిన్, రాజు తానాటచే నాకునున్ నీకు నున్ జూడఁ బూజార్హుఁ డాతం, డహో జానకీ! యిద్ధి దైవేచ్ఛ దుర్వా రమెవ్వారికిన్; శోకమున్ బొందఁగా రాదు, మారాడఁగా రాదు, నీ వెట్టులో కాలమున్ ధర్మమార్గంబునన్ ద్రోయఁగా నొప్పగున్ దేవి! నాకాన తీవే! యనన్ ;—

సీతాదేవి, తానరణ్యమునకువత్తు నని శ్రీరామునితోఁ బట్టుపట్టుట

సీత శ్రీరాముతోనాడు 'నోరామ! యీపేదపల్కాడది క్లేటికో? రాసుతా! నవ్వువచ్చెన్ జుమీ! నీనుడుల్ విన్న నోదేవ! యర్ధాంగ మిచ్చోటనే వీడిపోఁ జూతువే! నిన్నుఁబోనిత్తునా? నాథ! రాజ్యంబు లేకుంటకై కుంధఁ, గాంతారమున్ జేరఁగాఁ బోదువే' యంచు దుఃఖింప శోకింతు నీతోడి నీడౌననున్ వీడుదీవంచుఁ, బ్రాణేశ్వరా! సాధ్వికెన్నంగఁ బ్రాణేశుఁ డేప్రాణమౌ, నట్టిప్రాణంబు లేనట్టియీబొంది నాకేటికిన్, గాల్పనే? నాథ! నన్నిట్లు పాయంగ ము న్నెట్టిదోసంబు గన్గొంటివో నాయెడన్? హా ప్రియా! నిర్దయా!;— యంచు దుఃఖించునా ప్రేయసిన్ గాంచి శ్రీరాఘవుం డాడుఁ— బ్రాణేశ్వరీ! దుఃఖముల్ గూర్తువే నాకు, నిం కేనునున్ నీవునున్ బాయఁ, గౌసల్య జీవించునా? నా వియోగంబుమైఁ గుందు నాసాధ్వి శుశ్రూషలన్ దేల్పఁగా నీకునున్ జెల్లదే? తండ్రి వృద్ధుండు, పోషింతు రెవ్వార? లోకాంత! కాంతార మంచన్న నేమంచు భావించితో? కాయలున్ గూరలున్, గుడ్పులోఁ గందశే? నీరమా? యెక్కడన్ జిక్కు, నిం కొక్కడన్ దక్కెడిన్, గంట కావేష్టితంబుల్ గడున్ మార్గముల్ దుర్గమంబుల్! కనన్ భూతబేతాళి కావాసమౌ! దైత్యమాయల్ గడున్ జెల్లు, బల్ దుష్టమహాజంతుసంతాన

ముల్ నిండియుండున్! మహాచండతాపంబునా నెండ సైపన్ వలెన్! వ్రేళ్లతో భూజముల్ గూల్చు గాడ్పున్ సహింపన్ వలెన్, గుంభవర్షంబుఁ దాళన్ దగున్! బిడ్డ నేనిన్ భరింపన్ వలెన్; గారుచీఁకట్లలోఁ జీఁకుల ట్లుండఁగా నొప్పు! నో కామినీ! కట్టఁగా నారచీరల్ గదే! కందమూలంబు లాహారమా! సౌధముల్ లేనటన్-బర్ణశాలన్ వసింపన్ వలెన్! హంసతల్పంబులే, దుయ్యేలల్ లేవు, నీకున్ జెలుల్ లేరు, దాసీజనుల్ గల్గ, రం దెట్లు నీవుందువే? జానకీ? నాకు బల్ కష్టమౌఁగాదె నిన్ గాచుటల్! ప్రేయసీ! చూడుమా! మౌర్ఖ్యమున్ వీడుమా! యంచనన్:—

### శ్రీరామచంద్రుఁడు సీతాదేవికి నరణ్యమునకు రా ననుజ్ఞనొసంగుట

సీత నేత్రంబులన్ బాష్పముల్ నిండఁగా, మోము వాడ్వారఁగా, మేను కంపింపఁగా నేడ్చుచున్ భీతయై—'నాథ! నన్ బాయుటే నిశ్చయంబైన నేఁ బ్రాణముల్ వీడెదన్, జూడుమా! యత్తకున్ సేవ సల్పంగ దాసీజనుల్ లేరె? కోడండ్రు నింకుండరే? యేటికీరీతిఁబల్కంగ? నాతండ్రి నన్నున్ భరింపంగ నీ కిచ్చెనే కాని, నన్వీడఁగా నీయఁ డాతండు, నిన్ బూరుషశ్రేష్ఠుఁడం చెంచెనే కాని, పత్నిన్ భరింపంగ లేనట్టిఁడౌ పూరుషాకారమున్ గొన్న స్త్రీవంచు నిక్కంబుగా నెంచఁడో నాథ!'- యంచిట్లు నో నాడు కాంతామణిన్ గౌఁగిటన్ జేర్చి, బల్ మక్కువన్ జెక్కిలిన్ ముట్టి, మందస్మితం బొప్ప భాషించె—'నో దేవి! యిట్లెందుకే నిష్ఠురంబాడ? నిన్ బాసి నేమాత్ర మెట్లుందునే? కానలో నీదు కష్టంబు నీక్షింపఁగా రానిదౌ నా కటంచెంచి యిట్లాడితిన్, మానినీ! నీవు నా చెంతనున్నంత, కాంతరమే స్వర్గతుల్యంబుగాదే? సతీ! ధాతసృష్టించె నిన్ గానలో దుఃఖముల్ పొందఁగా, సుందరీ! లెమ్ము-కానిమ్ము, నీయిష్టమంచాడఁ—

### తన వెంట నరణ్యమునకు వచ్చుటకు శ్రీరాముఁడు లక్ష్మణుని ప్రార్థన నంగీకరించుట

దానంత దవ్వుండి యీభాషణల్ విన్న సౌమిత్రి వేవచ్చి శ్రీరాముపాదాబ్జముల్ పట్టి—'యోయన్న! నేవచ్చెదన్ గానకున్, మీకుఁ

గాపుండెదన్, దేవ! యేమాటు మాటాడ కీవాజ్ఞ నిమ్మన్న, నాలక్ష్మణున్ గాంచి శ్రీరాముఁ డిట్లాడు—'నేమిద్ది సౌమిత్రి? యిట్లేల కాంతీంచెదో? తమ్ముఁడా! యిందె నీవుండుమా! కైకపుత్త్రుండు రాజ్యంబుఁ బాలింపఁగా, నీవు శత్త్రుఘ్నునిన్ గూడి సాహాయ్యమున్ జేయఁగా తేనికిన్, రాజకార్యంబులన్ దీర్పఁగాఁ జూడుమంచన్న, సౌమిత్రి—'శ్రీరామ! నేనొల్ల నాస్వర్గమేన్ నీవు లేకున్న, నీవెంట నేవత్తు మాటాడఁగాఁబోకు, నాయాన నీకుండెనంచన్న, నారాముఁడొక్కింత చింతించి యామీఁద నిట్లాడు—'నోసోదరా! కాని లెమ్మెంతయున్ లెస్స నాతోడ నీవుంట'— యంచాతడున్ సమ్మతిన్ దెల్పె!—

{ శ్రీసీతాలక్ష్మణులతో నరణ్యమునకు పోవుటకై శ్రీరామచంద్రుఁడు దశరథుని యనుజ్ఞ పొందుట }

శ్రీరాముఁ డవ్వేళలో విప్రులాల బీదలన్ సాదలన్ వృద్ధసంఘంఘులన్, మీఁద నైజాశ్రితాళిన్ మఱిన్ సేవకానీకమున్ వేగరప్పించి లో మెచ్చఁగా హెచ్చుగా దానముల్ సేసెఁ దాఁ గూర్చు భండారమెల్లన్, మెయిన్ దాల్చు భూషావళుల్, సీత మేన్ సొమ్ములున్ బుచ్చి తానిచ్చె, నా పిమ్మటన్ దాను సౌమిత్రియున్ గూడి, ఖడ్గంబులున్, విండ్లు తూణీరముల్ దాల్చి, భూజాతతో గైకసౌధాంతరంబున్ జొరంబోయి, ద్వారంబునన్ నిల్చి, యవ్వార్తఁబుత్తెంచె నాతేనికిన్! సూతుఁడా భూవరున్ జేరి—'యోరాజచంద్రా! సతిన్ సోదరున్ గూడి శ్రీరాముఁ డేతెంచెఁ, గాంతారమున్ జేరఁగాఁబోవఁగా నీయనుజ్ఞార్థమై, వేచియున్నాఁ డదేద్వారమందంబుఁ దాఁ దెల్ప,—'హా' యంచువావిచ్చి, యాపంగరానట్టి దుగఖంబు తానెట్టెటో సైచి, యిట్లాడె నాతేఁడు—'నోసూత, నీవేగి యంతఃపురస్త్రీలనెల్లన్ వడిన్ దోడితెమ్మన్న వేడ్కతో దెచ్చె నాతండు వారందఱన్! వార్తనాలించి విచ్చేసి రచ్చోటికిన్ బౌరులున్ మానులున్ మంత్రిసామంతులున్, జేరి చిత్రంబు పాటింప నిశ్శబ్దమైయుండెఁ బేరోలగంబయ్యెడన్! గాంచి సర్వంబు నాతేఁడు శ్రీరామునిన్ దోడితెమ్మన్నఁ దోదెచ్చె

నాసీతయుఁ దమ్ముఁడుఁ దోడరా, దూత యారామునిం; భక్తిమై రాఘవుం డంతటం దండ్రి పాదంబులం మ్రొక్కి యిట్లాడె,—'భూనాయకా! సీతయుఁ లక్ష్మణుండుఁ వనిం దోడుగా నాకు విచ్చేతుమం చెంతయుం బట్టుసాధించి, రేనెంత గాఁజెప్పినం మానకున్నంత నేనియ్యకొంటిం; వనిం మువ్వు రేమైతి మింకేటి కీయోజనల్? సత్యవాక్పాలనం బెంచి యాజ్ఞావచస్సీమ్ము నా కేగఁగాఁ గానకుం, ధర్మమూర్తీ! లసత్కీర్తీ! మోహంబుఁ జెందాడుమా! భ్రాంతినిం వీడుమా! తుచ్ఛముల్ సౌఖ్యముల్; మాయలీమేనులుం శాశ్వతంబై నసత్కీర్తిఁ బాటింపుమా!' యన్న రాజేంద్రుఁ డొక్కింత చింతించియిట్లాడె—'శ్రీరామ! కైకేయి యీపాపముల్ సల్పె; నాయందు లేదొక్క దోసంబు'నం చిట్లు ముందేమియో చెప్పనుంకింప నామాటకడ్డంబుగా, రాముఁడాతండ్రితో నాడు!—

నాతండ్రి! నాతల్లి కైకేయినిం దూఱఁగాఁ జెల్లునే? తల్లియాజ్ఞం దగం మాళి నేఁ దాల్చెదం, తండ్రి! కైకేయిసూతిం ధరానేతగాఁ జేయుమా! కైక మన్నింపుమా! ధాత్రినిం గైకసూతిం భరింపంగ నాసమ్మతిం-మించి నాయానతిం వానికిం దెల్పు; మాశీస్సులం నావిగాఁ బల్కు, నాముద్దులం విన్నుమా, దేవ!యంచన్న, రాజేంద్రుఁడిట్లాడు:—'శ్రీరామచంద్రా! లసత్కీర్తిసాంద్రా! అయో!- పోదువే? పుత్రకా! పోయి రమ్మా! శుభంబొందుమా! నీపునర్దర్శనంబందునందాఁక జీవింప, నేనిప్పుడే కాంతు నీమూర్తి నాకన్నులారంగ, నామానసంబారఁ బ్రాణంబులుం దృప్తిమైమీఱు' నంచెంతయుం జెప్పనేం వాల్పకే చూచి-'యాహా చిదానందరూపంబు, సత్యస్వరూపంబు, వేదార్థరూపంబు, బ్రహ్మస్వరూపంబు నీమోమునం గాన నయ్యెం, గడుం ధన్యుఁడైతిం సుతా! పోయి ర'మ్మంచు భాషించి దీవించె!—

### కౌసల్యాదేవి శ్రీసీతారామలక్ష్మణులకు దీవన లొసంగుట

నాపైని శ్రీరాముఁ డాతల్లికౌసల్యకుం మ్రొక్కినిల్వంగ, నా పుత్రుదీవించి యాసాధ్వి యిట్లాడు— 'నోనందనా! రామ! ఆకానలో

గోమలిన్ సీత జాగ్రత్తతో జూడుమన్నా! వనిన్ లాలనన్ జేసి యీబా లఁబాలింపుమన్నా! కడున్ చిన్నఁ డీలక్ష్మణున్ బ్రీతిమైఁ గాంచుమన్నా! పదిన్నాలుగేఁడుల్ సుఖంబారఁగాఁ గానయందుండి, యామీఁదటన్ మాకు నీదర్శనం బీయవన్నా! సుతా! పోయిరావన్న! నాముద్దుకూనా!' యటంచాడి కన్దోయిటన్ నీళులన్ నించె; నామీఁదటన్ సీత యేతెంచి తా నత్తకున్ మ్రొక్కఁగాఁ, గౌఁగిటన్ గ్రుచ్చి మూర్ధంబుమూర్కొంచు, గాద్గద్యమున్ దోఁప కంఠంబునన్ బల్కె:— సీతా! ధరాజాత! సద్వంశ సంభూత! యోసద్గుణోపేత! నిన్ గానకున్ దోలి, నీతండ్రి కే మెంతయున్ దోసమున్ సల్పినామమ్మ! యోమైథిలీ! మైథిలుం డెంచి నీసౌఖ్యమున్, మాదుబాంధవ్యమున్ జేసి, ముద్దార నిన్ బెద్దగాఁ బెంచి మా చేతిలోఁ బెట్టె; మే మాకృతజ్ఞత్వమున్ గానకే క్రూరులై ని న్నిటుల్ కాన పట్టించినామమ్మ! యోకోడలా! దూఱకమ్మా? మమున్; గాంచఁగా నీ ధరానేత, తాసత్యవాగ్బద్ధుఁడై సాహసంబింతగాఁ జేసె నమ్మా! సతీ! భర్తయే దైవమంచెంచుమమ్మా! వనంబందు నీవొంటిఁగాఁబోవకమ్మా! వెతల్ సైఁపుమమ్మా! ధరాపుత్రి! నాపుత్రులీరామునిన్ లక్ష్మణున్ బెంచియిన్నాళ్లు, నీచేత నేఁడుంచినానమ్మ! యాకానలో వేళకాహార నీరంబులన్ వీరికిమ్మా! ముదంబారఁ బోషింపుమా! తల్లి నీకెల్లమా శీస్సులా' నంచు గాద్గద్యమాకంఠమం దోప్పఁగాఁ, 'పోయిరావమ్మ! సీతమ్మ' యంచాడి, ముందాడఁగాలేక యుత్కంఠ చేఁ, సీతమోమల్లనన్ గన్నులం గాంచుచున్ గన్నులం దశ్రువుల్ గార్చె;—

నాలక్ష్మణుం డంత విచ్చేసి కౌసల్యకున్ మ్రొక్కె నాసాధ్వి ప్రేమంబుమైఁ గౌఁగిటన్ గ్రుచ్చి యాలక్ష్మణున్:— 'బుత్ర! నాకోడలిన్ గోడ్కనున్ గంటిరెప్పట్లు కాపుండి రక్షించి, నీవీపదిన్నాలుగేఁడుల్ చనన్ దెచ్చి నాకెట్టులర్పింతువో? లక్ష్మణా! నీవు నారాముతోడుంటచే నే మదిన్ సాహసం బింతగాఁ జేసితిన్; బుత్రకా! అంతయున్ భార మెన్నంగ నీదేసుమా! సౌఖ్యమే పారుతన్ నీకు, నంచామె దీవించె;—

శ్రీసీతారామలక్ష్మణులు సుమిత్రాదేవియాజ్ఞఁ బడయుట

రాముండు సౌమిత్రితో సీతతో నాసుమిత్రాఖ్యకున్ మ్రొక్క, నాకాంత:— 'శ్రీరామ! సాధ్వీశిరోరత్న మీతల్లి కౌసల్య సన్మంగళాశీస్సు లుండంగ, నీ కేమిటన్ దక్కువా? నెమ్మదిన్ బోయి రావన్న'— యంచాడి, భూపుత్రి నీక్షించి:— ఓజానకీ! పూతచారిత్రవౌదమ్మ! నీనాథుతోఁ గానకున్ బోవు నీవర్తనం బెంచఁగా, లోకమం దెల్లస్త్రీజాతికిన్ బాతమై వెల్గునమ్మా! సుతా! యింతులం దెల్ల మేల్బంతివౌదమ్మ! మాయమ్మ! బల్సాధ్వివౌ నీకు నేధర్మముల్ దెల్ప నేలా? శుభంబయ్యెడున్ నీకు, మమ్మెన్నఁడున్ మర్వకమ్మా! మహారాజపుత్రీ! దురంతంబునౌ కాననావాస మెట్లోర్చెదమ్మా! నినున్ గాంచ భాగ్యైన నీరాఁగదమ్మా! వనిన్ ద్రోయఁగా నుంటిమమ్మా! కనన్ యత్నమే లేక నే మోర్చినామమ్మ! యేమన్న లాభంబు లేకుండెనమ్మా! అయో జానకమ్మా! సుఖంబారఁగాఁ బోయిరావమ్మ;— ఓలక్ష్మణా! నేఁడుగా, జన్మసార్థక్యమున్ గంటి నే నిన్నుఁ గన్నందునన్, బుత్రకా! రాముఁ డీసీతతోఁ గానకున్ బోయెడిన్ గాన, నిన్ దోడుగాఁ బంప నే నెంచియుంటిన్ జుమీ! కోరకేన్ముందె నాకోర్కె దీరంగ వర్తించి తౌరౌర! యిట్లొప్పుదే, పుత్ర! కాంచన్ బవిత్రుండవైతీవు. నాతండ్రి! ఆకాననే యీయయోధ్యాపురంబంచు భావింపుమా! రామునిన్ దండ్రిగా నెంచుమా! యీధరాజాతయౌ సీత, నీమాతయౌ నన్నుఁగా నెంచి సేవింపుమా! వీరికై ప్రాణమైనన్ దృణప్రాయమం చెంచి వర్తింపుమా! శీలమున్ సత్యమున్ ధర్మమున్ వీడ కీ వాపదిన్ నాలుగేఁడుల్ వనీవాసమున్ జేసి, సౌఖ్యంబుగా నన్నతో-శీలసంపన్నయౌ సీతతో వచ్చి నాదీవనల్ పొందుమా! నందనా! పోయిరమ్మంచు నాయమ్మ ముమ్మారుదీవించె;—

శ్రీరాముఁడు తమ్ము దీవించిపంపుమని కైకేయికి మ్రొక్కుట

సామీఁద రాముండు భూపుత్రినిన్, లక్ష్మణున్ గూడి కైకేయికిన్ మ్రొక్కి ప్రార్థించె:—'దీవింపుమమ్మా! మమున్ దల్లి! నాతండ్రినిన్

నిత్యసత్యవ్రతుఁ డల్పుఁగానేనుగాంతారముఁ జేరఁగాఁబోదునీకోర్కె మై; నీసుతుండై ననాసోదరుఁ ధాత్రి పట్టంబుదాల్పంగ నే నొప్పితిఁ, జెప్పితిఁ జేనికారీతిఁగావింపఁగా; జెప్పుమా, నీవు నాసమ్మతిఁ వానికిఁ; నే నిదే సీతతోఁ, బిన్నతమ్ముండు సౌమిత్రితోఁ, గానకుఁ బోదుఁ దల్లీ! ముదం బార నాజ్ఞావచస్సిమ్ము మా'కంచుఁ బ్రార్థింప నాకైక పల్కెడు:— 'నోరాసుతా! వెళ్లుమీ కానకుఁ, వేళయాయెఁ జుమీ! నారచీరల్ కొనుండివ్వి' యంచాడి తాఁ బెట్టె నవ్వాని శ్రీరామసౌమిత్రిసీతా కరాగ్రంబులఁ,—

దీనినిఁ గాంచి 'యాహా' యటంచార్చె నాఁబాలగోపాల, మంతఁ సుమంత్రుండు-ఛీ! ఛీ! యనెఁ; వెంటనే యావసిష్ఠర్షి-హా హా! యటంచార్చె, క్రీఁగంటితో క్రూరమౌచూపునఁ గాంచి జాబాలి, హా-హా, యనెఁ; - 'దుష్ట! థూ! థూ!' యటం చల్గి రందా సభాస్తారు, లౌపోరు; లంతఁ వసిష్ఠుండు లో వెక్కసంబెక్కు వైపల్కె - 'కైకా! ధరాజాత కానారచీరేటికే? - కానలఁ జేర శ్రీరామునిఁ గోరినావంతయే - సీత, సౌమిత్రినిఁ గోరినావే? - యిటుల్ దుష్టచారిత్రవైనావటే?' యంచు గర్జించె; నామీఁద నావృద్ధరా జెంతయుఁ గోపతాపంబులఁ బల్కె - మంత్రీశ్వరా! యూడ్చి నాయెల్లభండారముఁ దెమ్ము! సర్వప్రజఁ రాముకెంటఁ జనఁ జెప్పుమా! స్యందనం బొండు వేతెమ్ము, నేఁ బోయెదఁ భార్య లీయిర్వురఁ గూడి యాకానకుఁ జెట్ట కైకేయి పాలింపనీ, పాడురాజ్యంబు నాదుష్టుఁడౌపుత్రుతోఁ గూడి; లేలెమ్ము, జాగేల' యంచన్న, నామాట కాకైక లోకాళచేఁ గన్బొమల్ గంటుగాఁగూర్చి, క్రీఁగంటితో రాజునీక్షించి, యిట్లాడు;-

రాజేంద్ర! యి ట్లీమృషాలాపముల్ వల్క ధర్మంబె? పాడూరికా పట్టముఁ గట్టి నాపట్టి, కీవిచ్చినావా వరద్వంద్వముఁ? జాలు నింతే టికిఁ, మాటయే లేదు పొమ్మన్నచోఁ జెల్లదే? వల్లభా! ఆంధ్రతోఁ, గొడ్కకోడండ్రతో రాజ్యసౌఖ్యంబులఁ బొందుమా! నేనొ - నాపు

త్రుతోఁ బోదుఁగాంతారవాసంబుఁగావింపఁగా?' - నంచుఁ బల్కంగ-'హా' యంచు నావృద్ధరాజేంద్రుఁడున్ మూర్ఛమై వ్రాలె నప్పాన్పునన్, దోడనేయెత్తి రందున్న కాంతల్;—

—{ శ్రీతారామలక్ష్మణులు రథారోహణులై కాంతారసీమకుఁ బ్రయాణముసేయుట. }—

ప్రమోదంబునన్ రాముఁ డానారవస్త్రంబులన్ దాల్చె, సౌమిత్రి సన్న్యాసియైయొప్పె, భూపుత్రి యానల్కముల్ దాల్పలే కెంతయున్ భీతయై, పుట్టమున్ జేతిలోఁబట్టి ప్రాణేశుమో మ్మెప్పవీక్షించె, నంతన్ రఘూత్తంసు డాచీర నాసీత మైఁగట్టుపుట్టంబుపైఁ గప్పె, నామీఁద వార్షవ్వరున్ బంధుమిత్రాళికిన్ జెప్పి, యొప్పించి - యొప్పారఁగా సభ్యులన్ గాంచి కేల్మోడ్చి - 'మాకాజ్ఞయే' యంచు మందస్మితాస్యంబు లేపారఁ బ్రార్థించి, యంతఃపురం బట్టులన్ దాఁటిపోవంగ, వెన్వెంట నేతెంచి రాతండ్రియున్ దల్లులెల్లన్, బ్రజల్, బంధుమిత్రుల్, మహామంత్రులున్ భృత్యులున్ ఖిన్నులై; రాజమార్గంబువా రట్టులన్ దాఁట, సూతుండు వేగన్ రథంబొండు ముందుంచఁగా, మ్రొక్కి యాముగ్వు రారూఢులై పోవ, 'నాహా' - యటం చార్చి రావీథిలోనున్నవారల్; రథంబేగ దౌదవ్వులన్ - రాజు మూర్ఛిల్లె - నాక్రందనారావముల్ వెల్లురేఁగెన్ - నిరీక్షింపఁగా ఘోరమై దృశ్యమొప్పెన్, - దశస్యందనున్ లేపి కౌసల్య, 'మన్నాథ! శ్రీరాముఁ డేగెన్ జుమీ! సీత తోడన్ సుమిత్రాతనూజాతుతోడన్ వనిన్ జేరఁగా, నన్ను నిర్భాగ్యగాఁ జేసి' యంచేడ్చెఁ—బృథ్వీశ్వరుం డేడ్చెః—నారాఘవుం డేగెనా? నాదు ప్రాణంబు నన్ బాసెనా?' యంచుమూర్ఛిల్లె - హా! హా! యటం చార్చె నంతఃపురస్త్రీజనౌఘంబు, లాపైన నాఱేని కేల్వట్టి కొంపోయి రాదేవులా దేవికౌసల్యయిల్సేర్చ!—

నాఁ డాపురంబందు దుఃఖంబుచే నాప్రజల్ కైకనోనాడుచున్, ఱేనిదూషించుచున్, సీత లోనెంచి దుఃఖించుచున్, రాముఁ గీర్తించు

చుచుఁ, లక్ష్మణుఁ డెచ్చు, 'చేమింక నిందుండఁగా నొల్ల మారాముతోఁ గానకుఁ బోదు' మంచేడ్చుచుఁ బోవఁగాఁ గొంద ఱాస్యందనం బేగు జాడల్ పరీక్షించుచుఁ, గొంద అత్యంతశోకంబునఁ గుందుచుఁ వెన్కకుఁ బోయి రామీఁద!—

శ్రీ రాముఁ డాలక్ష్మణుఁ జానకిఁ గూడి, సూతుండు దోలఁ రథంబుఁ జనావాసముల్ దాఁటి, యెంతేనియుఁ బోయి, సాయంతనంబౌట చే నొక్కచోటఁ నదీతీరముఁ జేరి, యాస్యందనం బయ్యెడఁ బుచ్చి, వేగఁ దురంగంబులఁ నీరు సూతుండు ద్రావింప, నారాఘువుల్ తన్నదీతోయముఁ డాసి, సాంధ్యక్రియల్ దీర్చి, రామీఁద సౌమిత్రితో-సీతతో-సైకతక్షోణి విశ్రాంతిమైనుండె నారాఘువుం, డందు నారాత్రి నిద్రించి, రాప్రొద్దునఁ స్యందనం బెక్కి వారల్ ప్రయాణంబుగావించి, త్రోవఁ నదుల్ దాఁటి రందున్న - వేగశ్రుతిఁ, గోమతిఁ, స్యందికఁ; వానిపార్శ్వంబునందున్న యాకోసలఁ గాంచి కైమోడ్చి వా రాయయోధ్యాపురశ్రీకి, ముందేగి రంగత్తరంగంబులఁ బొంగుగంగానదీతీరముఁ జేరి, యందున్న యా'యింగుదీ' వృక్షప్రాంతంబునఁ డిగ్గి సాంధ్యక్రియల్ దీర్చి యేతన్నదీనీరముఁ గ్రోలి, యాచోట విశ్రాంతులై యుండిరవ్వేళ:—

## గుహుఁడు గంగానదీతీరమునకు శ్రీరాముని దర్శింపవచ్చుట

ఆపావనంబైన గంగానదీతీరమందొప్పు నా'శృంగిబే' రాఖ్యసత్పట్టణాధీశ్వరుండౌ 'గుహుం'డఁ నిషాదేశ్వరుం డందు, శ్రీరాముఁ డేతెంచెనవ్వార్త నాలించి, తోడ్తోడనే భ్రాజితోపాయనంబుల్ గడుఁ గొంచు నిష్ఠాళితోఁ బోయి, శ్రీరాముదర్శించి సద్భక్తిమై మ్రొక్కి, యామౌనివేషంబులఁ గాంచి లోనఁ వెఱంగంది 'యోదేవ! యీవేషముల్ దాల్పఁగాఁ గారణం బేమొ? మిమ్మింత గాఁ జేయు ద్రోహాత్ము పే రాడుమీ! బంటు నే నుంటి జెండాడెదఁ వానిశీర్షంబు నాఖడ్గధారాహతిఁ, దెల్పుమా!' యన్న, శ్రీరాముఁ డద్దానికిఁ నవ్వుచుఁ సర్వవృత్తాంత

ముఁ జెప్పి, వీరోక్తులఁ మాన్పఁగా, నానిషాదేశుఁ డాకైకదోసంబుఁ జింతించి, యిట్లాటకుఁ మించి దుఃఖించె; నామీఁద శ్రీరాఘవుం డాకిరాతేశుతో క్షేమవార్తాప్రసంగంబుఁ గావించి భాషించె, నంతఁ గిరాతేశ్వరుం, డిచ్చు నర్పింపఁగాఁ గందమూలంబులఁ దృప్తి సేవించి, తా సీతతోఁ బర్ణతల్పంబునఁ బండె:—

## శ్రీరామునివీడ్కొని సుమంత్రుఁ డయోధ్య కేగుట

నారాత్రిలో సూతుఁడుఁ లక్ష్మణుండుఁ గిరాతేశుఁడుఁ లేచి కాపుండి, శ్రీరాముపాలించి దుఃఖించి, రావేకువఁ లేచి రాముండు దాఁ గాలకృత్యంబులఁ దీర్చి, యాపై సుమంత్రుఁ విలోకించి యిట్లాడె:- నయ్యా! రథంబొప్ప దిం, కాయయోధ్యాపురం బేగుమా! తండ్రికిఁ దల్లికై కేయికిఁ దెల్పుమా, మేము గంగానదిఁ దాఁటి ముందేగుటల్; తండ్రినోదార్పుమా! తల్లి కౌసల్యకుఁ ధైర్యముఁ జెప్పుమా! కైక పుత్రుండు రాజ్యంబుఁ బాలింప నాసమ్మతిఁ దెల్పుమా!' యొమ్మటంచన్న, గాద్గద్య మేపారుకంఠంబునఁ బల్కు సూతుండు,—'రామా! నినుఁ బాయఁగానొల్ల, నీవెంట నేవచ్చెదఁ, మీకు శుశ్రూషలఁ జేసెదఁ, దాసునిఁ గావు మీ' వంచుఁ దాఁ గన్నులఁ బాష్పముల్ జాఱ రోదించు నాభృత్యు నీక్షించి శ్రీరాముఁ డిట్లాడు—'నోసన్మతీ! నేను గంగానదిఁ దాఁటి కాంతారముఁ జేరి నా నన్నవృత్తాంతముఁ జేనికిఁ గైకకుఁ జెప్పలేకున్నచో సత్యమేపార, దట్లాటచే, వేగ మీవేగు లీకార్య,మం చాడ, యత్నంబు లేకుంట చేతఁ రథం బెక్కి సూతుండు శోకించుచుఁ బోయె:—

## రాఘవులు గంగానదిని దాఁటి గుహుని వీడ్కొల్పుట

నంతఁ గుహుం డొప్పఁగాఁ గర్ణధారుండుగా, నావపై నెక్కి సీతాసమేతంబుగా, లక్ష్మణుఁ గూడి, శ్రీరామచంద్రుండు భాగీరథిఁ దాఁటె, నాపిమ్మటఁ ద్రోవఁ జూపింప నొక్కింతదూరంబు, నాపై నిషాదాగ్రణిఁ బుచ్చి, వారేగి రాఘోరకాంతారదేశంబునఁ,- బోవుచో,

నెండ కత్యంతమున్ బొక్కుచున్, ముండులన్ ద్రొక్కుచున్ దక్కు నాజానకిన్ గాంచి శ్రీరాముఁ 'డో కామినీ! కోమలంబైనయీనీతనూవల్లి యీబాధలన్ సైఁపఁగా నోప దంచెంచి, యవ్వీటనే నిల్వఁ బ్రార్థించితిన్, గోమలీ! చూడఁగాఁ జాల నీగో' డటంచాడుచున్, నీడలన్ భూసుతన్ నిల్పికొంచున్, సతిన్ జాడలన్ మెల్ల నడ్పించుకోం, చిట్టు లానాఁడు మూఁడామడల్ దాఁటి, యందొక్కచోటన్ 'సుదర్శంబు' నానొ సరసి ప్రాంతమున్ జేరి, సూర్యుండు గ్రుంకంగ నీక్షించి, యచ్చోటనే నిల్చి సాంధ్యక్రియల్ దీర్చి, భక్తిన్ మృణాలంబులన్ దెచ్చి సౌమిత్రి యందియ్యఁగాఁ దృప్తిసేవించి, యాసీతతో రాముఁ డారాత్రి నిద్రించె; నాపిమ్మటన్ వేకువన్ లేచి, విధ్యుక్తముల్ దీర్చి వా రేగి రానాఁడు వేవేగమే యోజనాల్ మూఁడు, గాళిందికిన్ గంగకున్ సంగమం బొప్పె నచ్చోట, నాప్రాంతమందున్న శ్యామాఖ్యభూజంబునీడన్ సశిష్యుండుగానుండు నాశ్రీభరద్వాజమౌనీంద్రునిన్ గాంచి సాష్టాంగదండప్రణామంబులన్ జేసి రా రాజపుత్రుల్ — మునీంద్రుండు దీవించి, యావేసముల్ గాంచి, యాశ్చర్యమగ్నుండునై, యోగదృష్టిన్ విలోకించి, లోనన్ విచారించి, వా రెల్లవృత్తాంతమున్ దెల్పఁగాఁ దా సమాలించి, వారిన్ గడున్ బ్రీతి లాలించి సత్కారమున్ సల్పి, నాధీరు లారాత్రి కచ్చోటనిద్రించి, రత్యంతమోదంబునన్;—

### భరద్వాజాశ్రమమునుండి శ్రీరాఘవులు చిత్రకూటాద్రి కేగుట

వేకువన్ లేచి, స్నానాదికృత్యంబులన్ దీర్చి, మౌనీంద్రుచే, దుర్గమంబైన యాచిత్రకూటాద్రికిన్ బో ననుజ్ఞాతులై, మౌని వీడ్కొంచు వేడ్కన్, బ్రయాణంబు సాగించి, రామార్గమధ్యంబునన్ వింటి మ్రోగించి బల్ భీతిమైపాఱు నాసింహశార్దూలమత్తేభఖడ్గాదియౌ జంతుసంతానమున్ జూపి, రాముండు సీతన్ ముదంబొందఁగాఁ జేయుచున్, వేడ్కఁ గొంపోయి, కాళింది దాఁటించె, నామీఁదటన్ జిత్రకూటాద్రి కేతెంచి రావిక్రమాఢ్యుల్, విచిత్రంబులై యగ్గిరిన్ గల్గు

చిత్రంబు లీక్షించుచున్, సంభ్రమంబొప్ప నాకాశమున్ దాఁకునట్లుండి, నల్దిక్కులన్ నిండి కన్పండువై యొప్పుశాఖల్ విభాసిల్లు నానాతరుశ్రేణులన్ గాంచి యుప్పొంగుచున్, సైకతంబందు నందందునన్ బెట్టి శ్రావ్యధ్వనిన్ మ్రోఁగుచున్ బాఱుపిన్నేరులన్ దాఁటుచున్, క్రౌంచహంసభ్రమద్భృంగచక్రాదులున్ సల్పుమాధుర్యసంపూర్ణనాదంబులన్ వీనులన్ జొన్పుచున్, గిన్నరీదివ్యగానప్రవాహంబునన్ దోఁగుచున్, శారికాకీరవాక్సారముల్ ద్రావుచున్, హోమమంత్రస్వరంబుల్ సరాగంబునన్ వించు, గంభీరమౌ వేదవాదంబులన్ సాదరంబొప్పలాలించుచున్, బోయి యందొక్కెడన్ మౌనిసంఘంబు నీక్షించి, యవ్వారికిన్ భక్తిమై మ్రొక్కి యాశీస్సులన్ బొంది, యచ్చోటనే పర్ణశాలన్ వినిర్మించి, వారందునన్ గాపురం బుండి యాతాపసానీకసంసేవనన్ మోదితస్వాంతులై కాలమున్ బుచ్చు:—

{ శ్రీసీతారాములక్ష్మణుల నరణ్యమునఁ జేర్పివచ్చితి నని సుమంత్రుండు దశరథునితోఁ జెప్పుట }

అట్లాసుమంత్రుండు శ్రీరాఘవున్ వీడి యత్యంతదుఃఖంబుతో స్యందనం బెక్కి కొన్నాళ్లపై నాయయోధ్యాపురిన్ జొచ్చి, దీనాననుండై జనానీకమున్ గాంచి వారేడ్వఁ దా నేడ్చుచున్, బోయి యావృద్ధరాజున్ విలోకించి పాదంబులన్ బట్టి గాద్గద్య మేపారుకంఠంబునన్ బల్కె:—'రాజేంద్ర! రాముండు సీతాసతిన్ లక్ష్మణున్ గూడి, గంగానదీతీరమున్ జేరి యందున్ జటల్ దాల్చి మంచేగె నాచిత్రకూటాద్రికిన్, డించి నేవచ్చితిన్ భూవరా!,' యంచుఁ జెల్పంగ నాతండు— 'హా రామ! హా జానకీ! లక్ష్మణా!' యంచుఁ బెల్లార్చి మూర్ఛిల్ల, నే తెంచి కౌసల్య యావృద్ధరాజేంద్రునిన్ లేవఁగా నెత్తి, దుఃఖాశ్రువుల్ జాఱ, నిట్లాడు: 'నా రాముని న్గానకున్ దోలితే నాథ! మాజానకిన్ బాపితే? గుండెభారంబు దగ్గెన్గదా నీకుఁ? గైకేయికిన్ దృప్తిగావించి నాపొట్ట కార్చిచ్చులోఁ బెట్టితే?' యంచు శోకించె:—

{ శ్రీరామవియోగమునకై, దశరథుఁడు దుఃఖించి కౌసల్యతో తాపసశాపవృత్తాంతమును దెల్పుట }

శ్రీరాముఁ డాచిత్రకూటాద్రిఁ జేరె నన్వార్త విన్నంతనే పిచ్చియెత్తెఁ ధరానేత, కాతండు భ్రాంతాత్ముఁడై రామునిఁ జీరు— ప్రేమఁ గవుంగిటికిఁ దార్చు, ముద్దాడు, మైఁదట్టు— దవ్వేగినట్లెంచి తాఁ గోపగించుఁ, గడుఁ నవ్వు, ముద్దించు—నాలక్ష్మణుఁ బిల్చు- భూజాత నీక్షించినట్లెంచి తాఁ బల్కరించుఁ—బడుఁ లేచుఁ, బా ఱంగ నుంకించు—ఘోరంబుగాఁ జీరు - హర్షించుచుఁ గేరు - గైకఁ గడుఁ దిట్టు, నాకాంతపుత్రుఁ జెడఁ దూలనాడుఁ; ధరాకాంతుఁ డీరీతిగావింపఁ, గౌసల్య:-'హా ! పుత్రుఁ డాకాననఁ జేరె నంచేడ్తునా ? నాథునిఁ బిచ్చిపైకొంట లోనెంచి శోకింతునా ? దైవమా!' యంచు బిట్టార్చె;-నంతఃపురస్త్రీలు వే వచ్చి, కౌసల్య నోదార్చి, రాజేంద్రునిఁ డాసి—'యిట్లేటికిఁ జేయ భూనాయకా! ధైర్యముఁ జెప్పుటల్ మాని నీ విట్టులఁ జేయ మమ్మెవ్వ రోదార్పువారల్ నృపా!' యన్న, నా రాజు తెల్వొంది కౌసల్యతోఁ బల్కెః—

"కాంతా! రహస్యంబు నేఁ దెల్పెదఁ, బ్రేయసీ! యొక్క నాఁ డొక్క రాత్రిఁ గడుఁ జీఁకటిఁ శస్త్రముల్ దాల్చి; నాశబ్దవేదిప్రభావంబు నీక్షింపఁగా, నొక్కచో లేచి నేనుండునంతఁ, నదిఁ శబ్దమే తేర, మత్తేభమే తెంచె నీ రానఁగానంచు లోనెంచి, బాణంబుఁ బోమీటితే, నద్దికుంభంబు పూరించుచున్నట్టిఁడో తాపసుఁ దాఁకె, నాతండు 'నారాయణా!' యంచు, ధాత్రిస్థలిఁ వ్రాలి మేఁ వాయుచున్నంతటఁ భీతుఁడై పోయి యా దవ్వులందున్న యవ్వాని బల్ చీకులౌవృద్ధులౌ తల్లినిఁ దండ్రినిఁ గాంచి విన్పించితిఁ వార్త; వా రంత దుఃఖించి నన్ గాంచి:-"మే మెట్టులఁ బుత్రలోకంబునన్ గుందుచుఁ జత్తుం, మారీతిగాఁ జావు మీ," వంచు, శాపంబు నాకిచ్చి వారప్పుడే ప్రాణముల్ వాసి, రోకామినీ! తత్ఫలం బిప్డు డొందెఁగదే ! నేఁడో- యెల్లుండియో

చావు నాకుండె' నంచాడఁ, గౌసల్య పల్కాడు— 'భూనాథ! యిట్లేటి కాడంగ నశ్లీలములన్? మంగళంబౌత' మంచాడి యోదార్చి, శయ్యా తలంబందు భూనాథునిన్ జేర్చి, యాసాధ్వి యంతఃపురస్త్రీసమూహం బుతోఁ బోవ;

### దశరథునిమరణము

నాపిమ్మటన్ ఱేఁడు—'హాపుత్ర! హారామ! హాసూర్యవంశప్ర దీపా!'-యటంచార్చి ప్రాణంబులన్ బాసె:-ఱేఁ డెన్నఁగా నిద్రలో నుండె నంచెంచి యారాత్రి నిద్రించి రాదేవులున్;—దెల్లవారెన్— గడున్ బ్రొద్దుమిన్నెక్కె;—'ఱేఁ డేలొకో మేలుకో' డంచు దేవేరు లేతెంచి స్పర్శించి భీతాత్మలై యూర్పు లేకుంట లక్షించి,—హా! యంచు రోదించుచున్; మోఁదికొంచున్ మొగంబుల్ దలల్ వక్షు ముల్, బిట్టుగా నేడ్చుచున్నంత, కైకేయి విచ్చేసి:—'హానాథ హా! పోయితే, నేఁడు మమ్మాదరింపేడి?—యింతొట లోఁగాన కే నింతగాఁ జేసితిన్, నాథ! నాచేతులన్-జేఁతలన్ నేనె వైధవ్యమున్ దెచ్చుకొంటిన్, ధరాధీశ! నే నొల్లనింకావరంబుల్, సుతున్ రాము రప్పింపుమా! ధాత్రిఁ బాలింపనిమ్మా! ననున్ జూడుమా! యొక్కమా టాడుమా! తప్పునైరింపుమా!' యంచు రోదించెఁ, గౌసల్యయున్ బిన్నపై వ్రాలి దుఃఖించుచుండెన్, సుమిత్రాఖ్య శోకంబు వర్ణింపఁగారా నిద్రైయుండె, నిం కెల్లనంతఃపురస్త్రీజనౌఘంబు లెంతో ప్రలాపించె;— నవ్వార్త యూరంతఁ బ్రాఁకన్, బ్రజల్ మంత్రిసామంతులున్ బంధులి ష్టుల్ భటుల్ వచ్చి యీక్షించుచుండన్; వసిష్ఠుండు నేతెంచి, యూరార్చి యాదేవులన్, దైలపాత్రంబునందుంచి యారాజుదేహంబు సింహాసనంబందుఁ బెట్టించి:—

### వసిష్ఠుండు, భరతశత్రుఘ్నులఁ దోడితెచ్చుటకు దూతలఁ బంపుట

ఆపిమ్మటన్ జారులన్బంపె నాకైకసూతిన్, రిపుఘ్నున్ వడిన్ దోడితే వారికిన్ గట్టడిన్ సల్పె, నీసంగతుల్ దెల్పకుండంగ; నాదూ

తలున్ రత్నముల్ వస్త్రముల్ గొంచు వేపోయి తత్పట్టణంబున్ వెసన్ జేరి; వస్త్రాదులర్పించి—'యోరాజచంద్రా! వసిష్ఠర్షి వే మిమ్ములన్ దోడి తెమ్మంచు మమ్ముంపె, నాలస్యమున్ జేయఁగారాదు, గుర్వాజ్ఞ సుండీ! వెసన్ లెండి! లెండింక. నీవేళనే వెళ్లఁ'డంచన్న, నాకైకపుత్త్రుండు నవ్వా రితోఁ బల్కె, 'మే మిప్పుడే పైనమున్ జేయఁగానుంటి, మీ రింతలో వచ్చినా రైనమేలాయె. నందాపురంబందు నాతల్లులున్ దండ్రియున్ సౌఖ్యమే? రాముఁడున్నాఁడె సేమంబుగా? సీత నామాత యాపూత చారిత్ర మోదంబె? మాలక్ష్మణుండున్ సుఖంబుండునే? పౌరులామో దులే?'-యంచుఁ బ్రశ్నింప నొక్కండుపల్కెన్—'సుఖంబున్నవారల్- మహారాజ! జాగేలనేయంగ' నంచెంతయున్ దీవరింపంగ:—

సాష్టమ్మటన్ మామచే నానతిన్ బొంది, శత్రుఘ్నుతోడన్ బ్రయా ణంబుఁ గావించె, తేఁడిచ్చునానామణుల్ దివ్యవస్త్రంబులన్ బొంది యాకైకపుత్త్రుండు;— వారాగతిన్ స్యందనంబెక్కి కొన్నాళ్లకే యాయయోధ్యాపురిన్ జేరి,-యారాజవీథిన్ బ్రవేశించి, యెందెందునున్ శోభలేకుండుటన్ గాంచి, విభ్రాంతులై;- పౌరులెల్లన్ విషాదంబు గొన్నట్లుగాఁ దోఁప, నిర్విణ్ణులై పోవుచున్, గైకపుత్త్రుండు శత్రు ఘ్నుతో నాడు;- 'నేమోకదా యూరు పాడైనయట్లుండెఁ, బౌరుల్ విషాదంబునన్ గుందఁగాఁ దోఁచె నేమో! యెదుర్కొంచు నెవ్వార లున్ మమ్ము సన్మానమున్ జేయఁగా రారు, చూడన్ ముదంబారఁగా, లక్ష్మణుం డేటికో చేరఁగా మమ్ము విచ్చేయఁ డెవ్వారికో కీడటం చెంచు చున్ ఖిన్నులై, పోయి యచ్చోటనే యున్నకేకేయి యంతఃపురిన్ జొచ్చి, హర్షంబునన్ బొంగుచున్నట్టి తల్లిన్ విలోకించి తత్సూనుఁ డిట్లాడె:—

భరతశత్రుఘ్నులు, కైకవలన నెల్లవృత్తాంతమును విని దుఃఖించుట

ఓమాత! యిల్లేటి కీయూరు శోభావిహీనంబుగానుండె? బౌరుల్ మదిన్ గుందఁగాఁగారణం బేమొ? యొక్కర్తవీవిట్లు హర్షాంబుధిన్ దేలె,

దేపట్టిసామ్రాజ్యమున్ గంటివో తల్లి'- భూనాథుఁడౌ తండ్రికిన్ నేమమే? తల్లికౌసల్యకున్ మోద మే? యాసుమిత్రాంబ కానంద మేమమ్మ! యాధీరుఁ, డాసూర్యవంశప్రదీపుండు, నాయగ్రజుండౌ రఘూత్తంసుఁ డారాముఁడున్నాఁడె సాధ్వీశిరోరత్నమౌ సీతతోఁగూడి సౌఖ్యంబుగా? విక్రమాఢ్యుండునౌ లక్ష్మణుం డొప్పునే? చెప్పవే! యన్న—కైకేయి యిట్లాడు నాపుత్రుతో:—పుత్రకా! నిన్ను నీమామగారూరికిన్ బంపి శ్రీరాముపట్టాభిషేకంబు సేయన్ దొడంగెన్ జుమీ భూపుఁ! డద్దాని కేనెంత యోనొచ్చి, నీశ్రేయమున్ గోరి, నిన్ రాజుగావింపఁగా నెంచి, యోచించి- యోచించి, యామీఁద నేనొక్కయుక్తిన్ దగన్ బన్నితిన్;— .

బుత్ర! మున్నొక్కనాఁ డిచ్చె నీతండ్రి, నాకున్ వరద్వంద్వమున్; గోరితిన్ వాని నే నిప్పు డాత్మాధవుం డియ్యఁగా, నొక్కటిన్ నీకు మూర్ధాభిషికంబుఁగావించి సర్వంసహారాజ్యమీయంగ; నింకొక్కటిన్ రాముఁ డావహానివేషంబుఁ గైకొంచు, నాఁడే పదిన్నాలుగేఁడుల్ వనీవాసమున్ సల్పఁ బోఁబంప, నోపుత్ర! యావెంటనే రాముఁడాలక్ష్మణున్ గూడి, భూజాతతో నేగెఁ గాంతారమున్ జేరఁగాఁ, బుత్రశోకంబుచే మొన్నఁ జీకాకుమైఁగుంది, లోకాంతరం బేగె నాకాంతుఁ డోనందనా! నీకునై యింతకార్యంబు కాఁజేసి, నాసాహసంబొప్ప, సాధించితిన్ బూజ్యసామ్రాజ్యమున్, బెట్టితిన్ జేత—నాపట్టి! యీయుర్వరన్ బట్టమున్ గట్టికొమ్మంచు, బల్ దిట్టయై పల్క, రాపట్టి యొక్కింతసేపట్టు నిర్విణ్ణుఁడై నిల్చి, యాపట్టునన్ మూర్ఛయై నేలపై వ్రాలి, యామీఁద తెల్వొంది నిల్వెల్ల నీర్గ్రమ్మగా నిల్చి, బల్ నిప్పుకల్ కన్నులన్ గుప్పుచున్ కైక నీక్షించి,లోకాకసైరింపఁగాలేక తా సర్వముల్లెంతయున్ రోఁజుచున్ బల్కె;-'హా చెట్ట! యెట్లాడెనే నీకు నోరెన్నఁగా, రామునిన్ గానకున్ బొమ్మనన్? జూడ నిక్ష్వాకువంశంబు ధ్వంసంబుఁ గావింపఁగాఁ బుట్టినావోకదే! దుర్యశంబబ్బె నీపొట్టలో నేను జన్మించుటన్,

ధూర్త, పాపాత్మురాలా! రఘూత్తంసుఁడౌ రాముపట్లఁ మహాద్రోహ మీరీతిగావించి బల్ఘోరపాపంబులఁ గట్టికొంటే?

పిశాచీ! ఆహా యెట్టులోర్తుఁ, మహారాజరాజేంద్ర సన్మౌళిసన్మానితామోఘపాదాబ్జుఁడౌ రాముఁడే, యుర్విపై నాల్గుపాదంబులఁ ధర్మమేపారఁగా నిల్పఁగా శక్తిసామర్థ్యముల్గన్న సంపన్నుఁడౌయొక్క శ్రీరాముఁడే, సర్వసర్వంసహాభారముఁ దద్భుజాపీఠిపై నిల్పి రక్షింప దక్షుండు నాజానకీరాముఁడే, యట్టిదేవేద్యునిఁ శాంతమూర్తిఁ గుణాఢ్యుఁ వనిఁ ద్రోలఁగాఁగోరు నీ నోరదేలా యచేపుచ్చిపోకున్నదే! యేటికీపాపకార్యంబు గావించితే! నేను నిన్నెప్పుడేఁ గోరినానే ధరఁదెచ్చి నానెత్తిపైఁ బెట్టుమం చేడ్చుచుఁ? హంత! నన్నెంతగాఁ దప్పుభావించితే?

రాముఁడే లేని యాదివ్యమౌ స్వర్గసామ్రాజ్యమేయబ్బ, మోఁకాలు నేనొడ్డెదఁ దానికిఁ; జెట్టవై! నీవు నాకిచ్చు నీతుచ్ఛరాజ్యంబు నాసింతునా? కుక్కమాంసంబులాఁగెంచి వర్జింతు దుర్జాతి! శ్రీరాముఁడౌ కానలోనుండ నేహంసతల్పంబుపై బండగాఁ జూతునా? యాతఁడట్టుల్ జడల్దాల్పగా నేఁదలఁ వజ్రవైడూర్యరత్నాంచితంబౌ కిరీటంబు నేఁ దాల్తునే? కందమూలంబులఁ బందుగాఁ బొంద నాతండు, దివ్యాన్నముఁ భక్ష్యభోజ్యంబులుఁ గుక్షినిండింతునా నేనిటఁ? రాముఁడౌ జీర్ణమౌ పర్ణశాలఁ వసింపఁగ నే నీమహాసౌధప్రాసాదరాజంబులఁ దేజముప్పొంగఁగా నుందునా? సౌఖ్యమొప్పారఁగా నుందునా? నీకు నేఁ బుత్త్రుఁడై నంతమాత్రాన నీయట్టిదుర్బుద్ధి నాకుండునం చెంచితే!—

రాక్షసీ! రాముఁ డెట్లెంచెనో నన్ను? సౌమిత్రి కోపించెనో? పూతచారిత్రయా సీత నన్నెట్లుభావించెనో! తండ్రి - నాకూర్చు నాకూర్మి, నాపెన్నిధానంబునౌతండ్రి, నాతండ్రి, నే నెట్టివాఁడంచు లోనెంచి, శోకించి శోకించి, నన్నెంతదూషించి, కన్మూసెనో.- భర్తృహంత్రీ! సుతద్రోహి! నీమోముఁ గన్గొన్న చోఁ బాపమౌఁ; బొమ్ము-

బొమ్మావలంచున్ రిపుఘ్నున్ గనుంగొన్న, నాతండు లోనున్న దుఃఖంబు గన్గొల్కులన్ దూరి నిండారి నీరై వెసన్ జెక్కులన్ జాఱి ధాత్రీస్థలిన్ జేరి పిన్నేరులై పాఱఁగా, మోము వాడ్వారఁగా; మేను కంపింపఁగా, మించి శోకించె; వారిర్వు రామీఁద నేవిక్కునున్ గానకే పోయి కౌసల్య యిల్ సేర,-

భరతశత్రుఘ్నులు కౌసల్యాదేవిని దర్శించుట.

ఆహారనిద్రాదులన్ మాని, భూశయ్య మేన్ వాల్చియున్ దుర్భరంబైన వైధవ్యదుఃఖంబునన్, వెక్కసంబైన పుత్రార్తిచేతన్ గడున్ బొక్కుచున్ జిక్కియున్నట్టి కౌసల్యపాదాబ్జముల్ వట్టి రోదించి రాధీరులత్యంతమున్; లేచి యాసాధ్వి కైకేయిపుత్రున్ విలోకించి యిట్లాడు-'నీతల్లి నీకై ధరారాజ్యమున్ గొన్నదో రాజ! నాపుత్రుఁ డాకాననలోఁ జేరె, నాథుండు లోకాంతరం బేగె, నిర్భాగ్య నే నేడ్వనాఁగాక! నీకేటికిన్ శోకమొందన్? మహారాజవై సౌఖ్యముల్ పొందుమా!' యన్న, నావాక్యముల్, క్రాఁగునిన్నున్ జెవిన్ బోసినట్లైన, లోనొచ్చి- బల్ వెచ్చనూర్పుఁ బోఁబుచ్చి, వేవిచ్చి కన్నీరు మున్నీరుగాఁ బాఱ నాతండు లోనుల్కుచున్ బల్కెడిన్;-

'తల్లిరో! తండ్రి నన్నెంతయున్ దప్పు భావించినన్, రాముఁడే ద్రోహి వీఁడంచు నన్నెంచినన్, లక్ష్మణుండట్లె సిద్ధాంతమున్ జేసినన్, సీత 'యహా'నంచు నన్ మించిదూషించినన్, మాతరో! నీవు నాపట్ల దోసంబు నేసుంత లో నెంచఁబోవంచు నేనెంచియుంటిన్ మదిన్ దల్లి! సాధ్వీమతల్లీ! నిజంబాడెదన్, రామద్రోహంబు నే స్వప్నమందైన భావించియేయుంటినేన్, గైకకావించు నీపాపకార్యంబు నే స్వాంతమం దెంచియేయుంటినేన్, బ్రాహ్మణున్ జంపుపాపంబునన్ బోయెదన్, గాంచ గుర్వంగనాసంగతిన్ గల్గుదోసంబు నాకబ్బెడిన్, మద్యపానంబునన్ వచ్చు దుష్ప్రాప్తి నాకయ్యెడున్, భండనంబందునన్ బాఱు నాపందకౌదుర్గతుల్ నాకునౌ; నే నసత్యంబు భాషించినన్ గుష్ఠరోగంబు ప్రాప్తించుతన్

నాకు, నానోటఁ బుర్వుల్ పడన్, దేహమింతింతగాఁ గుల్లి, దిక్కెన్ను
వారుండకే, యన్న మన్నంబటంచార్చినేఁ జచ్చుతన్,-దీనికిన్ దేవతల్
దిక్తటాధీశ్వరుల్ పంచభూతావళుల్ సాక్షులైయుందు, రోయమ్మ!
దుష్కృతికిన్ జంకి బొంకుల్ వచింపన్, గనన్ దల్లిరో! సాధ్వియానీ,
వదే పాపమున్ లేనిన న్నిట్లు నోనాడుటల్ గాంచి దిగ్భ్రాంతిమైఁ బల్కి-
తిన్,- శాపమేనిత్తువే నిమ్ము భీతిల్లఁ, బ్రీతిన్ భరింతున్ గదే'- యంచు
నీతీరుగాఁ బల్కు నాధీరవాక్సారమున్ వీనులన్ గొన్నయాతల్లి, తా
నక్కుమారున్ దగన్ గౌఁగిటన్ గ్రుచ్చి కన్నీళులన్ దుడ్చుచున్ మక్కు-
వన్ బల్కెన్;-

'ఓపుత్రకా! శోకభారంబునన్ దోఁచ కేమంటివో? దానికై కుంద
నిక్లేల? నారాముఁ డీవేయటం జెంచి హర్షింతు నోపుత్ర! మీనల్వురన్
భేద మేనెప్పుడే నెంతునే! బాలకా! అగ్నిసంస్కారకార్యంబు మీ
తండ్రికిన్ సల్పుమా!' యన్న, నాఁగాక, యంచప్పుడాదేవి వీడ్కొంచు
తోడన్ సుమిత్రాంబయుల్సేరి, యూరార్చి యాసాధ్వీదుఃఖంబు, నాపైన
వారేగి యాసింహపీఠంబునందున్న యాతండ్రి దేహంబు నీక్షించి, యా
శీర్షపై వ్రాలి, దుఃఖించి రారాజపుత్రుల్ విశేషంబుగా; నంతలో నవ్వ
సిష్ఠుండు విచ్చేసి-'మీరగ్నిసంస్కారముల్ దండ్రికిన్ సల్పనో లెండు,
దుఃఖంబుమానుం' డనన్, లేచి యాగాత్రమున్ దెచ్చి విధ్యుక్తధర్మం
బుగా నగ్నిసంస్కారమున్ జేసి, పిండప్రదానాదులన్ దీర్చి రవ్వార;-

శ్రీరామచంద్రునిఁ బురికిఁదోడ్తెచ్చెద నని భరతుఁడు ప్రతిజ్ఞ సేయుట.

లంతన్ వసిష్ఠుండు కైకేయిపుత్రున్ విలోకించి, యీయుర్వరన్
బట్టమున్ గట్టికొమ్మంచుఁ బల్కంగ నాదిట్టఁ డాపల్కులన్ సైఁప కిట్లాడు-
"నోమానివర్యా! మదీయంబునౌ వంశధర్మంబుపాటింప కిట్లాడుదే? కైక
గర్భంబునన్ బుట్టుదోసంబెగా కొండుదోసంబు నాయందునన్ గల్గునే?
అంతక్రూరుండనే? ఓగురూత్తంస! నీశిష్యుఁడై యుండి నే నట్టిద్రోహంబు
గావింతునే? రాముఁ దోడ్తెచ్చి సామ్రాజ్యపట్టాభిషేకంబు నా చేతులా

రంగఁ గావింతుఁగా, కట్టులాతండు రాకున్న నే మౌనివేసంబుతో నిష్ఠమై నుండి, యాధీరుపాదాబ్జముల్ గొల్చుచున్ ధన్యతన్ గాంచెదన్, సత్య మీపల్కు ముమ్మాటికి, కే నట్టువర్తింపలేకున్న చో, సత్యసంశీలుఁడౌ నా దశస్యందనోర్వీశుపుత్త్రుండఁ గా నింక, నాపావనంబైన యిక్ష్వాకువంశంబునన్ బుట్టు లేదింక; శ్రీరాముఁదమ్ముండఁ గానింక; నీనా ప్రతిజ్ఞన్ ముదంబార మీరెల్లరున్ వింటిరే!' యంచుఁ దా నాసభాస్తారులన్ గన్న, వారెల్ల రత్యంతహర్షంబునన్- 'మేలు రామానుజా! మేలుమేల్ మెచ్చు వచ్చున్ బళీ, రాఘవా!' యంచు వారల్ శిరఃకంపముల్ సేసి- 'దీర్ఘాయువేపారుతన్, నీకు సౌభాగ్యమొప్పారు' నంచాడు మోదించి దీవించి కీర్తించి రాధీరు;-

## భరతుఁడు బంధుమిత్త్రాళితో శ్రీరాముని దోడ్తెచ్చుటకు చిత్త్రకూటాద్రి కేగుట.

నాతండు సామంత్రిసామంతపౌరోహితవ్రాతమున్ దల్లులున్ దమ్ముఁడున్ దోడరా, సర్వసైన్యంబులున్ వెంటరా, నశ్వదంతావళాదుల్ వెసన్ గూడిరా, స్యందనాందోళికశ్రేణి వెన్నంటిరా టెక్కెముల్ పెక్కులై నిక్కిరా భేరిఢంకామృదంగాదివాద్యంబు లత్యంతమున్ మ్రోఁగిరా, వచ్చి గంగాతటిన్ జేరి, యందాగుహున్ గూడి, వృత్తాంతమున్ దెల్పి, సత్కారమున్ బొంది, యవ్వాని వీడ్కొంచు ముందేగి, యాశ్రీభరద్వాజపుణ్యాశ్రమం బొప్ప వీక్షించి, యందేగి మౌనీంద్రుచే సత్కృతుండై యటారాత్రి యందుండి, యాపైఁ బ్రయాణంబు సాఁగించె నాచిత్రకూటాద్రి కామీఁద;—

తా నంత విచ్చేసి యాకైకపుత్త్రుండు నందొక్కెడన్ దత్ప్రజన్ వీడి, శత్త్రుఘ్నుతోఁ గూడి పైఁదాల్చుభూషావళుల్ దివ్యవస్త్రంబులన్ బుచ్చి, యిచ్చన్ జటావల్కముల్ దాల్చి, యచ్చంబుగా మౌనివేషంబుతోఁ గాల్నడన్ వచ్చి, సీతాసమేతుండునౌ రాము దౌదవ్వులన్ గాంచి- 'ఓసోదరా! కాంచితే? రాజరాజన్యమూర్ధన్య పాదాబ్జుఁడౌ

దేవుఁ డాహా! వనిఁ జేరె, దేవేంద్రునిఁ మించి భోగంబులఁ బొందు నీభోగి యిట్లకట! జోగియై నిల్చెఁగా? చీనిచీనాంబరశ్రేణి మైఁగట్టు రాజేంద్రుఁ డీనారపట్టంబులఁ గట్టెఁగా? హంసతల్పంబునఁ బండు గన్నుండు, బల్కర్కశంబైన యీదర్భశయ్యాస్థలిఁ బండె, సారాన్న పానంబులఁ దృప్తుఁడౌ సార్వభౌముం, డయో! కాయలఁ గూరలఁ గుడ్పుగా మెక్కె; నీధాత్రిలో శత్రువేఁ గోరఁ గారానిదౌ దుస్థితిఁ గొన్న మాయన్న నీక్షించు నీపాడు నేత్రద్వయంబిట్టులే యింకిపోదే? అయో! కైకగర్భంబునఁ బుట్టుదోసంబునఁ జేసి నే నిప్పుడీదేవు, నీదు స్థితిఁ గాంచఁగా నయ్యె, నౌరౌర! యి ట్లీమహాత్మ్యుఁ గడుఁ గారియల్ పెట్టునా బ్రహ్మనేఁ బట్టి వేధించి బాధించినఁ, బోవదే కోప మో తమ్ముఁడా!' యంచు దుఃఖించు చేతెంచి శ్రీరాముపాదంబులఁ వ్రాలి, భూజాతయౌ సీతకుఁ మ్రొక్కి, సౌమిత్రినిఁ గౌఁగిటఁ గ్రుచ్చి, బల్ భక్తిఁ గేల్మోడ్చి యాకైకపుత్రుండు శత్రుఘ్నుతో రాము మోలిఁ వగఁ నిల్చి శీర్షంబునుఁ వంచియుండంగ; -

## శ్రీరామచంద్రుఁడు భరతశత్రుఘ్నాదుల నాదరించుట

శ్రీరాముఁ డవ్వారలఁ గ్రుచ్చి తా నక్కునఁ జేర్చి, మోదాశ్రువుల్ నించి, బల్ మక్కువఁ బల్కు - 'నోసోదరా! సౌఖ్యమే! తండ్రికారోగ్యమే? తల్లులేపారువారే? ప్రజల్ బంధులిష్టుల్ బుధుల్ మంత్రిసామంతులుఁ, మోదితస్వాంతులేగా? గురూత్తంసునాజ్ఞానుసారంబుగా నీవు వర్తిల్లుదే? ధాత్రిపాలింతె నిష్కంటకంబై కడుఁ మించఁగా? శాంతినిఁ గందె? శీలంబుతో నుందె? యేమారకే శిష్టులఁ బ్రోతువే? దుష్టసంహారముఁ జేతువే? క్షామబాధల్ నివారింతువే? భూప్రజఁ బిడ్డలట్లెంచి పోషింతువే? తెల్పవే!' యంచు ప్రశ్నించునన్నఁ విలోకించి, మారాడకే కన్నులం దశ్రువుల్ గార్చు నాకైకపుత్రాస్యముఁ గాంచి, శత్రుఘ్నుఁ డత్యంతగాద్గద్యమేపారుకంఠంబునఁ రాముతో నాడు;-

### దశరథునకు శ్రీరామలక్ష్మణులు తిలోదకాదు లొసంగుట

ఓరామచంద్రా! యయోధ్యాపురిన్ బాసి విచ్చేయఁగా మీరు- ‘శ్రీరామ! శ్రీజానకీరామ!’ యంచున్ బ్రలాపించు, చాహారనిద్రాదులన్ బాసి, తా నీవియోగార్తిమైఁ గుందుచున్ రోజు లేదేఁగఁగాఁ నాత్మ, దేహంబు వీడెన్ జుమీ, తండ్రి మమ్మెల్లరన్ వీడి’ యంచేడ్చి? నప్పల్కు, విన్నంతనే నెత్తిపై మిన్నుపడ్డట్లుగా, రాముడున్ లక్ష్మణుండున్ ధరన్ మూర్ఛమైవ్రాలి, రా సీత ‘హా!’ యంచు వావిచ్చిదుఃఖించె, నామీఁదటన్ రాఘవుల్ లేచి - ‘హాతండ్రి! హాపోయితే! సత్యనిష్ఠుండవై ప్రాణముల్ వాసితే! మమ్ముచేవీడితే?’ యంచు శోకించి శోకించి, యామైన నింతూఱటన్ బొంది, వారల్ వసిష్ఠాజ్ఞచేఁ దండ్రికిన్ బారలౌక్యక్రియల్ దీర్పఁగన్ సీతతోడన్ నదీస్నానమున్ దీర్చి, రాముండు సోదర్యులన్ గూడి విధ్యుక్తపిండప్రదానంబు గావించి, వా రొండొరుల్ గాఁగిటన్ గ్రుచ్చి దుఃఖించి రత్యంతమున్, జిత్రకూటాద్రి మార్గోగ్రగఁ;-

### శ్రీరాముని నయోధ్యకురమ్మని భరతుఁడు ప్రార్థించుట

నంతన్ వసిష్ఠుండు విచ్చేసి వారించె దుఃఖంబు, నాపిమ్మటన్ గైకపుత్రుండు శ్రీరామునిన్ డాసి, బల్ భక్తిఁ గేల్మోడ్చి, దీనాననుండై యిటుల్ వల్కె - శ్రీరామ! శ్రీసూర్యవంశాబ్ధిసంపూర్ణసోమా! ధరాభృల్లలామా! దయన్ జూడుమా! నీవయోధ్యాపురీరాజ్యసింహాసనం బేలుమా! మమ్ము నీబిడ్డలన్ గావుమా! ప్రార్థనన్ దీర్పుమా! వంశధర్మంబుఁ బాటింపుమా దాసునిన్ జూడుమా!’ యంచు బల్ దీనుఁడై దుఃఖభారంబునన్ గ్రుంగుచున్ వేఁడ, శ్రీరాముఁ డద్దానికిన్ నవ్వుచున్ గైకసూతిన్ గనుంగొంచుఁ బల్కాడు;-

### శ్రీరాముఁడు భరతునోదార్చుట, యన్నదమ్ములసంభాషణము

నాసోదరా! వీడు మీభ్రాంతి, నే నాయయోధ్యాపురిన్ జేరినన్ దండ్రివాగ్భ్రష్టుఁడౌఁగాదొకో? నాదుపుత్రత్వ మింకేటికిన్ గాల్పనే? సూర్యవంశంబు దుష్కీర్తిమైఁ గ్రుంగదే? నీవెఱుంగంగ రానట్టిధర్మంబు

లున్నే? నిన్నుఁ బోలువాఁ డిట్టులాడంగ న్యాయంబె? యోజింపుమా!' యంచు వాక్రువ్వ;-

దేవా! సమస్తంబుగుర్తించి నీ విట్టులాడంగ నే నేమిఁకన్ జెప్పఁగాఁ జాలువాఁడన్? విచారింపఁ గైకేయికై కాదె, మాతండ్రి నిన్నుం గవన్ దోలె? నాకై కయే, నేఁడిదే నిన్నుఁ బ్రార్థింపఁగానచ్చె నీ వేధరారాజ్య మేలంగ; నీకిందునన్ దోస మేముండె? కార్యంబునున్ గారణంబున్ విమర్శించి కర్తవ్యముల్ దీర్పఁగా ధర్మమౌఁగాని, యీరీతిగా మాట మాటంచు నిన్ బోలువారే యిటుల్ పట్టుపట్టంగ మాబోటులే తెల్ప శక్తుల్? మహాత్మా! విచారింపుమా! నీవురాకున్న ప్రాయోపవేశంబు గావింతు నే నంచు, సాధించుచున్ మించి ప్రార్థించె నాకైకపుత్రుండు, నిశ్శబ్దమై వీరిసంభాషణల్ వించు మోదాత్ములైయుండి రెల్లన్ సభాస్తారులౌ నాయయోధ్యాప్రజల్, కానలందుండి యేతెంచి వీక్షించుచున్నానుల్, నిషాదుల్, ఋషుల్ సర్వులున్; మీఁద మింటన్ సుపర్వుల్ గడున్ బచ్చులన్దీరి వీక్షింపఁగా, రాముఁ డిట్లాడు ప్రేమాస్పదుండైన యానో దరున్ గాంచుచున్;-

దమ్ముఁడా! యుక్తిమైఁ బల్కెదీ వంతియేకాని యోజింపుమా, సుంత! నాతండ్రి నన్నున్ బదిన్నాలుగేఁడుల్ వనీవాసమున్ జేయ నేమించె, నే నియ్యకొంటిన్; గనన్ దండ్రియాజ్ఞానుసారంబుగాఁ గానలో నుంటినేకాని, కైకేయి యాజ్ఞా ప్రకారంబుగా వచ్చియున్నాఁ డనే? సోదరా! చూడ నిందుండఁగాఁగాని, యందేగఁగాఁగాని, నాకాజ్ఞ సేయంగ నాతండ్రి తా నొక్కఁడే యర్హుఁడైయుండె, నీనాఁడు లేకుండె నాతండు, తా నుండి యీమాటయే చెప్పియున్నన్, విచారంబదెట్లుం డునోకాని, యిప్డీగతిన్ గానికార్యంబుకై యేల విశ్వప్రయత్నంబు గావింప, నాకూర్మికుత్తా! మదిన్ శోకమున్ మాను, నీతండ్రినిన్ సత్య వాగ్భ్రష్టుఁగావింప నీకొప్పునే? సత్యధర్మంబులేపార రాజ్యంబుఁ బాలిం

పుమా! నేఁ బదిన్ నాలుగేఁడుల్ చనన్ వచ్చి సామ్రాజ్యమున్ గొందు, సైరింపుమా' యంచు నోదార్ప;-

నాకైకపుత్త్రుండు నొక్కింతచింతించి - 'ఓరామచంద్రా! ముదం బొప్ప దీ వెంతగాఁ జెప్పినన్; రాముచే రాజ్యమేలింతుఁ, గాకున్నచో నేను సన్న్యాసమున్ బూని, యాధీరుపాదారవిందంబులన్ గొల్చుచున్ గాలమున్ బుత్తునంచున్ బ్రమాణంబుఁ గావించి విచ్చేసితిన్, నాప్రమాణంబు నేఁ దప్ప నో రాఘవా! రాజ్యమేలంగ నీవందు రాకున్నఁ బోనిమ్ము, నన్నిందె యుండంగ నాజ్ఞావచస్సిమ్ము, యారాజ్యమెల్లన్ రిపుఘ్నుండు పాలింపనీ, దేవ! నావిన్నపం బింతమన్నింపుమా!' యన్న, యాపిన్నతమ్మున్ దగన్ గౌఁగిటన్ జేర్చి శ్రీరాముఁ డిట్లాడు;- నోసన్మతీ! యింతగాఁ బట్టు సాధింతువే సోదరా! చెల్లదీకార్య మొక్కింత యోజింపుమా! చూడ నాతండ్రి నాకున్ బదిన్ నాలుగేఁడుల్ వనంబందు నెట్లుండఁగాఁ జెప్పెనో యట్లె నీతండ్రి నీకున్ బదిన్ నాలుగేఁడుల్ ధరాభారమున్ బూనఁగాఁ జెప్పె; మీఱంగరా డిర్వురున్ దండ్రియాజ్ఞన్ - రిపుఘ్నుండుగానీ, మఱొక్కండుగానీ, నినున్ దప్ప రాజ్యంబు నేలంగ రాదౌటఁ, జింతింపుమా!' యన్న, దైన్యంబు దీపింప నాయన్నతో నాడు, నీరీతి;-

శ్రీరామపాదుకల భరతుఁ డనుగ్రహింపఁబడుట

నిక్ష్వాకువంశోద్భవుండన్, మహాసత్యశీలుండునై నట్టి యాతండ్రి పుత్త్రుండ, నీతమ్ముఁడన్ రాఘవా! యిట్టిదౌ నాప్రమాణంబు వ్యర్థంబు నౌనే, దివిన్ భానుఁడున్ ద్రోవ నేన్ దప్పినన్ దప్పు? నో దేవ! యిట్లేల నన్నున్ బరీక్షింప? నే దీనుఁడన్ దాసుఁడన్; జూడుమా! వీడ నీపాదపద్మంబు' లంచున్ ధరన్ జాగిలన్ వ్రాలి శ్రీరాముపాదంబులన్ బట్టె, నాతం 'డిదేమిట్టు లోసోదరా! చాలులెమ్మంచు వేగన్ బదంబుల్ విదుల్పన్ బదాబ్జంబులందున్న శ్రీపాదుకల్ రెండు, నాధీరుహస్తంబులన్ జిక్కె నంతన్ వసిష్ఠుండు:—'మేల్ మేలు కైకేయిపుత్త్రా! త్రిలోకైకపూజ్యంబు లీపాదుకల్ చిక్కె ధన్యుండవై తీవు, తత్పాదుకల్

వీడఁగాఁబోకుమా! నీప్రతిజ్ఞఁ దగఁ దీర్పయోగ్యంబు లవ్వేసుమా! మౌనివేషంబుతో రాము శ్రీపాదుకల్ గొల్చుచున్ నీప్రమాణంబు పూరింపుమా! సత్యసంకల్పుఁడై తీవు లెమ్మా! యయోధ్యాపురం బేలఁ గాఁబొమ్ము సాగింపుమా! నీప్రయాణం' బటం చిట్లు బోధింప నాతండు మౌనీంద్రునిన్ గాంచి యానందబాష్పంబు లేపారఁగాఁ బాదుకల్ పట్టి, మూర్ధంబునన్ బెట్టి భాషించు సమ్మోద మేపార;—

ధన్యుండనైతిన్ మునీంద్రా! యమోఘుంబునీపల్కు, లీపాదుకల్ మోక్షసామ్రాజ్యపట్టాభిషిక్తంబులున్, దివ్యముల్ శ్రీకరంబులో, మహా దోషనాశావహంబుల్, విచారింప మత్పూర్వజన్మార్జితాత్యంతపుణ్యప్రభావంబునన్ జిక్కె నాకివ్వి, దక్కెన్ గదే! వీనిఁ గొంపోయి, సింహాసనంబందునన్ నిల్పి శ్రీరామపట్టాభిషేకంబుగావించెదన్; నేనికన్ మౌనినై కందమూలంబులన్ విందుగాఁగొంచు భూశయ్యపైఁ బండి నే నాపదిన్నాలుగేఁడుల్, మహానిష్ఠతన్ రాముశ్రీపాదుకల్ గొల్చు చీమేదినీభారమున్ బూనెదన్, రామ! శ్రీరామ! నా కిట్టులీవాసతీయన్ గదే!' యంచుఁ బ్రార్థించె; నంతన్ సుపర్వుల్ బళీ! యంచుఁ గొండాడి రాకైక సూనున్ - వసిష్ఠుండు;—శ్రీరామ! యీప్రార్థనన్ దీర్పుమా! కూర్మి తమ్ముగ్ గదున్ ధన్యునిన్ జేయుమా!' యన్న శ్రీరాముఁ డత్యంతహర్షంబునన్ దమ్మునిన్ గాంచి;—

'ఓసోదరా! లెమ్ము, నీయిష్ట మీడేర్తు' నంచాడి, యంతన్ వసిష్ఠున్ విలోకించి- యోసద్గురూత్తంసమా! నేను మీయాజ్ఞ మూర్ధంబునన్ దాల్తు, నంచన్న- నాకైకపుత్త్రుండు నాయన్నతోఁ బల్కె;- దేవా! పదిన్నాలుగేండ్లెట్టులో నందిగ్రామంబునన్ గాలమున్ బుత్తు, నాపై క్షణం బీవు రాకున్నచో నగ్నిగుండంబునన్ జొత్తు, సత్యంబు నాపల్కటంచాడె, నంతన్ సుపర్వుల్ మదిన్ మెచ్చుచున్ బుష్పవర్షంబుగావించి, రామీఁదటన్ గైకపుత్త్రుండు శ్రీరాము వీడ్కొంచు నాపాదుకల్ దెచ్చి 'శత్రుంజయా'భిఖ్యమత్తేభకుంభస్థలిన్ నిల్పి, తానున్ రిపుఘ్నుండు నవ్వానికిన్ జామరంబుల్ దగన్ వీచుచున్, వెంట నాయెల్లరే తేరఁగా,

రాజచిహ్నంబులేపార, వాద్యార్భటుల్ దిక్కులన్ బిక్కటిల్లంగ సాగించె నాపైఁ బ్రయాణంబు నాతండు;—

## శ్రీరామపాదుకాపట్టాభిషేకము

కొన్నాళ్ల కవ్వారలున్ నందిగ్రామంబునున్ జేరి, సింహాసనంబందునన్ గైకపుత్రుం, డధిష్ఠింపఁగాఁజేసి యాపాదుకాద్వంద్వమున్ మంచిమూర్తంబునన్, దా వసిష్ఠాజ్ఞ, శాస్త్రప్రకారంబుగా సల్పె, శ్రీరామ శ్రీపాదుకాపట్టభద్రాభిషేకంబు సంరంభమేపారఁగా; నంత నాధీయుఁ డా రాజ్యభారంబు నేతద్భుజాపీఠినొప్పారఁగాఁదాల్చి పాలించె నల్దిక్కులన్ గీర్తి నిండారఁగా, లోకులౌరా! యనన్, బూఁ బ్రతిజ్ఞా ప్రకారంబుగా, రామునాజ్ఞానుసారంబుగా, ధర్మమార్గానుసారంబుగాఁ!—

చిత్రకూటాద్రిపై రాముఁ డాసీతతోడన్ సుమిత్రాతనూజాతుతోడన్ గడున్ బ్రీతిమైఁ గొన్నినాళ్లుండి, యాపైనిఁ దా నత్రిము న్యాశ్రమం బేగి, యామౌనిచే సత్కృతుండై సుఖం బుండె నాసీతతోఁ దమ్ముతో; సీత యాయత్రిమౌనీంద్రుపత్నిన్ గడున్ భక్తిసేవించె, నా దేవియున్ సీతకున్ గుంకుమంబున్, వినూత్నాంబరంబుల్ విభూషావళుల్ ప్రీతితో నిచ్చె;—

నవ్వారు కొన్నాళ్ల కాచోటువీడ్కొంచు ముందేగి రాదండకారణ్యమున్ జేరఁగా;—నంచు శ్రీనారదుం డిట్లు, వాల్మీకిమౌనీంద్రుతోఁ జెప్పఁగా, నాతఁ డాలించె మోదంబుతో;—

ఇద్ధి శ్రీరామపాదాంబుజధ్యాననిష్ఠాగరిష్ఠుండు, విప్రుండు, వాసిష్ఠగోత్రోద్భవుం, డార్య వెంకోబరాయాత్మసంజాతుఁడున్, సాధ్వి లక్ష్మాంబికాగర్భసచ్ఛుక్తిముక్తాఫలంబైన, అశ్వత్థరాయండు నిర్మించు నీదండకోపాఖ్య రామాయణంబందయోధ్యాఖ్యకాండంబు నర్పించెదన్ గొమ్మిదే ఆంజనేయా! మహావజ్రకాయా! సదారామకార్యప్రియా! ధర్మధారేయ! సద్భక్తగేయా! బుధశ్రేయ! దీనార్తసద్భక్తబంధూ! దయాసింధు! శ్రీవాయుపుత్రా! పవిత్రా! నమస్తే నమస్తే నమః.

అయోధ్యాకాండము, సమాప్తము.

---

శ్రీ

శ్రీ సీతారామలక్ష్మణ పరబ్రహ్మణే నమః

# శ్రీ దండకరామాయణము.

## అరణ్యకాండము

శ్రీనారదర్షిశ్వరుఁ గాంచి ముందటికథాభాగముఁ దెల్పుఁగాఁ, బ్రీతి వాల్మీకి ప్రార్థింపఁగా, నారదుం డెంతయున్ హర్షితస్వాంతుఁడై పల్కె నీరీతి;—

### శ్రీరాముఁడు విరాధుని సంహరించుట

ఆరాఘవుం డట్లు లాయత్రిమౌనీంద్రు వీడ్కొంచుఁ, దా దండకారణ్యభాగంబునన్ సీతతోఁ దమ్మునితోఁ గూడి పోఁబోవుచుం దాశ్రమం బొక్కటిన్ జేరె, నందున్న యాతాపసానీక మేతెంచి సత్కారముల్ సల్పఁగా, నాఁటి కచ్చోటనే యుండి, యెల్లుండి ముందేగి హర్యక్ష భల్లూక వేదండ తండాది దుస్సత్త్వ సంతాన సంచారమౌ దండకారణ్య మధ్యంబునం దేగుచోఁ, నొక్కెడన్ మౌని సంఘంబు నీక్షించి సన్మాని తుండై యటన్ రాత్రి నిద్రించి యావేకువన్ లేచి, ముందేగి యందొక్కెడన్ గాంచెఁ దాఁ బర్వతాకారునిన్, దీర్ఘదంష్ట్రున్ బ్రచండాగ్ని నేత్రున్ గభీరోగ్రనాదున్ విరాధున్; మహాదుష్టదైత్యాధమున్ గాంచి భీతిల్లె భూజాత, ఆరాక్షసుం డంతఁ జేసాచె నాసీతఁ బట్టంగ, బల్ భీతయై సీత శ్రీరాము వెన్వెంట దాఁగంగఁ దారాడె; నారాముఁడున్ లక్ష్మణుం డంత నస్త్రంబులన్ దైత్యుపై నేయ, నాబాణముల్ వాని వక్షస్స్థలిన్ గాడి వేధింప, రోసంబునన్ వాఁడు చేసాచి యాయిర్వురన్ బట్టి, మ్రింగంగ నుంకింప, శ్రీరాముఁడున్ లక్ష్మణుండున్, దగన్ ఖడ్గముల్ పూని, యానీచు హస్తంబులన్ ద్రుంచి, శస్త్రంబులన్ నొవ్వఁగాఁ జేయఁ;—

ప్రాణావసానంబునన్ దైత్యుఁ డిట్లాడె- 'నో ధీరులారా! ననున్ దుంబురుం డందురు, గంధర్వుఁడన్, రంభతోఁ గూడి నే నుండి నాస్వామి యక్షేశునిన్ గొల్వఁబోకున్న, నాతండు శాపంబు నాకీయఁగా, నిట్టి జన్మంబు వచ్చెన్ జూడీ! శాప మేరీతి నిర్మూలనం బంచు నే నాతనిన్ వేడఁగా, నాతఁడున్ "మత్సమానుండు నిన్ గొట్టు నేనాఁటి, కానాఁటికిన్ దీఱు శాపంబు పో"మ్మంచు వాక్రుచ్చె, నే నిచ్చటన్ బెద్దకాలంబుగా నుండి యీత్రోవ నేతెంచువా రెల్లరన్ బట్టి భక్షించుచున్ మానులన్ గారియల్ వెట్టి వేధించుచున్నాఁడ, నేఁ డెన్న నాశాప మీకై వడిన్ దీఱె, మీ రెవ్వరో పుణ్యులారా! దయన్ జెప్పరే!'- యన్న, శ్రీరాముఁ డిట్లాడు:— నే రాముఁడన్, సోదరుం డీతఁ-, డీసాధ్వి నాభార్య, యిక్ష్వాకువంశోద్భవుల్ మేము, పిత్రాజ్ఞ పాలింపఁగా నిందు సంచారమున్ జేయుచున్నార, మో ధీరవర్యా! కనన్ మాకు నెచ్చోట సంవాసయోగ్యంబగున్ దెల్పవే!' యన్న నాతండు మీ రింకనున్ యోజనార్థంబు ముందేగినన్ శరభంగుండనా మౌని దివ్యాశ్రమంబుండు, నచ్చోటికిన్ బోవ నాతండు సత్కారమున్ సల్పు నో పూరుషశ్రేష్ఠ! గంధర్వలోకంబు నేఁ జేరఁగాఁ బోయెదన్, నాదు దేహంబు పాతించు మీ ధాత్రి, యీ ప్రార్థనన్ దీర్పవే!' యంచు వేడంగ, నా లక్ష్మణుం డన్న యాజ్ఞానుసారంబుగా దైత్యుదేహంబు ధాత్రిస్థలిన్ బాతి, ముందేగి దివ్యాశ్రమం బొండు దర్శించి యందున్ బ్రవేశించి రవ్వార;—

లందున్న మౌనీంద్రులన్ గాంచి, సద్భక్తి మై మ్రొక్కి సత్కారమున్ బొంది, యవ్వారు ప్రార్థింప నక్కాననలోనుండు దైత్యాళి సంహారమున్ జేతునంచున్ బ్రతిజ్ఞన్ దగన్ సల్పి, శ్రీరాముఁ డవ్వారి వీడ్కొంచు ముందేగి, యందొక్క చోటన్ సుతీక్ష్ణాశ్రమంబున్ బ్రవేశించి దా సత్కృతుండై యటన్ గొన్నినాళ్లుండె సౌమిత్రితో సీతతో మోద మొప్పార;—

## "అగస్త్యాశ్రమమునకు రాఘవులు వచ్చుట"

ఇట్లా రఘూత్తంసు లొక్కొక్క మున్యాశ్రమంబందు మాసంబు మాసద్వయం బల్లిమాసత్రయం, బర్ధసంవత్సరం, బొక్కొక వత్సరం బొప్పంగాఁ గాపురంబుండి రత్యంతమోదంబునన్; మౌనులన్ గొల్చుచున్, సత్కథల్ వించు, ధర్మంబు లాలించుచున్, దుష్టదైత్యాళి నాశంబుగావించుచున్, సీతతో శైలశృంగంబులన్ ద్రొక్కుచున్, గందరంబుల్ ప్రవేశించుచున్, శీతవాతాన్వితంబౌ లతాకుంజపుంజంబునన్ బొల్చిరంజిల్లు, నాయానదీస్నానముల్ సేయుచున్, బూవులన్ గోయుచున్, గ్రీడలన్ సల్పుచు నాకాశమున్ దాఁకువృక్షంబులన్ గాంచుచున్ భూపాదల్ మెచ్చుచున్, వ్యాఘ్రసింహాదులన్ దోలుచున్, మేలి పక్వంబులౌ పండ్లు సేవించు, చీరీతి నీరైదులౌ వత్సరంబుల్ సుఖంబుండి, యాపిమ్మటన్ శ్రీయగస్త్యర్షి దర్శింపఁగాఁ గోరి, వార్మువ్వురల్లేగి, యమ్మౌనినిన్ గాంచి సాష్టాంగమున్ జేయ;—

వాతాపసేంద్రుండు ప్రేమంబునిండారఁగా దీవనల్ సల్పి హర్షంబునన్ రామునిన్ గౌఁగిటన్ గ్రుచ్చి, యానందనిర్మగ్నసోత్కంఠుఁడై సత్కరింపంగ శ్రీరాముఁ డామౌనితో నాడు?- 'మౌనీంద్ర! నీదర్శనంబబ్బుటన్ ధన్యుఁడైతిన్ జుమీ! నీమహత్త్వంబు వర్ణింపఁగా రాని దౌఁగాదె? వాతాపి నాయిల్వలున్ భక్ష్యముల్ గాఁగ భక్షింపవే! మేరయే లేని సంద్రంబునీ రంతయున్ గ్రుక్కగాఁ గ్రోలవే? భానుతేరాఁగునట్లెంచ నత్యున్నతంబై దివిన్ దాఁకఁగాఁబోవఁగానున్న, వింధ్యాద్రి నీయంఘ్రిచే నొత్తి పాతాళమున్ జేరఁగాఁ ద్రొక్కవే?' యంచు వర్ణింపఁగా, నాయగస్త్యుండు మందస్మితంబొప్ప నిట్లాడు:- 'శ్రీరామ! నిన్ గానకిట్లందువే గాని సామాన్యుఁడే నీవు? చెప్పంగ రాదాటచే నుచ్చరింపన్ జుమీ నీకథన్! పుణ్యభాగ్యంబునన్ నిన్నుఁగన్గొంటి, మాకెల్ల నీవేకదా సొమ్ము? కైకొమ్ము నే నిత్తునీదివ్యఖడ్గం, బిధేవైష్ణవాస్త్రంబు, నక్షీణ తూణీరముల్ కొమ్మటంచిచ్చె; శ్రీరాముఁ డవ్వానిఁ గైకొని, ప్రార్థించె నావాస

యోగ్యంబు నొకటాస్పదం జూపింపఁగా; మహామునియుఁ 'దక్షిణంబేగు,
మందొక్కచోఁ బంచవటీ స్థానంబుం డెంకణీ గౌతమీతీరమం, దయ్యె
దక్ మీర లుండంగ యోగ్యం' బటంచాడ, నమ్మౌనిపీడ్కొంచు
నచ్చోటికిఁ బోయి, యచ్చో జటాయ్వాహ్వయుం బక్షినాథుం విలో
కించి, యాధీరుతో మైత్రిగావించి, యాపంచవటీ స్థానంబున్న ప్రాంతం
బునం, దొక్కచోఁ బర్ణశాలం వినిర్మించి, వా రందునం గాపురంబుండి,
కాలంబుఁబోఁ(బుచ్చ;-

"లక్ష్మణస్వామి, తపంబొనరించుచున్న - జంబుకుమారుని సంహరించుట"

నాకొనయం దొక్కనాఁ డాసుమిత్రాసుతుండేగి, యందందు
పక్వంబులౌ పండులం గోయుచుండంగ నా చెంత దట్టంబునై బెట్టిదంబౌ,
పొదం దూఁటి యొత్తెంచుచున్నట్టి దౌ చంద్రహాసంబు నీక్షించి, యుద్దాని
హస్తంబునం బట్టి చెట్టొక్కటిం గొట్టసుంకింప, నందున్న మౌనీంద్రు
లద్దాని వారించి, యాలక్ష్మణుం జూచి;- 'యో లక్ష్మణా! నీవిటెంపుం బరీ
క్షింపఁగాఁగోరి, పాంథాళికి ట్లాశ్రయంబిచ్చునీ చెట్టు గొట్టంగ న్యాయం
బౌకో! యీపొదం జూడుమా! ముంగ్గలొ నింపి బలదట్టమై చీఁకటిం
బెట్టి, నిం దెన్ని యోకాూరసత్వంబులుం జేరె, నిద్దాని నీవొక్క వేఁటు
నం గొట్టు మంచాడ, హర్షించుచుం లక్ష్మణుండంతఁ జేయెత్తి వేయంగ,
నా చంద్రహాసంబు వేగం బొదం దూఁటి యందుం దపంబున్న వానిం
వెసం ద్రుంచె! వీక్షించి సౌమిత్రి బల్ భీతుఁడై, మౌనిసంహారమున్
జేయుటం శోకతాపంబులం బొందు చేతెంచి, శ్రీరామపాదంబులం
వ్రాలి యాసర్వవృత్తాంతమున్ దెల్ప;—

ఆరాముఁ డత్యంతమున్ భీతుఁడై :- 'మౌనిసంహార మయ్యో!
మహాఘోరపాపంబునొందె దమ్ముఁడా!' యంచుఁ జింతించుచుండంగ,
నందున్న మౌనీంద్రు లేతెంచి దుఃఖంబువారించి, శ్రీరాముతోఁ బల్కిరీ
రీతిగా;— రామ! మీ రెంచినట్లాతఁ డే మౌనిగాఁ డెన్నఁగా, జంబు
పుత్త్రుండు నా రాక్షసుండౌసుమీ! తండ్రివైరంబుఁదీర్పంగ నాఖండలుం

గూర్చి ఘోరంబుగాఁగన్ దపంబుండె; నద్దానికిన్ మెచ్చి దేవేంద్రుఁ డాచంద్రహాసంబునున్ బంపెఁ. "దన్ గాంచి మేలౌ వరంబుల్ గడున్ వేడఁగాఁ గోరు నాకేటికిన్ బంపె దేవేశుఁ డీఖడ్గమంచల్లి యాచంద్రహాసంబుఁ దా ముట్టకున్నంత, నాఖడ్గమున్ గాంచి మీ లక్ష్మణుం డట్టి హస్తంబునన్ బట్టి, మాచేతసంప్రేరితుండై పొదన్ ద్రూయఁగా నేసె, నందున్న దుర్జాతుఁ డాజంబుపుత్త్రుండు ప్రాణంబులన్ బాసెఁ; బున్నెంబె నచ్చెన్ జుమీ!' యంచు నోదార్చి వాఁ రేగఁగా;—

“శూర్పనఖ పుత్త్రునిఁ జూడవచ్చి, శ్రీరామునిఁగాంచి మోహించుట”

నాపొదన్ జేరఁగా, 'చుప్పనా' తన్న పేరున్న రాకాసియొక్కర్తె యేతెంచి, యంతాత్మసంజాతు దేహంబునీక్షించి, దుఃఖార్తయై నేలపై వ్రాలి శోకించి శోకించి, యాపైని నావవ్వులందున్న మానీంద్రసంఘంబు నీక్షించి క్రోధంబుదీపింపఁగాఁ బల్కు:—

'నెవ్వాఁడు క్రొవ్వెక్కి మత్సూనునిన్ జంపెఁ, బేర్కొండురా లేక మిమ్మెల్లరన్ బట్టి భూమిన్ బడన్ గొట్టి నా పొట్టలోఁ బెట్టనా?' యంచు దట్టింపఁగా, మౌను లుల్లంబులున్ జల్లనన్ దల్లడంబందియుండంగ, నందొక్కఁ డౌ తాపసుం డాడు- 'నో కాంత! భూకాంతుఁ డొక్కండు లోకైకవీరుండు విచ్చేసె నిచ్చోటికిన్ మొన్న; నాధీరుఁడే నీకుమారున్ హతున్ జేసె, నే దారి తా నేగెనో? యిప్పు డెందున్నవాఁడో? విధం బేమియున్ గాన' మంచాడ, నాతన్వి తాఁ బోయి నందందు వీక్షించుచున్;—

రాముఁ డాసీతతోఁ బర్ణశాలాంతరంబందు సల్లాపముల్ సల్పుచుండంగ, నాచుప్పనా తప్పు డేతెంచి, యాశ్యామలాంగున్- విశాలాబ్జనేత్రున్- వినీలాళిసంకాశకేశున్- స్మితానందసంపూర్ణచంద్రాననున్- భవ్యమూర్తిన్, మహాదీర్ఘబాహున్, మనోజాత సంకాశరూపున్, నృపేంద్రున్, రఘూత్తంసు, శ్రీరామునిన్ గాంచి, చేతోభవాధీనతస్వాత్మయై, చేరి యాధీరుఁ గన్నారవీక్షించి, విన్నాణమేపారఁగా నిట్లు పల్కున్;— 'మనోజాతరూపా! వినన్ గోరికయ్యెన్, నినున్ గన్న

వారెవ్వరోకో? జనంబెట్లు నీకా బిల్చువారో? ఘనంబైన నీవంశమేదో? వనం బేటికిన్ జేరి యిట్లుంటివో? కనుంగొన్న నిన్నున్ మనంబచ్చెరువోందె, వినన్ దెల్పుమా!' యన్న, శ్రీరాముఁ డాద్యంతవృత్తాంతమున్ దెల్ప, హర్షించుచున్ జుప్పనాతిట్లువాక్రుచ్చె నాధీరుతోఁ;—

భూవరా! నీదువృత్తాంతమున్ వింటి నేఁ దెల్పెదన్ నాచరిత్రంబు;- ముల్లోకములుఁ ముట్టి, బల్ బాములన్ బెట్టి, యాదేవతానీకమున్ బట్టి, యేకంబుగా బందిలోఁ బెట్టి, విఖ్యాతుఁడై వెల్గు లంకాపురీనేత కేఁ జెల్లెలన్- జుప్పనాతందురు నన్నున్, నినున్ గాంచి మోహించితిన్, మారుకేళిన్ నినున్ దేల్పఁగా నెంచితిన్, లెమ్ము, లే లే' మ్మనన్, రాముఁ డల్లల్లనన్ నవ్వుచున్ బల్కె;- నో కామినీ! చెల్లదీ పల్కు, పో పొమ్ము; నీవన్న రాకాసి- వే నెన్నఁగా మానవుండన్ గదే? యేకపత్నీవ్రతుండన్ గదే? నీ విటుల్ వల్కరాదంచు సౌమ్యంబుగాఁ జెప్ప, నా చెట్టరాకాసి మాటాడు నీరీతి మొండొడ్డి;—

"లక్ష్మణస్వామి శూర్పనఖ ముక్కు- చెవులు కోయుట"

ఓరామ! నారూపమున్ గోరవో? పూరుషుండౌదువో- కావో? ఈనాదురూపంబు లావణ్యదీపంబు, కందర్పచాపంబు, దివ్యస్వరూపంబు, పూర్ణేందుతేజంబు, సమ్మోహనాస్త్రంబు. వీక్షింపు నీయక్షులన్ సార్థకం బౌనటుల్, రామ! యంచిట్లువర్ణింప, భూజాత తాఁ బక్కునన్ నవ్వె; నద్దాని కాధూర్త యల్కొంది 'శ్రీరామ! యీచెట్ట నన్ జూచినవ్వెన్ గదే? దీని నేఁ బట్టిభక్షింతు, నామీఁదటన్ నీవు నాతో డసౌఖ్యంబుగా నుండనౌ నంచు, నాసీతఁ బట్టంగ నుంకించె, శ్రీరాముఁ డారక్కసిన్ బట్టి; 'ఓలక్ష్మణా! యోర్చుకొన్నంత నీచెట్ట మామీఁదికే వచ్చెఁ, గ్రూరాత్ములన్ జెంతఁ జేర్పంగ రాదందురుగా! మాటలన్ బోవ దీబోటి, యట్లౌట నేదొక్క శాస్తిన్ దగన్ జేయవే!' యన్న, సౌమిత్రి కోపంబు దీపింపఁగా వచ్చి, యాకట్టెడిన్ వెండ్రుకల్ వట్టి ముందీడ్చి, ఖడ్గంబునన్ నాసికన్ వీనులన్ గోసి పోవీడె; నక్కాంత నల్దిక్కులన్ మాఱు

మ్రోగంగ రోదించుచుం బోయి బలదవ్వులం దొక్కకాంతారమం దొక్కచో, రక్కసుల్ పెక్కుర్ గొల్వఁగా, భద్రపీఠంబునన్, శివి మైనొప్పు దైత్యేశ్వరుండౌ ఖరాభిఖ్యునాస్థానముం జేరి, రోదించుచుం రాక్షసాధీశుమ్రోలన్ వెసన్ బర్వతంబట్లు కూలన్ బడెన్ భూమి యల్లాడ;—

{ శూర్పణఖ (తనమానభంగమును దెలిపి), ఖరదూషణాదులను, రామునితోఁబోరఁ బ్రేరేపించుట. }

ఆదైత్యుఁ డుగ్రాకృతిన్ సోదరీమానభంగంబు నీక్షించుచుం గంటిపెన్మంట లేపారఁగా, గీటుచుం బండు లాటోపమొప్పారఁగాఁ బల్కె, 'నోసోదరీ! నీకు నీమానభంగంబు గావించు దుష్టుండు భ్రష్టుం డదెవ్వాఁడు? తా మృత్యువుం గోఱలన్ బట్టికొంచీడ్చెఁ గయ్యాని, కానీచు డెవ్వాఁడు? ముక్కంటియామెక్కుడౌ కన్ను గాల్దన్నె, నాసన్న మృత్యుండు నిర్భాగ్యుఁ, డామందుఁ డెవ్వాఁడు? పేరేదొ, వంశంబు తోఁగూడ ధ్వంసంబుగావింతు, జాగేల? నే నైనఁ గాఁజాల;- వీరున్ ఖరుం గానఁడో? పఙ్క్తికంఠానుజున్ నన్ను లోకాంతకున్ జూడఁడో? ముద్దునాసోదరిన్ నిన్ను లెక్కింప కీఘక్కిగావించెఁ, జావెంచె'- నంచెంత యుం జీరుదైత్యేశ్వరున్ గాంచి, యాకాంత యిట్లాడె;—

ఓయగ్రజా! పంచవట్యాశ్రమప్రాంతమందుండె రాముండు నా మానవుం, డాతఁ డీరీతిఁగావించె; నేరావణుం జెప్పితిన్, నిన్నుఁబేరొక్కం టి, లక్షింపకాదుష్టుఁ డీరీతిగా నన్ను భంగించె,- నాభ్రష్టునిన్ జంపినం గాని కోపంబుచల్లార, దీమానభంగంబునుం దీఱదే! మీకు సత్కీర్తి చేకూర' దంచామె రోషంబు భాషింపఁగా, నాఖరుం డల్గుచుం దూష ణుం జీరి- 'యోవీర! పదినాల్గువేలుండుమూనైన్యముం గూర్పుమా! పోద, మాదుష్టునిన్ జెండ నంచాడ నాతండు నాయెల్లసైన్యంబులన్ గూడి విచ్చేసె, నంతన్ ఖరుండుం ద్రిశీర్షుండునుం దూషణుం డప్పు వఙ్జ్రాంగకంబుల్ దగన్ దాల్చి, శస్త్రాస్త్రముల్ పూని, యస్తోకతూణీ

రముల్ దాల్చి, బల్ సిస్తుగా వజ్రవైడూర్యవిభ్రాజితంబౌ రథారోహణం బొప్పంగాఁ జేయఁగా, భేరినిస్సాణఢంకామహాకాహళేత్యాది సంగ్రామ వాద్యాద్భుతారావముల్ సద్దిశల్ మ్రోఁగె, నంతన్ బదిన్నాల్గువేల్ సైన్యమేతెంచె, వాగ్భుజ్జనల్ గజ్జనల్ మిన్ను భేదించె, నీనేలయే యీన నల్లల్లెదన్ సైన్యమేపారఁగా, క్షోణికంపింపఁగా నచ్చి రాపంచవట్యాశ్రమప్రాంతమున్ డాయ నారక్కసుల్;—

దవ్వులన్ గాంచి రాముండు సౌమిత్రితో నాడు 'నోలక్ష్మణా! కంటివే వచ్చుసైన్యంబదే, దుష్టయా చుప్పనాతిట్లుగావించె, మాకాను యుద్ధంబుఘోరంబుగాఁ, గాన నీజానకిన్ గొంచు, నీ వాగుహన్ డాఁచి, ద్వారంబునన్ గాపుగానుండుమా! సీత భీతిల్లెడిన్ గాన నీ వేగుమా! దైత్యమాయల్ మహాఘోరముల్ గాన వేవేగ నీసీతఁగొంపొమ్మటం చాడి, యవ్వారిఁబోఁబంచి, తానొక్కఁడే నిల్చి, యాడట్టి దంతంబులన్ గట్టిగానొక్కి, శీర్షంబుపంకించి, హస్తంబునన్ దివ్యరత్నాంచితామేయ చాపంబు సారించి, తూణీరమెక్కించి, నారిన్ దగన్ గోపునన్ గూర్చి, మ్రోఁగించుచున్ శింజినిన్ దాయగుండెల్ గుభీలంచుడిందన్ బ్రసన్నోగ్ర మార్తాండుఁడై మండుచున్ నిల్వ;—

### ఖరదూషణాదులు శ్రీరామునితోఁ బోరిమడియుట.

దైత్యుల్ మహోగ్రస్వరూపుల్, పదిన్నాల్గువేల్ సైన్యముల్ రాఁగ నార్భాటముల్ సేయుచున్, ఘోరశస్త్రాస్త్రముల్ పూని వేదండ తండంబుపైనెక్కి, యుష్ట్రంబులున్ వాజులున్ వాహనాల్ గాఁగ విచ్చేయఁ, బాదాహతిన్ భూమియట్టిట్టెయూటాడఁగా, సింహనాదంబులన్ దిక్కులున్ బిక్కటిల్లంగ, బల్ రక్కసుల్ నిక్కుచున్ వచ్చి, యస్త్రంబులన్ వేయుచున్, ఖడ్గముల్ పట్టిసల్ తోమరాల్, ముద్గరంబుల్ మహాచక్రముల్, దండముల్ భిండివాలాదులన్ జిమ్ముచున్ గ్రమ్మఁగన్ గాంచి శ్రీరాఘవుండెంచి బాణంబులన్ మీటి బల్ ఘాటిమై; నొండు రెండున్, బదుల్ నూర్లు, వేల్ లక్షలున్ గోట్లు శంఖంబులున్, ఖర్వముల్ గాఁగ

నల్దిక్కులన్ రామునారాచముల్ నిండి భూమ్యంతరిక్షంబు లేకంబుగా మంటలై మండ నేపారెఁ, జాపంబు గైఁబూనుటల్ దాన బాణంబు సంధించుటల్, నారి చేయంటి గెంటించుటల్ గూడ గుర్తింపరాకుండె, నేమా చమత్కారమో? రెప్పపాటంతలో గుప్పెడిన్ గోట్లుగా బాణముల్; దేవతల్ గూడి యభ్రంబునన్ వేడ్కమైఁ గాంచి హర్షించి రత్యంతమున్;-

రాముఁ డారీతిగా, డొక్కలన్ బ్రక్కలన్ జెక్కుచున్, మొండెముల్ గూల్చుచున్, జేతులన్ జించుచున్, వాజులన్ ద్రుంచుచున్, సారథిన్ దంచుచున్ దంతులన్ నొంచుచున్ స్యందనంబుల్ విదారించుచున్, బోరునన్ బాణవర్షంబు సారింపఁగాఁ బాఱె నా దైత్యసైన్యంబు హా! యంచు;——

అంతన్ ఖరుం డుగ్రుఁడై వచ్చి సైన్యంబులన్ జేర్చి, యాటోపమే పారఁగాఁ బల్కె గర్జించు- 'చో ధీరులౌ దైత్యులారా! మహాశూరులౌ మీర లీరీతిఁ బాఱంగ ధర్మంబె? ప్రాణంబు లేమంతగాఁ దీపులే? యెంచ మున్నెన్నఁడేన్ గాంచ రీభీతి, నేఁ డేటి కీరీతిగాఁ జేయఁగా? రావణుం డెన్న మే ముంట చేఁ గాదె యింద్రాదులన్ యుద్ధమం దోర్చె? మీ రిట్టివారయ్యున్ దుచ్ఛుఁడౌ మానవున్ బట్టి మట్టేయలే రన్నచో, నేల మీ శౌర్యముల్? రండి నేనుంటి" నం చార్చుచున్, దూషణున్ జేరి, ధీరున్ త్రిశీర్షున్ నడిన్ జేరి, సైన్యంబులన్ గూర్చి, బిట్టార్చుచున్ వచ్చి శ్రీరాఘవున్ దాఁక;——

శ్రీరాముఁ డత్యంతశీఘ్రంబుగా బాణముల్ మీటఁగాఁ జొచ్చె నే మద్భుతం బంచు మింటన్ సుపర్వుల్ దనున్ మెచ్చికొండాడ, నొక్కొక్క దేవారి దేహంబునన్ లక్షలున్ గోట్లు బాణంబులున్ గ్రుచ్చి వేధింపఁ జొచ్చెన్- గనన్ గన్నులన్ నాల్కలన్ గుండెలన్ గొంతులన్ బొట్టలన్ దిట్టమై నాటె శస్త్రంబు లెన్నెన్నియో, యేయెడన్ గాంచ శ్రీరాముబాణంబులే కన్పడున్ గాని వేఱెద్దియున్ దిక్కులన్ దోఁపకుండెన్- దినేశుండు వీక్షింపరాకుండె, బల్ దట్టమై చీఁకటుల్ పర్వె నందందునన్ రామునారా

చముల్మ్రోఁగు నాదంబులున్, దైత్యులున్గూలుచో నయ్యయో! యంచు బిట్టార్చుగొంతుల్ వినన్వచ్చునే కాని వేఱొండు లేకుండె నెందున్ రణోర్వీస్థలిన్; మింట మేల్ రాఘవా! మేలు మేలంచు శ్లాఘించు గంధర్వఘోషంబుతో వెల్లుగా రేఁగె, నియ్యాముహూర్తంబులో దైత్యులామూలమున్ గూలఁగా, దవ్వులందుండి వీక్షించి యాసుప్పనా తప్పుడే భీతయై పాఱెఁ బ్రాణేచ్ఛయై స్వేచ్ఛయై;—

అంత సౌమిత్రి యేతెంచి బల్భక్తిమై నన్నుతున్ మ్రొక్కి-- 'శ్రీరామచంద్రా! యిదే దైత్యులెల్లన్ ధరన్ వ్రాలి నిర్నామమై పోయి రింకేటికిన్ గోపమున్ జూపఁగాఁ? జాపమున్ దెమ్ము శాంతింపుమం చాడఁగా, రాముఁ డానారినిన్ డించి, చాపంబు సౌమిత్రి చేఁ బెట్టి, భూజాతతోఁ దన్ సుఖాసీనుఁడై యుండఁగాఁ, దాపసుల్ వచ్చి, యారాఘవున్ మెచ్చి దీవించి, నిష్కంటకంబయ్యె నీకాననంబంచు, వీడ్కొంచు వారేగి, రత్యంత మోదాత్ములై;—

శూర్పణఖ సీతాదేవిని దెచ్చుటకు రావణుని బ్రేరేపించుట.

సుప్పనా తట్టులన్ బాఱుచున్ బోయి లంకాపురిన్ జేరి, దైత్యేశ్వరుండౌ దశగ్రీవునిన్ గాంచి, పాదంబులన్ వ్రాలి ధాత్రిస్థలిన్ బొర్లఁగాఁ, జూచి విభ్రాంతుఁడై, కన్నులన్ విస్ఫులింగంబు లేపారఁ గోపంబు దీపింపఁ దాపంబునన్ ఘూర్ణితస్వాంతుఁడై పల్కె. నన్నాతికిన్ మేఘగంభీరనాదంబునన్:- 'సోదరీ! యెవ్వఁ డీభంగపాటెన్నఁగా నీకుఁ గావించె, నాకల్కఁ గల్గించె, బ్రాణంబుపై నాసనే వీడ, నిర్భాగ్యుఁ డెవ్వాఁడు, నాకోపదావాగ్నిచే భస్మమైకూల నాలోచనల్ సల్పె నా బేల-నాకూళ- యెవ్వాండు? వేరేది యూరేది? ఘోరాజి నాక్రూరునిన్ జంపి చెండాడెదన్, బల్కుమంచన్న నక్కల్కి;—

లంకాపురాధీశ్వరా! రావణా! నీకు నేఁ జెల్లెలై యుండియున్ నేఁటికీభంగపాటొందఁగానాయె, దుర్మార్గులీరీతిగా సల్పి రేమందు? నాదండకారణ్యదేశంబునన్ రాముఁడన్వాఁడు భార్యాసమేతుండునై తమ్మునిన్

గూడియుండుఁ జుమీ! తాపసుల్ వేఁడఁగా దైత్యవంశంబు నాశంబు గావింపఁగా, బాసగావించెఁ దా నంచు నే వింటి, నాతండు నాపుత్రునిఁ జంబుమాలిన్ హతుఁ జేసె, నన్ బట్టి ముక్కుఁ జెవుల్ గోసె; నాపాటు వీక్షించి రోషించి నీసోదరుల్ దూషణుండుఁ ఖరుండుఁ ద్రిశీర్షుండు, తోడఁ బదిన్ నాల్గువేల్ సైన్యముల్ గూడి పోరాడఁగా, రాముఁ డా సర్వులన్ గూల్చెఁ, దానంతతోఁ బోఁడు, నేఁడో మఱింకొక్కనాఁడో నినుఁ దాఁకఁగానుండె, నీ విట్టు కన్గానకే, మత్తుఁడై నిద్రలోనుంటి వేమందు! నీమాత్రపున్ సౌఖ్యమున్ జూతువే కాని, నీవారి నీక్షింతువే? చూడు నీచెల్లెలిట్లైతి, నీతమ్ము లాదూషణాదుల్ పస్మృతిన్ జెంది రో సోదరా! యిట్లులైనన్ బ్రభుత్వంబు నీకుండునే? యామాత్యుల్ నిన్ను నాసింతురే? బందుగుల్ గాంచి మన్నింతురే? క్ష్మాతలాధీశుఁ డేకాల మందున్ నిజామాత్యభృత్యాప్తవర్గాళిన్ విలోకించి రక్షింప ధర్మంబగున్ జుమ్మటంచన్న, దైత్యేశ్వరుం డుల్కి యామాటకున్, దిగ్గునన్ లేచి- 'యామర్త్యునిన్ బట్టి ప్రాణంబుఁ బోఁగొట్టి, నే నిప్పుడే వత్తునం చాడి పోఁ బోవ, నాకాంత యారావణున్ నిల్పి భాషించు నిక్కువమిన్;—

దానవాధీశ! యారాముఁ డేమంత సామాన్యుఁడే? నీకు నెత్తంగ రానట్టిదా భర్గువింటిన్ విదారించి, భూజాతఁ బెండ్లాడఁగాఁడే? కనన్ శక్తికిన్ మించు కార్యంబులన్, యుక్తి సాధింపఁగా వచ్చునోటన్, విచారించి నే నొక్కయుక్తిన్ దగన్ దెల్పెదన్ విన్ము;- ఆరాము సర్ధాంగి యా సీత, వర్ణింపఁగారాని, చిత్రింపఁగారాని, యూహింపఁగారాని, దివ్యాంగ సౌందర్యమొప్పారఁగాఁ బొల్చెడిన్; నీవు భోగించినావే కదా రంభ? యాకాంతరూపంతయున్ సీతగోరంతకున్ రాదు సత్యంబు, నేఁ గాంచి నానారతిన్- భారతిన్- ముద్దుతారాసతిన్- పార్వతిన్- గాంతిపద్మావతిన్, సాటికాలేరు వారొక్క రాసీతకున్, లోకమందెవ్వరున్ దీటుకాఁబోవ; రయ్యింతి నీక్షించినన్ జాలుఁ గన్దోయి సార్థంబగున్ సత్య, మాబోఁటి యానోటమాటొక్కటే విన్నఁ జాల్ ధన్యతన్ బొందు వీనుల్, కటాక్షించి

యాతన్వివీక్షించినన్ జాలు, నాపుణ్య దేహంబు మాన్యంబగున్ రావణా! లెమ్ము, యాకామినిన్ దెమ్ము, సౌఖ్యంబులన్ దేలుచున్ హాయిగానుండుమా!—

రాము నోడించి యాబిత్తరిన్ దెత్తుసంచాసఁగారాదు, నీబుద్ధి శక్తిన్ సతిన్ రామునిన్ బాపి, తా నొంటియౌవేళ నాసింబుకంఠిన్ దగన్ బల్మిమైఁ దెచ్చి, లంకాపురిన్ జేర్చి యామీఁద నారామునిన్ జంప యోజింపఁగావచ్చు, లేకున్న నాయంతకాతండె తాంతాపియోగార్తిమైఁ జచ్చినన్ జావఁగావచ్చుఁ, గాకున్న చో వారిధిన్ దాఁటఁగాలేక, యెందేనియున్ గుందుచున్ బోయినన్ బోవఁగావచ్చుఁ గాదేని దిక్కేమియున్ దోఁపకే, యాయయోధ్యాపురిన్ జొచ్చినన్ జొచ్చు, మీ రిచ్చటన్ లంకలో, మెచ్చుగా ముచ్చటల్ దీర మోదింపఁగావచ్చు, సం చిట్టు బోధింపఁ, గామాతురుండై దశగ్రీవుఁ డాచుప్పనాతిన్ సమాశ్వాస మొనరించి యావంతచింతించి, యామీఁద;—

## రావణుఁడు మారీచునితోఁగూడి సీతాపహరణమునకై పంచవటి కేతెంచుట.

భూజాతపై భ్రాంతి లోనిల్పి, బల్వంచనోపాయమున్ సల్పి, వేగన్ రథంబెక్కి యభ్రంబునం దేగుచున్, గ్రింద సంద్రంబుమధ్యంబు నందున్న ద్వీపంబులన్ ద్వీపకల్పంబులన్ దాఁటి, యం దొక్కచో నున్న మారీచునిన్ డాసి, సత్కారమున్ బొంది యవ్వానితో నాదశగ్రీవుఁ డిట్లాడు;—

నోమామ! విన్నావొ లేదో గదా! చెల్లెలౌ చుప్పనాతిన్ గడున్ భంగపాటొందఁగాఁ జేసినాఁ డెవ్వఁడో, రాముఁ డన్వాఁడు, తమ్ముం డునున్ భార్యయున్ గొల్వఁగాఁ, బంచవట్యాశ్రమ ప్రాంతమందుండి, నాసోదరిన్ బట్టి ముక్కున్ జెవుల్ కోసి భంగించె, నాసోదరుండౌ ఖరున్ ద్రుంచె, నింకొక్కనాతమ్మునిన్ దూషణున్ దంచి ప్రాణంబులన్ జించె, ధీరున్ద్రిశీర్షున్ వినాశంబుగావించె, నాకెంతయున్ జింత చేకూర్చె, నీ భంగమున్ దీర్పఁగా, నేఁ బ్రతీకారమున్ సల్ప నూహించితిన్, రాము

పత్నిఁ జెఱఁబట్టఁగా నెంచి, నీసాయమ్ముఁ గోరి నే వచ్చితిన్, బోరు గావింపకే వంచనోపాయమ్ముఁ జేసి యారామసౌమిత్రులన్ బాపి భూజాతఁ గొంపోవ నే నెంచితిన్, లెమ్ము, నీమాయచేఁ దోయజాక్షిన్ నన్నుఁ గూర్పుమీ!' యన్న, మారీచుఁ డామాటకున్ భీతుఁడై, నోటఁ దెమ్మాఱఁగా, గుండియల్ జాఱఁగాఁ, జెమ్మటల్ గూర, దిగ్భ్రాంతి యేపార, నొక్కింతనిర్విణ్ణుఁడై నిల్చి యామీఁదటన్ బల్కెఁ దా నుల్కుచున్;—

రావణా! రాముఁడన్నంత సామాన్యుఁడే? తొల్లి యాగాధిజుం డొక్కజన్నంబుఁ దా సల్పుచుండంగ, మేమెల్ల దైత్యాళితోఁ గూడి యజ్ఞంబు విఘ్నంబుగావింపఁగాఁ బోవ, నారాము బాణాగ్నిపాలైరి వారెల్ల, న న్నొక్కబాణంబు వేగంటుచున్ దెచ్చి యిచ్చోట సంద్రంబులో వైచె, గట్టెట్టులో చేరి భీతుండనై యెందునున్ బోక, నే నిందె కాపుండితిన్ జిక్కనే లేశమో మెక్కుచున్ మానివేషంబునన్; మొన్న నాతండు కాంతారమున్ జేరె నన్వార్త నాలించి, యిం కిద్దఱిన్ దోడుగాఁ గూడి, యారామునిన్ జంపయోజించి, దివ్యంబుగా జంతురూపంబులన్ దాల్చి, మే మాతనిన్ డాయఁగాఁ బోవ, గుర్తించెనో యేమొ- బాణంబులన్ మీటె, నాతోడు లౌరక్కసుల్ చచ్చి, రేనొక్కఁడన్ జిక్కకే, పూర్వపుణ్యంబు నన్ గాచెనో! ప్రాణముల్ దక్కి యీచక్కి కేతెంచితిన్; రావణా! రాము పేరెత్తినన్ నిద్రరాకుండు, బువ్వేమియున్ బోదు, నిల్వెల్ల నీరౌఁగదా! కాంచ నీకేటి కీబుద్ధిలోఁ బుట్టెనో? రామబాణంబు సామాన్యమే? కాలుదండంబుకంటెన్ గడున్ గర్కశంబౌఁగదా! నీకెలోఁ బుట్టెనో మిత్రులై శత్రులెవ్వార లీబుద్ధి బోధించిరో నీకు, నోరావణా! మాను మీవంశనాశంకరంబైన కార్యంబు, నీ కేమిటన్ లోటుగానుండె? దిక్పాలకుల్ వెట్టి గావింప నీయింటఁ గాపుందురే! చారులంకేశ్వరుండై మహాభోగముల్ నిచ్చలున్ బొందునీ కేటికీ చెట్టయాలోగ్క;—

యాదిత్యునిన్ బాపి యేతత్ప్రభన్ గొందు సంచందువే? సీత యే తీరునన్ జిక్కు నీచేతికిన్? జిక్కెఁబో, ప్రాణముల్ తీసి, నీకొంపచల్లార్చి,

నీవంశనాశంబుఁగావింప కైకొక్కవడిన్ దక్కు? నీకింత కీరిత్త్వవైరంబ దేలా భమో? శత్రుఁడాకాఁడు నీకాతఁడున్; రాముఁ డీలోకరక్షార్థమై, దుష్ట సంహారమున్ సల్పఁగా దేవుఁ డీరీతిగా వచ్చినాఁడం(చు) ప్రజ్ఞానిధుల్, నీసముల్ కారె వీర్యంబునన్ దూషణాదుల్, ఖరున్ వారలన్ జంపెఁడా నొక్కఁడే మున్న; యీతెంపు నీ కెన్నఁగాదింపు, సైరింపు నన్ మన్నుమా! నీవు సీతార్తిఁ గొన్నాళ్ళు జీవింపుమా! వంశమున్ నిల్పు, నాపల్కు లాలింపుమా!' యంచు బోధించుమారీచునిన్ గాంచి, బిట్టగ్ని దట్టించి మాటాడుఁ, దా గట్టిగా దంతముల్ గీటి బల్ ధాటి;—

మారీచుఁడా! నీచుఁడా చిట్లుభాషింతువే? తుచ్ఛుఁడౌ మానవున్ హెచ్చుగాఁజెప్పి నన్ దెప్పెదే? చెల్లెలిన్ మానభంగంబుగావించె నాచెట్ట బల్ శత్రుఁడౌఁగాక నామిత్రుఁడే? నేఁ బ్రతీకారమున్ జేయ లేకున్న నా కప్రతిష్ఠల్ గదా, లోకమందెన్న? నిన్ బెట్టగా నెంచి నీ బుద్ధిమాటల్ వినన్ గోర్కిమైరాను, నీసాయమున్ బొంద, యాంత్రోయ జాతాక్షునిన్ బ్రత్యర్చిలింపంగ నే వచ్చితిన్, వచ్చి నాగోరికన్ జెచ్చెరన్ దీర్ప నిన్ మెచ్చెదన్, గాక యిటుల్ హెచ్చుగాఁ బలికినన్ వచ్చెదన్ జూడు నాముష్టిచే' నంచుఁ జేయెత్తి వారించి మారీచుఁ డన్నాఁడు;—

నోరావణా! లెమ్ము, లేలెమ్ము, నేవచ్చెదన్, మోసమున్ గొల్చి యాసీత నీకిచ్చెదన్, జెచ్చెరన్ రాముబాణాహతిన్ జచ్చి మోక్షంబు సాధించెదన్, గాని నీముష్టిఘాతంబునన్ జావ, నీయిష్టమూపైని, సీతా సతిన్ గూడెదో? రాముఘోరాస్త్రదావాగ్నిచేఁ బ్రాణముల్ వీడెదో? మాఁడెదో? ప్రాప్తి నెవ్వారుతప్పింపఁగాజాలువారల్? వడిన్ లెమ్ము, వేళాయె నేఁ గాలుదర్శింపఁగానేగఁగా'—నంచు భాషించుమారీచు నీక్షించి తా నవ్వుచున్ బజ్జికంతుంప—'మామా! యిటుల్ భీతిమై రీతిలేనట్టిపల్కాడెదే? నిన్ను రక్షించెదన్, రాము శిక్షించెదన్; సీత నాచేతరానిమ్ము, కాని మ్మదే మేమికానున్నదో? చూతు నంచాడి మారీ చునిన్ స్యందనంబెక్కఁగాఁజేసి, యాప్రక్కనే తాను గూర్చుండి, బల్

మఱుఁగవక చూపుచుఁ ముచ్చటల్ వల్కుచుఁ బోయి నాదండకారణ్యముఁ జేర;—

—● మారీచుఁడు జింక యగుట; మాయాహరిణమును సీత కాంక్షించుట ●—

ఆపంచవట్యాశ్రమం బంత వా రట్టులఁ జేరి, రామీఁద మారీచుఁడయ్యెఁ గురంగంబుగా, నెంచ వైదూర్యమేయాస్యమై యొప్పఁగా, మించుబంగారపుఁ బన్న నేత్రంబులే యుంచిరో నాఁగ నొప్పారుకర్ణంబులఁ గల్గి, రాణించుమాణిక్యపుఁ గమ్ములఁ ముద్దుగావంచి, యందుంచిన ట్లొప్పుశృంగంబు లందంబులై వెల్గఁగా, నింద్రనీలంబులఁ దెచ్చి కూర్పించినట్లున్న గిట్టల్ విరాజిల్లఁగాఁ, జంద్రబింబద్యుతిఁ బోలి చెల్వంబునొప్పొట్ట-యందమ్ములఁ బొందుఁగాఁజిల్కఁగా, హేమపుఁ గేసరుల్ బోలి శృంగారముల్ గొల్పు రోమాళి, యంగంబులం దెల్లెడఁ దోఁప, మారీచుఁడుఁ ముద్దుమాయాకురంగంబునై వచ్చి, భూజాత కల్లంతదూరంబునఁ వింత విన్నాణముఁ గొల్పుచుఁ నిల్వ;—

నాసీత వీక్షించి లోమెచ్చుచుఁ బట్టనుంకించె, నాజింక చేఁజిక్కకే దాఁటులఁ వేయఁ, జింతించి భ్రాంతాత్మయై సీత తాఁ గాంతునిఁ డాసి-'నాథా! కనుంగొంటివే యిట్టిరూపంబు? రత్నంబులఁ దెచ్చిరాణింపఁగా దీని సృష్టించెఁబో బ్రహ్మ నైపుణ్యమేపారఁగా, చంద్రునం దందమై పొందుగా నున్నయా లేఁడికిఁ, రుద్రునొద్దఁ బ్రబుద్ధంబుగా ముద్దుగా నుండునాజింకకుఁ బొంకమైపుట్టెఁబో యిద్ది! మన్నాథ! క్రొక్కారులుం గుల్ మఱిఁ జుక్కలుఁ జేరి, యీఁఫక్కిఁగాఁ జక్కనౌజింకరూపంబుగా నిక్కెనో కొక్క? ధవా! దీనితోఁగూడి యాడంగఁ గౌతూహలంబయ్యె, వేగఁ గురంగంబునుఁ బట్టి నాకిమ్ము, పట్టంగరాకున్నచో, దానినిఁ ద్రచ్చి తచ్చర్మమేఁ దెచ్చియిమ్మా! యనఁ, జూచి సౌమిత్రి శీఘ్రంబుగా వచ్చి శ్రీరామునిఁ జేరి;—

"మఱిఁ గంటిమే, వింటిమే, యిట్టిరూపంబు? మాయాకురంగంబుగా కిద్దియుఁ సత్యమే? దైత్యమాయల్ విచిత్రంబులో! భ్రాంతిమైఁ

గోరె భూజాత, యోజింపుమా సుంత'-యం చాడు సౌమిత్రికిఁ బల్కె
శ్రీరాముఁ- 'డో సోదరా! సీత కాంక్షించె నిద్దానిఁ, దేకున్నచోఁ జిన్న
వోవుఁ, మృగంబైనచో దానినిఁ బట్టి సీతామనోభీష్టముఁ దీర్చెదఁ,
దైత్యుఁడే యైనచోఁ గొట్టి లోకోపకారంబు గావించెదఁ, నష్టమేమిందు?
నెట్లైనను మేలు చేకొందు, నో సోదరా! యిందుఁ గాపుండి భూజాత
రక్షింపుమీ! భద్ర మంచాడి తా నమ్ములన్ వింటినిం బూని యా లేఁడి
వెన్నంట;—

"శ్రీరాముఁడు లేఁడిని వెంబడించుట"

నా మాయపుం జింక చేఁజిక్కకే జిత్తులం బన్నుచున్, రాము
నంతంత రానిచ్చి, దూరంబుగాఁ దెచ్చినన్, రాముఁ డాశ్చర్యమగ్నుం
డునై యుక్తులన్ సల్పుచున్ జింక నెట్లైనఁ బట్టంగ లోనెంచి వెన్నంటె;
నంతంత కాతండు నిల్వన్ గురంగంబు నిల్చున్, దనున్ డాయ నాతండు
విచ్చేయు జాడన్ విలోకించి, వేవేగమే దాఁటులన్ దాఁటు; వెన్వెంట
రాఁగాంచి, యంకించి బొంకించుచున్ ముందుముం దేగి, పొం దొపొదల్
దూరు, నెం దేగెనో యంచు రాముండు సందేహియై నిల్వ, నందొక్క
చోఁ గానఁగావచ్చుఁ, జేరంగ నాధీరుఁడున్ జూడ, గుర్తించి దూరం
బుగాఁ బాఱు, నిట్లా ధరాధీశునిన్ జిక్కులం బెట్టుచున్ బోయి, యందం
దునన్ నిల్చు, డాఁగున్, దగన్ జౌకళించున్, గడున్ బాఱుఁ, దారున్,
నరేశుండు వేసారి నిల్వన్, నిరీక్షించి తా వెన్కకేతెంచి, యాధీరు నంతం
తకున్ జేరు, నాతండు బట్టన్ బ్రయత్నంబు గావింపఁగాఁ జూచి గుప్పించు,
దౌదవ్వులన్ బాఱుఁ, జంద్రుండు మేఘంబులన్ డాఁగి యొట్టుల్ మఱిన్
గానఁగావచ్చు, నట్టుల్ పొదల్ చెట్టులన్ గుట్టలన్ దూఱుచున్ బాఱు
చందందునన్ దోఁచు; నట్లట్లె రాముండు వెన్నంటి యేతెంచుచున్,
బాఱుచున్, బొంచుచున్ బట్టనుంకించుచున్, జెట్టులన్ దారుచున్
బోయి యేయేయుపాయంబులన్ జిక్కకున్నంత యోజించి జింకన్
మదిన్ దైత్యుఁగా నెంచి, కోపించి బాణంబు సంధించి, వ్రేటేయఁగా

నద్ది మైనాటి, యేణంబు- 'హాలక్ష్మణా!' యంచు శ్రీరాముఁడే యార్చి నట్లార్చి మేన్ వాసి ఘోరాకృతిన్ గూలెఁ;—

సీత నిష్ఠురములాడి లక్ష్మణుని, శ్రీరామునికై దోడితేఁ బంపుట

నాశబ్దముఁన్ విన్న భూజాత- 'యోలక్ష్మణా! వింటె- 'హాలక్ష్మణా!' యంచు మీయన్న యెల్గెత్తి పిల్చెన్ గదే? కీడు శంకించెదన్, గాన వైళమ్మె నీయన్నకున్ సాయమైపొమ్మటంచేడ్చుచున్, గన్నులన్‌నీరు నిండారఁగా, విన్ననై వేఁడగా, లక్ష్మణుం డాడు- 'నోయమ్మ! మాయన్న కేకీడులున్ గల్గునే? బ్రహ్మరుద్రాదు లేకంబుగాఁబట్టిసాధించినన్ గాదుపో, దైత్యుఁ డెవ్వాఁడో యీరీతిగాఁ గూసె, నీకేటికిన్‌జింతసేయంగ? నిన్నిందు నే నొంటిగాడించిపోరాదు, తల్లీ! సుఖంబుండు శ్రీరాముఁ డోయమ్మరో! నమ్ము నామాట, వేత్రైనచో భూమి యిట్లుండునే బ్రుంగ కే? భానుఁ డేలాధరన్ వ్రాలకిట్లుండెడిన్? మేరు వల్లాడదే? సంద్రముల్ మేరలన్ మీఱవే? యేటికీభ్రాంతి, చింతింపుమా!' యన్న భూజాత కోపించి తాపంబునన్‌బల్కు;- 'పాపాత్మకా! అన్నకౌకీడు లో నెంచఁగా లేవు, సాయంబుగాఁబోవు, నామీఁదఁ గన్నుంచియున్నావొ? యోదుష్ట నీచా!' యనన్ రామ! రామా! యటంచాడి హస్తంబులన్ గర్ణముల్ మూసి, బల్ముల్కులై సీతపల్కుల్ హృదిన్ గాడఁగానొచ్చి, దేహంబు కంపింపఁగా, నీరు నేత్రంబులన్‌రాలఁ, గేల్మోడ్చి భీతాత్ముఁడై పల్కుఁ:- 'దల్లీ! యిటుల్ చెల్లునే తప్పుగా నన్ను నూహింపఁ, గానిమ్ము, నిన్ బంచ భూతమ్ములే ప్రోచు, జాగ్రత్త! నేఁబోయివత్తున్, వడిన్ దెత్తు నీనాథు! నంచాడి, విల్లమ్ములన్ బూని వేవేగమే లక్ష్మణుండేగఁ—

సీత, సన్యాసియైవచ్చిన రావణుని, సత్కరించుట

పౌలస్త్యుఁ డీసర్వమున్ దవ్వులందుండి వీక్షించి, నాకార్య మీఁదేరె నంచెంచి, సన్యాసిరూపంబునున్ దాల్చెఁ; నొప్పారఁగాఁ గావి పుట్టంబుమైఁగట్టి, రుద్రాక్షమాలల్ దగన్ గంఠమందుంచి, కేలన్ త్రిదండంబునున్‌దర్భలున్‌బట్టి, బల్‌గడ్డమున్ మీసలున్‌గల్గి, వ్రేలన్

జటల్ నెత్తిపై, బూది మేనెల్లభాసిల్లఁగా, పావుకోళ్లాపదద్వంద్వమం దొప్పఁగా, జింకచర్మంబునన్ జుట్టగాఁజుట్టి తాఁ జంకలోఁబెట్టి-నోటన్, 'శివా! శంకరా!' యంచుఁ బేర్కొంచు, నాపర్ణశాలోపరిప్రాంతమున్ డాయరా, సీత యీక్షించి, సన్యాసి యేతెంచినంచెంచి, జోతల్ సమర్పించి, తా భక్తిమైఁ బీఠిఁ గూర్చుండఁగాఁజెప్పి, యర్ఘ్యంబు పాద్యంబులన్ దీర్పఁగా;—

మాయసన్న్యాసి హర్షించుచున్, సీతలావణ్యమున్ గాంచి లో మెచ్చు, చాశ్చర్యమగ్నుండునై పల్కెఁ;- 'కల్యాణి! పేరేమి? నీదానివాసస్థలం బెద్ది? నిన్ భార్యఁగాఁగొన్న ధన్యాత్ముఁ డెవ్వాఁడు? నీవిట్టులన్ గానలన్ జేర నే హేతువో? పల్కవే!' యన్న, నామాయసన్న్యాసి కిట్లాడు భూజాత- 'యోమౌనిచంద్రా! దశస్యందనుండన్న భూనేత కేఁ గోడలన్, విక్రమోపేతుఁడౌ రాము నిల్లాల, నన్ సీత యం చంద్రు, పిత్రాజ్ఞపాలింప నానాథుఁ డీకానలన్ జేరఁగాఁ, బత్నినౌ నేను నే తెంచితిన్ దోడుఁగాఁ, దాపసేంద్రా! యతం డొక్క కార్యార్థమైపోయినాఁ, డిప్పుడే వచ్చు, మీ కాతఁ డేతెంచి సత్కారమున్ సల్పు, నందాఁక నిం దుండఁ బ్రార్థింతు నే'- నన్న, భూజాత కామాయకాఁ డిట్లనున్;—

రావణుఁడు, తన నిజవృత్తాంతమును సీతకుఁ జెప్పి తన్నుఁ గూడుమని ప్రార్థించుట

గామినీ! నీచరిత్రంబు నే వింటి, నేఁ జెప్పెదన్ నాచరిత్రంబు-శ్రీపద్మగర్భుండు నా తాత, ప్రఖ్యాతుఁడౌ విశ్రవోబ్రహ్మ నా తండ్రి, వారాశిమధ్యంబునన్ భ్రాజితంబై మహాభద్రతన్ బొల్చు విఖ్యాతలంకాపురంబౌను నా కాపురం బెన్న నోపద్మనేత్రా! త్రిలోకాభిరామంబు నా బాహుశౌర్యంబు భామామణీ! దైత్యరాజ్యాఖిలశ్రీసతీభర్త నే రావణాభిఖ్యుఁడన్, నీకు నేమంచు వాక్రుత్తు నాశౌర్యమున్? సర్వదిక్పాలురన్ గెల్చితిన్, నిర్జరాధీశునిన్ బట్టి మర్దించితిన్, సిద్ధసాధ్యామరశ్రేణినిన్ బట్టి నాయింటిలో వెట్టిసేయించితిన్, గంటి కింపైన కాంతాజనశ్రేణి

నిర్బంధమైఁ బట్టి భోగించితిన్, వింటి నీరూపు, నేఁ గంటినినేత్రపర్వంబుగా, నింక నిన్ లంకకున్ రాజ్ఞిగాఁ జేయ నే నుంటి, నీదాసుఁ డే నంటి, నో మచ్చకంటీ! కడున్ భ్రాంతుఁడై యుంటి, నన్నేలు' మంచన్న - నాసాధ్వి రోసంబునన్ బల్కు;—

మూఢాత్మ! శ్రీస్రష్టకున్ బౌత్త్రుఁ డీవందువే? యిట్టిదుర్బుద్ధి నీ కొప్పునే! చావఁగా నెంచితో రామబాణాగ్నిచేఁ? శీఘ్రమే పొమ్ము, పా ష్మాతఁడే తెంచెనా, నిన్ను జెండాడు - పోపొమ్ము, పొమ్మన్న, నద్దైత్యుఁడున్ నవ్వుచున్ బల్కు "నాగేంద్రదంష్ట్రంబులన్ బట్టి ఛేదింతునా? భాస్కరున్ దాఁకి చీకాకుగావింతునా? కాంత! నాచేతులన్ భూమి నాకాశమున్ బట్టి తాళంబు వాయింతునా? యెంచి యీరేడులోకంబులం బట్టి దట్టించి, కూలన్ బడన్ గొట్టనా? వార్నిధుల్ గూర్చి యేకంబుగాఁ దార్చి హస్తంబునన్, గ్రుక్కగా మ్రింగనా? అంగనా! యిట్టి నా బోఁటికిన్ రాముఁడున్ గీముఁడున్ లెక్కయా! చూడు' మంచద్భుతంబౌ నిజాకార మేపారునట్లుల్, దశాస్యంబులున్ నిర్వదౌ చేతులున్ గల్గి, నిల్వంగ, నాభీకరాకారమున్ గాంచి భూపుత్రి భీతాత్మయై మూర్ఛమై వ్రాలె!—

{ రావణుఁడు, మూర్ఛితయైపడియున్న, సీతాదేవిని రథముపైఁ గొని, లంకోన్ముఖుఁడగుట, సీతాప్రలాపము }

నారావణుం డాసతిన్ బట్టి, వేగన్ రథంబందునన్ బెట్టి, లంకోన్ముఖుండౌచుఁ బోఁబోవ, భూజాత భీతాత్మయై చీరుఁ బేరెల్గునన్;- 'నన్ను గొంపోవుచున్నాఁడె యీరావణుం డక్కటా! బల్మిమై, నేను శ్రీరాము పత్నిన్, ధరాజాత సీతాసతిన్, రామ! ప్రాణప్రియా! రమ్ము, నేనార్తనై వేఁడెదన్; లక్ష్మణా! నిన్నుఁ బూతాత్ము, మూఢాత్మనై నే దురుక్తుల్ గడున్ బల్కి నొప్పించితిన్ దత్ఫలం బిప్పుడేఁ గుడ్చుచుంటిన్ మహాత్మా! దయన్ గావవే! నన్ను మన్నింపవే! రామ! శ్రీరామ! నీభార్య నిట్లీ దురాత్ముండు గొంపోయెడిన్, దేవ! రావా; ననున్ గావవా! నామొ

తాలింపవా! దీనులఁ బ్రోచు ధీరుండవే? భార్య దిక్కెన్న లేకుంటివే!- యంచు రోదించుఁ, గంపించుఁ, దాఁ గన్నులన్ నీరు నించున్, దిశల్ చూచుఁ జింతించు, హా రామ! హా లక్ష్మణా! యంచు బిట్టార్చు, లేరే కదా త్రాతలెవ్వార, లీదీనురాలిన్ విచారించువా, రంచు శోకించు,- నో పావనాకారగోదావరీ! మాల్యవంతా! సుధీమంత! యో దండకారణ్యమా! తాపసశ్రేష్ఠులారా! దయన్ జెప్పరే మీరు శ్రీరామునితో- 'దేవిసీతన్ దురాత్ముండునౌ రావణుం డెత్తికొంపోయె నం, చేర్పడన్ జెప్పరే! మ్రొక్కెదన్ మీకు నే' నంచు రోదింప;

జటాయువు రావణునితోఁ బోరి. పక్షములు గోల్పోవుట

నాలించి యా భాషణంబుల్ జటాయుండు నాగృధ్రనాథుండు, దా దక్షుఁడై తాఁకె దైతేయేశ్వరున్, బోయి యాకాశమార్గంబునన్:- 'రావణా! పూతచారిత్ర శ్రీరామునిల్లాలు భూజాత నీకంఠపాశంబగున్ గాలకూటంబు గ్రోలంగఁగాంక్షించితే మూర్ఖ! వైదేహినిన్ వీడకున్నన్ నినున్ ద్రుంచెదన్ జూడుమంచన్న, దైత్యుండు లక్షింప కా పక్షినాథున్, మదోన్మత్తుఁడై స్యందనం బేగఁగా ముందుఁ బోఁదోలఁగాఁ, గాంచి బల్ క్రుద్ధుఁడై పక్షిరా జడ్డమైపోయి పోరెన్ మహాఘోరరీతిన్, మహీజాత తన్నెంతయున్ మెచ్చ;—

ఆదైత్యుఁ డత్యుగ్రుఁడై పోరెఁ బక్షీంద్రుతోఁ, గొండతోఁ గొండ డీకొన్నరీతిన్, మహాముష్టిఘాతంబులన్ బెట్టుచున్, గొట్టుచున్, దాఁకుచున్, బీకుచున్ గొంతకాలంబు నిట్లొండొరుల్ పంతమేపారఁగా, సుంతయున్ దగ్గకే యుండఁగా, నగ్గలంబై నయాక్రోశ మేపారఁగాఁ బోరఁగా, రావణుం డంత ఖడ్గంబు చేఁబూని, యాపక్షిరాట్పక్షముల్ గొట్ట, నాపెట్టుచేఁ బక్షముల్ వ్రీగి పక్షీశుఁడున్ భూమిపై వ్రెల్లెఁ దాఁ బ్రాణమాత్రావశిష్టుండునై; దైత్యుఁ డాపిమ్మటన్ స్యందనం బేగఁగాఁ దోలె,- భూపుత్రి రోదించుచున్:- 'పక్షిరాజా! ననున్ గావఁగావచ్చి ప్రాణంబులన్ బాసితే! దైవమా!' యంచు శోకించుచుండెన్, విమానంబు

నాకాశమార్గంబునన్ బోవుచుండంగ, నందొక్కచోఁ గ్రింద, ధాత్రీస్థలిన్ బర్వతశ్రేణిమధ్యంబునన్, వానరుల్ నల్వురుండంగ వీక్షించి, భూజాత మైసొమ్ములన్ బుచ్చి చేలాంచలంబందు నవ్వానినిన్ గట్టి, భూమిన్ బడన్వైచెఁ బైనుండి; కీశేశ్వరుల్ చూడ- 'హా రామ! ప్రాణప్రియా!' యంచు రోదించుచున్, వానరశ్రేష్ఠుఁడైనట్టి సుగ్రీవుఁ డా మాటలాలించి, యామూటనీక్షించి, తెప్పించి, యద్దానిఁ దా నొక్కచో దాఁచె;—

## రావణుఁడు, సీతాదేవినిఁ గొనివచ్చి, అశోకవనమం దుంచుట

నా రావణుం డట్టులాకాశమార్గంబునన్ ద్రుచ్చు మాడ్కిన్ ధరాజాతఁ గొంపోయి, లంకాపురిన్ జొచ్చి, యంతఃపురంబందునన్ డించి,- కన్నీళులన్ నించుచున్ ఖిన్నయై యున్న వైదేహినీక్షించి:- 'కంటే సతీ! నాకలోకంబుకంటెన్ విరాజత్ప్రభాపుంజమై పొల్చు లంకాపురిన్? సర్వసౌకర్యసంపన్నమై, దేవతాధీశ్వరాగారమున్ మీఱు, చేపారుఁగా నిద్ది!. గంధర్వ సిద్ధాదన్యైకామరస్త్రీలు నాకిందు బాదాలుగా నుండిరో సుందరీ! నిన్ను వారెల్లరున్ గొల్వ నేమింతు, నీదాసుఁడై నేను నిల్తున్, సదా యీప్సితార్థంబులన్ దీర్తు, సౌఖ్యంబుగా నిన్ రతిన్ దేల్తు నీభర్మ్యహర్మ్యంబులన్, శోభితోద్యానభాగంబులన్, సారనీరంబు లొప్పారునా యాసరఃప్రాంతదేశంబులన్, మందశీతానిలోపేతక్రీడాగిరీంద్రంబులన్, బుష్పకంబెక్కి నీయిచ్చకున్ వచ్చు బల్ తావులన్ ద్రిప్పుచున్; దేవి! నీభర్తపై నాసలన్ వీడుమా! రాఁడు రాఁడింక నీకీఘోరవారాశినిన్ దాఁటి యిచ్చోటికిన్ వాఁడు, ముందెన్నఁడున్ జూడలే వీవు నీజన్మమధ్యంబునన్ వాని, పేరాస నీకేటికే? జవ్వనీ! యౌవ్వనంబున్ వృథాపుచ్చకే, కూడి నాతోడ సౌఖ్యంబులన్ దేలుమా! మౌర్ఖ్యమున్ మానుమా! నీపదంబుల్ శిరంబందు నేఁ దాల్తు మన్నింపు, మే నల్గినన్ దేవగంధర్వసిద్ధాహిరక్షోగణంబుల్ వడంకున్ గదే! అట్టి నన్నిట్టు నీపాదముల్ పట్టఁగాఁ జేసి తౌనే కదున్ దిట్టవౌదే సతీ! యంచుఁ బెల్లుబ్బి తబ్బిబ్బులై పల్క;—

నిర్భీతయై సీత చేతన్ దృణంబద్ధమైయుండఁగాఁ బట్టి పల్కెడు:- 'రాముండు శౌర్యాభిరాముండు, ధర్మాత్ముఁడున్ సత్యసంధుండునౌ, నమ్మహాధీరు నిల్లాల, నే సాధ్వి దైత్యాధమా! మ్రుచ్చవై తెచ్చినావీవు, నీకా నపాయంబు లోనెంచఁగా లేవు, నీలంక సర్వాసురశ్రేణితోఁ గూడ నీతోడ నిర్మూలమౌ రాము బాణాగ్నిచే దగ్ధమై సత్య మీపల్కు, నీ వే లిటుల్ త్రుళ్ళెదో? నన్ను నిర్బంధమున్ జేసినన్ బ్రాణముల్ వాసెదన్, మూర్ఖ; పోపొమ్ము టంచాడఁగాఁ, గ్రుద్ధుఁడై రావణుండంతటన్ ద్రైజటాఖ్యాసురిన్ జేరి, యాకాంతతోఁ జెప్పు- నో కామినీ! విన్ము, సీతాసతిన్ సామదానంబులన్ భేదదండంబులన్ జేసి యెట్లైన నొప్పించి, నన్ గూడఁగాఁ జేయుఁడీ! మీయభీష్టార్థముల్ దీర్చెదన్, వత్సరం బిచ్చితిన్ గడ్వు, తా నంతలో నొప్పలేకున్నచో, మీర లన్నాతిఁ జెండాడి భక్షింపుఁడీ! ప్రేత భూతాళికిన్ విందుగాఁ బెట్టుఁడీ! యీసతిన్ మీ రశోకావనిన్ బెట్టి కా పుండుఁడీ!' యంచునాజ్ఞాపనం బిచ్చి తా నేగె నంతఃపురోద్యానభాగంబు చేరంగఁ;—

## అరణ్యములో లక్ష్మణస్వామి వెదుకుచుఁబోయి, శ్రీరాముని గలసికొనుట

కాంతారమం దట్టు లాలక్ష్మణుం డన్నయన్వేషణార్థంబు తాఁ బోవుచున్, మార్గమధ్యంబునన్ గాంచె శ్రీరామునిన్; రాముఁ డా లక్ష్మణున్ జూచి, విభ్రాంతుఁడై నిల్చి తా నుల్కుచున్ బల్కు:- సౌమిత్రి! భూజాత నీ వొంటిగా డించి, యిబ్భంగి రాఁ జెల్లునే? భీతిలోఁ దోఁచె,నిట్లేల గావించితో? సోదరా! దుష్టమారీచుఁ డాజింకయై వంచనన్ జేసెఁ, జేఁ జిక్కకున్నంత నేఁ జంపితిన్- 'లక్ష్మణా!' యంచు వాఁ డట్టులన్ గూసి ప్రాణంబులన్ వాసె, విచ్చేయు చుంటిన్ గదే? అంతలో వచ్చి తేలా సతిన్ డించి కాంతారమధ్యంబునన్? గండభేరుండఖడ్గాదులే మెక్కెనో? దైత్యహస్తంబులన్ జిక్కి యాతన్వి దుఃఖంబునున్ బొందెనో! ప్రాణముల్ డిందెనో?- సీత లేకున్నచో, రాజ్యమే నొల్ల, బ్రాణంబు నేనొల్ల; మత్ప్రాణప్రాణంబగున్ గాదె భూజాత? యేలిట్లు గావించితో'

యంచుఁ జింతించు శ్రీరాము నీక్షించి ఖిన్నుండునై లక్ష్మణుం డాడు;—

నోయన్న! మారీచుఁడన్ నీచుఁ డారీతిగా,- 'లక్ష్మణా!' యంచుఁ జీరంగ భూజాత భీతాత్మయై, యశ్రువుల్ నించి కంపించుచున్ బల్కె:- 'నోలక్ష్మణా! వింటె? "హాలక్ష్మణా!" యంచు నెల్గెత్తి మాయన్న చీరెన్ గదే! దుర్దశన్ జిక్కె నొక్కో ధవుం, డేగుమా! వైళమే పొమ్మటం చామె నన్ వేగిరింపంగ- 'దల్లీ జగద్భద్రసంధాయకుండైన రాముండు కష్టంబులన్ జిక్కునే! కల్ల,యీ రేడులోకంబు లేకంబుగా వచ్చినన్ రాముఁ డోర్చున్ నిజంబిద్ది. దైత్యాధముం డొక్కఁడెవ్వాఁడొ, యీరీతిగాఁ జీరె బో! వంచనన్ జేయఁ; దల్లీ! వెఱంబొంద కమ్మా!' యటం చెంత నేఁ జెప్పినన్ మానకే, కంట నీర్వెట్టుచున్, గద్గదంబైనకంఠంబుతో బిట్టు రోదించు, 'చోరోరి! మాయగ్రజుం డాపదన్ జిక్కె నిన్ జీరినన్ బోవుగా! అన్న చా వెంచితో? కన్ను నాపైన నీ వుంచితో? యెంచఁగా నౌనె దాయాదిచిత్తం'- బటం చుగ్రతన్ నిష్ఠురం బాడె, సైరింపఁగా లేక విచ్చేసితిన్, సైఁపుమా!' యన్న, రాముండు చిత్తంబు చీకాకునొందంగ నా లక్ష్మణున్ గాంచి:- 'యాముగ్ధ నిన్నేదియో యప్రియంబాడె నం చిట్లు, సైరింపఁగా లేక, యుక్తం బయుక్తంబటం చెంచ కాకాంతఁ గాంతార మధ్యంబునన్ వీడి రాఁ జెల్లునే! యెం తనర్థంబు గావించితో, తమ్ముఁడా! చూడుమా! దుర్నిమిత్తంబులే తోఁచె నేమో కదే! ఝల్లనున్ గుండె, నాజానకిన్ జూతునో లేదొ నాభాగ్య మెట్లుండెనో? సోదరా!' యంచు బాష్పాంబువుల్ రాల, వేవేగమే వచ్చి స్వస్థానమున్ జేరి, యాపర్ణశాలన్ బ్రవేశించి, భూజాత కన్పింపకుంటన్ విచారించి, తొట్రాను పాదంబులన్ ముందుకున్ వెన్కకున్ బోయి, నల్దిక్కులన్ జూచి నిర్విణ్ణుఁడై యుస్సురం చూర్పు సారించి మూర్ఛిల్లఁగా, లక్ష్మణుండున్ భయాక్రాంతుడై సేవ దేఁకంగ శుశ్రూషలన్ సల్ప, యామీఁదటన్ బల్కనిక్కె వడిన్ ;- 'నీ వయో కుందఁగాఁ జెల్లునే! కనం దెల్లెడన్ జూతు, నొక్కింత శాంతింపు మో దేవ!' యం చశ్రువుల్ దోఁగ శోకించుచున్ బోయె సౌమిత్రి కాంతారమం దెల్లెడన్ గ్రుమ్మఱన్;—

## "శ్రీరామచంద్రుని సీతావియోగ దుఃఖము"

భ్రాంతుఁడై రాముఁ డాచెంత భూజాత యేతెంచినట్లైనఁ గన్మూసి తా దిగ్గునన్ లేచుఁ, జేసాచి కాంతామణిన్ బట్ట నుంకించి వేగన్ బయల్ పట్టుఁ, జేఁజిక్క లేకున్న నేత్రంబులన్ విచ్చి నాతిన్ విలోకింపఁగా నెంచి నల్దిక్కులన్ జూచు వైదేహి యెందేనియున్ గానరాకున్న; బాష్పంబులన్ నించి 'హా సీత! హా మన్మనోహారిణీ!' యంచు వాపోవుఁ, 'దాపంబు నే సైపఁగాలేను నీముద్దుమోమున్ విలోకింపఁగా నీయవే!'- యంచు శోకించు, నార్తిన్ దపించున్, మహోన్మాదుఁడై యట్లు వాపోవు, నిర్విణ్ణుఁడై నిల్చు, నీరెల్లునన్ జీరు, నాకాశమున్ జూచు, నేమో గణుంచున్, సిరిన్ గోలుపడ్డట్టు చింతించు, వేగన్ జిరాకొంది దిక్కుల్ నిరీక్షించు; నిట్లార్తుఁ డుండన్ సుమిత్రాసుతుండంత నేతెంచి, చింతాకులస్వాంతుఁడౌ నగ్రజున్ గాంచి లోనొచ్చి, స్థైర్యంబునన్ జేసి, బోధించి ధైర్యంబు, చింతించి వైదేహి కెంతేఁ, దదన్వేషణార్థంబు కాంతారభాగంబులం దెల్ల శోధింపఁగా నన్న నొప్పింప, నా యిర్వురున్ గూడి;—

వాగుల్, నదుల్, గుట్టలున్ జెట్టులున్ గొండలున్ లోయలున్ గందరప్రాంగణంబుల్, మహాశైలశృంగంబులున్, వల్లరీకుంజభాగంబులున్ గాననం బెల్లెడన్ జుట్టుచున్ బోవఁగా, రాముఁ డందందునన్ సీత వృత్తాంతమున్ దెల్పఁగా వేఁడు వృక్షంబులన్, బక్షులన్, జంతుసంతానమున్, గాంచు యావద్విశిష్టంబులన్ గూడఁ బ్రార్థించి శోకించుచున్;- కోకిలన్ దిట్టు, లోకాఁకచే నంచలన్ గొట్టు, నాకేకులన్ గాంచి కుయ్యెత్తుఁ, దా కంతునిన్ దూఱు, భ్రాంతిన్ వసంతున్ సతిన్ జూపఁగాఁ గోరు, రాకానిశాకాంతు వేసారు, వంతన్ సమీరున్ విదేహాత్మజన్ దెల్పఁగాఁ జీరు;—

సింగంబు నీక్షించి సీతాతనూమధ్యమం చెంచు, భృంగంబులన్ నాతివక్త్రాలకంబుల్ కదా యంచు లో నెంచు, మత్తేభమున్ గాంచి లోనన్ భ్రమించున్ సతీయానమం, చేణనేత్రంబులన్ గాంచి శంకించు, నాచక్ర

వాకంబులఁ జూచి యాచాపచణ్డుబ్బలం చెంచి లోనఁ దపించుచు దమిఁ
గూరి; యిష్టూడ్కి విశ్రాంతుఁడౌనన్న నీక్షించి సౌమిత్రి లోఁగుందు
చుఁ- 'ప్రాకృతుండట్లు నీ విట్లు గాసింపఁగాఁ జెల్లునే నీకు? నన్నా!
మదిఁ ధైర్యముఁ బూను, మేనెల్లకొండలఁ జుట్టి, భూజాతవృత్తాంత
ముఁ దెల్పెదన్; సైఁపుమా!' యన్న, సౌమిత్రి కారాముఁ డిట్లాడు
బాష్పాంబువుల్ కన్నులన్ నిండఁ గంపించుచున్;—

లక్ష్మణా! జంతువుల్ చంపెనో? దుష్టదైత్యాధముల్ సీతఁ గొం
పోయి, ప్రాణంబులే తీసిరో? లేక యెందేనియున్ దాఁచిరో సోదరా!
మోసమయ్యెన్ గదే! ప్రాణముల్ తత్తఱంబందె, నిం కేమనర్థంబులౌనో
కదా! తమ్ముఁడా! సీత లేకున్న సన్న్యాసముం గొందు, నారీతి వీక్షించి
తాఁ గైకపుత్రుండు ప్రాణంబులన్ బాయుఁ, గౌసల్య చచ్చున్, సుమిత్రాది
సాధ్వీమణుల్ మేను లాసింప, రామిాఁదటన్ నీవు మేనుంతువే?
యారిపుఘ్నుండు జీవించునే! వంశనిర్మూలమౌఁగాదె? ధాత్రీప్రజల్
సౌఖ్యమున్ గందురే? ఒక్క భూజాతచే నెంతనర్థంబు వాటిల్లుఁ గన్గొం
టివే? చుట్టినా మెల్లకాంతారమున్, సీత కన్పింపదయ్యెన్, మహాభీతి లోఁ
దోఁచె, వృత్తాంతమున్ జెప్పరే యెవ్వరున్! మిన్ను తామిన్నకుండెన్ గదే!
పంచభూతంబులున్ బల్కవే! దేవతల్ దెల్పరే! కన్నులన్ గావరంబేమొ?
నన్ లెక్కలోఁ బెట్టరే మోకదా!'- యంచు నుగ్రుండునై విస్ఫులింగంబు
లక్షిద్వయిన్ రాల, మధ్యందినార్కాంశువోలెన్ బ్రచండప్రతాపుండునై
దోఁచుచున్ బల్కె- 'నో లక్ష్మణా! చూడు, నా సీతవృత్తాంతమున్ దెల్ప
కున్నన్ మదీయాద్భుతాస్త్రప్రతాపాగ్నిచే భస్మమున్ జేతు, నీరేడు
లోకంబులన్; సిద్ధులన్ ద్రుంతు, యక్షాదులన్ బట్టి వేధింతు, రక్షస్సమూ
హంబుఁ గారింతు, గంధర్వులన్ నొంతుఁ, బక్షీశులన్ ద్రుంతు, నాగేంద్రు
నిన్ జింతు, నే సర్వనాశంబు గావింతు, నీరజగర్భాదులున్ లోన భీతిల్ల'-
నఁ జల్లుచున్ గేలఁ గోలంది ఘోరాకృతిన్ నిల్చె రౌద్రాత్ముఁడై యొప్పె;-

సూర్యుండుఁ దేజంబు డిందెన్, మహావార్ధుల్ ఘూర్ణిలెన్,
దిక్కులున్ రాలె, శైలంబు లూటాడె, ధాత్రీతలంబున్ వడంకెన్

సుమిత్రాసుతుం డంతఁ, గేల్మోడ్చి- 'యో రాఘువా! యేలొకో యిట్లు కోపింప? దష్టాత్ముఁ డెవ్వాఁడో యీరీతిఁ గావించె, నాభ్రష్టునిన్ బట్టి దండింపఁగా నొప్పగున్ గాని,సృష్టిన్ వినాశంబుఁ గావింతు రెమిమ్ముఁబోల్ శిష్టు, లో దేవ! నీవెన్నఁగా లోకనాథుండవున్, లోకపాలుండవున్, గావె క్షోణీధవా! భూతసంరక్షణం బె మహాపుణ్యకార్యంబు, తన్నాశ నంబె మహాదోషమౌఁ జుమ్ము! శాంతమ్మె శ్రేష్ఠమ్ము, శాంతమ్మె నీసొమ్ము, శాంతాత్ముఁ డీవెన్న! శాంతింపుమా! దేవ విశ్వంబు నేన్ జుట్టి వై దేహి వృత్తాంతమున్ గంద మెట్లైన, నొక్కింతకాలంబు సైరింపుమా! సౌఖ్య ముల్ దుఃఖముల్ సర్వసామాన్యముల్ గావె భూతాళికిన్? గానఁ బ్రజ్ఞానిధుల్ దుఃఖమున్ సైఁతు, రజ్ఞుల్ గదా శోకమున్ బొందువారల్? మహాతత్త్వబుద్ధిన్ మహాత్ముల్ విలోకింతు రీవిశ్వమున్; జూడుమా, రామ'- యంచన్న, శ్రీరాముఁ డామాటలన్ శాంతుఁడై చాపమున్ డించి, యుల్లాస మేపారఁగాఁ బల్కె- 'నోసోదరా! వేగమే సీత నెట్లైన గాంచన్ దగున్, మాకు సాధ్యంబె కాకున్నచో, ముందుకర్తవ్యమున్ జూడఁగావచ్చు, లె' మ్మంచు, నాకాన నందందు సంచారమున్ జేయుచున్ బోవ;—

"జటాయువు, రామచంద్రునకు సీతాదేవివృత్తాంతమును దెలిపి, ప్రాణములు వీడుట"

అందొక్కెడన్ బక్షముల్ ప్రీగి,రక్తాంగుఁడై భూమిపై వ్రాలి,బాధా కులుఁడౌ జటాయున్ విలోకించి, శ్రీరాముఁ 'డో లక్ష్మణా! చూడుమా! జానకిన్ మ్రింగి దైత్యాధముం డొక్కఁ డిక్కెడన్ బక్షిరూపంబునన్ గుక్షిభాగంబుతో బాధచేనుండె, శిక్షింతుఁ జాపంబు తెమ్మంటంచన్నఁ, బక్షీంద్రుఁడున్ భీతుఁడై పల్కె- 'శ్రీరామచంద్రా! జటాయ్వాఖ్య పక్షీంద్రుఁడన్ నేను; లంకేశ్వరుం డౌదశగ్రీవుఁ డన్వాఁడు, వంచించి భూజాతఁగొంపోవుచుండన్, మహాభీతయై సీత శోకించుటన్ గాంచి, నే వానితోఁబోరితన్ దాఁకిఘోరంబుగా కొంతకాలంబటుల్ మేము యుద్ధం బుగావింపఁగా, దైత్యుఁడేసెన్ ననున్ ఖడ్గమున్ బూని సారెక్కటుల్

వ్రక్కలై పోవఁగా వ్రాలితిన్ మహార్ఘమైభూమిపై; దైత్యుఁ డీదిక్కునన్ వ్యోరుమార్గంబునన్ సీతఁ గొంపోయె, నో రాఘవా!' యంచు రోదించె; శ్రీరాముఁ డావార్త నాలించి శోకించుచున్ బక్షి మే నంటి తాఁ దువ్వుచున్ బల్కు:- 'పక్షీశ్వరా! మాకునై ప్రాణముల్ వీడుదే? సీత ప్రాణంబుతో నుండె నన్వార్త విన్పించి నన్ గాచినా వీవు, నీయట్టి పుణ్యాత్మకుల్ గల్గిరే? యెందు నీమేలు నే నెంతు', నం చాడఁగాఁ, బుల్గుఱేఁ డంతఁ బొర్లాడుచున్ బ్రాణముల్ వాసె, వా రగ్నిసంస్కారమున్ బక్షికిన్ జేసి, శస్త్రాస్త్రముల్ దాల్చి ముందేగ;—

### "శ్రీరాముఁడు కబంధాసురుని సంహరించుట"

నల్దిక్కులన్ బిక్కటిల్లంగ నేతెంచు శబ్దంబు నాలించి, యాధీరు లచ్చోటికిన్ బోయి, వీక్షించి రందున్ గబంధున్, మహాసత్త్వునిన్, భగ్నజంఘోన్నతున్, యోజనవ్యాప్తబాహున్, వికారస్వరూపున్; దురాత్ముండు దైత్యుండు చేసాచె నాయిర్వురన్ ఒట్టి భక్షింపఁగా; రాముఁ డాభంగి నీక్షించి యస్త్రంబులన్ దైత్యబాహుద్వయిన్ జెక్కె, నా వ్రేటులన్ రక్తమున్ గ్రక్కుచున్ గూలె దైత్యుండు, ఘోరాద్రి వజ్రాహతిన్ ద్రెళ్లుచందంబునన్; దైత్యుఁ డల్లంత పై లేచి శ్రీరామునిన్ గాంచి 'మీ రెవ్వరో దేవ! తెల్పుం' డటం చర్థిఁ బ్రార్థింప;...

శ్రీరాముఁడున్ సర్వవృత్తాంతమున్ దెల్పి యాదైత్యునిన్ గాంచి- 'నీ వెవ్వఁడో, చెప్పు'మన్నన్ గబంధుండు- 'నో రాఘవా! మిమ్ము దర్శించితిన్, శాపమున్ దీఱె; నే నొక్క గంధర్వుఁడన్; మున్ను నే దివ్యగాత్రద్యుతిన్ జంద్రునిన్ సూర్యునిన్ మీఱి భాసిల్లితిన్, భోగదేవేంద్రుఁడై మంటి, నెన్నన్ దపశ్శక్తిచే ధాత మెప్పించితిన్, గామరూపంబులన్ దాల్పఁగా బ్రహ్మచేతన్ వరంబుల్ దగన్ గొంటి, క్రౌర్యంబునన్ హింసలన్ సల్పుచున్ గామరూపంబులన్ దాల్చి నానాదిశల్ చుట్టు చేనుంటి; నే నీవికారస్వరూపంబునం దొక్కనాఁ డేగి, కానన్ దపంబుండఁగా స్థూలశీర్షుండు నా మౌనియొద్దన్ జరిరసంగ, నాబుద్ధి లక్షించి, బల్ క్రుద్ధుఁడై

యమ్మహాత్ముండు నన్నుఁ శపించెఁగదా, యట్టి రూపంబె నే నొంది యుండంగ, నామౌనిశాపంబునఁ భీతచిత్తుండనై నేను బ్రార్థించితిఁ మిక్కిలిఁ, శాంతుఁడై యాతఁ డిట్లాడె- 'నోరి' నినుఁ రాఘవుల్ నీదు దేహంబు నేనాఁడు భస్మంబుగా వింతు, రానాఁటికిఁ బూర్వరూపంబు నీ కబ్బునం చాతఁడుఁ బల్కె;—

నే నంతటఁ ఘోరరూపుండనై పోయి మత్తుండనై యింద్రునిఁ దాఁకఁగా, నాతఁ డల్కఁ నన్నుఁ గొట్టె వజ్రంబుచే; నంత నాప్రేటు, నాకంఠముఁ శీర్షముఁ గాళులఁ బొట్టలో నొక్కెఁ;- 'బద్మాసనానుగ్రహంబౌవరంబుంటచే, చావలేకుంటి వీ' వంచు, నాతండు నా పొట్టలో నాదువక్త్రంబు, నానేత్రముల్ నాదువక్షంబునం దొప్పఁగాఁ జేసి, నా బాహువుల్ యోజనవ్యాప్తముల్ గాఁగ నుండఁ గటాక్షించి, తా నేగె; నానాఁటతోనుండి నే నుందు నిచ్చోట, నొక్కామడందున్న నానామృగానీకముఁ మానవస్తోమముఁ బట్టి భక్షింతునేఁ బెద్దకాలంబుగా;- నేఁడు నాశాపముఁ దీఱెనం చాడ, రాముండు; 'నో పుణ్యుఁడా! మత్సతిఁ వంచనఁ జేసి కొంపోయెఁ దా రావణాఖ్యుండు, నామీఁది వృత్తాంతముఁ గోచరంబేని, యాపర్వముఁ దెల్పవే!' యన్న, వాతండు:- 'నీస్థూలదేహంబుచేఁ దెల్పలేకుంటె, మీ రిప్పు డిద్దాని భస్మంబు గావించినఁ, గ్రొత్తమేఁ వచ్చునా, కప్పు డేఁ బల్కెదఁ సర్వవృత్తాంతమం చాడుచుఁ బ్రాణముల్ వాయ!—

నా రాఘవుల్ కట్టెలఁ గూర్చి తద్దేహముఁ గాల్ప, నందుండి యేతెంచి బల్ దివ్యతేజంబు మిన్నేగుచుఁ బల్కె:- 'నో రాఘవేశా! దశగ్రీవుఁ డన్వాఁడు భూజాతఁ గొంపోయెఁ దా బల్మిపై లంకకుఁ; వాఁడు శూరుండు నౌటఁ, మహావీరు సుగ్రీవు నేస్తంబు గావింపుమీ! యాతఁడుఁ దీర్పశక్తుండు నీకార్యముఁ రామ! శక్తుండెగా నుత్తముండౌ సుమీ! వాఁడు ధర్మజ్ఞుఁడుఁ న్యాయమర్మజ్ఞుఁడౌ గాదె, సుగ్రీవుడఁ వానరేశుండు పంపాసరఃప్రాంతమందుండు, మంత్రుల్ దనుఁ నల్వురుఁ గొల్వఁగా; నాతఁడుఁ ధూర్తుఁడౌ వాలితో వైరముఁ జేసి, భార్య

వియోగంబునఁ శోకసంతప్తుఁడై యుండు, నీతిజ్ఞుఁ డాతండు బలవిక్ర మాఢ్యుండు పొమ్మంచు భాషించి, తా నాకలోకంబుఁ జేరన్ జనంగాఁ.

### "శ్రీరామలక్ష్మణులు శబరిచే సన్మానింపఁబడుట"

మహాశ్చర్యమున్ బొంది రాముండు సౌమిత్రితోఁగూడ సుగ్రీవు జాడల్ విచారించుచున్ బోవఁగా, శాబరాఖ్యాతసద్వంశసంజాతయౌ వృద్ధ యొక్కర్తుకన్ యోగినిన్ గాంచె; నాచాన బల్ భక్తిభావంబు రంజిల్ల పాదంబులన్ వ్రాలి ప్రార్థించి శ్రీరామునిన్ లక్ష్మణున్ దెచ్చి తాఁ బర్ణశాలన్ దగన్ డించి, యర్ఘ్యంబు పాద్యంబు నర్పించి, మోదాశ్రువుల్ రాల్చి పూజించి సేవించె; పుష్పంబులన్ వైచి యర్చించె, బూదేనియల్ దెచ్చి యర్పించె, నందందునన్ బోయి వృక్షంబులందున్న పండ్లన్ వెసన్ డుల్చి, చేదాల్చి, తియ్యంబులో కావో, నాస్వాద సేవింపఁగాఁ జెల్లవో, పుల్లవో? చెల్ల!' యంచెంచి యోజించి, తాఁ బంటితో నొక్కి యొక్కొక్కటిన్ బుల్లనౌవాని నందే పడన్ ద్రోసి బల్ తియ్య నౌపండ్ల నెల్లన్ ముదంబారఁగాఁ దెచ్చి శ్రీరాము ముందుంచ, సౌమిత్రి యారీతి లోనెంచి శ్రీరాముమోమట్టె వీక్షించె, శ్రీరాముఁ డాలక్ష్మణున్ గాంచు చాపండ్లఁ గైఁబూని సౌమిత్రిచే నొండు రెండుంచి:- లో కూర్మి యే శ్రేష్ఠమౌఁగాని పైపూఁతలున్ చేఁతలున్ రోఁతలౌ లక్ష్మణా! బిడ్డలందున్ మఱిన్ భక్తులందున్ గనన్ వచ్చునే రీతులన్ రోఁతలన్, నీతులన్; ప్రీతియే ముఖ్యమౌఁగాని, సౌమిత్రి సేవింపు మీపండ్ల టంచాడి, తాఁ గొన్ని భక్షించి సంతుష్టుఁడై యోగినిన్ గాంచి:- 'యో యవ్వ! నీమానసంబట్టు లీపండ్లు దివ్యంబులై చాలతియ్యంబులై యుండె, నయ్యారె! సంతుష్టుఁడైతిన్ గదే' యన్న నత్తన్వి:- 'శ్రీరామ! నీప్రాప్తిచే సర్వలోకంబులన్ దృప్తి నొందన్, మహాధన్యతన్ గాంచితిన్, దేవ! సీతన్ దశగ్రీవుఁ డారీతిగా మోసమున్ జేసి కొంపోవుటల్ వింటి; కాలంబు మీ కంగరా దేరికిన్ రామ! సుగ్రీవుఁడన్ వానరాధీశ్వరుండుండు పంపాతటీప్రాంతమం; దాతఁడున్ గూడ భార్యావియోగార్తిమైఁ గుందెడిన్, స్నేహమున్ జేయు

మాధీరుతో నీకు మేలయ్యెడిన్, రామ! మున్నొక్క మౌనీంద్రుఁ
డేతెంచి, నీవచ్చువృత్తాంతమున్ నాకు విన్పించె, నిన్ గాంచఁగా వేచి
యుంటిన్ జుమీ! మద్గురుండేగ కైలాసమున్ జేరఁగా, నన్నుఁ గొంపో
వుఁడం చప్పుడే నాతనిన్ వేఁడితిన్, నాకు నాతండు:- 'శ్రీరామచంద్రుండు
నీచోటికేతెంచు నొక్కప్పు డో యోగినీ! యాతనిన్ గాంచి, సేవించి
బల్ పూతమౌ దేహమున్ వీడినన్, దేవసాన్నిధ్యమౌ నీకు' నంచాడి తా
నేగె; నే నిచ్చటన్ మీకునై చాలకాలంబుగా వేచియుంటిన్, భవద్ద
ర్శనంబయ్యె, సేవించి పూతాత్మురాలైతి, నే నగ్నిలో వ్రేల్చు దేహం! బటం
చట్లు గావించె; నామీఁదటన్ రాఘవుల్ వే ప్రయాణంబు సాగించి,
పంపాసరఃప్రాంతమున్ జేరి రంతంత, సీతావియోగార్తుఁడై కుందుచున్
రాముఁ, డందుండు చిత్రంబులన్ గాంచి మోదించు చందందు విశ్రాంతిఁ
గైకొంచుఁ గాలంబు పోఁద్రోయు చుండెన్ జుమీ!' యంచు, వాల్మీకికిన్
నారదర్షీశ్వ ం డాదరం బొప్పఁగాఁ జెప్పె నిక్కైవడిన్;—

ఇద్ది శ్రీరామపాదాంబుజధ్యాననిష్ఠాగరిష్ఠుండు, విప్రుండు, వా
సిష్ఠగోత్రోద్భవుం, డార్యవెంకోబరాయాత్మసంజాతుఁడున్, సాధ్వీ
లక్ష్మాంబికాగర్భసచ్ఛుక్తిముక్తాఫలంబైన, అశ్వత్థరాయండు నిర్మించు
నీదండకోపాఖ్య రామాయణంబందు, నారణ్యకాండంబు నర్పించెవన్
గొమ్మిదే ఆంజనేయా! మహావజ్రకాయా! సదా రామకార్యప్రియా!
ధర్మధౌరేయ! సద్భక్తగేయా! బుధశ్రేయ! దీనార్తసద్భక్తబంధూ!
దయాసింధు! శ్రీవాయుపుత్రా! పవిత్రా! నమస్తే, నమస్తే నమః.

అరణ్యకాండము, సమాప్తము.



శ్రీ

శ్రీ సీతారామలక్ష్మణ పరబ్రహ్మణే నమః

# శ్రీ దండకరామాయణము.

## కిష్కింధాకాండము.

శ్రీనారదర్షీశ్వరుఁ గాంచి ముందొ కథాభాగముఁ దెల్పవే! యంచు వాల్మీకి ప్రార్థింపఁగా, నారదుం డెంతయుఁ హర్షితస్వాంతుఁడై పల్కె;—

శ్రీరాముఁ డాలక్ష్మణుఁ గూడి పంపాతటిన్ జేరి యందందుసంచారముఁ జేయుచుండంగ, నాఋష్యమూకాద్రియం దున్నసుగ్రీవుఁడీక్షించి వాతాత్మజుఁ బిల్చి భాషించు శ్రీరామసౌమిత్రులన్ జూపి;—

సుగ్రీవుఁడు, శ్రీరామలక్ష్మణులయొద్దకు హనుమంతునిఁ బంపుట

ఆవీరు లెవ్వారొ? ప్రచ్ఛన్నవేషుల్ గదా! మౌనివేషంబులన్ దాల్చి, శస్త్రాస్త్రముల్ పూని యీప్రాంతముల్ చుట్టుటల్ చూడ, డెందంబులో సందియంబయ్యె, నివ్వారు తేజస్వులున్, భూరిసత్వాఢ్యులున్ బోలెఁ గన్పట్టువారల్ సమీరాత్మజా! వాలి పంపంగ విచ్చేసిరో? శంకలో నంకురంబయ్యె, నావాలిచే నెప్డు డేకీడు లేరీతిగా మూఁడునో! శత్రువున్ నమ్మఁగారా, దుపేక్షించి సుం తేమఱన్ రాదు, గానన్ వెసన్ బోయి యాధీరులన్ జేరి, కాలానుసారంబుగా భాషణల్ సల్పి, వృత్తాంతముఁ సర్వముఁ గుట్టుగా వారిలోమట్టులన్ గాంచి నీవిట్టువిచ్చేయు మంచన్న;—

సామీరి శీఘ్రంబుగా నగ్గిరిన్ డిగ్గి, తా భిక్షువేషంబునన్ బంపకేతెంచి, శ్రీరామునిన్ లక్ష్మణున్ డాసి, సద్భక్తి సాష్టాంగముఁ సల్పి,

కేల్మోడ్చి నమ్రాంగుఁడై పల్కు:- 'నింద్రోపముల్, భానుతేజుల్ మహా విక్రమాటోపు లీ రెవ్వరో? శాంతమూర్తుల్ శరచ్చంద్రహాసుల్, భుజోత్తుంగు లుత్తాలవక్షుల్, మహోగ్ర ప్రచండాస్త్రహస్తుల్, విరాజన్మహారాజచిహ్నల్, తపోవేషముల్ దాల్చినారేల? మీ తావులన్ వీడి యీఘోరకాంతారసంచారముల్ సల్ప నేహేతువో? దాసకే తెల్పరే' యంచుఁ బ్రార్థించు నామీరి నీక్షించి, సంతోషితస్వాంతుఁడై రాముఁడా లక్ష్మణున్ గాంచి,- 'సౌమిత్రి! వీక్షించితే యీతనిన్? భారతీకాంత కున్ బ్రహ్మకున్ గాక పల్కంగసాధ్యంబె యీదివ్యధారామృతాపూర వాక్సారముల్; బండితుండీతఁడెన్నంగ సంపన్నుఁడైనట్లు కన్పట్టెడిన్, మేరుధీరుండు, సుత్రామశౌర్యుం, డటం చెంతు నే నీతనిన్, దమ్ముఁడా! చూడు మీధీరుసఖ్యంబు క్షేమకరంబంచు భావించెదన్ లక్ష్మణా! సర్వముల్ దెల్పు మస్మత్ప్రవృత్తాంత' మం చారఘూత్తంసుఁ డాడంగ, వాతాత్మజున్ గాంచి సౌమిత్రి భాషించెడిన్;

'సన్మతీ! యిర్వురే మన్మదమ్ముల్, గనన్ క్షత్రియుల్, భానువంశోద్భవుల్ మే, మయోధ్యేశుఁడౌ శ్రీదశస్యందనాఖ్యార్యపుత్రుల్; మహాఖ్యాతుఁ డీతండు రాముండు, నే లక్ష్మణాఖ్యుండఁ, బిత్రాజ్ఞచే మౌనివేషంబునన్ గాననావాసముల్ జేయుచున్నాము. దుష్టాత్ముఁడౌ రావణుం, డీ సుచారిత్రు కాంతామణిన్, బూతచారిత్ర యూసీతఁ, దానొంటిగానుండఁ, గొంపోయెఁ దా దొంగయై బల్మిమై; జాడ లీక్షించుచున్ మేము విచ్చేసినా మిట్టు లిచ్చోటకిన్, గాంచ నీవెవ్వరో? మా కెఱింగింపుమీ!'- యన్న, వాతాత్మజుం డాదరం బొప్పఁ బల్కాడు;—

'సుగ్రీవమంత్రిన్ సమీరాత్మజుండన్ హనూమంతుఁడన్ పేరివాఁడన్, గనన్ భిక్షువేషంబుమై మీవిధంబారయన్ వచ్చితిన్, దేవ! శ్రీరాఘవా! నిన్ను దర్శించుటన్ ధన్యుఁడే నైతి, నానోములున్ బండె, స్వామీ! కనన్ దొల్లి నాతల్లి, నన్ బుత్రుఁగాఁ గాంచి, తా వీడిపోఁ బోవుచున్ బల్కె:-'నోపుత్రకా! శ్రీమహావిష్ణువే రామచంద్రుండుగావచ్చి

నీకిచ్చెడిఁ దర్శనం, బాతనిఁ వాఙ్మనఃకాయకర్మంబులఁ గొల్చి భక్తిఁ దరింపంగదే!' యంచు వాక్రుచ్చి తా నేగె; నారీతిగా నిన్ను నిన్నాళ్లకేఁ గంటి, నాస్వామి నన్నేలుమా! బంటుగా నన్నుఁ గొమ్మేను నాజన్మమున్నంతకాలంబు నీపాదముల్ గొల్చి సేవింతు, నిఁక నమ్మితిఁ, సమ్మతిఁ నెమ్మదిఁ, నిన్నెనా దిక్కుగాఁ నేఁ గాన నీదాసుఁడఁ దీనుఁడఁ బ్రోవవే!' యంచుఁ బాదంబులఁ బట్టి ప్రార్థింప;—

శ్రీరాముఁ డత్యాదరంబొప్ప, సామీరి శీర్షంబుపై నుంచి భక్తాభయశ్రీకరంబైనహస్తంబు, హర్షించుచుఁ బల్కు:- 'నోయంజనాపుత్ర! మోదించితిఁ, నిన్ను నాలక్ష్మణుఁ బోలె వీక్షించెదఁ, నాదుప్రాణంబుగా నిన్ను రక్షించెదఁ, నెమ్ము- లెమ్మన్నఁ, దా లేచి కేల్మోడ్చి- 'యోస్వామి! సుగ్రీవుసఖ్యంబుఁ జేయింతు నాకాజ్ఞయే' యన్న, సౌమిత్రి సౌహార్దమేపారఁగాఁ బల్కు;—

నోవాయుపుత్రా! సుచారిత్ర! వి న్మీరఘూత్తంసుఁ డీరామచంద్రుండు విఖ్యాతసత్త్వుండు, దివ్యాస్త్రుఁ, డత్యంతముఁ స్థైర్యశౌర్యాభిరాముండునుఁ, సాహసోద్దీప్తవీర్యుండునుఁ, భూరికారుణ్యసింధుండుఁ, గాంచఁ నతత్రాణపారాయణుండుఁ, జగన్నాథుఁడుఁ సత్యధర్మావతారుండునౌఁ జుమ్ము! నే బంటనై యీరఘూత్తంసునిఁ గొల్తు; నీతండు సాధింపఁగారానికార్యంబు లే దొండు క్ష్మామండలిఁ; రావణుఁ జంపి భూజాత సాధింపఁ దా నోపువాఁ, డైన నేకాకియై, కార్యసాకల్యముఁ గోరి లోకంబునఁ ధీయుతుల్ పోవరాదౌటచే, క్షత్రియుల్ మేము సైన్యంబులఁ గూడుటల్ మాకుధర్మంబునౌటఁ విచారించి సుగ్రీవుసాయంబునఁ జేసి, కార్యంబు కైఁబూనివిచ్చేసె నీతండు, నీకిష్టమైనఁ ఘటింపఁగదే! సఖ్యముఁ మాకు సుగ్రీవుతో' నన్న, సామీరి మోదాత్ముఁడై వారిచేమన్నసల్ పొంది,- 'ధన్యత్వముఁ గంటి నే' నంచు నానందముఁ బొందుచుఁ వారి వీడ్కొంచు శీఘ్రంబుగావచ్చి, సుగ్రీవునిఁ డాసి సంరంభమేపారఁగాఁ బల్కు;—

### శ్రీరామునకు, హనుమంతుఁడు-సుగ్రీవుని సఖ్యంబుఁ జేయించుట

సుగ్రీవ! నీపూర్వజన్మార్జితానేకపుణ్యంబ దేమోకదా! దుఃఖవా
రాశిలో దోఁగు నీ కబ్బె శ్రీరాముఁడన్ తెప్ప; జీవింపఁగాఁ గంటి వెన్నంగ,
నీకోరికల్ దీరె, సంతోషముల్ మీరె, నో వానరోత్తంస! యిక్ష్వాకుఁడౌ
నాదశస్యందనాఖ్య క్షితిపపుత్రుండు శ్రీరాముఁ డాతండు, సద్ధర్మసంచా
రుఁడై, తండ్రియాజ్ఞానుసారంబుగా, దండకారణ్యమున్ జేరె, దుర్మా
ర్గుఁడౌ రావణాభిఖ్యుఁ డారాముదేవేరినిన్ మ్రుచ్చిలింపంగ, నన్వేష
ణల్ సల్పుచున్ దమ్మునిన్ గూడి నీచెల్మికై వచ్చె నిచ్చోటికిన్, సత్యమం
చన్న, హర్షాంబుధిన్ దేలి సుగ్రీవుఁ డామారుతిన్ గౌఁగిటన్ గ్రుచ్చి-
'బల్మేలు నేకూర్చినా వీవు, వైళంబుగా నేగి తోడ్తెచ్చి వారిన్ ననున్
గూర్పుమా!', యన్న, వాతాత్మజుం డేగి, శ్రీరాముపాదంబులన్ వ్రాలి,
సద్భక్తిమై నిల్చి- 'సుగ్రీవుఁ డో దేవ! మీదర్శనార్థంబు నన్నంపె, విచ్చే
యుఁ డంచాడి, వారిర్వురన్ మూఁపులన్ దాల్చి, సామీరి యత్యంత
హర్షంబునన్ జివ్వునన్ వచ్చి, యాఋష్యమూకాద్రిపై రామునిన్
లక్ష్మణున్ డించి, యామీఁద సుగ్రీవునిన్ డాసి విన్పించె వృత్తాంతమున్;
మంత్రులన్ గూడి సుగ్రీవుఁ డానందమేపారఁ, గేయూరహారాదులన్,
దివ్యవస్త్రంబులన్, గర్ణభూషాదులన్ దాల్చి, మాణిక్యవజ్రాంచితంబౌ
కిరీటంబు మూర్ధంబునన్ బెట్టి, తా- రాజచిహ్నంబు లేపారఁగా, వచ్చి
శ్రీరామునిన్ డాసి ఫాలంబు తత్పాదదేశంబు సోకంగ సాష్టాంగదండంబు
లర్పించి, వేలేచి, కేల్మోడ్చి నిల్చుండె;—

### సుగ్రీవుఁడు సీతాదేవి సొమ్ములమూటను శ్రీరామచంద్రున కర్పించుట

రాముండు సుగ్రీవునిన్ గాంచి ప్రేమంబునన్ గౌఁగిటన్ దార్చి,
మోమెత్తి వీక్షించి సానందుఁడై పల్కె;-నో వానరోత్తంస! నీవిక్రమంబున్
భుజాటోపమున్ నే సమాలించి, నీసఖ్యమున్ గోరి విచ్చేసితిన్, భీతిలో
మానుమా! నీవిరోధిన్ హతున్ జేతు, నీవైతి, మాకిప్డు డాప్తుండుగా,
ముఖ్యబంధుండుగా' నంచుఁ బల్కాడ సుగ్రీవుఁ "డో దేవ! నన్ బంటు

గాఁ గొంటి నే ధన్యుఁడైతిన్ జుమీ! నీకు నాయట్టి బంటుంటచే, నింక నీకార్య సర్వంబు చేకూరె. నారావణుం డారయన్ జచ్చె, భూజాత చేఁజిక్కెనంచెంచుమా! స్వామి యన్నన్ మఱిన్ భృత్యుఁడన్నన్ ధరన్ నీవున్ నేనున్గా కొరుల్ గల్గరన్నట్లుగా సాక్ష్య మీయన్ వలెన్ జుమ్మురామా!' యటం చిట్లు సంతోష మేపారఁగాఁ బల్కె;—

నామీఁద నన్యోన్య మయ్యగ్నిసాక్ష్యంబుగా నిర్వురున్ సఖ్యమున్ సల్పి. రాపైని, నవ్వాయుపుత్రుండు వారిర్వురిన్ గాంచి మోదాశ్రువుల్ గార్చుచున్ వారుకూర్చుండఁగాఁ జెట్టుకొమ్మొక్కటిన్ దెచ్చి వైవన్, సుఖాసీనులై వార లాశాఖపై, ముచ్చటల్ ముచ్చటింపంగ, సుగ్రీవుఁ, 'డో రాఘవా! భూసుతన్ రావణుం డట్లు కొంపోవుచో, సీత భీతాత్మయై చీరుచున్, మమ్ములన్ గాంచి యీసొమ్ములన్ మూటఁగాఁగట్టి శ్రీరామ! రామా! యటంచార్చి క్రిందన్ బడన్ వైచె, నాకాశమార్గంబునం దా విమానంబునన్ బోవుచోఁ, జూడుమం చియ్య, నవ్వానిఁ గైఁబూని తా నట్టె వీక్షించి వీక్షించి, యాపైన నాలక్ష్మణున్ గాంచి 'యోసోదరా! చూడు మీసొమ్ము లాసీతవో, కావొ? గుర్తింపుమీ!' యంచో సంగన్ సుమిత్రాత్మజుం డాడు;—

'నో దేవ! భూజాత యేయేవిభూషల్ మెయిన్ దాల్చెనో నే నెఱుంగన్ జుమీ! సీతమోమెప్పుడున్ గాన, నిత్యంబు నెంచన్ యుషః కాలమం దట్లు మేల్కాంచి, నే-మీదుశయ్యాగృహద్వారమం దొప్పఁగా వేచియుండున్ గదా! మీరు మేల్కాంచి విచ్చేయ, నే వాకిటన్ మీ పదాబ్జంబులన్ వ్రాలి, యావెంట నేతెంచు భూపుత్రి పాదంబులన్ మ్రొక్కుచుంటిన్; వనిన్ సైత మామాతసంచారమున్ సల్పుచో, వెంటనేయుంటి నాకాలమందైన, నాసాధ్వితో భాషణల్ సల్పుకాలంబునందైన, నే పండ్లుపానీయముల్ దెచ్చి యాతల్లికర్పించుకాలంబునందైననున్, భక్తిమై నౌదలన్ వాల్చి మాటాడుదున్ గాని, యెందున్ బరాకొందియైనన్ ముఖంబెత్తియీక్షింప నీకన్నులన్ సీత నేనెన్నఁడున్, సత్య,

మామాతపాదాంబుజద్వంద్వమున్ మాత్రమే గాంచితిన్, గానఁ బాదంబులన్ దాల్చు మాణిక్యమంజీరముల్ చూచి గుర్తింపఁగా నేర్తు,నీ రెండు మంజీరముల్ తప్ప కాతల్లివే, యింక నీతక్కుభూషావళుల్ సీనవో, కావో? యెందెందు నాసొమ్ములన్ బాల్చెనో మేన నేఁ గాన' నం చన్న;—

'నోలక్ష్మణా! సొమ్ము లీయన్నియున్ సీతవే' యంచు రాముండు నిట్టూర్పు సారించి, బల్ దీనుఁడై సొమ్ములన్ గన్నులం దద్ది, కన్నీట నా సొమ్ములన్ గడ్గి, వక్షంబునం దొత్తి, భూజాతఁ జింతించి, శోకించి శోకించి మూర్ఛిల్ల, సుగ్రీవుఁడున్ లక్ష్మణుం డంత శుశ్రూషలన్ సల్ప మేల్కాంచి, క్రోధాత్ముఁడై పొల్చుచున్ నిల్చి పల్కాఁడు,- సుగ్రీవ! పేఁడుమా! వైరి యేదేశమందుంచె నాసీత? సాధింతు నాదుష్టునిన్ ద్రుంతు, లోకంబు లేకంబుగావచ్చినన్ వ్రచ్చెదన్ మాన'నంచాడ, సుగ్రీవుఁ డో దేవ! సైరింపు, మిట్లాతురంబైనచో నెట్లు? నే దూతలన్ బంపి భూజాత వృత్తాంత మెల్లనఁ దెప్పించి,యాదుష్టునిన్ ద్రుంప యోజింతు' నంచాడు సుగ్రీవునిన్ గాంచి, 'యోవానరాధీశ్వరా! మేలుమేలయ్యె, నే నైఁచితిన్, మీఁద సాధింతు నాదుర్మతిన్, జూడ నాచుట్టమైతీవు. సఖ్యంబు చేకూరె మాకొట, నీదుఃఖమున్ దీర్తు నే ముందు, నీశత్రు వెవ్వాఁ డతం డెందు వర్తించు? నేపాటిదో వాని శౌర్యంబు? మీ రిర్వురున్ బోరఁగాఁ గారణం బేమొ? వాక్రువ్వు మంచన్న సుగ్రీవుఁడిట్లాడు;—

సుగ్రీవుఁడు శ్రీరామచంద్రునకు, వాలివృత్తాంతమును దెలుపుట

శ్రీరామ! మద్వేషి నాయగ్రజుండౌను, తా 'వాలి'నామంబునన్ వెల్గు, వైరంబు మా కైనయాకారణంబున్ వచింతున్, బ్రభూ! తొల్లి దైత్యామరశ్రేణి కవ్వంబుగా మందరాద్రిన్ మఱిన్ వాసుకిన్ ద్రాడుఁగాఁ బూని, క్షీరాంబుధిన్ ద్రచ్చుకార్యంబునన్ మాసహాయంబుఁ గాంక్షింపఁగా, వాలియున్ నేను సాహాయ్యులై నిల్చి త్రచ్చంగఁ ద్రచ్చంగ, వారాశిలోఁ గాలకూటంబు జన్మించి లోకంబులన్ గాల్ప నుంకింప, నద్దాని నాపార్వతీశుండు హస్తంబునంబట్టి తా నట్టె మ్రింగెన్ మహాశ్చర్యమున్ బొందఁగా లోకముల్;—

మీఁదఁ ద్రచ్ఛంగవారాశిలో జ్యేష్ఠ తా నుద్భవంబై కలిన్ జెట్టవట్టెన్, మహోత్కృష్ట వస్తుప్రకాండంబునున్ బెల్లుగాఁ బుట్టె, నొక్కొక్క రొక్కొక్కటిన్ దాల్చి, యైరావతంబున్ మహాకామధేనున్ మఱిన్ గల్పవృక్షంబుఁ జింతామణిన్ దేవతాధీశుఁడే పూనె, నామీఁదటన్ శ్రీమహాలక్ష్మి జన్మించె, నారాయణుం డాసతిన్ వక్షమం దూనెఁ, జంద్రుండు జన్మింప, నవ్వాని శర్వుండు తా మౌళిపై దాల్చె, నంవార్ధిలో నప్సరస్త్రీలు జన్మించి రవ్వారలన్ 'దార'యన్ జవ్వనిన్ మాకు నర్పించి రా దేవతల్; మీఁద సంద్రంబులోనన్ సుధాభాండమే పుట్టె, నద్దాని శ్రీవిష్ణువే మోహినీకాంతయై దైత్యులన్ మోసమున్ జేసి యా దేవతా కోటికిన్ ద్రావఁగాఁ బెట్టె, మే మాపయిన్ దారతోఁ గూడి మావీట సౌఖ్యంబుగాఁ గొంతకాలంబుఁ బోఁబుచ్చఁగా, మీఁద నే నాసుషేణాఖ్యపుత్రిన్ రుమాఖ్యాసతిన్ బెండ్లియై, పెద్దకాలంబు సౌఖ్యంబుతో నుండ;—

## మాయావికథ

మాయావియన్ రాక్షసుం డొక్కఁ డేతెంచి, తా వాలినిన్ యుద్ధమున్ జేయఁగాఁ జీర, నావాలి కోపంబునన్ వాని వెన్నంటె, నే నంత నావాలికిన్ సాయమున్ జేయ వెన్వెంటనే పోవ, మాయిర్వురన్ గాంచి, భీతాత్ముఁడై పాఱె మాయావి ప్రాణేచ్ఛమై; మేము వెన్నంట వీక్షించి తా నొక్కచోటన్ గుహన్ దూఱె దైత్యుండు, నామీఁదటన్ వాలి నన్ గాంచి, 'యీవాకిటన్ నీవు గాపుండుమీ! యెవ్వరున్ లోన రాకుండ, నే నీగుహన్ జొచ్చి దైత్యాధమున్ జంపి వేసత్తు'నం చేర్పడన్ జెప్పి తా నా గుహన్ జొచ్చె, నే నొక్కయేఁడుంటి నవ్వాకిటన్, వాలి రాకుండె, నామీఁద రక్తప్రవాహంబు రాఁజొచ్చె నంతన్ గుహాద్వారమందుండి యద్దాని వీక్షించితిన్, ద్వారమందుండి యాలించితిన్ వాలి మూల్గుల్ గడున్ వింటి, భీతిల్లితిన్; దైవమా! వాలి దుష్టాత్ముఁడౌ దైత్యుచేఁ జిక్కె, నన్ జంపఁగా దైత్యుఁ డేతెంచు నిం కంచు, నేనొక్క

కొండన్ బిలద్వారమున్ మూసి, యచ్చోటనే పారలౌక్యక్రియల్ వాలికిన్ దీర్చి, కిష్కింధ కేతెంచి వృత్తాంతమున్ దెల్పితిన్;—

మంత్రు లారాజ్యపట్టాభిషేకంబు నాకెంచి కావించి, రే నంత రాజ్యాధికారంబు గైఁబూనితిన్, వాలి మాయావిఁ బోకార్చి తా నా గుహాద్వారమున్ డాసి, నన్ జీరియున్ జీరియున్ రోసి, యాకొండఁ బాదాహతిన్ బిండిగాఁ దన్ని, విచ్చేసి యచ్చోట నన్ గానకే, గిన్కమై మండి కిష్కింధ కేతెంచి సింహాసనాసీనుఁడై యున్న నన్ గాంచి కోపించె; నే లేచి కేల్మోడ్చి ప్రార్థించితిన్ గాని మన్నింపకే కాలితోఁ దన్ని దుర్భాషలన్ దిట్టె;- 'నాచావు కాంక్షింతే దుర్మతీ!' యంచు గర్జించె, నే నంతఁ బాదంబులన్ వ్రాలి యా యెల్లవృత్తాంతమున్ జెప్పి, సింహాసనం బెక్కుమం చెంతయున్ వేఁడితిన్, గాని యంతంతకున్ మీఱి కోపంబునన్, రాజ్యలక్ష్మిన్ మఱిన్ నాదు నర్ధాంగలక్ష్మిన్ రుమాఖ్యాసతిన్, ధర్మనిర్మూలమున్ జేసి తాఁ బల్మిఁ జేపట్టె, నే భీతిమైఁ బాఱఁగాఁ జొచ్చితిన్, నాదు వెన్నంటె నాతండు కారుణ్యలేశంబు నేన్ గాన; కేమిర్వురారీతిగా నెల్ల భూమండలిన్ జుట్టి, వేసారి నే నీమహాపర్వతం బెక్కితిన్; వాలి యిందెక్కరాకున్కిఁ బ్రాణంబు దక్కంగ నిక్కెక్కవడిన్ మంటి నో దేవ ! యంచన్న నాలించి యామాట, కాశ్చర్యమున్ బొంది శ్రీరాముఁ, డావాలి కీ పర్వతం బెక్కరాదెట్లు విన్పింపుమా!' యన్న, సుగ్రీవుఁ డిట్లాడెడిన్;...

## దుందుభివృత్తాంతము

దేవ! శ్రీరాఘవా! దుందుభిఖ్యాతుఁ డొక్కండు దైత్యుండుఁ లోకంబు భీతిల్లఁగా స్వేచ్ఛ సంచారమున్ జేయుచున్, దున్నపోతై సముద్రున్ రణం బియ్యఁగాఁగోర, నయ్యంబుధీశుండు భీతాత్ముఁడై రత్నరాసుల్ గడున్ గానుక లర్పించి- 'నేఁ జాల నీతోడఁ బోరంగ వింధ్యాద్రియేగాని పొమ్మంచు వీడ్కొల్పె; దైత్యుండు వింధ్యాద్రి కేతెంచి, యద్దానిశృంగంబులన్ బట్టి భంగంబు నొందింపఁగా, శైలరాజంబు లో నొచ్చి-'నీసాటియే నేను నీతోడఁ బోరాడఁగా వాలియే చాలువాఁ-

డాతఁడో నేఁడు కిష్కింధ పాలించుఁ, బొష్మంచుఁ బ్రార్థింప, నద్దైత్యుఁ డున్మత్తతఁ మించి, కిష్కింధ కేతెంచి, ద్వారంబునఁ నిల్చి, మేఘంబు వోలె గర్జనల్ సల్పి, 'యాలంబు నాకిమ్ము వాలీ!' యటంచార్వఁగా, వాలి కోపించుచుఁ వచ్చి దాఁకంగఁ, బోరాడి రా యిర్వురుఁ క్షోణి కంపింపఁగఁ;—



గొన్ముులఁ జిమ్మునాదున్న నవ్వాలి, యాజంతువుఁ ముష్టిఘాతంబులఁ గొట్ట, నాదున్న బిట్టార్చుచుఁ వచ్చి వాలిఁ "పెఠీ" లంచు మూర్ధంబునఁ దాఁకు శైలంబు డీకొన్న మాడ్కిఁ, గడుఁ బోరి రీ రీతి నొక్కింత కాలంబు, నాపై మహోముష్టిఘాతంబులఁ వాలి యద్దైత్యు వక్త్రంబుపైఁ గొట్టి, యవ్వాని హస్తంబులఁ బట్టి, మే నట్టులే చుట్టఁగాఁ జుట్టి, పైకెత్తి గిర్గిఱ్ఱునఁ ద్రిప్పి, క్రిందఁ బడఁ వైచి పై మోరగాఁ గంఠముఁ ద్రిప్పి, ప్రాణంబు దప్పించి, యా మేను పైకెత్తి యూటార్చుచుఁ జిమ్మె, నా దేహ మాఘాటిపై యోజనంబిట్టు లేతెంచి నీయద్రిపై వ్రాలె, నట్లొట రక్తప్రవాహంబుతో నిండి యీపర్వతంబొప్ప వీక్షించి యిందుఁ దపంబున్న మాతంగుఁడఁ మౌని, క్రోధంబునఁ - వాలియే యింత గావించె' నంచెంచి, యా వాలి యీపర్వతంబెక్క నవ్వాని శీర్షంబు వే వ్రక్కలౌనంచు శాపింప, నావార్త నాలించి భీతాత్ముఁడై వాలి యీ కొండఁ దా నెక్కకుండుఁ;—



శ్రీరామచంద్రుండు (కాలిబొటనవ్రేలితో) దుందుభికళేబరమును (నూఱుయోజనములుదాఁటిపోఁ) జిమ్ముట.

ప్రభూ! దైత్యుదేహంబు నవ్వాలికేగాని చేఁదాల్చిమీటంగ రాదేరికిఁ, నీవు నద్దాని నారీతిగామీటుచో, వాలిఁ జంపంగశక్తుండ వీవంచు నే నమ్మెదఁ, దేవ!' యంచన్న, శ్రీరాముఁ డామాటకుఁ నవ్వి 'సుగ్రీవ? ఆగాత్రమెందుండునో చూపుమా!' యన్న, నందొక్కెడఁ గ్రాలుచున్నట్టి యద్దైత్యుదేహంబుఁ జూపంగ, శ్రీరాముఁ డా షేరు

శైలంబుమాడ్కిన్ గడున్ దోఁచు నద్దైత్యుగాత్రంబు తాఁ డాసి, కాలుఁ గదింబూన్చి యద్దాని మీటెన్, మహావేగమై యస్థి నూఱామడల్ దాఁటిపోఁ గాంచి, సుగ్రీవుఁ డాశ్చర్యమగ్నుండునై పల్కె: 'శ్రీరామ! యీదేహ మానాఁడు రక్తంబుమాంసంబుతోఁ గూడి నిండారె, నద్దాని నావాలి మీటెన్ జుమీ యోజనం బేగఁగా; దేవ! నేఁ డిద్దియో శల్యమాత్రావశిష్టంబుగా నుండఁగా బెండుగా! కావునన్ వాలికిన్ నీకు నే తారతమ్యంబొ లెక్కింపఁగా రాదు;

శ్రీరామ! యావాలి తా నిత్యమున్ సప్తవారాసులన్ మున్గి, యొక్కొక్కవారాశి నీరంబు కైదాల్చి, ఖద్యోతు నర్ఘ్యప్రదానంబుచేఁ దృప్తుఁ గావించు సూర్యోదయంబందు; వేగంబునన్ వాయువున్ మించు; నవ్వాలికిన్ సాటియే గల్గ, రాతండు నీయేడుతాళంబులన్ హస్తమం దొక్కటౌనట్లుగాఁ బట్టి, పత్రంబులన్ ద్రుంచు; నా తాళవృక్షంబులం దొక్కటేన్ బట్టలేఁ డింద్రుం, డివ్వాని నీ వొక్కబాణంబునన్ ద్రుంగిపో నేసితేన్ రామ! నీలావు తద్వాలిశౌర్యంబుకంటెన్ గడున్ వొడ్డదా నంచు నే నెంచెదన్ దేవ! యేధీరుఁ డీయేడుతాళంబులన్ ద్రుంచునో యొక్కబాణంబునన్ వానిచే వాలి ప్రాణంబులన్ బాయునంచున్ మహత్తుండు నా మాని వాక్రుచ్చియుండెన్ మహాత్మా!' యనన్, రాఘవేంద్రుండు మందస్మితం బొప్ప, శీర్షంబుపకించి, యస్త్రంబు సంధించి పోమీటి, నామ్ముల్కి తాళంబులేడింటినిన్ ద్రుంచి, పాతాళమున్ జొచ్చి వేవచ్చి శ్రీరాముహస్తమ్మునన్ జేరె, నారీతి నీక్షించి సుగ్రీవుఁ డాశ్చర్యమగ్నుండునై, రాముఁ గీర్తించుచున్ మ్రొక్కుచున్ బల్కె;- 'నో రాఘవేంద్రా! మదిన్ గల్గుసందేహమున్ బాసితిన్, వాలి నీబాణఘాతంబునన్ జచ్చు, నా కబ్బుఁ గీశాధిపత్యంబు సత్యంబు, మూఢాత్ముఁడన్ నేను నీలావు నిట్టుల్ పరీక్షించితిన్, దప్పు సైరింపవే!' యంచుఁ బాదంబులన్ బట్టి ప్రార్థింప, శ్రీరాముఁ 'డో వానరోత్తంస! సందేహమైనన్ విచారించుటల్ దోసమే? లెమ్ము, జాగేల? కిష్కింధకున్ బోయి యావాలితో నాల

ముఁ జేయుమా! నేను బాణాహతిఁ వాని ప్రాణంబులఁ గొందు, కీశాధిపత్యంబు నీకిచ్చెదఁ బొమ్ము పొమ్మన్న;—

## వాలిసుగ్రీవుల ప్రథమ యుద్ధము.

నీలుఁ నలుఁ దారు నయ్యంజనాపుత్రునిఁ గూడుచుఁ, యుద్ధ సన్నద్ధుఁడై, రామసౌమిత్రులుఁ వెంట విచ్చేయఁగా, నేగి, కిష్కింధ కల్లంతదూరంబునఁ జెట్టునీడఁ రఘూత్తంసులుఁ నిల్వ, సుగ్రీవుఁ డుగ్రుండునై మించి కిష్కింధ కేతెంచి, తద్ద్వారసీమఁ దగఁ నిల్చి గర్జించినఁ, వాలి సుగ్రీవునిఁ గాంచి విచ్చేయఁగా, ద్వంద్వయుద్ధంబు గావించి రాయిద్ద్వ రత్యంతముఁ;—

రాముఁ డాదవ్వులందుండి వీక్షించి వా రిద్వురాకార రేఖావిలాసంబులఁ, దేహతత్త్వంబులఁ భాషణఁ భీషణంబౌ ప్రతాపంబునఁ విక్రమాటోపవీర్యంబునం, దొక్కటైయుంట లక్షించి, శ్రీరాముఁ డాశ్చర్యముఁ బొంది, బాణంబు సంధించియుఁ డించి, చింతించి తానాత్మఁ గర్తవ్యమేదోచ, కవ్వారిపో రెంచి వీక్షించుచుండంగ, సుగ్రీవుఁ డావాలిచేనొచ్చియుఁ, ముష్టిఘాతంబునఁ గుల్లలై పోవ దేహంబు నిర్వణ్ణుఁడై, రాముదిక్కై మొగంబెత్తి, దృష్టిఁ బ్రసారించి, వీక్షించె; రాముండు బాణంబు కేలూనకేయుండుటల్ గాంచి, భీతాత్ముఁడై యాత్మఁ జింతించు 'నే నేటికీ రామునిఁ నమ్మి దోర్వీర్యదుర్వారుఁడౌ వాలితోఁ బోరు కాంక్షించితిఁ, మోసమేవచ్చె' నంచెంచి ప్రాణేచ్ఛమై ఋష్యమూకాద్రినిఁ జేరఁగాఁ బాఱినఁ; గాంచి శ్రీరాముఁ డావెన్కనేపోయి సుగ్రీవునిఁ డాయ, ఖిన్నుండునై వానరాధీశుఁ డారామునితోఁ బల్కు:-

'రాజేంద్ర! నిఁ నమ్మి నే వాలితోఁ బోరి చావంగ నుంటిఁ గదా? యిట్లుపేక్షించి నా చావు నీక్షింతువే? సూర్యవంశోద్భవుం డీవు కల్లల్ వచింపంగ ధర్మంబె? యే లింతమోస 'బటంచాడు సుగ్రీవుతో రాముఁ డిట్లాడు;—

ఓవానరోత్తంస ! మోసంబునుఁగాదు, నాయం దుదాసీన భావంబునుఁ లేదు, నిన్ వైరికర్పించునుద్దేశముఁ గాదు, మీ రిర్వురా యశ్వినీసూనుల, ట్లొక్కరూపంబుతో భేదమే లేకయుంటఁ గనుంగొంటి, దుర్వారమానమ్ము నే వీడినఁ, వాలినే చంపునో, కాక నిన్నే హతుఁగా జేయునో? యంచు శంకించి కర్తవ్యమూహింపఁగాలేక, నే నూరకట్లుంటినేగాని వేఱొండుగా, దింతసత్యంబు- నీ విప్పుడేదైన గుర్తింపనా చిహ్నముఁ దాల్పు'మంచన్న, సౌమిత్రి తానొక్క పూమాలికన్ దెచ్చి, సుగ్రీవుకంఠంబునన్ వైచె; రామింద శ్రీరాముఁడిట్లాడు- నే నిప్పుడా వాలి సంహారముఁ జేసెదన్, బోరఁబొ'మ్మన్నఁ దా మంత్రులన్ గూడి, శ్రీరామ సౌమిత్రులుఁ వెంటనే తేఁగాఁ బోయి, కిష్కింధ కల్లంతదూరంబునన్ జెట్టుమాటొందఁగా రామసౌమిత్రులుఁ నిల్వ, సుగ్రీవుఁ డుగ్రాగ్రతారుండునై పోయి, కిష్కింధకే తెంచి తద్వారదేశంబునన్ నిల్చి ఘోరంబుగా సింహనాదంబు గావించె, నద్దానినాలించి యవ్వాలి రోషంబునన్ యుద్ధముఁ జేయఁబోఁజూడఁగా, నడ్డమై వచ్చి యావాలితో దారయౌ తార భాషించు నీరీతి;—

వాలినియుద్ధమునకుఁ బోవలదని, తార యడ్డగించుట.

సుగ్రీవుఁడో, నిన్న నీచేత నాలంబులో నొచ్చియుఁ, నేఁడు ధైర్యంబునన్ నిన్నుఁ జేరన్ గదా, పోరుగావింపఁగా నాథ! యీయింతలో నింత ధైర్యంబు నీవైరి కెట్లబ్బెనో, సుంత యోచింపవే?- అంగదుం డాడఁగావింటి, శ్రీరామచంద్రుండు, పిత్రాజ్ఞ సీతాసతిన్ లక్ష్మణున్ గూడి కాంతారమందుండ, నా రామసౌమిత్రులన్ బాపి, దౌష్ట్యంబునన్ సీత నారావణుం డెత్తి కొంపోవుటన్, వారు సుగ్రీవుసాహాయ్యముఁ గోరి యిచ్చేసినారంట, సుగ్రీవుస్నేహంబు గావించి, రాముండు నిన్ జంపి, యీ కీశసామ్రాజ్యసర్వంబు సుగ్రీవుస్వాధీనముఁ జేయఁగాఁ బూఁ ప్రమాణంబు గావించినాడంట, యాయంగదుం డేగి, యాఋష్యమూకాద్రిప్రాంతంబు నందుండి యా రాడఁగా నిట్టు లాలించి విచ్చేసినాడంట, యోదేవ! నా

మాటపాటింపవే! నాథ! యింకేలవైరంబు? శ్రీరాముఁ డెన్నంగ సామాన్యుఁడే? వాని శౌర్యంబు నాలింపమే? వేగ నీ వేగి ప్రాణప్రియా! రాముతో సంధి నర్థింపుమీ!' యన్న;—

### వాలి తారను తిరస్కరించి సుగ్రీవునితో యుద్ధమునకు వచ్చుట

ఆవాలి యామాట లాలించి- 'యోజేల' సంగ్రామముఁ గోరి, నావైరి నావీటి ద్వారంబునన్ జేరి, నన్ జీరఁగాఁ, బోరుఁ గావింపకుండంగ భీరుండనే నేను? ధీరాత్మవే నీవు నిట్లాడఁగాఁ బాడియే? ప్రాణమే మంతగా తీపియే? నవ్వరే కాంచువీరుల్? సతీ! రాముఁ డేలా ననున్ దాఁకుఁ? దాఁ దాఁకినన్ దాఁకెఁ బో కాని తప్పేమి- నేఁ బోరెదన్, శూరుఁడౌ నాకు నిక్కోటికే సంధి? శ్రీరాముఁడే కాదు, సుత్రాముఁడే వచ్చినన్ వచ్చెఁబో పోరెదన్, వచ్చెదన్- లేక నేఁ జచ్చెదన్ గాని, సుగ్రీవుఁ డత్యుగ్రుఁడై వచ్చి నాపైని గర్జించుచుండంగ, నిర్జింపకే తాళఁగాఁ జాలనే బాల! యీరీతి యాభ్రాంతి నీకేల! నాకేల రాముంతు? నాకేటికీ సంధి! యీరేడు లోకంబు లేకంబుగా వచ్చినన్ బోరెదన్, దేవతల్ మెచ్చఁ జీకాకు గావింతుఁ, బోకార్త్తనం చాడి శీఘ్రంబుగా వచ్చి సుగ్రీవు నీక్షించి తా నాగ్రహోదగ్రుఁడై వే భుజాస్ఫాలముల్ జేసి, వాలంబు పైకెత్తి గుండ్రంబుగాఁ ద్రిప్పి తా దెప్పునన్ నేలకున్ రొప్పి, చేయిచ్చి వే దాఁకరాఁ గాంచి, సుగ్రీవుఁ డార్భాటముల్ సల్పుచున్ దిట్టయై మెట్టి, యావాలి కేల్వట్టి యాపట్టునన్ వాని మే నట్టులే బాహుమూలంబునన్ గట్టిగా నొక్కుచున్ బట్టెనన్;—

### వాలి సుగ్రీవుల ద్వితీయ ద్వంద్వయుద్ధము.

ముష్టిచే వాలి, సుగ్రీవు మూర్ధంబుపైఁ గొట్టె, సుగ్రీవుఁ డవ్వాలి మూర్తిన్ గదాఘాతముల్ బెట్టె, నవ్వాలి లోనొచ్చి గీయంచు గీపెట్టి, సుగ్రీవునిన్ దక్కఁ జేఁ గట్టిగాఁ బట్టి, యిట్టట్టు లూగాడ్చి తా నేలకున్ గొట్టె, నాపెట్టునన్ భానుసూనుండు నిట్టూర్పుఁ బోఁ బుచ్చి, బిట్టార్చుచున్ లేచి దట్టించుచున్ గాళులన్ బట్టి బిట్టీడ్చుచున్ ద్రొమ్మునన్ గొట్టె,

నిట్లొండొరుల్ మించి పోరాడుచున్ మూల్గుచున్ సల్గుచున్ గొంత కాలంబు భీమంబుగా నాలమున్ సల్పఁగా;—

{ శ్రీరాముఁ డేకైకబాణమున వాలినిఁ గొట్టుట; వాలి శ్రీరామునిఁ దూలనాడుట. }

దవ్వులన్ జెట్టుమాటుండి శ్రీరాముఁడున్ విల్లుకేలందు, నద్దిక్కులన్ బిక్కటిల్లన్ గడున్ నారి మ్రోఁగించి, ఘోరమ్మునౌ నస్త్రమున్ వింట సంధించి, యాకర్ణమాయత్తఁ ద్రొడిచి, తీవ్రంబుగా వాలిపై దృష్టి సారించి బాణంబుఁ బోవీచె; నయ్యమ్ము సూర్యాగ్ని తేజంబునన్ మిన్ను మన్నేకమై మండుచున్ వచ్చి, యింద్రాత్మజున్ దాఁకి, వక్షస్థలిన్ గాడినన్, వాలి బల్సోలి దర్పంబుఁ బోఁదూలి, భూమిస్థలిన్ వ్రాలెఁ దా రక్తసిక్తాంగుఁడై, రోచులన్ వీడి ఖద్యోతుఁ డుర్వీస్థలిన్ గూలు చందంబు దోఁపించుచున్, గాంచి శ్రీరాముఁ డంతంతనన్ దవ్వు డాయంగ రా, నాతనిన్ వాలి వీక్షించి, లోఁసల్క మొల్కెత్తఁగాఁ బల్కె;- 'శ్రీరామ! ధర్మాత్ముఁడీ వంద్రు, భూమండలిన్ సత్యసంధుండ వీవంచుఁ గీర్తింత్రు, మూర్ధాత్మకుల్ గారె యామానవుల్! రామ! నీకెన్నఁడే నెగ్గుగావింప, నేధర్మమంచెంచి నన్ జంపితో? క్రోఁతులన్ జంపఁగావచ్చునే కోవిదుల్? రీతిలే కట్టులన్ జెట్టుచాటుండి దొంగట్లు నన్ గొట్టితే? వీరులున్ మెత్తురే దీని? నాతోడ నీవే భుజాటోప మేపారఁ బోరాటమే సల్పియేయున్నచోఁ, జూపుచుంటిన్ జుమీ మత్ప్రతాపంబు! నీ విట్లు గావింపఁగా సిగ్గు కాలేదె? ఓరామ! లోకైకవీరుండ వీ వందు, రామాట యేపాటిదో? యన్నదమ్ముల్ గదా మేము? మాలోన మే మిట్లు పోరాడ నీ కేటికీ జోలి కాఁబట్టెనో? క్షత్రియుల్ దుష్టసత్త్వంబులన్ వేటలోఁ గొట్టభావింతురే కాని, నిత్యులన్ సాదులౌ క్రోఁతులన్ జంప నుంకింతురే? క్రోఁతిమాంసంబు వర్జ్యంబుగున్ గాదె? శ్రీరామ! నీ తండ్రి వాక్యంబు పాలింప, సద్ధర్మసంచారివై కానలో మౌనివేసంబుతో నుంటివే?- యొక్కదోసంబుతో కోటి పుణ్యంబులున్ బోదుకావే? యిటుల్ స్వార్థివై, రావణున్ జంపు కార్యార్థివై నీవు

సుగ్రీవుసఖ్యంబు గావించి, నన్ జంపితే? బుద్ధిమాసెఁగదా నీకు? నే
రావణున్ వాలమూలంబునన్ గట్టి సంద్రంబునన్ ముంచి. యాతండు
భీతుండునై నన్నుఁ బ్రార్థింపఁగా వీడితిన్, రామ! నన్ గోరియుంటేని
భూజాతతో లంక నీపాటికిన్ దెచ్చి, నీముందు నే నుంచియుందున్
గదా! స్వల్పకార్యంబునై తెల్పియే మాలి, బల్ తుచ్ఛమార్గంబునన్
బోదువే? దుర్యశం బంచు శంకింపవే!' యంచు నోనాడు నావాలికిన్
రాముఁ డీరీతి బ్రత్యుత్తరం బిచ్చె;—

## వాలికి శ్రీరామచంద్రుని ప్రత్యుత్తర సమాధానముఁ

ఓవానరా! బుద్ధిలేనట్టి దౌజంతు వీ వెన్నఁగా, ధీయుతుల్ తాపస శ్రేష్ఠు, లేమోయి యిట్లంచుఁ బల్కంగ రానట్టి ధర్మాంశముల్ చర్చ గావింప నీశక్యమే? ధర్మమార్గంబు సూక్ష్మాతిసూక్ష్మంబగున్ జుమ్ము, వాక్రుత్తు నే విన్ము: దుష్టాత్ములన్ జంపుటల్ రాజులౌ మాకు నౌఁగాదె ధర్మమ్ము? నీతమ్ము నిల్లాలిఁ, బాపం బటం చెంచకే, బల్మిమైఁ బట్టి భోగించు భ్రష్టున్ నినున్ జంపుటే మాకు న్యాయమ్ము, సుగ్రీవుపై భారి భావంబు పోనాడి, ప్రార్థించినన్ మాన, కాధీరు, నిర్దోషి, నీసోదరున్ జంపనుంకించు దుర్మార్గునిన్ నిన్ను శిక్షించుటే రాజులౌ మాకు న్యాయమార్గమ్ము; మే మట్టులన్ జెట్టునన్ డాఁగి నిన్ గొట్టుటన్ కాదు దోసమ్ము, చూడన్ మృగంబున్ దగన్ జెట్టుమాటొంది సంహారమున్ సల్పుటల్ కాదు దూష్యమ్ము, వేఁటాడఁగా నొక్రమంబిద్ది, యార్షేయమైయొప్పు సత్యమ్మిదో వానరా! నేను నీతోడఁ బ్రత్యక్షమై, పోరు గావించియే యుంటినేనిన్ నెఱిన్ నీవు కిష్కింధలోఁ జొచ్చి, యవ్వీటనే దాఁగుచో నెట్లు? నేమాని నొట్టన్ జనావాసమున్ జేరఁగా రాదు, నిన్నప్పుడే మాడ్కిఁ బోకార్పనౌ నేను? నే బాస గావించితిన్ నిన్ హతున్ జేసి కీశాధిపత్యంబు నీకిత్తునంచట్లు సుగ్రీవుతో; నా ప్రమాణంబు వ్యర్థంబగున్ గాదె, నీవట్లు కిష్కింధలో దాఁగుచో? యొంచి నేనిన్ని, ధర్మంబులోనన్ విచారించి, నిర్విఘ్నమై నా ప్రమాణంబు గిట్టింపఁ జింతించి, నేఁ జెట్టుచాటుందితిన్ గాని, నీతోడఁ బోరాడ శం

కించి నే నిట్టులన్ జేయ. నీవెంత? నీశౌర్య మన్నంత నాకెంత! సందేహముఁ మాను మిందే యధర్మంబునన్ గల్గదో వానరా! చూడుమా! నీవు నాశత్రువౌ నాదశగ్రీవుస్నేహంబు గావించుటన్, శత్రుమిత్రుండు శత్రుండగున్ గాన, నే నిన్ను నాశ్యంబు సంహారముఁ సల్పుటొప్పేయగున్ మర్కటా! చెప్పపాటంతలో రావణున్ బట్టి మట్టేసి సాధింప శక్తుండ వీ వంచు నే నెంచియున్ గూడ, బలదృప్తుఁడున్ ధర్మహీనున్ నినున్ ద్రుంచుటే మాకు సత్కర్మమం చెంచి, నిన్ మాని సుగ్రీవుసఖ్యంబునాసించితిన్ గాని నేస్వార్థతన్ గాదు, సందేహముఁ మానుమా! నీకుఁ గైవల్యమే నిచ్చెదన్, జ్ఞానివై ప్రాణముల్ వీడుమా!' యన్న నావాలి హృష్టాత్ముఁడై రాముమోమున్ మరల్ వీక్షించి యానంద మేపార మోదాశ్రువుల్ జాఱ భాషించు;—

శ్రీరామ! నారాయణా! నిన్ను నేఁ గానకే మందబుద్ధిన్ గడున్ నిష్ఠురం బాడితిన్, దోసమయ్యెన్ గదే? నైనఁ బునాపాపమున్ దేవ! జ్ఞానోదయంబయ్యె నో మాధవా! రావణున్ జంపుకార్యంబునన్ నీసహాయానకై యెల్లనృక్షించ రానీకము ల్లేరునున్ ధాత్రిలోఁ బుట్టెనున్ గూడ, మూఢాత్ముఁడై యాదశగ్రీవుసఖ్యంబు గావించితిన్, ధాత యాజ్ఞన్ విరస్కారమున్ జేసితిన్, దోషినై యుంతి, నేఁ డిట్టులన్ శాస్తి గావించి పూతాత్మున్ జేసినా వీవు, శ్రీనాథ! యోదుష్టసంహారకా! శిష్టసంరక్షకా! ధర్మసంస్థాపకా! రామ! శ్రీరామ!' యంచాద్బుతంబున్ మూర్ఛనై పోలె;—

వాలిపై వ్రాలి తారాంగదులు రోదించుట.

శ్రీరాము బాణంబునన్, వాలి భూమిస్థలిన్ గూలె నన్వార్త నాలించి, తత్పత్నియౌ తార తాఁ, బుత్రుతోడన్ గడున్ గుందుచున్ వచ్చి యవ్వాలిపై వ్రాలి, బాష్పంబుజాల్వాఱఁగాఁ, దారహారంబులల్లాడఁగాఁ, గేశపాశంబు వీడంగ 'హా!' యంచు రోదించెఁ; దా వక్షమున్ మోదికొంచున్ దలన్ నేలకున్ గొట్టుకొంచున్, విధిన్ దిట్టుకొంచున్ బ్రలాపించె- 'హానాథ! హావానరాధీశ్వరా! శూర! లోకైకవీరా! మహా

శైలముల్ బంతు లట్లార్చు నీవిక్రమం బెందుఁబోయెన్? త్రిలోకేశుఁడౌ నింద్రపుత్త్రుండవే! యిట్టినీశౌర్య మెం దేగెనో? మానవుం డా నినున్ మన్నుపాల్సేసె? నారాముతోఁ బోర రా దంటి, నామాట విన్నంటి, నాతండు నిన్ జంపఁగానుండె నంచంటి, నామాటపాటింప కీపాటునీచేతు లన్ దెచ్చుకొంటే? అయోనాథ! క్షీరాబ్ధిలో మందరంబుంచి, యవ్వాసు కిన్ ద్రాడుగాఁజుట్టి, శౌర్యంబుతోఁ ద్రచ్చవే? యిట్టినీలావు నేలంటెనే? రావణున్ జంకలోఁ జిక్కఁగాఁబట్టి సప్తాంబుధుల్ ముంచునీశక్తిసామర్థ్య ముల్, నేఁ డిటుల్ వ్యర్థమైపోయెనే? శ్రీమహాదేవుపాదంబులన్ వ్రాల్చు నీమౌళి, నీనేల నీధూళిలో వ్రాల్చితే? దేవ! నీపాటు నీక్షించి సైరింపఁ గాఁజాల, నన్ జూడవే! పల్కవే! కూర్మికుఱ్ఱండు నీరొమ్మునన్ వ్రాలి రోదించు నీయంగదున్ గాంచవే! కౌఁగిటన్ జేర్పవే? చెక్కిలిన్నొక్క ముద్దాడవే?' యంచు శోకించి, సుగ్రీవు నీక్షించి-'నీవైరితోఁ బోరఁగా నేరకే పందవై పాఱి శ్రీరామునిన్ దెచ్చి కార్యంబు సాధించితే? తుచ్ఛ రాజ్యంబు కాక్షించి నీయన్నఁ జంపించితే? యిష్టమీడేరెఁబో, పేర్మిమై సర్వభోగంబులన్ బొందుమీ! యంచు నోనాడి; శ్రీరాముదిక్కై;—

'అహో రామ! యుగ్రాటవిన్ నిన్నుఁజేరంగ నీతండ్రి మాడ్కిన్ నినున్ గోరెనే వాలి? నీరాజ్యభోగంబులన్ గొన్న యాకైకపుత్త్రుండో యీవాలి? నీప్రేయసిన్ బల్మిమైఁగొన్న భ్రష్టాత్ముఁ డా రావణుండౌనో యీవాలి? న్యాయంబుఁ బోఁదోలి, కారుణ్యమున్ మాలి, నిష్కారణం బిట్టు లీధైర్యశాలిన్, రిపువ్రాతఘోరాటవీ దావకీలిన్ ధరన్ గూలఁగా నేసితే? ధాత్రి నీయట్టిధర్మాత్ముఁ డే యిట్లధర్మంబుఁగావింప, సామాన్యు లన్ జెప్పఁగానేల? యంచిట్లు, నోనాడు నాతారతో, రాముఁడొక్కింత సౌమ్యంబుగాఁ బల్కె;—

**శ్రీరామచంద్రుఁడు తారకు సమాధానము చెప్పుట;**
**వాలి, సుగ్రీవతారాంగదుల నూఱడఁ బల్కుట.**

ఓసాధ్వి! శోకంబు మానంగదే! వాలి కీభూఋణం బింతతోఁ దీఱుటన్ జచ్చు, నీధాత్రిలోఁ జావువల్దన్నచో మానునే? కాలమే

డాయుచో, నందఱుం జచ్చువారేకదా! ధీరుఁడౌ వాలి, యుద్ధంబునం గూలి కైవల్యసామ్రాజ్యభోగంబులం బొందఁగాఁబోవు; శోకింప నీకేటికిం? ధైర్యముం బూనుమా!' యన్నతారా చేలాంచలం బెత్తి తాఁ గంటి నీరొత్తుచుం నిల్చె;—

నాయంతలో వాలి కన్విచ్చి-తారాసతిం, బుత్రు నాయంగదుం గాంచి, సుగ్రీవునిం జేరఁగాఁజీరి యిట్లాడు-'నాసోదరా! రమ్ము, వైరంబు దీఱెం; రఘూత్తంసుఁడౌ రాముకారుణ్యముం బొందుటం జేసి, నీ కార్యమీడేరె, నీ యంగదుండింక నీపుత్త్రుఁడేసుమ్ము, రక్షింపుమా! తార నీ వేలుమా! హేమహారంబు నీకంఠమందొప్పఁగా నేసి, యీకీశసామ్రాజ్యపట్టాభిషిక్తుండవై గ్రాలుమా! రామకార్యంబుసాధించి, సత్కీర్తిమై వెల్గుమా! తమ్ముఁడా! దేహముం వీడి నేఁ బోయెదం, వైరముం మానుమా!' యంచు నయ్యంగదుం గాంచి-యోనందనా! చేతులారం గఁగీశాధిపత్యంబు నీకేసుగట్టంగ లేనైతి, నీప్రాప్తి నాప్రాప్తియిట్లుండె, దుఃఖంబుసైరింపుమా! నిన్ను సుగ్రీవుఁడోముం సుతా! యాతనిం దండ్రిగా నెంచి సేవింపుమా! రాముపాదాబ్జముల్ గొల్వుమా! కీర్తి నార్జింపుమా! దీర్ఘకాలంబు జీవింపుమా!' - యంచు దీవించి, యాతార నీక్షించి;-'సుగ్రీవుఁ డీయంగదుం డున్నవారల్ సతీ! నిన్నుఁ బోషింత్రు, నేఁబోయెదం, శోకముం మానుమా!' యంచుఁ దాఁగన్నులం నిండుగా నీళులంనించి యొక్కింతసైరించి శ్రీరామునిం గాంచి సద్భక్తిమై ధ్యానముం జేయు;-

వాలి శ్రీరామచంద్రుని స్తుతించి, ప్రాణములువిడుచుట.

ఓదేవ! యాబ్రహ్మరుద్రాదు లేమూర్తి సేవింతురో, తాపసుల్ గాంచ పంచేంద్రియోన్మాదముం బాసి, యాపంచప్రాణంబులంమించి బంధించి, తా రాత్మశక్తిం విలోకించి, యేదివ్యరూపంబుదర్శింపఁ గాంక్షింతురో? యజ్ఞయాగంబులంసల్పియుం, యుద్ధమధ్యంబునం జచ్చియుం, బుణ్యులై పోయి యాదివ్యలోకంబునుం జేరి వీక్షింపఁగాంక్షింతు రేదేవు,

నాదేవుఁడౌ నీవు, నా కిప్పుడీరీతిఁ బ్రత్యక్షమైనావు, నాపాపముల్ మండె, నాపున్నెముల్ పండెఁగా! చాలు నీలోక, మాలోకమున్ గూర్పవే! వేఁడెదన్, రామ! ప్రాణంబు లేగున్ గదే! బాణ మీకాయమున్ నాటె, లాగంగదే!' యన్న- నారామునాజ్ఞన్ వెసన్ నీలుఁ డయ్యమ్ముఁ బోఁదూసె, 'శ్రీరామ! శ్రీరామ! శ్రీరామ! యంచాడుచున్ వాలి ప్రాణంబులన్ బాసె;—

## శ్రీరామునాజ్ఞచే సుగ్రీవుఁడు కిష్కింధాసామ్రాజ్యపట్టముఁ గట్టుకొనుట.

నావేళఁ దారాదికాంతామణుల్ రోదనల్ సల్ప, సుగ్రీవుఁ డాయంగదుం డాదియౌ వానరుల్ శోకమున్ సల్పఁగా నేడ్పు మిన్నంటెఁ-నామీఁద సౌమిత్రి వారించి దుఃఖంబు, నవ్వారిచే వాలిగాత్రంబు, గంధంబు మాల్యంబు వస్త్రంబుచే వెల్గఁజేయింపఁగా, వాలిదేహంబుఁ గొంపోయి వా రొక్కచో నగ్నిసంస్కారమున్ సల్పి, నీరాడి, రాపిమ్మటన్, బారలౌకిక్రియల్ దీర్చి శుద్ధాత్ములై రామునాజ్ఞన్, గపుల్ పోయి, కిష్కింధలో సన్ముహూర్తంబునన్ గీశరాజ్యాధిపున్ జేసి సుగ్రీవు, నాయంగదున్ యౌవరాజ్యాధికారంబునన్ నిల్పి, వారల్ మహానందులై యుత్సవంబుల్ గడున్ సల్పి, రామీఁద సుగ్రీవుఁ డాయంగదుండున్ దగన్ రాజచిహ్నంబులన్ దాల్చి, మంత్రుల్ మఱిన్ దండనాథుల్, ప్రజల్ గూడుచున్ దోడరా, మంగళారావముల్ మ్రోఁగ, సంరంభ మేపార విచ్చేసి, శ్రీరామసౌమిత్రులన్ గాంచి సాష్టాంగదండప్రణామంబు గావింపఁగా, రాముఁ డీక్షించి, దీవించి, సన్మానముల్ పల్కి, సుగ్రీవునిన్ గాంచి భాషించు:-'నాషాఢమాసంబు విచ్చేయుటన్, దాడికిన్ వీలుకాదౌట, మీరేగి కిష్కింధలోనుండుఁడీ! తాపసుల్ మేమటుల్ పట్టణావాసమున్ జేయరాదౌట, నీమాల్యవంతంబుపైనుండి యీవానకాలంబుఁబోఁబుత్తు, మాపై శరత్కాలమే తేరఁగా, శత్రుపై దాడికిన్ బోదమంచాడి, యవ్వారి వీడ్కొల్పి, సౌమిత్రితోఁగూడి యమ్మాల్యవంతంబునన్ గాలమున్ బుచ్చుచుండంగ;—

వర్షర్తువొప్పారె, ఝంఝానిలం బెంతయున్ వీచెఁ, జిత్రాతిచిత్రంబులై మేఘజాలంబు లత్యంతమున్ మింటఁ జూపట్టె, గాఢాంధకారంబు గ్రమ్మెన్ దిశల్ నాల్గు, క్రొక్కారు మెఱుంగుల్ పసన్ జూపె, నత్యద్భుతారావముల్ మేఘముల్ సల్పెఁ, గుంభంబులన్ నించి సంరంభ మేపార, రంభాదు లాయభ్రమందుండి, యీకుంభినిన్ బోసిరోనాఁగ, వర్షంబు బోరంచు వర్షించుచున్, మింటికిన్ మంటి కేకైకధారాప్రవాహంబుగా, నీరమవ్వారిగా ధారుణిన్ వ్రాల్చె, నొక్కొక్కెడన్ బిడ్గులున్ గడ్బిడల్ చేసె, మండూకముల్ గూసె, జోకారఁ బింఛంబులన్ విచ్చి పీఁకన్ నెమిళ్లాడె, వర్షంబుచే నీళులన్ నిండి మార్గంబులే కానరాకుండె, నెందెందునన్ నీరులే యేఱులై పాఱెఁ, బెన్నేఱులున్ మ్రోఁతలన్ మీఱె, భూభాగముల్ పచ్చనై యెల్లెడన్ బచ్చికల్ దోఁచె, నంతంతకున్ వర్షముల్ నిల్చె, నభ్రంబు శుభ్రంబుగా నొప్పె, సూర్యప్రకాశంబు స్వచ్ఛంబుగాఁ దోఁచె, రే లంత నచ్ఛంబుగాఁ జంద్రికల్ గాచె;—

### { సుగ్రీవుఁడు తనసమస్త సైన్యముతో వచ్చి, మాల్యవంతమున శ్రీరాముని దర్శించుట }

అంతన్ సమీరాత్మజుం డప్పుడే తెంచి సుగ్రీవునిన్ డాసి, 'కాంచన్ శరత్కాలమే తెంచె, శ్రీరామకార్యార్థమై సేనలన్ గూర్పుమా!' యన్న, సుగ్రీవుఁ డానందమేపారఁగా, నీలునిన్ బిల్చి, యందందునన్ బర్వతప్రాంతముల్ గల్గు నీయెల్లభూభాగమందుండు సర్వంబునొ వానరానీకమున్ బిల్వఁగా దూతలన్ బంపనేమింపఁగాఁ జెప్పె; నీలుండు నారీతిఁ, గావించె నామీఁదఁ గొన్నాళ్లపై;—

దూత లారీతిగా సైన్యముల్ గొంచు విచ్చేసి, కిష్కింధలో సూర్యపుత్రున్ విలోకించి యావార్త విన్పింప, సుగ్రీవుఁ డత్యంతహర్షంబునన్, మంత్రిసామంతులున్ దండనాథాదులున్ వెంటరా సైన్యముల్ గొంచు విచ్చేసి, యామాల్యవంతంబునం దున్న శ్రీరాము దౌదవ్వులన్ గాంచి, తా నంతటన్ స్యందనంబున్ వెసన్ డిగ్గి, వే పాదసంచారియైవచ్చి,

శ్రీరామునిఁ గాంచి, పాదంబులకు వ్రాలి, సన్మానముఁ బొందె; వారిరువురు క్షేమవార్తాప్రసంగంబు గావించి, రామునిఁ జూచి సుగ్రీవుఁ డాడెను:- 'రఘూత్తంస! కన్గొంటె నా సైన్యమే తెంచె డిఁక? గాంచఁ గైలాసశైలంబునందుండియుఁ, గాంచనాద్రిఁ, మఱి ద్రోణశైలంబు, నీలాచలం, బొప్పు వింధ్యాద్రి, నాపై హిమాద్రిఁ, మఱి బశ్చిమాద్రిఁ, మఱి బూర్వభాగాద్రి యామందరాద్రిఁ, మహామోఘ బుహాద్రి, సోమాద్రి శోణాద్రులే యాది యా పర్వతశ్రేణులందున్న నీసర్వమా సైన్యముల్ గొంచు, నీలుండు, నయ్యాంజనేయుండు, గంధుండుఁ గాంచఁ గవాక్షుండు, తారుండు, నాజాంబవంతుండు, నస్లేసుషేణుండు, జ్యోతిర్ముఖుం డంగదుం డాదియా సుప్రసిద్ధప్లవంగేశు లొక్కొక్కరే, పద్మముల్ ఖర్వముల్ మీఱఁగా నా నసంఖ్యాతమౌ సైన్యముఁ గొంచురా, నింగియుఁ నేలయుఁ నిండి, నల్దిక్కులఁ జూపుమేరంతకుఁ సైన్యమే పిక్కటిల్లంగ విచ్చేయుచుందంబు నీక్షించితే? వీర లొక్కొక్కరే, మించికార్యంబు సాధింపఁగాఁ జాలువారంచుఁ బల్కాడి, యవ్వారిసత్త్వంబులఁ బుట్టుకల్, నామధేయంబులఁ జెప్పి వర్ణించె నీరీతిఁ—

బెఁ జిచ్చునేఁ జొచ్చి విచ్చేయఁగా, భూమినాకాశమేకంబుగాఁ జుట్టఁగా, సంద్రమే నీఁదఁగా, శేషుదంష్ట్రంబులఁ బీఁకఁగా, మృత్యువక్త్రంబునఁ జొచ్చిరాఁగా సమర్థుల్ సుమీ వీరు! వైదేహినెట్లైన వీక్షించి వృత్తాంతముఁ గొంచు విచ్చేయువా'రంచుఁ బల్కంగ, శ్రీరాముఁ డత్యాదరంబొప్ప సుగ్రీవునిఁ గౌఁగిటం గ్రుచ్చి, లో మెచ్చి 'వైదేహిజాడల్ విమర్శించి విచ్చేయఁగా నాజ్ఞనీ విచ్చి, యీవీరులం బంపుమా!' యన్న, సుగ్రీవుఁ డానీలునిం జేరి తాఁ బల్కె;—

## సీతాన్వేషణార్థము నల్దిక్కులకు, సేనలను సుగ్రీవుఁడు పంపుట.

నీ సేనలం గూడి తూర్పేగి, యాయామినీ పర్వతప్రాంతముల్ చూచి, యామీఁద నయ్యాపగం డాసి, శోణాహ్రదం బేగి, యాకౌశికిం

దాఁటి, శ్రీశారదం జేరి, యాసింధువుం దాఁకి, యామీఁదటం బాం డ్రభూమిం విదేహంబునుం జుట్టి, యామాళవస్థానముం, గోసలం మాగధం మెట్టి, యాబ్రహ్మమాల్యాఖ్యశైలంబులక్షించి, వారాశి నీక్షిం చి, యామందరాద్రిం బ్రవేశించి, యాపై నవద్వీపముం జొచ్చి, యాపిమ్మటం జంబువం ద్వీపముం జూచి, శీతాద్రులక్షించి, కాకోలముం డాసి, యాలో హితాభిఖ్యవారాశి లంఘించి; శ్రీగారుడాఖ్యాశ్రమం బేగి, గోశృంగముం జొచ్చి, దుగ్ధాబ్ధి శోధించి, మీఁదం సుదర్శంబునా నొప్పునద్రిం విలోకించి, శుద్ధార్ణవంబుం దగం గాంచి, యాజాత రూపాద్రినిం జూచి, యామీఁదటం శీర్షసాహస్రముం గల్గి వెల్గొందఁ గానొ ననంతుం భయంబొప్ప సేవించి, యాపైఁ బదిన్నాల్గువేల్ యోజ నాల్ ముందుకీరేగుఁడీ! యయ్యెడం మేరువుం డాసి, యాశైలముం జుట్టు భానుం విలోకించి సద్భక్తిమై మ్రొక్కి, యావాలఖిల్యాదులం జేరి పూజించి, యాపైనఁబూర్వాద్రి నీక్షించి, వేగంబ విచ్చేయుఁడు, డాపైన నాదిత్యువెల్గేమి లేకుంటచే ముందుఁబో సాధ్యమే కాదు, మాసంబుకాలం బునం మీర లీచోటులం జుట్టి, భూజాతవృత్తాంతముం దెండు, పొం డీర' లంచాడ, శ్రీరామసౌమిత్రిసుగ్రీవుపాదంబులం మ్రొక్కి పూర్వాశ శోధింప; వేగంబుగా నీలుఁడేగం స్వసైన్యంబులం గూడి—

సుగ్రీవుఁ డంతం నలాఖ్యుం విలోకించి పల్కాడు- 'సీ వంగ దుం వాయుజుం జాంబవంతుం గవాక్షాదులౌ వీరులం గూడుచుం దక్షిణం బేగుమా! తొల్త వింధ్యాద్రి నీక్షించి, యానర్మదం దాఁటి, మీఁ రాదశార్ణం విలోకించి, యాదండకారణ్యమందుం బ్రవేశించి, గోదా వరిం జేరి, వేత్రావతిం జూచి, కాళింగకర్ణాటకాంధ్రంబులం జోళదేశం బునుం, గేరళంబుం సమీక్షించి, యా పాండ్యరాజ్యంబులోఁ జూచి, యాపైని వౌపర్వతప్రాంతముల్ జూచి, కావేరినీక్షించి, ముందేగ నందా యగస్త్యాశ్రమంబుండు, నందేగి యామౌనికిం మ్రొక్కి, యాతామ్ర పర్ణిం విలోకించి, యాతీరమందున్న యాయాస్థలంబుల్ పరీక్షించి,

హేమాభిధానంబునన్ వెల్గనా పట్టణంబెల్ల వీక్షించి, యంతన్ మహేం ద్రాద్రియందెల్లెడన్ జొచ్చి, వారాశిలో జూచి, యందందునన్ గల్గు ద్వీపంబులన్ ద్వీపకల్పంబులం దెల్ల శోధించి, యామీఁదటన్ బోయి యాయెద్దుకొండంతయున్ జుట్టి, పుష్పాద్రి శోధించి, యాకుంజరాద్రిన్ బచారించి, యయ్యంజనాద్రిన్ విమర్శించి, యాపిష్మటన్ నాగవాసంబునం దెల్లెడన్ జూచి, యామీఁదియద్రుల్ పరీక్షించుచున్ మీర లానిష్పాటే ఉన్ విలంఘించి, వైవస్వతంబన్ బురం జేగి, శ్రీధర్మరాజున్ విలోకించి, యాదేవుఁ బ్రార్థించి యాలోకమందెల్లెడన్ జూడుఁడీ! యంధకారావృతం బౌట ముందేగఁగా రాదు, మీరంతటన్ మాసకాలంబునన్ దేవిసీతా సతీవార్త తెం డేగుఁడీ!' యంచుఁ దా నాజ్ఞ సుగ్రీవుఁ డీయంగ;—

శ్రీరామచంద్రుఁ డాంజనేయునకు సీత కర్పింప ముద్రిక నిచ్చుట.

శ్రీరాముఁ డాయాంజనేయున్ విలోకించి, రాఁబిల్చి తా డగ్గఱన్ జేర్చి పల్కాడు 'నో మారుతీ! వాయువేగా! జనంబందునన్ బాహు శౌర్యంబునన్, బుద్ధిశక్తిన్, నిజస్వామిభక్తిన్, గడున్ గార్యదీక్షన్, నినున్ బోలువా రుండరం చెంచెదన్, నీవు నాజానకిన్ గాంచి, వృత్తాంత మున్ దెచ్చి నాకేర్పడన్ జెప్పఁగా శక్తుఁడౌదంచు నాయాత్మ నాకున్ బ్రబోధించె, నట్లౌట నీముద్రికన్ గొమ్ము, దీనిన్ మహీజాత కర్పించి, నా నేమమున్ జెప్పి, యాసాధ్వినూరార్చి విచ్చేసి, యాతన్వి నేమంబు నాకున్ వినన్ జెప్పుమా!' యంచుఁ దా నుంగరంబిచ్చినన్ గొంచు వాతాత్మజుం, డంచితంబైనబల్ భక్తిభావంబునన్, గన్నులందొత్తి యద్దాని మూర్ధంబు నన్ దాల్చి 'యోస్వామి! నీదౌకృపాదృష్టియే యున్న నీమూఁడులోకం బులం దెచ్చటే నున్న, నేనాన కాజానకీదేవి నీక్షించి భాషించి, యేగుర్తు నేన్ దెచ్చియర్పింతు, నీపాదమా'నంచు భాషించు సామీరి నీక్షించి, హర్షిం చుచున్ రాముఁ డాసీతచిహ్నంబులన్ గొన్ని గుప్తంబుగాఁ దెల్పి, దీవించి పో' మ్మంచు నాజ్ఞావచస్సియ్య, సామీరి యామీఁదటన్ వానరోత్తంసులన్ గూడి మోదాత్ముఁడై దక్షిణం బేగె;—

సుగ్రీవుఁ డంతన్ సుషేణున్ విలోకించి వాక్రుచ్చె, 'నీసైన్యమున్ గొంచు సౌరాష్ట్రమున్ జేరి, బాహ్లీకమున్ జూచి, యాసింధు, సౌవీరమున్, గేకయాభిఖ్యమున్ డాసి, మీఁదేగి పున్నాగభాగంబులన్ జొచ్చి, యాపశ్చిమాంభోధి నీక్షించి, యానారికేళోపరిప్రాంతమున్ గాంచి, వజ్రాద్రి శోధించి, శ్రీపారియాత్రాభిధానాద్రిలోఁ జూచి, యందుండు గంధర్వకోటిన్ విలోకించి, యాచక్రవంతంబు శోధించి, యాపిష్మటన్ సూర్యుఁ డేతావునన్ గ్రుంకు నాపూజ్యమైయొప్పు నస్తాద్రికిన్ బోయి, యామీఁద సౌవర్ణ నీక్షింపుఁ, డందుండి మీరేగి యచ్చోఁ బదిన్ మీఁద నింకెన్మిదో వేలసంఖ్యాతులౌ తాపసుల్, మౌనులై యీశ్వరధ్యానమం దుందు, రాకాంచనాద్రిన్ విలోకించి, యందుండు శ్రీమేరుసావర్ణినామానికిన్ మ్రొక్కి, రం, డాపయిన్ బోవఁగా రాదు, మీరొక్కమాసంబులో జానకీదేవివృత్తాంతమున్ దెండు పొం' డన్నఁ, దోడన్ సుషేణుండు తా నెల్లసైన్యంబుతోఁ బశ్చిమం జేగ;—

సుగ్రీవుఁ డంతన్ గజున్ గాంచి, 'నీసైన్యమున్ గూడి క్రోవన్ బులిందన్ విలోకించి, యాసారసేనంబు నీక్షించి, యాప్రాంతదేశంబులం దెల్లెడన్ జూచి, కాంభోజమున్ డాసి, యాకొంకణాభిఖ్యదేశంబు వే చుట్టి, యాపై హిమాద్రిన్ విలోకించి, సోమాశ్రమం జేగి శోధించి, శ్రీమించుకాళాఖ్యశృంగంబు నీక్షించి, యామీఁదియద్రుల్ పరీక్షించి, హేమాద్రిలోఁ జొచ్చి, కైలాసమున్ డాసి, కౌబేరమున్ జూచి, క్రౌంచాద్రిలోఁ గాంచి, యాపైన మైనాకునిన్ దాఁకి, వైఖానసంబన్ సరఃప్రాంతమున్ జూచి, శైలోదతీరంబునున్ జేరి, యామీఁద నాయుత్తరోర్వీస్థలంబుల్ దగన్ మెట్టి, యాయుత్తరాంభోధి లంఘించి, సోమాద్రి నీక్షించి, యందొప్పుముమ్మూర్తులన్ గాంచి సేవించి, పూజించి, ముందేగ రాదౌట, నందుండి మీరొక్కమాసంబునన్ జానకీదేవివృత్తాంతమున్ దెండు పొండింకఁ బొం' డన్న, వారేగి రామీఁదటన్ రాముఁ డాశ్చర్యమగ్నుండునై యుండి సుగ్రీవుతో నాడు 'నీవెప్పుడే రీతిగా నేటి కీచోటు

ల౯ జుట్టితో నాకు నాలింపఁగాఁ గోర్కెయౌ' నన్న,- నావైరి యౌవాలి నాఁ డట్లువెన్నంటఁగా, భీతిచేఁ బాఱి నే నిన్నిటి౯ జుట్టి యందందున౯ దాఁగి, ముందేగుచు౯ బెక్కువేలేండ్ల కామీఁద నీమాల్యవంతాన కేతెంచినా' నన్న, నాలించి, హర్షాన్వితుండయ్యె, శ్రీరాముఁ డాచోట సుగ్రీవసౌమిత్రుల౯ గూడి కొన్నాళ్లమోదంబుతోఁ గాలము౯ బుచ్చ;-

నామీఁద బూర్వోత్తరాశాప్రదేశంబుల౯, బశ్చిమాశాప్రదేశంబుల౯ జుట్టి భాస్వంతుదీప్తుల్ ప్రసారించునందాఁక నావానరుల్ పోయి వీక్షించి, సీతా సతి౯ గానకే రోసి, విచ్చేసి శ్రీరామసుగ్రీవుల౯ డాసి, యవ్వార్త విన్పించి వారుండఁగా;—

## శ్రీయాంజనేయాదుల దక్షిణ దిశాన్వేషణము

ఆంజనేయాంగదాదుల్ మహానందమేపారఁగా దక్షిణం బేగి, సుగ్రీవుఁ డెట్లెట్లు విన్పించె నట్టట్టులందందు వీక్షించి, యెందెందు భూజాత నీక్షింపలేకుంటఁ, జింతాసమాక్రాంతులై పోయి వారొక్కెడ౯ జేరి, రాచోటు కణ్వర్షిపుత్రీలలామంబు కాల్జారివారిప్రవాహంబున౯ దారి, ప్రాణంబుల౯ బాయుటీక్షించి, తాఁ బుత్రశోకంబున౯ మాని యంత౯ శపింపంగ, నిర్మానుషంబై మఱి౯ నిర్మృగంబౌను, నందెందున౯ నీడ యు౯ నీళులు౯ లేక యున్నట్టి, శూన్యప్రదేశంబున౯ జొచ్చి, యాతావులందెల్ల సంచారము౯ జేసి, యెంతేనియు౯ రోసి, నోరెండ నీరంబుల౯ గోరి, పోఁబోవ, నందొక్కచోట౯ బిలద్వారమందుండి యెన్నెన్ని యో పక్షులేతేర వీక్షించి, యచ్చోట నీరుండునంచెంచి, వారాబిలద్వారము౯ జొచ్చి ముందేగ గాఢాంధకారంబు చూపట్టె, నాత్రోవ వారెల్లరక్లేగఁగాఁ, గొంత కాయంధకారంబు మాయంబునై యద్భుతాకారమౌ పట్టణం బొండు గన్పట్టె, బంగారమై మిద్దెలు౯ వేడలు౯ సర్వము౯ దోఁచె, వృక్షంబులు౯ బర్వతంబుల్ సువర్ణంబులై యొప్పె, నాపట్టణం బెన్న నిర్మానుషంబౌచుఁ గన్పట్టె, వా రందు వీధుల్ బచారించుచో నొక్కెడ౯, మిన్నుతోరాయున ట్లున్నతంబై విరాజిల్లుసౌధంబు నీక్షించి

యా మేడపై కెక్కఁగా బ్రాఁకి, యందుఁ దపోవృత్తిమైనున్న యొక్క వృద్ధ పుణ్యాంగనఁ గాంచి కేల్మోడ్చి- 'యీ వెవ్వ, రీరీతిగా నొంటిగా నుంట కే హేతువో? పట్టణం బిట్లు నిర్మానుషంబౌట కే కారణం బుండునో? తెల్పుమా!' యంచుఁ బ్రార్థింప, నాకాంత యిట్లాడెడిన్;—

"దొల్లి యుండెన్ మయుండన్ మహాదానవుం, డాతఁ డుగ్రంబు గాఁగన్ దపంబుంటకున్ మెచ్చి, నిర్మాణకౌశల్యమున్ బద్మజుం డిచ్చె, నాశక్తిచే నాయమయాఖ్యాతవిఖ్యాతుఁ డీపట్టణం బిట్టులన్ గట్టి, తా హేమ యన్ గాంతతోఁ బెద్దకాలంబు సౌఖ్యంబుతో నుండఁగా నియ్యెడన్, దేవనాథుండు వజ్రాహతిన్ జేసి యాదానవున్ జంపి, కొంపోయి హేమన్ వెసన్; నేను తత్కాంతకున్ నెచ్చలిన్, నేఁ దపోనిష్ఠమై నుందుఁ జెరన్ 'స్వయంభాస'నా నొప్పెదన్, మీర లేరీతి విచ్చేసినారో కదా యిందు? గీర్వాణులున్ గానరీ తావు," నంచాడి తాఁ గందమూలాదులన్ విందుగాఁ బెట్టి మీ రేటి కీచోటికే తెంచినారన్నఁ, దా నెల్లవృత్తాంతమున్ జెప్పి సామీరి యిట్లాడు 'నో సాధ్వి! మమ్మీబిలద్వారమున్ వెల్వడన్ జేయుమా!' యన్న, హర్షంబునన్ గాంత పల్కాడు- 'శ్రీరాము కార్యార్థమై వచ్చియున్నారె! పుణ్యాత్మకుల్ మీరు, మీదర్శనంబబ్బుటన్ ధన్య నే నైతి, మీరల్ కనుల్ మూసికొండింత యన్నన్, గపుల్ కన్నులన్ మూసి, రాపైన నక్కాంత వారెల్లరన్ దెచ్చి వేగన్ బిలద్వారమం దుంచి తా మాయమై పోయె; నాపిమ్మటన్ బైటి కవ్వారలే తెంచి, యొందెందునన్ సీతనీక్షింపఁగా రామికిన్ రోసి, వారామహేంద్రాద్రికే తెంచి, యందెల్లగన్ జేరి, తన్మెంతయున్ వాయుసూనుండునున్ జాంబవంతుండు నాయంగదుండున్ నివారించినన్ మాన కవ్వారు ధైర్యంబు పోనాడి ప్రాయోపవేశంబు గావింపఁగా నెంచి శోకించి రీకైవడిన్;—

{ వానరులు ప్రాయోపవేశమునకు సిద్ధపడుట; సంపాతి సీతాదేవివృత్తాంతమున్ దెల్పుట. }

భార్యలన్ బిడ్డలన్ బాసి, యిట్లియ్యెడన్ జావఁగానాయె హా దైవమా! సీత నీక్షింపలేకుంటి మే మక్కటా! కాంచసుగ్రీవుఁడో

చండతా శాసనుండౌను మమ్మెల్లరన్ జంపి చెండాడకే సైఁచునే? అట్టి చావోల్లకే మిట్టులన్ జావసంకల్పమున్ జేసినా మయ్యయో! రాముఁడా కానలన్ జేరఁగా నేల? సీతాసతిన్ రావణుం డట్లు కొంపోవఁగా నేల? యంతన్ జటాయుండు నాఁ బక్షినాథుండు పోరాడి పోరాడి, యద్దైత్య ఖడ్గాహతిన్ బక్షముల్ వ్రీలి ధాత్రీస్థలిన్ గూలి, భూజాతవృత్తాంతమున్ రాముతోఁ జెప్పి, ప్రాణంబులన్ బాయఁగా నేల? నామీఁద సుగ్రీవుతో రామసౌమిత్రు, లారీతి స్నేహంబుఁ గావింపఁగా నేల? శ్రీరాముఁ డావాలి సంహారమున్ జేసి, సుగ్రీవునిన్ గీశరాజ్యాధిపున్ జేసి, భూజాత నన్వేషణన్ సల్పఁగా మమ్మిటుల్ పంపఁగా నేల? హా! మాకు నీపాటు రానేల? మీరిట్టులన్ జావుఁ డంచున్ దలన్ వ్రాసినా వేల హా దుర్విధీ!' యంచు దుఃఖింప నాలించి, యయ్యద్రియందున్న సంపాతియన్ వృద్ధపక్షీంద్రుఁ, డల్లల్లనన్ జేరఁగా వచ్చి, యావానరానీకమున్ గాంచి భాషించు:-'నో ధీరులారా! జటాయుండు నా ముద్దుతమ్ముండు, సూర్యాత్మజుల్ మేము, నాసోదరుం డక్కటా! చచ్చెనా? అయ్యయో! హేతు వేమో కదా?' యన్న, నయ్యంగదుం డంతయున్ జెప్పె; నాలించి సంపాతి తన్నాపయోరాశి నీళ్లార్పఁగాఁ గోర, వారట్టులన్ నీళులార్పన్, కృతస్నానుఁడై వచ్చి శోకించి, యాపైని వృత్తాంతమున్ జెప్పఁగాఁ జొచ్చె నిమ్మాడ్కి:—

నాతమ్ముఁడున్ నేనుఁ, గైలాసశైలంబునన్ జంటగానుంటి మాపైని మాసత్త్వముల్ మేము లెక్కింపఁగాఁ గోరి, యుగ్రాంశునిన్ దాఁకఁగా నెంచి యాకాశమార్గంబునన్ బైకిఁ బోఁబోవుచుండంగ, నంతంతకున్ మండుచున్ సూర్యరశ్మిప్రభల్ గ్రుచ్చికాల్పన్, జటాయుండుఁ డాస్రుక్కి, వీక్షించి రక్షింపఁగాఁ గోరి నాపక్షముల్ వానిపైఁ గప్పఁగా, నాక్షణంబందు ఖద్యోతు తీక్ష్ణాంశువుల్ దాఁకి, నాపక్షముల్ కాలి నే నీక్షితిన్ గూలితిన్, సోదరున్ గాన నామీఁద నేమయ్యెనో? మీర లీనాఁడు వాక్రువ్వ వృత్తాంతమున్ వింటి; నే నట్టులన్ బక్షముల్ వ్రీలి

యిందుండ, సానందనుండై సుపార్శ్వుండు నాకెప్పు డాహారముల్ దెచ్చి యర్పించుచుండెన్ జుండీ! యొక్కనాఁ డాతఁ డాలస్యమైవచ్చె, నేకార ణంబంచుఁ బ్రశ్నించితిన్ వాని, వాఁ డుచ్చె నాతండు 'నోతండ్రి! నే నామహేంద్రాద్రిసామీప్యమందుంటి, నంతన్ దశాస్యుండు తా నొక్క కాంతామణిన్ గొంచు లంకాపురీమార్గమందేగ, నక్కాంత శోకించు టన్ గంటి. నవ్వారి నీక్షించుచే నుంటి. నాహేతువున్ బట్టి యొక్కింత యాలస్యమైవచ్చినా' నంచు; సందేహ మేలేదు సీతాసతిన్ దుష్టుఁడౌ రావణాఖ్యుండు గొంపోయె, నోవానరశ్రేష్ఠులారా! వినుం డేను నూఱామడల్ దవ్వు నీక్షింతు; నాపక్షముల్ ప్రేలుటన్ జేసి యిందున్న మౌనీంద్రులం దొక్కనిన్ వేఁడితిన్ నాకుఁ బక్షంబులిమ్మంచు; నాతండు "శ్రీరాఘుదూతల్ ధరాజాతయన్వేషణార్థంబు నిచ్చోటు, కవ్వారితో నీదువృత్తాంతమున్ దెల్పినన్, వచ్చునీపక్షముల్ పొమ్మటంచాడె, న న్నేను మీరాకై నిరీక్షించుచుందుంటి, నేఁ డిట్లు కన్గొంటి, మీయొల్లవృత్తాంతమున్ వింటి, నే నాకథన్ మీకువిన్పించితిన్, జూడుఁ' డంచాడి, పక్షం బు లల్లార్చుచున్ రిప్పనన్ మింటికిన్ దాఁటె, నవ్వెగి వీక్షించి యిట్లాడు:- 'లంకాపురిన్ భాసురోద్యానభాగంబునం, దొక్కవృక్షంబునీడన్ మహా దేవియాసీత కన్పట్టె, మీ రేగుఁడీ వారిధిన్ దాఁటుచున్ లంకవంకంచుఁ బల్కాడి సంపాతి తా నేగె హేమాద్రికిన్;—

వానరులు, సముద్రమును లంఘుంచుటకై, వారివారి సత్త్వములు వెలిపుచ్చుట

బిమ్మటన్ వానరుల్ ఘోరవారాశినిన్ డాసి బల్ చండవాతప్రభూ తంబునన్ బుట్టి, మిన్నంటఁగా నుబ్బి యూటాడు ఘోరంబులౌ బల్ తరంగా వళుల్ పొంగిరంగారుచున్ భీకరారావముల్ సల్పఁగా, ఘోరనక్రం బులున్ గ్రాహకోటుల్ మహాపర్వతంబుల్ బలెన్ గట్టులన్ బ్రాఁకి కన్ప ట్టుచున్, భూమి భేదిల్లఁగా గర్జలన్ సల్పుచున్ భీతి గొల్పన్, గనన్ జూడ్కి కందంగ రానంతదూరంబు నీరంబు నిండారి, నల్దిక్కులన్ బండి ఘోరంబుగాఁ గంటికే పారుచున్ మీరు వారాశినీక్షించి, యావానరుల్

దూతలౌ మాకు ధర్మంబగున్, లేనిచో వంచనంబౌ! మఱిన్ స్వామి
ద్రోహంబునాఁ గాన నేఁ దెల్పెదన్, బిన్నకాలంబు నందున్న నా సత్త్వ
మున్ దెల్పినన్, నవ్వుపాటౌనుగా మీకుఁ గానిండు నేఁ దెల్పెదన్;
మున్ను దేవాసురుల్ ఘోరులై పోలేదా సుధన్ బొంద? నే సాయమున్
వారికిన్ జేయుటన్, దేవతల్ మెచ్చి, వారాసుధన్ గొంత నాకిచ్చి,
రా యింత సేవించితిన్, దాన నేమంచు వాక్రుత్తు నా శక్తి? నీయొక్కటే
కాదు పాం, డేడుసంద్రంబులన్ లీలగా దాఁటితిన్ నేను నస్తాద్రిపై
నొక్క కాలుంచి, పూర్వాద్రిపై నొక్క కాలుంచి, మేన్వొంచి నిల్చుంటి
నాభీలుఁడై; దైత్యనాథున్ బలిన్ బట్టి బంధించునాఁ డా మహా వామన
స్వామి విశ్వస్వరూపంబుఁ గొల్వంగ, నే నిర్వనొక్కండుమార్లెంచి
భూమండలిన్ జుట్టివిచ్చేయుచోఁ, గొండ మోఁకాలిలోఁ జిక్కిపోయెన్
జుఁడీ! యంతకే నేను లొంగన్, గనన్ నేఁడు నాకెన్నఁగా మిక్కుటంబౌ
జరాభారమే పాఱె, నే వృద్ధుఁడన్ దాఁపకే తెల్పెదన్, దొంబదౌ యోజ
నాల్ దాఁటుదున్ గాని ముందేగఁగాఁ జేతఁగా'దంచుఁ బల్కాఁడి,
యయ్యంగదున్ గాంచి భాషించు;-

ఓయంగదా! నీవు నీవారిధిన్ దాఁటినన్ దాఁటుదౌఁ గాని రా
నేర్తువో నేరవో, మీఁద నీగట్టు జేరంగ? మా కీవు రాజౌటచే, నిట్టి
కార్యార్థమై నిన్నుఁ బంపంగరాదెన్నఁడున్; నీరజా వాసరుల్ నట్టివా
క్పౌరుషంబుల్ వృథా పల్కుచున్ గాలమున్ బుత్తురే? వేలు వేలొక్క
రీ కార్యమున్ జేయఁగాఁ, గాని మాయందు నా కార్యమున్ జేయఁగాఁ
జాలువాఁడొక్కఁడుండెన్ జుఁడీ! వారిధిన్ దాఁటఁగా, సీతవృత్తాం
తమున్ దెచ్చి శ్రీరాము కార్యంబు సాధింపఁగా సాహసుం డాతఁ డీవా
యుపుత్త్రుండు మాకెల్ల ముఖ్యుండెకా? యమ్మహాత్ముం డెఱుంగండు
తానున్ స్వసామర్థ్యమున్, గానఁ దా నీవిచారంబునై నేమియున్
బల్కకుండెన్, గనుండంచు సామీరినిన్ జేరి భాషించు;-

ఓవాయుపుత్త్రా! మహాపుణ్య మా స్వామికార్యంబు జోలిన్ విచా
రింపకే యూరకున్నాఁడవే! ధర్మమే నీకు? నీవొక్కఁడే కాక వేరొక్కఁ

డీకార్యముఁ జేయశక్తుండవె? యాలింపుమా! తొల్లి మీతల్లి తా నప్సర స్త్రీయునై యగ్నిశాపంబుచే, నంజనాదేవియనఁ వేరిటఁ వానరస్త్రీగఁ బృథ్వీస్థలిఁ బుట్టి, తాఁ గేసరిఁ బ్రీతిఁ బెండ్లాడి బలసాధ్వియైయుం డఁగా, నొక్కనాఁ డొక్కచో, వాయుదేవుండు నిన్నామెకుఁ బ్రేమ తోడఁ బ్రసాదింపఁగా, నీవు జన్మించి తోమారుతీ! వాయువేగంబు పక్షీంద్రుసత్త్వంబు నీకుండు, శ్రీపద్మగర్భుండు నీకిచ్చె మేలౌ వరంబుల్ మహాత్మా! నినుఁ బోలరెవ్వారు, నీవిక్రమం బెన్నఁగా శక్యమేమాకు? నెట్టైన నీవారిధిఁ దాఁటి, శ్రీజానకిఁ గాంచి శ్రీరాముకార్యంబు గావించి మాయెల్లరఁ బ్రోవు, మాచంద్రతారార్కమౌకీర్తి నార్జింపుమా!' యంచుఁ బ్రార్థింపఁగా, నాజగత్ప్రాణపుత్రుండు లోనెంతయుఁ బొంగుచుఁ బల్కె;-

## ఆంజనేయుండు సముద్రమును లంఘించుట

ఓవానరశ్రేష్ఠులారా! కనుండిప్డు నాసాహసం బేర్పడఁ జూపెదఁ, స్వామికార్యార్థమై వార్ధిలంఘించి, నేనక్కజంబైనయా లంకలోఁ జొచ్చి నల్వంకలఁ జుట్టి, యేశంకయుఁ జంకునుఁ బూనకే, మించి శోధించి, యాలంకజానకిఁ గనుంగొందు, నీక్షింపరాకున్నచో, రావణుఁ బట్టి వేధించి బాధించి బోధించి సీతాసతీవార్తసాధింతు, నారీతిగాకున్న నాలంకనీతోఁకతోఁ జుట్టి నేపీకి జోకారఁగాఁ దెచ్చి శ్రీరాముముందుంతు, నం దెందునుఁ సీత లేకున్నచో, వార్నిధుల్ నేఁ గలంతుఁ గనఁ భూమిఁ జీల్పించి యందెల్ల శోధింతు, నాకాశముఁ జింతు, నామృత్యువుఁ దంతు బ్రహ్మాండముఁ వ్రక్కలింతుఁ సురశ్రేణి వేధింతు గంధర్వ సిద్ధాదులఁ బట్టి కారింతు, రక్షస్సమూహంబు వేధింతు, వారెవ్వరుఁ దెల్పలేకున్నచో, బ్రహ్మ సాధింతు, నెట్టైన భూజాతవృత్తాంతముఁ దెత్తు నంచాడి మాహేంద్రశైలాగ్రభాగంబుపై కెక్కె, యింతింతగాఁ గొంతకాకాశముఁ దాఁకఁగా దేహముఁ బెంచి, శ్రీవాయుదేవుఁ మదిఁ గొల్చి, శ్రీరామపాదాంబుజధ్యానముఁ జేసి, యాయద్రిపై భద్రమై

పాదముల్ మోపి, తా మోర నొక్కింతపై కెత్తి, యింతింతగా మేను క్రుంగించి, హస్తంబు లాయద్రిశృంగంబులందూన్చి, వాలంబు నల్లార్చి కర్ణంబులన్ నిక్కఁగాఁజేసి, వారాశి నాద్యంతముం జూచి, యాలంకపై దృష్టిసారించి, తాఁ బంచప్రాణంబులన్ బిగ్గఁగాఁబట్టి, దేహంబు నూగార్చి యూగార్చి, బల్ ఠీవ్వినన్ బోయి నాకాశభాగంబు డాయంగ; నాఘాటికిన్ శైలశృంగంబు లూటాడి భూరేణు లల్లంతయున్ బిండిగ్గై రాలె, నావేగవాతాహతిన్ వృక్షముల్ నింగిపై పక్షులట్లాడె, వారాశి నీరల్లకల్లోలమైమింటికిన్ దాఁకె, నావేళ నాక్రిందఁబాతాళమందున్న భోగీంద్రు శీర్షంబులున్ గానఁగావచ్చె, నీరీతి నీక్షించి దిక్పాలు రానింగి కేతెంచి సామీరికిన్ దీవనల్ సల్పి రత్యంత హర్షంబునన్ బొంగి

## హనుమంతునకు, సముద్రమధ్యమునుండి మైనాకుఁ డడ్డమువచ్చుట.

ఇట్లాసమీరాత్మజుం డబ్ధిపై దాఁటుచున్ బోవఁగా, వార్థిమధ్యంబు నందుండి, పైపైకిఁ దా నిక్కుచున్ ద్రోవకడ్డంబుగావచ్చుమైనాకునిన్ గాంచి సామీరి, 'యౌరా! యి దేమిట్లు విఘ్నంబు గావింపఁగా వచ్చెఁబో దైత్యుఁడెవ్వాఁడొ శైలంబుగా?' నంచు లోనెంచి కోపించి, తావజ్ర పక్షంబుచే ఘోరమైతాఁకె, నద్దానికిన్ నొచ్చి యాపర్వతేశుండు పల్కాడె 'నోయంజనానందనా! నీకు నాతిథ్య మియ్యంగ లోనెంచి యేతెంచితిన్ గాని నీశత్రుఁడన్ గాను, నీతండ్రికిన్ మిత్రుఁడేనౌ, వదెట్లందువా! తొల్లి శైలంబులున్ బక్షముల్ గల్గి గర్వించి బల్ స్వేచ్ఛమై మించి సంచారముల్ సల్ప, వీక్షించి యాఖండలుం డల్గి వజ్రంబునన్ బక్షముల్ దున్మచున్ రాఁగ, మీతండ్రి యావాయుదేవుండు నన్నున్ దయాపూరితుండై వడిన్ దెచ్చి యీయుప్పుసంద్రంబునన్ డాఁచి నాపక్షముల్ గాచి రక్షించె, నాహేతువుం బట్టి నామిత్రపుత్రుండ వీవెన్నఁగా నీకు సత్కారముల్ సల్పఁగా నాకు ధర్మంబెకా? శీతశైలాత్మజుం డేను మైనాకుఁ డన్వాఁడ, నాతండ్రి! నాశృంగమం దింత కాలూని, రుచ్యంబులౌనీఫలంబుల్ గదున్ దృష్టిసేవించి యొక్కింత విశ్రాంతిగై

కొంచుఁ బోరాదె' యంచాడ, నాలించి వాతాత్మజుం డాడు:—'నో
శైలరాజేంద్ర! నేస్వామికార్యార్థమై పోవుచుంటిన్ గదా! నిల్వరాదే
క్షణం బైన నెందెందు, నాకున్ సపర్యల్ గడున్ ముట్టె, విశ్వాసమే
చాలు, మన్నింపు' మంచాడి యయ్యద్రినిన్ జేతితోఁదట్టి ముందేగె;-

దేవదూత అడ్డముగాఁవచ్చి, హనుమంతునిబలముఁ బరీక్షించుట.

అమీఁదటన్ దేవతాదూతయొక్కర్తు తా నడ్డమైనిల్చి, యా
వాయుజున్ మ్రింగ, నైదామడల్ నోరువిప్పంగ నీక్షించి, సామీరి
రెండంతలై మేనుపెంచెన్, గనుంగొంచు నాకాంత తా ముప్పదుల్
యోజనాల్ వక్త్రమున్విప్పఁగా, జూచి సామీరి తా నల్వదౌయోజ
నాల్ చెల్లుదేహంబుతోఁ నొప్పె, నాచాన నూర్యోజనాల్ నోరు
విప్పంగ, వీక్షించి సామీరి యంగుష్ఠమాత్రంబు నౌగాత్రమున్ దాల్చి,
సూక్ష్మంబుగన్ నాతివక్త్రంబులోఁ జొచ్చి విచ్చేసె, నద్దాని కాకాంత
లోమెచ్చి 'యోమారుతీ! నీదుసామర్థ్యమున్ జూడఁ గాంక్షించి దేవేం
ద్రుఁడంపన్ బరీక్షించితిన్ బొమ్ము, నీకౌశుభ"మ్మంచుఁ దా దీవనల్సల్పి
వేమాయమైపోయె;—

సింహిక హనుమంతునిఁదాఁకి మడియుట.

అపిమ్మటన్ సింహికానామయౌనొక్కరాకాసి యయ్యబ్ధిలో
నుండి ఛాయన్ దగన్ బట్టి వాతాత్మజున్ గ్రిందికీడ్వన్ విలోకించి
సూక్ష్మాంగుఁడై యాతఁ డద్దాని పెన్బొట్టలోఁజొచ్చి, ప్రాణంబుఁబో
కార్చి వారాశిలోవైచి, తా నంతసంద్రంబు సర్వంబు లంఘించి, యా
తీరమందున్న మిన్నొసువేలాద్రి శృంగాగ్రభాగంబునన్ జేరి, విశ్రాంతి
నై కొంచు నుండెన్ జుమీ! యంచు, శ్రీనారదర్షీశ్వరుం డెంచి వాల్మీకి
మౌనీంద్రుతోఁ జెప్పె నీరీతిగా;—

ఇద్ది శ్రీరామపాదాంబుజధ్యాననిష్ఠాగరిష్ఠుండు, విప్రుండు, వాసిష్ఠగోత్రోద్భవుం, డార్య వెంకోబరాయాత్మసంజాతుఁడుఁ, సాధ్వీలక్ష్మాంబికాగర్భసచ్ఛుక్తిముక్తాఫలంబైన, అశ్వత్థరాయండు నిర్మించు నీదండకోపాఖ్యరామాయణంబందు, గిష్కింధకాండంబు సర్పించెదఁ గొమ్మిదే ఆంజనేయా! మహావజ్రకాయా! సదా రామకార్యప్రియా! ధర్మధౌరేయ! సద్భక్తగేయా! బుధశ్రేయ! దీనార్తసద్భక్తబంధూ! దయాసింధు! శ్రీవాయుపుత్రా! పవిత్రా! నమస్తే! నమస్తే! నమః.



శ్రీ

శ్రీ సీతారామలక్ష్మణ పరబ్రహ్మణే నమః

# శ్రీ దండకరామాయణము.

## సుందరకాండము.

శ్రీనారదర్షి శ్వరుఁ గాంచి ముందొ కథాభాగముఁ దెల్పఁగా మాని వాల్మీకి ప్రార్థింపఁగా, నారదుం డెంతయుఁ హర్షితస్వాంతుఁడై పల్కె;—

హనుమంతుఁడు సువేలాద్రిపైనుండి, 'లంక' సౌందర్యముఁ దిలకించుట.

అట్లాసమీరాత్మజుం డంబుధిఁ దాఁటి, బల్ దివ్యశృంగంబులుఁ, సానుదేశంబులుఁ భూరుహంబుల్, లతాకుంజపుంజంబులుఁ గల్గి వెల్గొందు లంకాపురీప్రాంతభాగంబునన్ భాసమానంబునౌ నాసువేలాద్రిపై నెక్కి వీక్షించె, సౌభాగ్యసంపన్నమై, దేవతాధీశునావాసముఁ నవ్వి, నల్దిక్కులన్ వార్ధి యొప్పారఁ, దన్మధ్యభాగంబునం దెంతొ సింగారమేపారు లంకాపురిన్ గాంచి, తా నాత్మలోనన్ ముహూర్తంబు చింతించి యాశ్చర్యమగ్నుండునై యుత్తమాంగంబు కంపించి,-యౌరౌర! యీరీతి సౌభాగ్యవిభ్రాజియౌ, పట్టణం బీధరామండలిన్ జూడఁగాఁ గంటిమే? యిట్టిలంకాపురాధీశుఁడై, మూఁడులోకంబులన్ గెల్చి ముత్తిప్పులన్ బెట్టి, భల్ బల్లిదుండై విరాజిల్లు నీరావణుం డక్కటా! లో వివేకంబుఁబోనాడి లోకైకనాథుండు శ్రీరాముదేవేరి సీతాసతిన్ లోకమంతన్, గడున్ బూతచరిత్రయౌ భూసుతన్ మ్రుచ్చిలించెన్ గదా! మృత్యువున్ గొంగిటన్ బట్టి సుంకించెఁబో! కాలముఁ మీఱరా దెరికిన్, గాని నాకేటి కీభ్రాంతి! శ్రీరాముకార్యార్థమై వచ్చి, నే స్వామికార్యంబుకై

వూన కిట్టుల్ ప్రమత్తుండనై చింతసల్పంగ నా కొప్పునే?' యంచు, కార్యాతురుండౌచు, లంకఁ బ్రవేశింప నుంకించి, 'యీఘోరమా మేనితోఁబోవ గుర్తింతురో రక్కసుల్, మీఁతి పోరాటమే సేతురో! కూడ దిట్లంచు, మార్జాలమాత్రంబునౌ సూక్ష్మగాత్రంబుతోనొప్పి, సూర్యుండు గ్రుంకంగ నీక్షించి, నిశ్శబ్దమై సర్వులుఁ లంకలో నిద్రలో నుండు ప్రొద్దెంచి తా నుత్తరద్వారముఁ జేరి, శ్రీరామనామంబు నేమంబు నఁ జిత్తమం దెంచుచుఁ, దత్పురిఁ జొచ్చె నిర్భీతియై సాహసం బేర్పడఁ;-

హనుమంతుఁడు 'లంక' యనురాక్షసిని గొట్టి లంకలోఁ జొచ్చుట.

బోవుసామీరి నీక్షించి, బల్ భీకరాకారయౌ లంకయఁ పేరిరా కాసి, తా నడ్డమైవచ్చి యావాయుజుఁ డాసి, రెట్టింప క్రోధంబు ఘట్టించుచుఁ బల్కెః- 'నీ వెవ్వఁడో మర్కటా! యెవ్వరంపంగ నిచ్చోటికేతెంచినా, వేమి కార్యంబు! నాయాజ్ఞ లేకుండ నీలంకలోఁబోవ రెవ్వారు; నీ వింతలే వింతగర్వంబె? పల్కాడుమా!' యంచు నల్కొందిభాషించు కల్కిఁ విలోకించి సామీరి యిట్లాడుః- 'నీ వెవ్వ రిందేటికున్నావు? పేరేమి? పల్కాడు మాపైననేఁ దెల్పఁగాఁజాలువాఁ' డన్న నాచాన కోపంబు దీపింపనిట్లాడు- 'నే నీపురాధీశుఁడౌ రావణాభిఖ్యునాజ్ఞను సారంబు రక్షింతు నీలంక, నేపొద్దు నీవాకిటఁ నిల్చి; వీక్షింతు నే క్రొత్త వారెవ్వరేఁ వచ్చినఁ శంకలోఁ దోఁప సంహారముఁ జేతు, లంకాసతిఁ; జెప్పు మీ వింక నీసంగతిఁ గొంక' కన్నంత వాతాత్మజుం డాడుః- 'నే స్వామికార్యార్థమై వచ్చితిఁ, వానరుండఁ, విలోకింప నీలంకలో నావిశేషంబు నేతెంచితిఁ, లోనికేఁ బోదు నాకడ్డముఁ రాకు' మంచాడఁ, గోపానలజ్వాలలఁ జూపులేపారఁగా, వీఁక రాక్షసియిట్లాడు- 'నాచేతిలోఁజిక్కినా వీవు, బల్ తెంపుగాఁ బల్కుచున్నావు, నిఁ జంపి నీరక్తముఁ ద్రావ, నేనింపుమైనుందు' నంచాడి, వేమ్రింగరాఁ గాంచి సామీరి యా కాంతవక్షంబుపై ముష్టిచేఁ గొట్టె, నా పెట్టు సైరింపఁగాలేక, యా కాంత ధాత్రీస్థలిఁ ద్రెళ్లి, యాపైన నొక్కింతకెల్పొంది హీనస్వరఁ

బొప్పఁగాఁబల్కె,'నో వానరోత్తంస! రక్షింపు, మీపట్టణం బెంచి నిర్మించి నాఁడాసరోజాతజాతుండు వాక్రుచ్చె నాతోఁ"బ్లవంగోత్తముం డొక్కఁ డెన్నండు నిన్ గొట్టు, నాఁ డాదిగా సర్వనాశంబగున్ లంక పొమ్మిం" కటంచాడె, నో ధీవరా! నీదు కార్యంబు సిద్ధించులె' మ్మంచుఁ ద్రోవిచ్చి తాఁ బంచె, నామీఁద సామీరి సంతోషితస్వాంతుఁడై కోటలోఁ జొచ్చి బల్ గూఢవృత్తిన్ విలోకించె నంతంత నాయాస్థలంబుల్ కడున్ శ్రద్ధతో;—

## ఆంజనేయుండు లంకలో సీతాదేవి నన్వేషించుట.

వీథులన్ జొచ్చి, వీక్షించి రచ్చల్, మహాగోపురాలెక్కి, వేదండశాలల్ పరీక్షించి, హర్మ్యంబులన్ గాంచి, దేవాలయంబుల్ విలోకించి, బల్ సాలదుర్గొందులన్ జూచి, తా మేడలన్ మిద్దెలం దెల్ల శోధించి, శస్త్రాస్త్రశాలల్ పరీక్షించి, సౌధాంతరాళంబులం దేగి, వేమంత్రిసామంతుల౯ండ్లన్ బరీక్షించి, దైవజ్ఞులిండ్లన్ విలోకించి, తాఁ దంత్రపాలాలయంబుల్ విమర్శించి, యామీఁద సామాన్యరక్షోనివాసంబులం దెల్లెడన్ శ్రద్ధ శోధించి యాపై [1]విభీషాఖ్యసద్మంబు, నంతన్ మహాకాయు గేహంబు, నాకుంభకర్ణాఖ్యువాసంబు, నయ్యింద్రజిత్తున్న ధామంబు శోధించె, నంతఃపురావాసముల్ గాంచె, నొక్కొక్కచో నేకకర్ణుల్, మహానాసికుల్, దీర్ఘదంష్ట్రుల్, వికారాకృతుల్ నిద్రలోనుంట లక్షించె, నొక్కొక్కచో దివ్యమాల్యాంబరాదుల్ విభాసిల్ల, స్త్రీపూరుషుల్ హంసతల్పంబులం, దొండొరుల్, కౌఁగిటన్ గ్రుచ్చి నిద్రించువారిన్ గనుంగొంచు, భర్మాంచితం బౌకవాటంబులన్ దాఁటుచున్, రత్నవిభ్రాజితంబౌ గవాక్షంబులన్ దూరుచున్, బోయి తాఁ జేరె నారావణాంతఃపురిన్;—

నిద్రమై నున్నయారక్షకాళిన్ విలోకించి, నిర్భీతిమై వాకిళుల్ పెక్కులన్ దాఁటి, తాఁ గొల్వుకూటంబులం దెల్లెడన్ గాంచుచున్ బోయి యాయోజనంబున్న తంబౌచు, నందర్భవై శాల్యమున్ గల్గి వెల్గొందునంతః

1 'దశగ్రీవు నాపిన్నతమ్ముండు వాసించుసద్మంబు' పాఠాంతరము.

పురంబెల్ల వింతారవీక్షించు, చందందునన్ గల్గువైచిత్ర్యముల్ గాంచు చున్ బోయి యందొక్కచోఁ బుష్పకంబున్నఁ దా డాసి యద్దాని చెల్వున్ బరీక్షించుచున్, గాంచె నారావణున్ సౌఖ్యవారాశిఁ దేలించి కాంతామణుల్ మద్యపానంబుచే మత్తలై మేనులన్ వ్రాల్పఁగా, మోడ్పునన్ దోయి సొంపారఁగా, నూర్పులల్లారఁగా, నాననాబ్జంబులందెంతొ సౌందర్యసౌభాగ్యమేపారఁగా, మించుపాలిండ్లుగుల్కారఁగాఁ, జన్ దోడల్ మెల్మినిగ్గుల్ ప్రసారింపఁగా, హారహీరావళుల్ చిక్కులన్ గూరఁగాఁ, వేణివిప్పారఁగా, నీవియున్ జాఱి మర్మాంగముల్ గానరాఁ గాంచి- 'శ్రీరామ! శ్రీరామ!' యంచున్ గరంబెత్తి నేత్రంబులన్ మూసికొం చాత్మనీరీతిఁ జింతించె;- 'నాస్వామి శ్రీరాముకార్యార్థమై యీవధూమర్మముల్ కంటినే కాని నేఁ గామినై కాదుగా' యంచు బుద్ధిన్ విచారించి, శాంతించి, శ్రీరామనామంబు నేమంబునన్ ధ్యానమున్ జేయుచున్ మించి శోధించె నా కాంతలం దెల్లభూజాతకై శ్రద్ధమై;-

### రావణుని ప్రక్కలో నిద్రించుచున్న మండోదరిని గాంచి హనుమంతుడు సీతాదేవియని భ్రమించుట

'అక్కటా! యిట్టి సౌందర్యసౌభాగ్యసంపన్న కాంతాజనం బెందఱో యుండ, నీరావణుం డేటికీ సీతకై నెమ్మదిన్ సోలె? తా నన్యకాంతాళిపైఁ బాప మంచెంచ, కీభామపై మానసంబుంచె, నాహా! యనర్థంబు గావించె, దుర్బుద్ధిలోఁగాంచె' నంచెంచుచున్ బోయి, తా నొక్కచోఁ జూచె నారావణున్ గౌఁగిటన్ గ్రుచ్చి నిద్రించుభామామణిన్; చంద్రబింబాస్య, నీలోత్పలాక్షిన్, శుభాంగిన్ మహారాణి మందోదరిన్; గాంచి తద్దివ్యసౌందర్యరేఖల్ విలోకించి, 'యన్నాతియే సీత కానోపునం చెంచి లో నుల్లమున్ గాత్ర మాపాదమున్ జల్లనన్ నీరు గ్రమ్మన్, విచేష్టుండునై నిల్చి-హా! సీత దుష్టాత్ముఁడౌ రావణున్ గూడె, నింకేల నాసాహసం, బేల శ్రీరాముయత్నంబు? సర్వంబు వ్యర్థం బహా దైవమా!' యంచు వాపోయి, యొక్కింతచింతించి, యాపైని తా నిట్లు భావించె;-

నయ్యో! యిదేమిట్లు నే భ్రాంతుఁడనైతిని, గడుసాబూత చారిత్రయగు సీత నీమూర్ఖుఁడేతాకినను భస్మమైపోఁడె? నేమరల్కటుంబౌ టచే మందబుద్ధిని విచారింతు నీరీతిఁ; బాపంబు శాంతించుఁగాక' యంచుఁ దాఁ జెవుల్గను గొట్టికొంచున్, విలోకించె శ్రీరాముఁ డానాఁడు వాక్రుచ్చియున్నట్టి భూజాతచిహ్నంబులం దొండునేని గానరాకుంట గుర్తించి, తా సంశయాత్ముండునై, యామెపాదంబునం దొప్పు రేఖల్ పరీక్షించి, సాముద్రికం బెంచి వైధవ్యమున్ దెచ్చు రేఖన్ దదం ఘ్రిని విలోకించి, భూజాత కాదంచు నిర్ధారణన్ జేసి, మరిన్ముం దునన్బోయి వీక్షించె, గంధర్వసిద్ధామరేత్యాదిదివ్యాంగనౌఘంబు— 'వీరందఱున్ బందెగాఁదెచ్చెఁబో! దైత్యుఁ డింకెంతదుష్టాత్ముఁడో! యంచుఁ జింతించుచున్బోయి, లంకాపురంబందు నల్దిక్కులన్ జుట్టెఁ దానప్రమత్తుండునై;-

నీడలన్ నిల్చుచున్, శబ్దమేకానియట్లుంచి పాదంబు లొయ్యొయ్యనన్ బెట్టుచున్, దాఁగుచోఁ గ్రక్కదన్ దిండుగాఁ బొర్లుచున్, దక్కుచున్ దారు, చేవేళ నేరీతి మేలౌనొ, యావేళ నారీతిఁగావించుచున్, మిద్దెలన్ దూఁకుచున్, మేడలన్ బ్రాఁకుచున్, గోడలన్ దాఁటుచున్ బోయి, యుద్యానభాగంబులందున్, సరఃప్రాంతభాగంబులందున్ బరీ క్షించి, సీతాసతిన్ గాన కెంతేనియున్ రోసి వాతాత్మజుం డాత్మఁ జింతించు;-

సీతను గానక విసిగి హనుమంతుఁడు చింతించుట

నాస్వామి శ్రీరాముఁడో, నేన యన్వేషించ నంచెంచి, నాకిచ్చె నీముద్రికన్, సీత కర్పింపఁగా"; లంక నానాజనావాసముల్ గాంచితిన్, గేళికామండపంబుల్ విలోకించితిన్, మించి శుద్ధాంతవాసంబులన్ జొచ్చితిన్, సుందరోద్యానభాగంబులన్ గాంచితిన్, శైలశృంగంబులన్ మెట్టితిన్, సౌనువుల్ చూచితిన్, మేడలన్ వాడలన్ జప్పరంబుల్ వివ మెట్టితిన్, సానుపుల్ చూచితిన్, ... మాడుగుల్ మెట్టితిన్, సర్వలంకాపురిన్ జుట్టితిన్ మాత ర్తించితిన్, మాడుగుల్ మెట్టితిన్, సర్వలంకాపురిన్ జుట్టితిన్ మాత నీక్షింపలేనైతి;-

భూజాత ప్రాణంబుతో నుండెనో? వార్ధినే చేరెనో? రాక్షసుల్ పట్టి భక్షించిరో? రావణుం గాంచి భీతాత్మయై ప్రాణమే వీడెనో? లేక దైత్యాధముం డొండులోకంబునం దెందొ గూఢంబుగా దాంచెనో? నే నిం కేమోముం బోదుం గిష్కింధకుం 'సీత యెందుండె? నెట్లుండె? నేమాడె?' నం చాడు శ్రీరామునితో నేమివాక్రుత్తు? సౌమిత్రి కేమందు? సుగ్రీవుం డేమంచుం బ్రశ్నింప, నే నేసమాధానముం జెప్పుదుం? దైవమా యేమినేం జేయంగా నేర్తు? నాయగ్నిలోం జొత్తునా? కాక వారాశిలో దూంకి ప్రాణంబు నేంబుత్తునా? నేను సంపాతివాక్యంబులం నమ్మి, వారాశి లంఘించి, విచ్ఛేయునాసాహసంబుం వృథాయాయె' యొక్కింత యామీందనాటోప మేపార భావించుబల్ ధాటిమై;-

సీత నీక్షింపలేకున్న చో ధాతం గోపింతునే, బెగ్గిలం ధూర్జటిం గాంతు, శ్రీవిష్ణుపై నల్గి గర్జింతుం, జేతం గ్రహానీకముం బట్టి వేధింతు, వారాసులేకంబుగావించి కారింతు, నక్షత్రముల్ నేలపై రాల్తు, నయ్యింద్రు వేధింతు, నాపావకుం నొంతు, నేమృత్యువుం గొట్టి రక్తంబు గ్రక్కింతు, మీందం గృతాంతుం వడిం బట్టి మర్దింతు, నాగాలిం దూలింతు, నాయిట్టిదౌ సాహసం బెంచి గీర్వాణు లెల్లేనియుం దెచ్చి భూజాత నర్పింతురొండెం, రఘూత్తముం డేవచ్చి—"యమ్మింక సామీరి వ"ల్దంచు నం జీరనొండెం, మఱింకొండు నే నొల్ల' నంచెంచుచుం బోయి యందున్న యత్యున్నతంబౌ మహాగోపురం బొండువీక్షించి, యద్దానిపై నెక్కి నల్దిక్కులం జూడ్కులం నిక్కంగాం జేసి వీక్షించె, నందాయశోకావనిం, శింశుపావృక్షమున్ నీడ, నిర్విణ్ణయైయున్న కాంతామణిం, భర్తృచింతాకులం, రామనామంబు నేప్రొద్దు ధ్యానించు ధన్యాంగినిం, మించి నిత్యోపవాసంబులం, నిద్ర లేమిం ముఖాబ్జంబు వాడ్వారంగా, నశ్రువుల్ దోంగం, జింతాభరాక్రాంతయై క్రాంగి, ప్రాణంబులం రోసి, దైత్యాళిబాధల్ గడుం సైంచి, నేత్రాబ్జముల్ మూసి, శోకించునారీశిరోరత్నముం గాంచి, యన్నాతియే సీతకానోపునం చెంచి;-

### అశోకవనములో నున్నసీతను గుర్తించి, హనుమంతుఁ డందలి శింశుపావృక్షము నెక్కి దాఁగియుండుట.

శ్రీరాము ధ్యానించి, హర్షంబునన్ బొంగి యాగోపురాగ్రంబు నందుండి కుప్పించి, యంగుష్ఠమాత్రుండునై వేగవిచ్చేసి, యాశింశుపా వృక్షమున్ డాసి, పైకెక్కి శాఖాగ్రమున్ జేరి, శాఖామృగస్వామి వీక్షించె శ్రీరామచంద్రుండు మున్నానవాల్ గాఁగ వాక్రుచ్చియున్నట్టి చిహ్నప్రకారంబులన్; గాంచి, సందేహమున్ బాసి, యిన్నాళ్లకా, కంటి నామాత? నంచెంతయుఁ బొంగి, యాసీత కందుండియే మ్రొక్కి, నిశ్చింతమై యందె తా నుండఁగా;

### రావణుఁడు సీతాదేవికై అశోకవనమునకు వచ్చుట

నాతఱిన్ రావణుండెంతయున్ సీతపై భ్రాంతి రేయెల్లఁ బోఁబుచ్చి తా వేకువన్ లేచి కాలక్రియల్ దీర్చి, పన్నీటితో స్నానమున్ జేసి, దివ్యాంబరంబుల్ మెయిన్ గట్టి కర్పూరశ్రీగంధమున్ జర్చగావించి, తా పారిజాతప్రసూనంబులన్ దాల్చి, జవ్వాది మైఁ బూసి, రత్నాంచితంబౌ కిరీటంబు మస్తంబునన్ దాల్చి, వజ్రంపురాల్ కుండలంబుల్ దగన్ గర్ణయుగ్మంబులం దుంచి కంఠంబునన్ భానుదీప్తంబులౌ హీరముల్ గల్గుమాణిక్యహారావళుల్ గుల్కఁగాఁ బెట్టి, యేతద్భుజాస్కంధసందోహమం దొప్పఁగా బాహుకీర్తుల్ విరాజిల్ల వైదూర్యవిభ్రాజమానంబులౌ సుంగరంబుల్ గడున్ వెల్గఁగా వ్రేళులందుంచి, నానామణుల్ పొందుటన్ గంటికిన్ విందుగా వించుచున్ నాణ్యమే పారు హేమంపుటొడ్డాణమున్ మధ్యమం దొప్పఁగాఁ బెట్టి, హస్తంబునన్ శిస్తుగాఁ జంద్రహాసంబు గీలొల్పి, కందర్పసౌందర్యసమ్మానితాకారుఁ డౌచున్, మఱిన్ యక్షగంధర్వసిద్ధోరగాద్యంగనాశ్రేణి, పార్శ్వంబులన్ నిల్చి, వా రాలవట్టంబులన్ బట్టఁగాఁ, గొంద ఱామర్త్తికచ్ఛత్రముల్ పూనఁగాఁ గొందఱౌ కామినుల్ తాళవృంతంబులున్ భక్తి వింజామరంబుల్ దగన్ వీచుచున్ బార్శ్వముల్ గొల్చిరాఁ, గొంద ఱాముందఱన్ హస్తదీపంబులన్ దాల్చి, నాట్యంబులన్ నీటుగా

సల్పుచుఁ బోటులేకోటికిఁ దాఁటివచ్చేయ, నేతెంచె దైత్యాధినాథుం డశోకావనిన్ జేరఁగా;-

వచ్చి తాఁగాంచె వాతాహతిన్ దూలుపూఁదీఁగెవోలెన్ వడం కొందుచున్, సుందరాంగంబులన్, హస్తవస్త్రోరుకేశంబులన్ మాటుచున్ గప్పుచున్, బూడిదన్ దాఁగు నిప్పట్టులన్, ధూళిలోఁ బ్రుంగు రత్నంబు వోలెన్, గనన్ మేఘసంఛన్నమౌచంద్రబింబంబటుల్ దోఁచుభూజాత నీక్షించి పల్కెన్ దశాస్యుండు;-

రావణుఁడు, సీతతోఁ దనపరాక్రమము చెప్పుకొనుట.

భామామణీ! కాయజుం డెంతయున్ బాధగొల్పెన్ గదే! తాళఁగాఁ జాల నీకౌఁగిటన్ దార్చి న న్నేలవే! తియ్యమోవిన్ బ్రసాదింపవే! నన్ను సామాన్యుఁగా నెంచి ధిక్కారమున్ జేయకే! మానినీ! యక్షనాథుండు తా నిత్యమున్ బంపెడిన్ చీనిచీనాంబరంబుల్ గడున్ భక్తిమై, నాకలోకేశ్వరుండంపు ముప్పొద్దులన్ బారిజాతప్రసూనంబులన్ భీతిమై, దక్షిణాధీశుఁడే కానుకన్ గానంపు గంబూరజవ్వాదులన్, నిచ్చలున్ నాకునై భోగినాథుండు పాతాళలోకంబునందుండి పుత్తెంచు భూషావళుల్ కొల్లగాఁ గల్గునాయింట నవ్వారిగా, నిచ్చమై స్వేచ్ఛగా వాని మైఁబూని నన్ మారుకేళిన్ ముదంబారఁగాఁ దేల్చి మోదంబునున్ బొందుమా! కాంతరో! యేడువారాసులేదాఁటి రానట్టి కోటల్ సుమీ! అట్టిలంకాపురీ భద్రసింహాసనాధీశుఁడన్, నిర్జరేశాదిదిక్పాలకుల్ నాకు దాసానుదాసుల్ గదే! యక్షగంధర్వసిద్ధామరేత్యాదికాంతామణుల్ బందెలై యుంద్రు నావీట, విత్తేశుబండారుసొమ్మెల్ల నాకైవసం బుండు, నేనల్గినన్ లోక మల్లాడు, నేఁ బుష్పకం బెక్కి నిచ్చల్ నిజేచ్ఛన్ సమస్తంబునౌలోకమున్ జుట్టివత్తున్, ననున్ బోల రెవ్వార లేనాఁటికిన్, మద్భుజాశక్తి యత్యద్భుతంబౌఁజుమీ! చూడు;—

నావీటిలో వాయుదేవుండు సమ్మార్జనల్ సల్పు, నేప్రొద్దు పాకారి ... దాఁ గల్పకంబాదిగా సర్వమున్; జూడ యతేశ్వ

యం జెప్పు నాపేటవెచ్చంబులన్ జెట్టు; నీశానుఁడో వాసిమైఁ దా విభూతిన్ విశేషంబుగాఁ దెచ్చి నాకర్పించు; నా దేవతాచార్యుఁడో, వేకువన్ లేచివిచ్చేసి నాముందఱన్ నిల్చి పంచాంగముల్ జెప్పు; గంధర్వయక్షామరస్త్రీల నే బల్మిమైఁ దెచ్చి నాకొల్వులోఁ నిల్పితిన్, గాంత! నావైభవం బిట్టులే పారుచుండుంగదే! కామినీ! మద్భుజాశక్తి నేమందు? నేనెత్తితిన్ శంకరాద్రిన్ భుజాటోపమేపారఁగా బంతిమాడ్కిన్, సతీ! మొత్తితిన్ సర్వదిక్పాలకశ్రేణి 'హా' యంచు వావిచ్చి పెల్లార్వఁగా, మించి నే నొత్తితిన్ శత్రుజాతిన్ ధరన్ ద్రెళ్లఁగా, మొత్తితిన్ భోగిశీర్షంబులన్ గీర్తిదిగ్దేశముల్ నిండఁగా;—

నట్టి నే నేడ! కాంతా! తపోవృత్తిమై ఘోరదుర్గంబులన్ గాయలన్ గూరలన్ గూడుగాఁ గుడ్చునిర్వీర్యుఁడౌ మానవుం డేడ? యా రాముఁ డేమాడ్కి నీఘోరవారాశిఁ దా నీఁదుఁ దా నెట్లులో యీఁదెఁబో, దేవదైత్యాళికిన్ సాధ్యమే కాని యీలంకలో నెట్లు తాఁ జొచ్చుఁ? దా నెట్టులోఁ జొచ్చెఁబో, వీర్యహీనుండు నౌ మానవుం డెట్టు లీఘోర దుర్వారదైత్యాళి చేఁజిక్కి ప్రాణంబులన్ బాయకే దక్కుఁ, దా దక్కెఁబో, వీరులౌ వీరలన్ గెల్చి, కాలాంతకున్ నన్ను సంగ్రామమందోర్చి నిన్నెట్లు కొంపోవు? ఈవార్త విన్నంతనే నవ్వరే పిచ్చివారైన? నోచాన! యూరిత్తలాకోర్కెలన్ మానుమా! కాఁడు నీరాముఁడేనాఁటి కీచోటి, కోచోఁటి! నామాటపాటింపుమా! నన్నుఁ జేపట్టి సౌఖ్యంబులన్ దేలుమా! నిన్నుబోల్ సుందరుల్ సృష్టి నెందెందునన్ లేరు! భూషావళుల్ దాల్చి మేల్ పుట్టముంగట్టి గందముం గత్తురిన్ మేనికిన్ బూసి, యాపారిజాత ప్రసూనంబులన్ వేణికిన్ జుట్టి, శృంగార మేపారఁగా, మొల్కునవ్వెంతయున్ గూర, నీమానసం బారఁగాఁ బల్కు, నీశ్రీకటాక్షంబు నాపైదయన్ జిల్కని మ్మింత నాముద్దు చిల్కా!' యటం చిట్లు పల్కెడు నా రావణున్ రోసి భూజాతచేతన్ దృణం బూని భాషించుఁ గోపించుచున్;—

### భూజాత రావణుని ధృణీకరించి దూషించుట.

భర్తయే దైవమం చెంచి సేవించుసాధ్వీజనానీకముం బల్మిమై తెచ్చుదుష్టాత్మ! నీతోడ భాషించుకంటెన్ మహాఘమ్ము వేఱున్నె? యిట్లన్యకాంతాజనాపేక్ష చేఁ గుందుభ్రష్టుండు పున్నెంబులన్ బాయు, దీర్ఘాయువున్ వీడుఁ, దా లోకనిందాస్పదుండై చెడున్, నారకంబుల్ గడున్ బొందు, నాత్మస్తుతిన్ జేయుహీనుండు, పాపాత్ముఁ డౌనండ్రు, నీ విన్నియున్ గల్గువాఁ డౌదు వోభ్రష్ట! దుష్టాత్మ! శ్రీరాముఁ డీసర్వలోకైకనాథుండు, ఘోరాజి నాతండు నిన్నున్ సుతామాత్యసైన్యంబుతోఁ గూల్చు నిక్కంబు, నీవంశనిర్మూలముం జేయు సత్యంబు, శ్రీరామసామర్థ్యముం గానవో? లోకవిఖ్యాతమౌ తత్ప్రతాపంబు నాలింపవో? కాలమాసన్నమౌటన్ బరాకొంది నీవుంటివో! దుర్మదా! తాటకన్ ద్రుంచె, గాధేయుయజ్ఞార్థమై ఘోరదైత్యాళినాశంబుగావించె, నెంచన్ విరాధున్ విదారించెఁ, గాంచన్ ఖరాద్యాసురశ్రేణిఖండించె, మాయామృగంబైన యానీచు మారీచు నారీతిగాఁ గూల్చె, నానాఁడు నీ వెత్తఁగాలేని శ్రీభర్గుచాపంబు కేలంటి లీలావిలాసంబుగాఁ దుంట్లు గావించె; నాధీరు దోశ్శక్తికీసాగరం బెంత? నీలంకయే మంత? నీవెంత? నీలావు చేవెంత! నీకంటితో నంతయున్ జూతుగా కింత శాంతింపుమా; నేఁటికిన్; రాముఁ డేతెంచి, బాణాగ్ని నీలంకఁ జుట్టించి ముట్టించి తా దిట్టయై నిల్చి దివ్యాస్త్రముల్ దాల్చి, నీవారి నీలంకలోనున్న యీయెల్లవారిన్ మఱిన్ వారికై వచ్చి పోరాడువా రెంతవారైన వారిన్, మఱిన్ వారివారిన్, ధరన్ గూల్చి, నీమస్తకంబుల్ క్షితిన్ దొర్లఁగాఁ జీల్చి ప్రేతాళికిన్ దృప్తిగా భోజనం బిచ్చు, నిక్కంబులత్రుళ్ళంగ సైరింపుమా!' యంచు, నారాక్షసస్వామి లక్షింపకే సీత తీవ్రంబుగాఁ దూలనాడంగఁ, దా వాలమున్ ద్రొక్కఁగాఁ రేఁగు కాలాహిలీలన్, దిశల్ ఘూర్ణిలన్ గర్జనల్ సల్పుచున్, మించ దావానలజ్వాల లాకన్నులన్, సీత ఖండింప నుంకించె, నాయంతకాకాంతలడ్డంబుగావచ్చి దైత్యేశు వారించి వేగన్ సమాధానమున్ జెప్పె నీరీతిగా;—

◆ త్రిజట రావణునకు సమాధానముఁజెప్పి, యింటికి మరలించుట ◆

దేవ! నీకోపముఁజూపఁగా దేవతానాథుఁడో? గాఁడుపో? భానుఁడో? గాక, నీసాటియే యాఁటదెన్నంగ, సైరింపుమా!' యన్న, నారావణుం డంతఁ గోపంబు తాపంబు దీపింపఁగాఁ బల్కి నారాక్షస స్త్రీలతో, 'మీర లిన్నాళ్లి నెట్లైన మాపద్వయంబందునన్ గూర్పుఁడీ, నాకుఁ! దా నంతలోఁ ద్రోవకున్ రానిచోఁ, బంత మేపారఁగా, దీని నింతింతగాఁ గోసి భక్షింపుఁడీ!' యంచు గర్జించుచున్ బోయె నంతఃపురిన్ జేరఁగా, వెంట దాసీభటస్తోమ మేతేరఁగా;

ఇంత వీక్షించుచున్నట్టిసామీరి యాదైత్యుపై వ్రాలనుంకించి, యొక్కింత సైరించి, చింతించుఁ దా నాత్మలో - 'నేను కోపంబుచే దైత్యుపై దూఁకినన్ వాఁడు నాచేతిలోఁ జిక్కుచో మేలు, గాకేని యాదుష్టుచేఁజిక్కినన్ మోసమౌఁగాదె! భూజాతవృత్తాంతమున్ గాన కారాముఁ డేమౌనొ? భూపుత్రి ప్రాణంబులన్ బాయునో? యొంచ సౌమిత్రి జీవించునో! మించి యొంతెం తనర్థంబు వాటిల్లునో? వేళగాదిద్ది సైరించుటే ల'గ్గటం చెంచి తా నెట్టిటో డెందమున్ జిక్కఁగాఁబట్టి యాచెట్టుపై గుట్టుగానుండెఁ;

◆ సీతాదేవిని రాక్షసస్త్రీలు బెదరించుట ◆

ఆరావణుం డట్టులేగంగ, నాపిమ్మటన్ దైత్యకాంతల్ ధరాపుత్రి నానాప్రకారంబులన్ ద్రిప్పలో నెంచి, గర్జించి భర్జించి బోధించి రత్యంత, మం దొక్కరాకాసి ఖడ్గంబు చేఁబూని-ఓనారి! యారాముఁ డీదిక్కురా లేఁడు, ప్రేమించి మారావణున్ బొంది మారాణివై ప్రేమ్మంచున్ గోపించె నింకొర్తు- 'మామాట లాలించి మాతేనినిన్ గూడు, లేకున్నచో నిన్ను ఖండించి, వండించి భక్షింతు మే' మంచు నిక్కచ్చిగాఁజెప్పె; నింకొక్క రాకాసి,'మారావణస్వామి నీవొప్పలేకున్న, నీకుత్తుకన్ బట్టినే నొత్తి ప్రాణంబు పోఁగొట్టి వారాశిలో వైతు' నం చాడె; నిట్లందఱున్నన్ని రీతుల్ ప్రబోధింప, వైదేహి 'హారామ! హారామ! హాలక్ష్మణా!' యంచుఁ దా

నేలపై మూర్ఛమైఁగూలె, నాయంతలో నిద్రలోనుండి మేల్కాంచి దైతేయ వామాక్షి యొక్క త్రి యవ్వారి వారించి యిట్లాడు:- నేనొక్క స్వప్నంబు నీక్షించితిన్, లంక వారాశిలోఁగ్రుంక దైత్యేశుకంఠంబులన్ రాము నారాచముల్ గూల్పఁగాఁ గంటి, నామీఁద నీసీతతోఁగూడ శ్రీరాముఁడే స్యందనం బెక్కిపోవంగ నీక్షించితిన్, దప్ప దీలంక నాశం బగున్, సత్య మీపల్కు, శ్రీరాముఁ డారావణున్ద్రుంచి భూజాతఁ గొంపోవు, మీ రేటికీదేవి నిక్లేశఁగా, నంచు నిక్కచ్చిగాఁ బల్క, నవ్వార లామాటకున్ నొచ్చి చింతించుచున్ నిద్రఁబోఁజొచ్చి, రంతన్ ధరాజాత శోకించుచున్ రాముఁ జేర్కొంచు, హాలక్ష్మణా' యంచు వాపోవుచుండంగ, సామీరి భూజాత నోవార్పఁగా నిద్దియే కాల మం చెంచి, వృక్షంబుపై నుండిలంఘించి, ధాత్రీస్థలిన్ నిల్చి కేల్మోడ్చి పల్కాడు భూపుత్రితో;-

## హనుమంతుఁడు సీతాదేవికి శ్రీరాముముద్రిక నిచ్చుట

'హాయిమైనుండు శ్రీరాముఁ డాతమ్మునిన్ గూడి యమ్మాల్య వంతంబునన్, వానరేశుండు సుగ్రీవుఁడే బంటునై కొల్వఁగా; నిన్ను నీక్షించిరం డంచు బంపించె, నల్దిక్కులన్ జుట్టఁగా వానరశ్రేష్ఠులన్; వారలం దొక్కసంఘంబుగా మమ్ము నీదక్షిణాశన్ విలోకింపఁగాఁ బంపె, నావేళలో నన్ను వీక్షించి తా నుంగరం బిచ్చె నాచేత నీకప్పగింపంగ శ్రీరాముఁ, డద్దానిఁ గైకొమ్మటం చిచ్చినన్;- సీత కైబూని యద్దాని శ్రీరాము ప్రేలుంగరం బంచు గుర్తించి తాఁ గన్నులం దొత్తి మూర్ధంబునన్ దాల్చి హృత్సీమ నంకించి, హస్తంబుచే బిఱ్ఱుగా నొత్తుచున్ బట్టి, యవ్వాయుపుత్రున్ విలోకించి తా నాత్మ శంకించు చున్ బల్కు:-

నోవానరా! కాంచ నెవ్వాఁడవో నీవు? నా కిందు నేప్రొద్దు దైత్యుల్ కదున్ భీతి గొల్పింతు, రాఠీతివాఁ డౌదువో? నిన్ను నే నమ్మఁ గాఁ జాలఁ బోమ్మన్న, సామీరి తల్లీ! నినున్ రావణుండెత్తికొంపోవుచో

హేమభూషాదుల్ కొంగునన్ గట్టి యామూట నీవయ్యెడన్ వేయవే ఋష్యమూకాద్రిపై, మేము నద్దానిఁ గైబూని శ్రీరాముఁ డేతేర నర్పించినా మమ్మ!' యంచన్న, భూజాత లో మెచ్చి భాషించు- 'నో వానరా! యింతకే నిన్ను నే నమ్మ, నీ వాతనిన్ జేర నేహేతువో? రాముకార్యార్థమై యిట్లురా నేనిమిత్తంబు నీకుండెనో! క్రోతి నీ వారయన్, మానవుం డాత డేరీతి మీకొప్పసఖ్యంబు? బల్ సందియంబయ్యె'నంచన్న, సామీరి యత్యాదరంబొప్ప భాషించు;-

శ్రీరాముఁ డారీతి నిన్ గానలోఁ గానకే శోకమున్ జేయుచున్ రా విలోకించి నీసొమ్ము లియ్యంగ, హర్షించి మారాజు సుగ్రీవుతో స్నేహమున్ జేసె, నామీఁద శ్రీరాముఁ డావాలి సంహారమున్ సల్పి, రాజ్యంబుతో వాని దేవేరి సుగ్రీవునిన్ జేరఁగాఁ జేసెఁ, దత్కారణం బుంటచే, బంటుగాఁ గొల్చె సుగ్రీవుఁ డాదేవునిన్; మేము రాజాజ్ఞమై నిన్ను నీక్షింపఁగాఁ గొందఱే తెంచినా మమ్మ! యవ్వారలం దేను నల్లంతప్రొద్దుం డఁగా వార్ధి లంఘించి యీలంక కేతెంచి యన్వేషణన్ జేసితిన్ నిన్ను; నాదైత్యుఁ డేతెంచి దుర్భాషణల్ వల్కుకాలంబునన్, డాఁగి యీవృత్తమందుంటి, నామాటలన్ వింటిఁ, నీమాటలన్ వింటిఁ గాలంబు కాదౌట సైరించితిన్ దేవి! నన్ నమ్ముమా!' యన్న, నొక్కింత చింతించి, సామీరి మోమట్టె వీక్షించి, వైదేహి భాషించు,- 'నో వానరోత్తంస! శ్రీరాముఁ డెట్లుండు? నమ్మాన్యచందంబు, భాషించుభావంబు, నేర్పున్ గుణంబున్ వినన్ దెల్పుమా!' యన్న, వాతాత్మజుం డంత భూజాతకున్ మ్రొక్కి యిట్లాడెడిన్;—

హనుమంతుఁడు సీతాదేవికి నిజస్వరూపమును జూపుట.

శ్యామలాంగుండు, నాజానుబాహుండు, నీలోత్పలాకర్ణ నేత్రుండు, శ్రీకంబుకంఠుండు, బల్ పీనవక్షుండు, మేలైనగుల్ఫంబు లొప్పారు ధీరుండు, చిన్నారినవ్వొల్కు చెల్వుండు, శాంతమ్మునే సొమ్ముగాఁ గొన్న వీరుండు, బల్ సత్యశీలుండు, తా నేకపత్నీవ్రతుండమ్మ! తల్లీ! గుణాఢ్యుండు నీకాంతుఁడౌ రామచంద్రుండు లోకైకవీరుండగున్, మాతరో!

లక్ష్మణుం డెన్నఁగా, నిన్నిఁయుఁ గాగల్గి, బంగారుచాయన్ గదుర్ మేను రంగారుసింగార మేపారువాఁడమ్మ!;—

'నే నాజగత్స్వామిపుత్త్రుండ, సుగ్రీవుమంత్రిన్, హనూమంతుఁ డండ్రమ్మ నన్ నమ్ముమా! ముద్రికన్ నీకు నర్పించితిన్, దూత నే రిక్తహస్తంబునన్ బోవరాదోటచే వేఁడెదన్ నీశిరోరత్న మిమ్మా! రఘూత్తంసుచేనుంతు నద్దాని నే నానవాల్గాఁగ' నంచాడుచున్ హస్తముల్ చాచు నామారి నీక్షించి, భూజాత యేమాఱుమాటాడకే యూరకున్నంత, నాధీరుఁ డాతీరునెల్లన్ విలోకించి యిట్లాడు-'నోమాత! నేనెంతగాఁ జెప్పినన్ నమ్మకున్నావు, నీచిత్తమందున్న సందేహ మే మానలేయంగ దే నాకుఁదల్లీ! నిజంబిద్ది, శ్రీరాముదూతన్, హనూమంతుఁడన్ వేరివాఁడన్, నినున్ గాంచి పోవచ్చినానమ్మ! సందేహముల్ మానుమమ్మా!' యనన్ సీత పల్కాడు:- 'నోధీనిధీ! కాంచ నీరూప మల్పంబు, వారాశి నేరీతిగా దాఁటితో? దుష్టదైత్యాళిచేఁదప్పి నీవెట్టు లీలంకలోఁజొచ్చితో? మీఁద నీచోటికెట్లేగెదో? నాకుఁ జోద్యంబగున్, గాన నేనియ్యఁగాఁ జాల నీ కీశిరోరత్నమున్; నామదిన్ సందియంబయ్యె' నంచన్న, వాతాత్మజుం డంత భూజాతపాదంబులన్ మ్రొక్కి,'నాదౌస్వరూపంబు నీక్షింపుమం' చాడి మేన్ పెంచె నక్షత్రముల్ నెత్తిపైఁబూలుగాఁదోఁప, నాకాశమున్ భూమి యేకంబుగానిండి తానంత నిల్వంబడన్, గాంచి మోదాశ్రువుల్ జాఱ హర్షించుచున్ మేను నిండన్ గగుర్పాటుదోఁపంగ నీక్షించి- 'యోమారుతీ! కంటినీరూపు, నీలావు నేనెంచితిన్ జూడ నత్యద్భుతంబయ్యె నాశ్చర్యమున్ దోఁచె, నానంద మేపారె, నింకేల? నీసూక్ష్మరూపంబు గైకొమ్మ'టంచాడె;—

**సీతాదేవి యాంజనేయునిచేత శిరోరత్నమిచ్చి, దీవించుట.**

అట్లాతఁ డొప్పన్ విలోకించి, వాతాత్మజున్ దగ్గఱన్ బిల్చి, భూజాత సంపత్కరంబైనహస్తంబుఁ దా శిస్తుగా వాయుసంజాయమూర్ధంబుపైనుంచి- 'మన్నాథునేమంబు నాకేర్పడన్ దెల్పి, నాప్రాణ

ముల్ గాంచినా వీవు, నీకేమి నే నీయఁగానేర్తు? సామీరి! వర్ధిల్లుమా, బ్రహ్మకల్పంబు నీ' వంచు దీవించి, తాఁ గొంగునన్ దాఁచియున్నట్టిదౌ శ్రీశిరోరత్నమున్ వానరోత్తంసుహ స్తంబునం దుంచి హర్షించుచున్ వెండియున్ బల్కె;—

## రామలక్ష్మణులకు భూపుత్రిసందేశము

“ఓయంజనాపుత్ర! తన్ బాయునాఁడాదిగా, నన్నమున్ నీరమున్ మాని, కన్నీరమున్నీరుగా నేడ్చుచున్, నిద్రఁబోఁబుచ్చి తన్మూర్తి హృత్పీఠిపై నిల్పి, ధాత్రీరజం బంగమున్ బర్వఁగాఁ బ్రాణమే లేనియట్లుంటినం చాడుమా నాదుప్రాణేశుతోఁ;- దన్ను నేప్రొద్దు లోనమ్మి దైవంబుగాఁ గొల్చుదానన్, ననున్ మర్వ రాదంచు వాక్రువ్వుమా! అగ్నియే సాక్షిగాఁ గొన్నయర్ధాంగి యిట్లన్యు చేఁజిక్కి దుఃఖింపఁ దా నిన్నినాళ్లోప న్యాయంబుగాదంచు బోధింపుమా! నాకునై కానిచోఁ బోనిలే, భార్య నొక్కండు ధూర్తుండు నిర్బంధమున్ జేసి కొంపోవ, వానిన్ హతున్ జేసి, యిల్లాలిఁ దాఁదీయకున్నన్, ధరన్ భర్తకున్ దుర్యశం బౌటఁ, దన్ బోలువాఁ డూరకుండంగ రాదంచు,నామాటగాఁ జెప్పుమా! నీవు కన్నారవీక్షించినావే కదా! ధూర్తుఁ డీప్రొద్దువిచ్చేసి నన్ బల్కుతీరం తయున్; రాక్షసుల్ గొల్పుబాధల్ సహింపంగ రా, వెట్టులో నైఁచితిన్, రాముపై నాసచే నుంచితిన్ బ్రాణముల్, మారుతీ! జ్ఞాపకంబుంటినో, లేక నన్నెల్లఁడో! కాక కోదండదీక్షాగురుండైన నాస్వామికి రావణుం డెంత? నన్ గాచుకార్యం బదేమంత?”- యం చేడ్చుభూజాత నీక్షించి వాతాత్మజుం డాడు;—

‘ఓమాత! నీభ్రాంతియే కాని, శ్రీరాముఁ డేప్రొద్దు నీచింతలో నుండె, సంతృప్తిగాఁ బండ్లు సేవింపఁడే, నిద్ర నేన్ జక్కఁగాఁ బోవఁ, డంతంత నిద్రించి- హా, సీత! యంచార్చుచున్ లేచు, నీకై తపించున్, నిజం బింతె యంచాడ, భూజాతయార్వార్చి ‘యోమారుతీ! కాననంబందు మున్నొక్క కాకంబు నావక్షమున్ ముక్కుతోఁ గ్రుచ్చఁగాఁ గాంచి, కోపించి యద్ధా

నిప్పైఁ దా నిషీకంబువై వంగ, బ్రహ్మాస్త్రమై యద్ది యా గాకివెన్నంటఁ, బ్రాణేచ్ఛ నాకాకి యేకాక్షియై మూఁడులోకంబులన్ జుట్టి, దిక్కెవ్వరిన్ గాన కేతెంచి శోకించుచున్ వేఁడ, రక్షించె రాముండు దీనావనుం, డార్త రక్షైకదక్షుండు, నా ప్రాణనాథుండు- ప్రాణేశ్వరిన్ భక్తురాలిన్- నన్నున్, వీడు నే? కల్ల; రక్షించు నిక్కంబు, శీఘ్రంబు నీ వేగి, నీకన్న పాటెల్ల నా స్వామితోఁ జెప్పి, వైళంబ దోడ్తెచ్చి నన్ బ్రోవుమా!—

తండ్రి! యింకొక్కమాటుండె, నద్దాని లోనెంచ గుండెల్ గుభిల్లంచు డిందున్ గదే, మారుతీ! రామునిన్ దండ్రిఁగా, నన్నుఁ గన్నమ్మఁగా నెంచి సేవించు, పూతాత్మునిన్, నీతిమంతున్ మహానిర్మలున్, లక్ష్మణున్, లో వివేకంబుఁ బోనాడి, యానాఁడు దుర్భాషలన్ బల్కితిన్; దత్ఫలం బిప్డు డీరీతి ఘోరంబుగాఁ గుడ్చినా నంచు సౌమిత్రితో నానుడుల్ గాఁగ విన్పింపుమా! మూఢనై పల్కునాయానుడుల్ చిత్తమందుంచకే, ప్రేమ నామానసమున్ గావ నమ్మాన్యుతో, వేఁడినా నంచు పల్కాడుమా! మారుతీ!' యంచు శోకించె;—

అమీఁద సామీరి;- 'యోయమ్మ! యిన్నాళ్లిటో సైఁచినా, వింకఁ గొన్నాళ్లు సైరింపుమా! నేను నీవార్త శ్రీరామునితోఁ దెల్పుమాత్రంబు నన్, వచ్చి నీచాత్మఁడౌ రావణున్ జంచి, నిన్ గొంచుఁ దా నేగు, దుఃఖింపకమ్మా! యిటుల్ నీవు శోకింపఁగాఁ గాంచి నే సైఁపలేనమ్మ! యింతేల? నాతల్లి! నావీఁపుపై నెక్కి కూర్చుండుమా! కాంచఁ బూర్వాద్రిపై భానుఁడున్ దోఁచునా యంతలో, వార్ధి లంఘించి కొంపోయి నీనాథుతోఁ జేర్చెదన్ రమ్మురమ్మంచు మూఁ పొడ్డఁగా, మెచ్చి భూజాత, సామీరి నీక్షించి భాషించు;—

హనుమంతుఁడు సీతాదేవిని సమాధానపఱచి, యామెను వీడ్కొనుట.

నీ వట్టిధీరుండవౌ, దైన నారీటఁగావించినన్, దైత్యుకంటెన్ రఘూత్తంసుఁడే దొంగటం చన్నదుష్కీర్తియౌ;- దూతవున్, బుత్రతుల్యుండ వీ వౌట, నీవెంట నే వచ్చినన్ దప్పుగాకుండు నైనన్, దురా

త్ముండు నాదైత్యసంహారమున్ జేసి, బలసాహసం బొప్పఁగా, నన్ భరిం
పన్ దగున్ గాని, నన్ గౌఁగిలింపంగరాదౌట, నారాముతో నిన్నియున్
దెల్పి తోడ్తెమ్ము: యోమహామతీ! నేను ప్రాణేశ్వరున్ బాసి యీయైదు
మాసంబు లీరీతిగా, ఘోరదుఃఖంబునన్ నైఁచితిన్, రెండుమాసంబు
లీవాంఛితో నుందు నే నింక, నాయంతలో నాథుఁ డీలంకకున్ రానిచో,
వార్థిలో దూఁకి ప్రాణంబులన్ బాయుదున్ గాని జీవింపనం చెప్పినన్
గాంచి సామీరియిట్లాడు:- 'నీనాథుఁ డీయంబుధిన్ దాఁటి, సుగ్రీవసౌమి
త్రులన్ గూడి సైన్యంబుతోవచ్చి, యీలంక నాశంబుగావించి తత్పుత్ర
మిత్రాళితో రావణున్ ద్రుంచి, తన్నున్ సుపర్వుల్ గడున్ మెచ్చికొం
డాడఁగా నిన్నుఁ గొంపోవు నమ్మా! సుఖంబుండు మమ్మా! ధరాపుత్రి!
నామాటలన్ నమ్ము మమ్మా!' యటం చామెకున్ ధైర్యమున్ జెప్పి తాఁ
బోవఁగా నానతిన్ వేఁడె, నద్దేవి దీవించి యాజ్ఞన్ బ్రసాదించె:- నాపైని
సామీరి:- యోమాత! నే నాఁకటన్ జిక్కితిన్ మిక్కిలిన్, గాన నిం దీవ
నిన్ గల్గునీపండ్ల సేవించెదన్, దృప్తినొందంగఁ బూఁదేనియల్ గ్రోలెదన్
జాలఁగా, నానతీయంగదే! మాత! యీమాత్రమే కాదు తల్లీ యిటుల్
వైరిప్రోల్ సొచ్చువృత్తాంత మావైరికిన్ దెల్పకే, దొంగ యట్లేగఁగాఁ
గాదుగా వీరధర్మంబునున్ నామనంబొప్ప దామార్గ, మట్లౌట నే నీయశో
కావనిన్ గొంత స్వేచ్ఛావిహారంబుగావింతుఁ, దద్రక్షకాళిన్ వినోదంబు
గొల్పింతు, దౌష్ట్యంబునున్ జేతు భీతిల్లకమ్మా! అవశ్యంబయేనిన్ దగన్
సందు నా కబ్బినన్ మానకే నాదురాత్ముండునౌ రావణున్ జూచి బోధిం
చెదన్ నీతినిన్, త్రోవకున్ వాఁడు రాకున్న, నే నింత చూపించెదన్ నా
ప్రతాపంబు; శ్రీరాముదోశ్శక్తి నేఁ జాటి, యామీఁదటన్ ధాటిమై
దాఁటి మున్నీటి, నామాల్యవంతంబునున్ జేరి దోర్వీర్యమేపార, శ్రీ
రాముదర్శింతు నమ్మా! ధరాపుత్రి! నాకేభయంబుండదమ్మా! వెతన్ బొంద
కమ్మా! ననున్ గూర్చి భీతిల్లఁగా రక్కసుల్ నీకు నేవింతలౌ వార్తలన్
జెప్పినన్ సుంతయున్ నమ్మకమ్మా! యటం చాతి సద్భక్తి సాష్టాంగదండ

ప్రణామంబు గావించినన్, సత్కృపాదృష్టి వీక్షించి సామీరి నా రాము దేవేరి. 'నీ కెల్లడన్ మంగళంబౌత! నీయిష్ట మీడేరుతన్, రాముఁ డెల్లప్పుడున్ నిన్ను రక్షించుతన్! మించి నాదీవనల్ నిన్ను గాపాడుతన్, దేవతల్ ప్రీతి రక్షింత్రు గాతన్ హనూమా' యటన్ జోయిరమ్మంచు దా నానతీయంగ, నామీఁద వాతాత్మజుం డాయశోకావనిన్ జేరి;—

హనుమంతుఁ డశోకవనమును గూల్చుట.

వృక్షంబులన్ గూల్చెఁ, జెన్నారు నా పుష్పగుచ్ఛంబులన్ ద్రాల్చెఁ, బొందౌ పాదపాల్ జీల్చెఁ, బూతీనియల్ రాల్చె, మేలౌ లతామందిరంబుల్ విదారించెఁ, దా మేడలన్ మిద్దెలన్ మట్టు గావించెఁ, గేళీగృహంబుల్ పడన్ గూల్చె, లీలన్ సరస్సుల్ గలంచెన్, దనున్ దాఁకఁగా నాలువేల్ రాక్షసుల్ వచ్చినన్ గూల్చె, నద్దాని నెల్లన్ ధరాపుత్రికన్ గాచు దైత్యాంగనల్, చూచి పర్వెత్తుచున్ బోయి భీతిన్ దశగ్రీవునిన్ గాంచి కేల్మోడ్చి- 'యోదానవాధీశ్వరా! మర్కటుం డొక్కఁ డెక్కెక్కడిన్ జొచ్చెనో తోఁటలోఁ జొచ్చి, భూజాతతో నేమొ భాషించి మీఁ దాయశోకావనిన్ సర్వనిర్మూలముం జేయుచున్నాఁడు, వీక్షించి వీరుల్ వనీపాలకుల్ పోరు గావింప, నాయాలు వేల్ దైత్యులన్ జెక్కు చెండాడెఁ దా నొక్కఁడే శక్తిసంపన్నుఁడై సాహసం బేర్పడంగా; నశోకావనిన్ నిల్చి గర్జించుచున్నాఁ' డనన్:- గ్రోధరక్తాక్షుఁడై దానవేంద్రుండు పల్కాడు:—

'ఆరాముఁ డంపంగ వచ్చెనే గాఁబోలు! నా క్రోతిఁ జంపుఁ' డనన్, రాక్షసుల్ పెక్కువేల్ మంది శస్త్రాస్త్రముల్ దాల్చి, క్రోధంబుతో నార్చుచున్ వచ్చి, వాతాత్మజున్ దాఁకినన్; వీఁకఁ దాఁ దోఁకతోఁ జుట్టి యద్దైత్యులన్ జావఁగాఁ గొట్టి, యయ్యిందఱన్ నేలకున్ బెట్టి, బల్ దిట్టయై చెట్టుకొమ్మెక్కి తా గట్టిగా గంతులన్ వైచినన్- గొంద. -ఱెల్లెల్లఁ జేదప్పి ప్రాణంబులన్ దక్కఁ, బర్వెత్తుచున్ బోయి దైత్యేశు వీక్షించి వృత్తాంతమున్ జెప్పినన్;—

## రావణుఁడు హనుమంతునిపైకి రాక్షసులఁ బంపుట.

క్రుద్ధుండై మండుచున్ రావణుం డంపఁగాఁ, బింగళాక్షుండు, నాదీర్ఘజిహ్వుండు, ఘోరాశ్మవక్త్రాదియోధాగ్రగణ్యుల్, మహాసైన్యముల్ తోడరా, స్యందనారూఢులై వచ్చి శస్త్రాస్త్రముల్ పుచ్చినన్; జేకేలఁ బూనక వాయుపుత్రుండు దర్పంబు పెంపొంది బడన్ మోఁదుచున్ దోఁకతో, సర్వదైత్యాళి సంహారముల్ జేసినన్‌- గాంచి దవ్వున్న దైత్యుండొకం డాతురుండై వేగన్ వచ్చి యారాక్షసస్వామి కావార్త వినిపించినన్;-

విస్మయంబంది దైత్యేశ్వరుం డుగ్రుఁడై క్రోధదావానలజ్వాలలాడంగ నేత్రంబులన్, శీఘ్రమంపెన్ మహామాత్యపుత్రౌఘమున్; రక్తరోముండు, రక్తాక్షుఁడున్, శూలదంష్ట్రుండు నీయాదియౌ వీరులేతెంచి, రా సైన్యవారంబు బీరంబులన్ బల్కుచున్ వెంటరా, భూమి ఛేదిల్లఁగా సింహనాదంబులన్ సల్పుచున్ వచ్చి, శస్త్రాస్త్రముల్ వానరస్వామిపై నేసినన్, గాంచి యాతండు కోపంబు రెట్టింపఁగా, వాలమల్లార్చి బ్రహ్మాండగోళంబదెల్లన్ బకిలంచు వేబ్రద్దలౌనట్లుగాఁ దాఁ గఠోరంబుగా నార్చుచున్ వచ్చి, యాసైన్యమధ్యంబునన్ జొచ్చి, మత్తేభమున్ బట్టి వేగొట్టు నాయేనుగుమందల్ ధరన్ద్రెళ్లికూలన్, రథంబెత్తి కొట్టున్ రథంబుల్ సెడన్, గుఱ్ఱమున్ బట్టి గుఱ్ఱంబులన్ జావమోఁదున్, భటున్ బట్టి పైకెత్తి గిర్గిఱ్ఱునన్ద్రిప్పికొట్టున్ భటశ్రేణి ప్రాణంబులన్ బాయ,- నీరీతి పామీరి, కాసారమున్ జొచ్చి స్వేచ్ఛావిహారంబు గావించు వేదండరాజంబువోలెన్, మహాసైన్యమధ్యంబునన్ దూఱి తానల్లకల్లోలమున్ జేసి, యాశత్రుపాళిన్ విదారించి, చీకాకుగావించి, ప్రాణంబుఁ బోఁగొట్టి, బిట్టార్చుచున్ బాహువుల్ గొట్టుచున్ నిల్చినన్, గాంచి శేషించు దైత్యాళి బల్ భీతిమైఁ బాఱి దైత్యేశ్వరున్ జేరి వృత్తాంతమున్ జెప్పఁగా;-

## రావణుఁ డక్షయకుమారుని హనుమంతునిపైఁ బంపుట.

విస్మయంబంది తా నింత చింతించి, నల్దిక్కులం జూచి, యాప్రక్కఁ గూర్చున్నపుత్త్రున్ మహాస్త్రున్ విలోకించి యయ్యక్షపుత్త్రున్ దరిన్ జేర్చి పల్కాఁడు: 'ఓపుత్త్ర! వింటేకదా, క్రోతి కావించు దౌష్ట్యంబు? వీరాధివీరుల్ పదార్వేలు దైతేయులన్ జంపె, నద్దాని సామాన్యగా నెంచఁగా రాదు, నీ వేగి నీ విక్రమం బేర్పడన్ జాగరూకుండవై పోరి యామర్కటున్ జంపి పేర్వాసి మైమ్ము పొమ్మన్నఁ' దా డిగ్గనన్ లేచి యయ్యక్షపుత్త్రుండు వేగన్ రథంబెక్కి శస్త్రాస్త్రముల్ దాల్చి, వేదండతండంబుముం దేగఁగా, వెంటవెంటన్ భటస్తోమ మేతేరఁగా, వీరహుంకారముల్ భేరికాఘోషభాంకారముల్ దిక్కులన్ బిక్కటిల్లంగ, నాసైన్యపాదాహతిన్ ధాత్రి గ్రుంగన్ మహాటోప మేపారఁగా, నక్షపుత్త్రుండు విచ్చేసి క్రూరాస్త్రజాలంబుతో నుంచినన్;—

గాంచి కోపించి దిగ్భాగముల్ మాఱుమ్రోఁగంగ వే సింహనాదంబు గావించి వీక్షించి, తద్బాణవర్షంబు గాఁ, జేతులన్ బట్టుఁ, బాదాహతిన్ గొట్టుఁ, దా ముష్టితో నెట్టు, మోచేతులన్ నూకుచున్ వెన్కకున్ దట్టు, మారొడ్డుచున్ నెత్తిఁడీకొట్టు, వాలమ్మునన్ జాఁపఁగాఁ జుట్టి యయ్యస్త్రములన్ నేలకున్ బెట్టి, బిట్టార్చుచున్ జివ్వునన్ బోయి వృక్షంబులన్ దెచ్చి సైన్యంబులన్ గొట్టు, బల్ కొండలన్ గుండులన్ దండిగాఁ జేతులన్ మూఁపులన్ బెట్టి కొన్నింటిఁ బాదమ్ము లానించి దొర్లించుచున్ దెచ్చి సైన్యంబుపై ఉవ్వుచున్, మొండెముల్ దండముల్ తుండ్లుగా గావించి, బల్ కండలున్ రక్తమున్ గార్చి, భూతాళికిన్ బందుగల్ వెట్టుచున్నట్టిసామీరి నీక్షించి, క్రుద్ధుండునై యక్షపుత్త్రుండు చేతన్ గదన్ దాల్చి, వే స్యందనాగ్రంబునందుండి సామీరిపై దూఁకి వక్షంబుపైఁ గొట్టె, నా పెట్టుచేఁ గొంత యాతండు మూర్ఛిల్లి, యంతంతటన్ దేఱి, తా నాగదన్ లాగి, బాహాబలస్ఫూర్తి నద్దైత్యుమూర్ధంబుపైఁ గొట్టినన్, వాఁడు ప్రాణంబులన్ బాసె;

సామీరి యామీఁద నక్రాకృతిఁ బొల్చు నాతోరణం బెక్కి తాఁ గర్జనముల్ భీకటలై పాఱఁ బెల్లార్చినన్;—

గాంచి భీతాత్ములై కొంద ఱేతెంచి రాత్రించరస్వామి నీక్షించి, బల్భక్తిభావంబునన్ హస్తముల్ మోడ్చి విన్నించి రీరీతిగన్- 'రావణా! లోకవిద్రావణా! సింహసత్త్వుండు సచ్చెన్, గనన్ దంతివక్త్రుండు ప్రాణంబులన్ బాసె, నాజంబుమాల్యాఖ్యవీరుండు గూలెన్, విరూపాక్షుఁ డన్ గ్రుగ్గె, నాశూలదంష్ట్రుండు నుగ్గయ్యె, యూపాక్షుఁ డీల్గెన్, మహారాజ! మీ యక్షపుత్త్రుండు తాఁ జేరఁగాఁబోయె నాకంబు' నంచన్న, దిగ్భ్రాంతుఁడై రాక్షసేశుండు చింతించి మీఁదన్ సభాస్తారులన్ గాంచి భాషించెడెన్ 'క్రోతి కాదిద్ది దైత్యాళి మ్రింగంగ రూపంబుఁ గైకొన్న దయ్యంబొ? నాకేశుఁ డాభర్గునిన్ గొల్చి దైత్యాళివంశంబు నాశంబుఁ గావింపఁగా మేల్వరంబుల్ దగన్ గొంచు నీరీతి నేతెంచెనో? యట్లైనాకున్న నాధాక కా దేవతల్ దాళ రీలోకమందన్న, యీక్రోతి యేమీ! మమున్ దాఁకు టేమీ? మహాశ్చర్యమై తోఁచు' నం చెంతయున్ జింతచేఁ గుందుతండ్రిన్ విలోకించి, యమ్మేఘనాదుండు భాషించె గంభీరవాక్ప్రౌఢిమం బేర్పడన్;—

ఇంద్రజిత్తు హనుమంతునిపై కేగుట.

'తండ్రి, దిగ్దేశముల్ గెల్చి, దేవేశ్వరున్ బట్టి నాగేంద్రునిన్ గొట్టి పేర్వాసిగన్నట్టినీ కేటికో చింత, యీక్రోతికై యింత! శాంతింపుమా! నేన యామర్కటున్ బ్రచ్చెదన్, లేనిచోఁ బట్టి యాచెట్ట నీవ్రోటికిన్ దెచ్చెదన్, జూడు' మం చాడుచున్ రుద్రుఁడై లేచి నిల్వంగ, మోదాత్ముఁడై రాక్షసేశుండు తా రావణిన్ గాంచి- 'శ్రీబ్రహ్మదత్తప్రతాపుండవున్, జాపవిద్యాప్రవీణుండ వీవాదు, వా దేవతాధీశు మర్దించి, సత్కీర్తిమై నింద్రజిత్తన్న పేరెన్నికన్ గన్నవీరుండవీ వారయన్, నీకసాధ్యంబులున్ గల్గునే! పోయిర'మ్మన్న, నాతండు మాణిక్యదేదీప్యమానంబునౌ స్యందనం బెక్కి శస్త్రాస్త్రముల్ పూని, బల్సాహసోదారులౌ దైత్యవీరుల్ భయా

కారులై వెంటరా, నశ్వమాతంగముల్ కూడిరా, భేరిఢంకామృదంగస్వనం బుల్ ధరాకాశముల్ నిండి యేకంబుగా మ్రోఁగఁగా వచ్చె; నావచ్చు సైన్యంబు నీక్షించి, సామీరి యాతోరణస్తంభభాగాగ్రమం దుండి బిట్టార్చె, నాపట్టునన్ వార్ధిధుల్ ఘూర్ణిలెన్, శైలజాలంబు కంపించె, దిగ్దంతు లూటాడె, నంతన్ నభోవీథినే తెంచి వీక్షించి రాదేవతల్;—

## ఇంద్రజిద్వాయుపుత్రుల యుద్ధము.

దైత్యసంఘంబు శస్త్రాస్త్రముల్ గుప్ప, సామీరి కోపించుచున్ దోరణాగ్రాంబునందుండి లంఘించి, యాసైన్యమధ్యంబునన్ జొచ్చి- వాలంబుతోఁ గొందఱన్ గొట్టు, సాలంబులన్ బట్టుచున్ గొందఱన్ నేల కున్ బెట్టు, నంతంతఁ గుప్పించు వేదండతండంబుపై; వాని నన్నింటిఁ బో కార్చి, యాపైన నందుండి లంఘించు నాస్యందనశ్రేణికిన్; వాని నన్నింటిఁ జీకాకుగావించి, యొండొండుగా సారథిన్ యోధునిన్ దంచి మర్దించి, యందుండియే దూఁకు గుఱ్ఱాలపై; రౌతులన్ బట్టి కాల్ సేతులన్ బీకు, సైన్యంబులన్ ద్రొక్కి పాదాహతిన్ నేలకున్ రాచుఁ, బ్రాణంబు పోనూకు, నిట్లొక్కఁడెం డెందునన్ నిండి సైన్యంబులన్ జెండ, వీక్షించి యమ్మేఘనాదుండు సామీరిబల్ సాహసం బెంచి లో మెచ్చి యత్యుగ్రుఁడై వచ్చి యయ్యంజనాపుత్రుపై, వాఁడి శస్త్రాస్త్రముల్ గుప్పి మైఁగాడఁగాఁ జేసినన్;—

వానరాధీశుఁ డవ్వానినన్నింటినిన్ జేతితోఁ బట్టుచున్, రుద్దుచున్ బిండిగావించి, శీఘ్రంబుగా నేగి, సాలంబులన్ శైలజాలంబులన్ దెచ్చియద్దైత్యసైన్యంబుపై నేయ,వీక్షించి యమ్మేఘనాదుండు ఖడ్గంబుచే వానినన్నింటినిన్ దుండ్లుగాఁ జెక్కి చెండాడినన్;- వాయుపుత్రుండు కోపించి పాదాహతిన్ స్యందనంబున్ ధరన్ గూల్చి, యావెంటనే సారథిన్ బట్టి ప్రాణంబు పోఁగొట్టి, గుఱ్ఱంబులన్ నేలకున్ బెట్టి తన్ బట్టనుంకింప, వీక్షించి యాదైత్యరాట్సూనుఁ డాయంతలో మారుతాస్త్రంబు సామీరిపై నేసె, నల్లేయఁగా నద్ది యేతెంచి తా నామరుత్పుత్రునిన్

దాఁకఁగా నోడి తొదవ్వులఁ జుట్టుచుఁ నిల్చె; నద్దాని నీక్షించి యద్దైత్య పుత్రుండు రౌద్రంబునఁ వేసె రుద్రాస్త్రముఁ;- మారుతిఁ దాఁక కయ్యస్త్ర మున్నంత నీక్షించి, యాశ్చర్యముఁ బొంది-'యయ్యారె! యస్త్రంబు లీధీరునిఁ దాఁకఁగా నోడు నౌరౌర! బ్రహ్మాస్త్రమే పుత్తునం చెంచి యయ్యస్త్రముఁ బూనె బ్రహ్మాండ మల్లాడి తానల్ల కల్లోలమై పోవఁగా, దేవతల్ భీతులై దిక్కులఁ బాఱఁగా;—

ఆంజనేయుఁడు బ్రహ్మాస్త్రమునకుఁ గట్టువడుట.

భీకరాస్త్రంబు బ్రహ్మాండమే కాల్చునట్లార్చుచుఁ, జ్వాలికామాలికల్ వేదిశాకాశముల్ నిండిరాఁ, గాంచి సామీరి తా ధాతచేతఁ వరం బొందుటఁ జేసి, నిర్భీతుఁడై యాత్మలో బ్రహ్మమంత్రంబు ధ్యానించె, నయ్యస్త్రమంతంత కేతెంచి నిల్వంగ, వీక్షించి సామీరి రా రమ్మటం చస్త్రముఁ జీరె, నయ్యమ్ము విచ్చేసి యేబాధయుఁ గొల్ప కామారుతిఁ బద్ధుఁ గావించె, నద్దాని నీక్షించి యమ్మేఘనాదుండు హర్షించుచుఁ లోనఁ జింతించె;- 'నీవీరునిఁ బట్టుటే నాకు నీరేడులోకంబులఁ గట్టినట్లయ్యె, నీధీరు నాతండ్రియాస్థానమం దుంచి, యందుఁ వినోదంబు గావింప మే' లంచు లో నెంచుచుఁ మారుతిఁ బట్టి, యాస్యందనంబందునఁ బెట్టి, తోలెఁ రథం బాతఁ డా దానవస్వామి యాస్థానముఁ జేర;- న ట్లా సభాస్థానముఁ జొచ్చి, నయ్యంజనాపుత్రునిఁ గ్రిందికిఁ దింపఁగా, గాంచి యామేఘనాదుఁ మదిఁ మెచ్చుచుఁ, రాక్షసేశుండు సామీరి నీక్షించి, నేత్రంబులఁ విస్ఫులింగంబు లేపార, నుచ్ఛ్వాసనిశ్వాసముల్ తీవ్రమై పాఱ, ఘూర్ణిల్లుచుఁ గోపతాపంబులుఁ మీఱ గర్జించుచుఁ బల్కు ;—

రావణుఁడు హనుమంతునిపై నాగ్రహించి, ప్రగల్భములు పలుకుట.

'ఓరోరి, నీవెవ్వఁ డోమర్కటా! యెవ్వఁ డంపంగ విచ్చేసితో? భీతి లేఁగాన కిట్లాసురశ్రేణిసంహారముఁ జేయ నేధైర్యమో నీకు? నౌరౌఁ! నావిక్రమం బెంచవో? జీవితాశఁ మఱఁగానవో? చూడరా! మూఢుఁడా! మూఁడులోకంబులఁ మద్భుజాశక్తిఁ బీడించి యోడించి పూబంతు

లఙ్ఘించి యాడింతు, నా పేరువిన్నంత నీగ్గాక యెట్లుండె నీగుండె? నీకెవ్వ రీతావునన్ దెక్కు? నీకావరం బెట్టిదయ్యారె! వారాశిలంఘించి విచ్చేయుటే కాక, నాపట్టణం బిట్టులన్ జొచ్చి, బల్ దిట్టమై నావనం బెల్ల నిర్మూలమున్ జేసి తారౌర! యామాత్రకే పోయితే? లక్షసంఖ్యాకులౌ దైత్యులన్ జంపినావౌర! లేవింత, బల్ వింత! నా చెంత నీవింతశంకింప, కత్యంత గర్వంబునన్ బొంకమై నిల్చి, బింకంబుఁ జూపించుచున్నావు, ని న్నిప్పుడే నొంచి ఖండించి, తుండించి, నీకండలన్ మండుతైలంబునం దుంచి వ్రాఁగించి, బాగొప్పఁ బ్రేతాళికిన్ బందుగల్ సేతు నాకోపమారంగ నేఁ డంచు గర్జించి భర్జించినన్, వాయుపుత్త్రుండు దైత్యేశ్వరున్ గాంచి యాటోప మేపారఁగాఁ బల్కె;—

## రావణునకు రామదూత హితముఁ జెప్పుట.

'శ్రీరాముఁ డంపంగ విచ్చేసితిన్, రాముదూతన్, సమీరాత్మజుండన్, మఱిన్ నేను సుగ్రీవుమంత్రిన్, రఘూత్తంసుదేవేరికిన్ రాము సేమంబు విన్పించి, యాదేవిసేమంబు నాస్వామికిన్ దెల్ప నే నేగుచున్, మీకు నారాకలన్ పోకలన్ దెల్పఁగా నెంచి నే నాయశోకావనిన్ గూల్చితిన్, మీఁది కేతేరఁగా దైత్యులన్ జంపితిన్, నిన్ను నీక్షించి నీతోడ నొక్కింత మాటాడఁగా నెంచి, యస్త్రంబుచే నిట్టులన్ బంధమున్ గంటి, నిన్ గంటి, నీయెల్లసౌభాగ్యమున్ గంటి, నీవాక్ప్రగల్భంబులన్ వింటి, నీకింత సన్మార్గమున్ దెల్పఁగా నుంటి, నాలింపుమా! బుద్ధియోజింపుమా! రావణా! నీవ వీరుండవున్ నీతిసారుండవున్, గార్యశూరుండవున్, సాహసోదారధీరుండ వౌదయ్య! నిన్ బోరునన్ గెల్వలేఁ డెన్నఁగా వజ్రియేన్; విన్నమాత్రాన నీపేరు నీలోకముల్ మూఁడు నల్లాడు; నీ భోగ మేభోగికిన్ లేదు; నీరూపమున్ దేఱిచూడంగరా దేరు; నీసాటులేమేటులున్ గారు, నీయట్టివాఁ డిట్టిదుర్బుద్ధి లోఁ దొట్టి నాశంబు గాకుంటకై చెప్పెదన్;—

రావణా! సూర్యునిన్ బట్టి దట్టింపఁగా శేషుదంష్ట్రంబులన్ బీకఁగా, ఘోరకాకోలమున్ గ్రుక్కఁగాఁ గ్రోలఁగా, మించి బ్రహ్మాండమున్ జిప్ప

లూడంగఁ గాల్దన్నఁగా, మండుదావాగ్నిలోఁ దూఁకి చికాకుగావింపఁగా, నేడువారాసులన్ గల్గునీరంతయున్ దార్చి, హస్తాగ్రమున్ జేర్చి, యాపోశనంబట్లు ప్రాశింపఁగా, మృత్యువున్ బట్టి యట్టిట్టులన్ జేయఁగాఁ జాలు విఖ్యాతసత్త్వుల్, మహాకాలరుద్రావతారుల్, గదున్ లెక్కకున్ జిక్కకున్నారు సుగ్రీవుసైన్యంబునన్ వీరులౌ వానరుల్;- పోవనిమ్మద్ది:- శ్రీరామచంద్రుండు వీరావతంసుండునున్, దాటకాప్రాణసంహర్త్రయున్, ఆతినిన్ నాతిరూపంబుగామార్చి విఖ్యాతిగొన్నట్టిఁడౌ పూతచారిత్రుఁడున్, భర్గుకోదండమున్ దుంట్లుగావించి దిఙ్మండలిన్ గీర్తిగైకొన్న దివ్యాత్ముఁడున్, భార్గవాత్యుగ్రతేజంబుభంగించి ప్రఖ్యాతిగన్నట్టిబాహాబలోపేతుఁడున్, జూడ మున్నాఖరాద్యాసురవ్రాతవిచ్ఛేదకుండున్, విరాధాసురప్రాణసంహర్త, మారీచసంహారకుండున్, గబంధాంతకుండున్, మహావాలిప్రాణాంతకుండున్, ధనుర్వేదసామ్రాజ్యపట్టాభిషిక్తుండు, కోదండదీక్షాగురుం, డార్తరక్షైకదక్షుండు, శ్రీభానువంశాబ్ధిచంద్రుండు, కారుణ్యసాంద్రుండు దీనావనుండౌఁజుమీ! జానకీరాముఁడాదేవదేవేశ్వరున్, దప్పుసైరింపఁగాఁ బాదముల్పట్టి ప్రార్థించి, భూజాత నర్పించి, ప్రాణంబులన్ నిల్పుకో వంశమున్ గాచుకో; కార్య మేమంతగా మించిపోలేదు, నామాట లాలింపుమా! గర్వివౌచున్ జెడన్ బోకుమా! రావణా!' యంచు బోధించువాతాత్మజున్ గ్రూరదృష్టిన్ విలోకించి, ఘూర్ణిల్లుచున్ దైత్యులన్ జీరుచున్ రాక్షసాధీశుఁడిట్లాడు;—

రాక్షసులు హనుమంతునితోఁకకు నిప్పంటించుట.

'ఈ మర్కటున్ బట్టి వేధించి బాధించి, శస్త్రాస్త్రముల్ గ్రుచ్చి, మేనంతటన్ దూట్లుగావించి, బల్గ్రుద్దులన్ దంచి మర్దించిమర్దించి, ప్రాణంబులన్ దీసి సంద్రంబునన్ వేయుఁడీ! దైత్యులీ' రన్న, శీఘ్రంబుగా నడ్డమై వచ్చి యన్నన్ విలోకించి పల్కెన్ [1]విభీషాఖ్యుఁడీరీతి,- 'దైత్యేశ్వరా!

1 గనిష్ఠానుజుం డిట్లు, పాఠాంతరము.

దూతలు౯ వారిరాజు౯ గదు౯ గొప్పగాఁజెప్పి, తక్కెల్లర౯ దెప్ప
టల్ ధర్మమాఁగాదె? నీకింకఁ గోపంబుపోకుండిన౯, స్వల్పశిక్ష౯విధిం
పంగరాదే?' యన౯, మెచ్చి యాపల్కుల౯ దానవేశుండు తా నాభట
శ్రేణి నీక్షించి పల్కెడెడి౯, 'గోతికి౯ వాలమే ముఖ్యచిహ్నంబునా,
దాని లేకుండఁగాఁ గాల్చుఁడీ! దీని నీక్షించుచు౯ పాటిక్రోతుల్ గదు౯
నవ్వఁగా మానభంగంబు గావింపుఁడీ! పొండి మీ'రన్న, నారాక్షసుల్
కేకల౯ బెట్టుచు౯వచ్చి, వాతాత్మజు౯ నూకికొం చేగి, వారొక్కచోఁ
దోఁకకు౯ గోకల౯ నిండుగా, దండిగాఁ జుట్టి, తైలంబు నెంతేనియు౯
బోసి,యద్దానికగ్గి౯ రగుల్పంగ, నయ్యగ్ని దేదీప్యమానుండునై యొప్ప,
సామీరి తా నాత్మలో వహ్నిమంత్రంబు నిష్ఠ౯జపింపంగ నయ్యగ్ని
సంతృప్తుఁడై శీతలుండయ్యె సామీరికి౯; జాడ్కికి౯దోఁచె నయ్యగ్ని
వాలాగ్రభాగంబున౯ గట్టఁగాబద్ధమాణిక్యపు౯ ముద్దయోనాఁగ; నా
మీఁదట౯ దైత్యు లాయంజనాపుత్రుని౯ వీథుల౯ ద్రిప్పుచు౯ రొప్పు
చు౯ గొంచుఁ దా మేగఁగా సీత కావార్త నాదైత్యకాంతల్ నివేదించి;
రాసాధ్వి చింతాభరాక్రాంతయై, భక్తిఁ గేల్మోడ్చి యయ్యగ్నిదేవు౯
మది౯ స్తోత్రము౯ జేసె సామీరికి౯ శైత్యము౯గూర్ప; నామీఁద నా
రాక్షసుల్ లంకలో వీథుల౯ ద్రిప్ప, సామీరి తా నాత్మలో బ్రహ్మమం
త్రంబు నిష్ఠ౯ జపింపంగ బ్రహ్మాస్త్రబంధంబు లూడె౯, మహానందుఁడై
వాయుపుత్రుండు బల్ గంతుల౯ బెట్టుచు౯, జుట్టియున్నట్టి యారాక్ష
సానీకము౯బట్టి, వాలంబుతోఁగొట్టి, ధాత్రీస్థలి౯బెట్టి బిట్టార్చుచు౯
దోఁక నల్లార్చుచు౯ స్వేచ్ఛమైఁ జుట్టి నల్దిక్కుల౯ వహ్నినంటించి, యా
లంకలో నల్లకల్లోలము జేసెఁ బెల్లార్చుచు౯;—

### లంకాదహనము

గాంచి కుప్పించు నాకొల్వుకూటంబుల౯; వానికి౯ నిప్పు
చూపించి వేచాకళించు౯ మదేభాశ్వశాలాగ్రభాగంబు! లవ్వాని
నన్నింటిని౯ గాల్చి యందుండి యేవ్రాలు సౌధాంతరశ్రేణికి౯; వహ్ని

చూపించి తా దూఁకు భండారగేహంబుఁ జేర; నవ్వాని భస్మంబు గావించి లంఘించు నంతఃపురానీకముఁ గాల్పఁగా, నిట్లు తా నాట కూటంబులఁ జొచ్చుచుఁ, రచ్చకొట్లఁ విదారించుచుఁ, దూరుచుఁ, గోపురా లెక్కుచుఁ, మేడలఁ ద్రొక్కుచుఁ, వాడలఁ ద్రాల్చుచుఁ, సందులఁ గొందులఁ, రాజవీథుల్ సమస్తప్రదేశంబులఁ జుట్టు చాచో ట్లఁ గల్గు దివ్యంబులౌ గేహముల్ సొచ్చి భస్మంబుగావించె; నావహ్ని యాకాశముఁ దాఁకుచుఁ వీఁకఁ గాఁకఁ విజృంభించుచుఁ, మించి ఘోరార్భటుల్ సల్పుచుఁ, నిగ్గుచుఁ, దగ్గుచుఁ భగ్గుమంచాడుచుఁ సర్వలంకాపురిఁ బుగ్గిగాఁ జేయుచుఁ, రేఁగి స్వేచ్ఛావిహారంబు గావించుచోఁ;-

జాడచూడంగ సౌధంబులుఁ బల్గుభీలంచు వేఁ గూలు, నందున్న వున్నట్లుగా మాడువుల్ వ్రాలు, మేల్ కుడ్యముల్ చీలు, వృక్షంబులుఁ గాలుచుఁ గూలు, నెందెందునఁ ఘోరమై జ్వాలలే ప్రాలు, నట్లుండఁగా, నిండ్లలో గాఢమా నిద్రలోనున్న వా, రగ్నిసంస్ప ర్శచే లేచి, స్త్రీపూరుషుల్ దిక్కు నేఁ గానకే చచ్చువారల్, సురాపాన మత్తాత్ములై తెల్వి లేకుండి, తీవ్రాగ్నికిఁ గట్టలై కాలువారల్,కనఁ బిడ్డలఁ దక్కలోఁబట్టి తొట్రాడుచుఁ దెచ్చి, తేఁబోవ నాయంతలో భార్యకుఁ మంట మైనంటి రోదింపఁ బోలేకదవ్వుండి వీక్షించుచుఁ గుందువా, రందు గేహంబులం దున్నసామగ్రులఁ వేగ తేఁబోయి, జ్వాలాగ్నిలోఁ జిక్కి రాలేక దిక్కేమియుఁ దోఁచకే, చచ్చువారల్; మఱిఁ జుట్టులం దగ్ని దారోక్కన్న రోదించుచుఁ బాఱువారల్, తనూవల్లినిప్పంట, నిశ్చే ష్టులై సీల్గువారల్; గృహం బగ్నిచేఁ జిక్క, లోనున్నయాభార్యలఁ బిడ్డలఁ భర్తలఁ వహ్ని కర్పించి, యత్నంబు లేకుంట దుఃఖించుచుఁ జూచువారల్; కడుఁ దీనతఁ వెక్కి 'హాతల్లి! హాతండ్రి! హాభ్రాత! హాబావ!' యంచేడ్చుచుఁ జేతులఁ నోటికంటించి రోదించుచుఁ గంట నీర్వెట్టి కంపించువారల్; మ తేభాతినోవచ్చి నిప్పంటఁగాఁ గట్టుపుట్టం

బులఁ ద్రోసి, నిర్వస్త్రలై మానమర్యాదలన్ దోలి, ప్రాణేచ్ఛమై పీథులన్ బాలుస్త్రీపూరుషుల్; మీసలున్ గడ్డమున్ వహ్ని ముద్దాడ 'నాహా!' యటం చార్చుచున్ చేతులందార్చఁగా రుద్దుచున్ నాట్యమున్ బట్టుచున్ గాల్లకున్ బుద్ధిబోధించి దిగ్దేశముల్ పట్టువారల్; విశేషం బుగా నిండి యాలంక నెందెందునన్ సందడిన్ సల్పుచుండంగ, నామీఁద సామీరి తా నున్న దున్నట్లుగా నాఁగి శంకించి నిర్వీర్యుఁడై వే వెఱంబొంది చింతించెఁ దా;-

హనుమంతుఁడు మఱల సీతాదేవినిదర్శించి, సముద్రమును దాఁటుట

'అక్కటా! లంక సర్వస్వమున్ గాలె, భూజాత యేమయ్యెనో? యగ్నినే చిక్కెనో?- అయ్యయో! యెంత మూఢాత్ముఁడన్? సుంత యోజింపలేనైతి. నే నెం తనర్థంబుగావించితిన్? రాముఁ డీసీతకై కాదె యానాఁడు కొండంతదౌ భర్గచాపంబుమోపెట్టె! మార్గంబునన్ భార్గవున్ నొంచె, భూజాతకై కాదె కాంతారమం దానిశాటిన్ జెవుల్ ముక్కుఁబోఁజెక్కె; సీపూతచారిత్రకై కాదె, కాకాసురున్ లోకముల్ జుట్టఁగాఁజేసె! వైదేహికై కాదె, తా నన్నమున్ నీరమున్ నిద్రయున్ మాని, బల్ చెట్లులన్ గుట్టలన్ జుట్టుచున్ గాననం బెల్ల సంచారమున్ జేసె! సీసాధ్వికై కాదె, యావాలిసంహారమున్ జేసి, సుగ్రీవుసఖ్యంబు గావించి మమ్మేలె! సీపూతచారిత్రపై నాసచేఁ గాదె, నాస్వామి యింత యయ్యె సైరించి, ప్రాణంబుతోనిల్చె? నేనక్కటా! యెంత కార్యంబుగావించితిన్; రాముఁ డీవార్తవిన్నంత జీవించునా? మించి సౌమిత్రి ప్రాణంబుతో నిల్చునా? రాజు సుగ్రీవుఁ డుగ్రుండునై నన్ను జెండాడి, తాఁ జావకేమానునా? యయ్యయో! యెం తనర్థంబుగావించితిన్ ద్రోహమా స్వామికిన్ సల్పితిన్, ఘోరపాపాత్ముఁడైతిన్, గటా! దైవమా! రామ! శ్రీరామ! శ్రీజానకీరామ!' యం చెంతయున్ గుందుచున్ బ్రాణముల్ వాయ నుద్యుక్తుఁడై కొంత కాలంబు సైరించి చింతించె నీరీతి;-

**నేదేవికారుణ్యలేశంబు నా కుంటచే నగ్ని దేవుండు నన్ గాల్పఁగా**

భీతుఁడై తోఁకనే మండుచుండ నాకుఁ జల్లందనం బిచ్చె? నాపుణ్యచారిత్రనా? సర్వలోకైకనాథుండునౌ రాముదేవేరినా? శ్రీమహాలక్ష్మినా? యగ్ని భీతిల్లకేతాఁకు? నాశ్రీజగద్భద్రసంధాయకుండైన నాస్వామికార్యం బదేలా చెడుఁ? మర్కటుం డేను మూర్ఖుండ, భ్రాంతాత్ముఁడన్ గాన బల్ తప్పుభావించితిన్ గాదె?' యంచెంచుచున్- దామజెన్ జిత్తమందెంచు-'నెట్లైనఁ గానిమ్ము, భూజాత నీక్షించుటే లెస్సయౌ,' నంచు, శీఘ్రంబుగాఁబోవుచున్, వార్ధినీరంబునన్ దోఁకమం టార్చి, తా నాయశోకావనిన్ జొచ్చి, భూజాతనున్ దవ్వులన్ గాంచి, యాసాధ్వి సేమంబుగానుంట వీక్షించి సంతోషితస్వాంతుఁడై పోయి వైదేహికిన్ భక్తి సాష్టాంగమున్ జేసి, యాలంకలోనెల్లఁ దా సల్పియున్నట్టివృత్తాంతమున్ జెప్పి, తా నేగఁగానాజ్ఞ కై వేఁడి, యాదేవి దీవించి తన్నంప, నాలంకలోనుండి తా పశ్చిమద్వారమున్ జొచ్చి విచ్చేసి వేగన్ సువేలాద్రిపై నెక్కి నల్దిక్కులన్ గాంచి, దిగ్భాగముల్ దద్దరిల్లంగ, నారాక్షసుల్ భీతులై తన్ను వీక్షించి పాఱంగ, గర్జించుచున్ సింహనాదంబు గావించి, కుప్పించి, యాకాశభాగంబునం దేగి, వేగంబుగా నిర్గమించెన్; సురల్ మింట బంగారపుంజెండుఁ బోమీటిరోనాఁగ సింగారమై దోఁచుచున్;-

వాయుపుత్రుండు వార్ధిలంగించి వానరులం జేరి లంక వృత్తాంతము వినిపించుట

మధ్యవారాశి కేతెంచి, మైనాకునిన్ గాంచి, పాదంబులన్ వాని శృంగంబులం దూన్చి, మూర్తంబు తా నిల్పి, యందుండి వారాశిలంఘించి, యామీఁద నాయుత్తరప్రాంతభూభాగమున్ జేర, నాకాశభాగంబునందుండి యింతింతగాడిగ్గి ధాత్రీస్థుఁడై నిల్వఁగాఁ, గాంచి సామీరికై వేచియున్నట్టి యాజాంబవన్ముఖ్యులెల్లన్ వడిన్ వచ్చి, వాతాత్మజున్ గౌఁగిటన్ గ్రుచ్చి, కార్యంబదేమాయెనో? యంచు నాత్రంబుతో నున్న చిహ్నంబు లామోములన్ గాంచి, సామీరి మందస్మితంబొప్ప నవ్వారిఁ దోడ్తెచ్చి, తా నొక్కచోనిల్చి, వా రెల్లరన్ గుంపుగాఁ జుట్టుగా నిల్వ నేమించి, కూర్చుండఁగాఁ జెప్పి, తన్మధ్యభాగంబునన్ నిల్చి, తా నంత

భాషించె వారాశి లంఘించుటే యాదిగా సంగతిన్, రావణున్ గాంచి
యాలంక, వాలాగ్నిచేఁ గాల్చి విచ్చేయుటల్ సర్వమున్ జెప్ప, నాలించి
యావానరుల్ హర్షితస్వాంతులై, గంతులన్ వైచుచున్, వింతగానాడు
చున్ బంతమేపారఁగాఁ బల్కుచున్, జాతిచేష్టల్ మనంబారఁగాసల్పు
చున్ బల్కి రాయొండొరుల్;-

## వానరులయుత్సాహ ప్రకటనము

'నేన యారావణున్ బట్టి మర్దింతు నీరీతినం' చొక్కఁడింకొక్కనిన్
గ్రుద్దె. నవ్వాఁడు, నే వానికంఠంబు లీరీతిగాఁ బట్టి ప్రాణంబుఁ
బోఁగొట్టువాఁ డంచుఁ దానొక్కనిన్ గొంతుకన్ జేతులన్ బట్టుచున్
బిట్టుగా నొక్కె, నాయంతకాతండు లోనూపిరిన్ ద్రిప్పుకోలేక, ప్రాణా
వసానంబుగానుండుటన్ గాంచి, వేఱొక్కఁ డాధూర్తునిన్ ముష్టిచే
నెత్తిపై గట్టిగాఁ గొట్టి, యాపట్టుమాన్పించె; - నే నిట్టులా రావణున్
ముక్కుపట్టీడ్తునం చొక్కనిన్ జేరి, యొక్కండటుల్ ముక్కుపట్టీడ్వఁగా,
నూడి యాముక్కు చేఁ జిక్కరా, వాఁడు నా మొండిముక్కొక్కచే
మూసి, యానొప్పిచే మిక్కిలిన్ మొత్తికొం చేడ్చె; నింకొక్కఁ డింకొ
క్కనిన్ గిల్లె, నింకొక్కఁ డాయొక్కనిన్ మోఁదె, వాఁ డొక్కనిన్ దిట్టె,
వేఱొక్కఁ డాప్రక్కవానిన్ బడన్ గొట్టె, నం దొక్కఁ డింకొక్కనిన్ జేరి
కర్ణంబునన్, గట్టిగా, మిట్టిపాటొందఁగా- 'కే'- యటం చార్చె; నొక్కం
డు గీపెట్టె, నొక్కండు చీపెట్టె, వాఁ డొక్కఁడింకొక్కనిన్ బైకిఁ బో
మీటె, నొక్కండు నవ్వన్, మఱింకొక్కఁ డేడ్వన్, మహాసైన్యమందె
ల్లెడన్ వానరార్భాటముల్ పెల్లురేఁగన్ విలోకించి, వా రూరకుండన్
నియోగించి, యాయంగదుం డంత వాతాత్మజున్ గాంచి పల్కాడు;—

'ఓమారుతీ! రాముఁడింకేల, మే మేగి యారావణున్ బుత్రమి
త్రాళితోఁ జంపి, భూజాతఁ దోడ్కొంచు నా రామునిన్ జేరఁగాఁబోద,
మింకేల నాలస్య' మంచాడ, నవ్వాయుపుత్రుండు నాధీరుతో నాడు. 'నో
యంగదా! కూడ దీకార్య మెన్నంగ, తేఁడింతకున్ సీతనన్వేషణన్ జేయ

నేమించెనే కాని; యీరీతిఁ గావింపఁగాఁ జెప్పెనే?- తా నటుల్ సెప్పియే యున్న, నేనూర కీరీతిగా వత్తునే? రావణున్ జంప లేకుంటినే? మించి సీతమ్మఁ దేకుంటినే? రాము నుద్దేశ్య మేమోకదా! రావణున్ జంపునో? వాఁడు ప్రార్థింప జీవింపఁ బొమ్మంచు నాలంకకే పంపునో? యార్తరక్షైక దీక్షుండు రాముండు తా నెట్లు కావించునో? సుంత యోజింప కీరీతి నా రావణున్ జంపుచో, స్వామి మన్నించునో? యెం తనర్థంబు గావించినా రంచుఁ దా మించి నిందించునో? కూడ దీకార్యమో యంగదా!' యన్న, నాజాంబవంతుం డిటుల్ పల్కె- 'నౌనౌను, శ్రీరాముతో నీయుదంతంబు విన్పించుటే లెస్సయౌఁగాక, యీలేనిపోనట్టియాజోలి వల్దంచు, వా రెల్లరున్ గూడి పోనెంచి, యమ్మాల్యవంతంపుఁగూటంబునం దున్న సుగ్రీవునుద్యానమున్ గాంచి పేరాఁకటన్ జిక్కుటన్ జేసి, వా రావనిన్ జొచ్చి సేవించి రా పండ్లు పానీయముల్ తృప్తిగాఁ, బిమ్మటన్ వారు సామీరి వెన్వెంట నాటాడుచున్ బాడుచున్ రామునిన్ జేరఁగా నేగఁగాఁ;—

## శ్రీరామసుగ్రీవుల సీతాన్వేషణ సందర్భ సమాలోచనా సంభాషణము.

రాముఁ డమ్మాల్యవంతంబునన్, లక్ష్మణుం డల్లె సుగ్రీవుఁడున్ గొల్వ, సీతావియోగార్తిమైనుండి, సుగ్రీవునిన్ జేరి భాషించె- 'సుగ్రీవ! పూర్వోత్తరప్రాగ్దిశల్ జుట్టి, భూజాత నెందెందు నీక్షింపకే వానరుల్ వచ్చినా, రైన నా దక్షిణాం బేగియున్నట్టి వా రేల రాకుండిరో! సీత నీక్షించిరో, లేదొ? యీక్షించియే యున్న, నిందాఁక రాకుండ వా రుందురే? చూడ నిర్ణీతకాలంబునున్ మీఱెఁగా?- వారు విచ్చేతురో- రారొ? యుల్లంబులో సందియం బయ్యె, నెట్లౌనొకో కార్య' మంచాడి చింతించుచున్ బిట్టునిట్టూర్పు వోఁబుచ్చు శ్రీరాము నీక్షించి సుగ్రీవుఁ డిట్లాడు- 'నో దేవ! నేఁ డెంత సేపైన వా రిందు విచ్చేయువారల్; మితిన్ దాఁటి వర్తింప రా వానరుల్; సత్య మీపల్కు, నాయాజ్ఞ వా రెప్పుడున్ బొల్లు గావింప' రంచన్న వాక్యంబు లాలించి శ్రీరాముఁ 'డో వానరాధీశ్వరా!

నిన్న నీవానరుల్ వారిలోవారు భాషించుటల్ వింటి, సుగ్రీవు నాజ్ఞన్న సామాన్యమే కా, దదేమాత్రముఁ దాఁటిరేనిఁ దండమ్ముఁ లేదు, కంఠంబుగెంటించు' యంచు నీశాసనంబెంచి భీతిల్లు నవ్వారలఁ గంటి, సుగ్రీవ! యిట్లొప్పునే! స్వల్పదోషంబుచే, రాజు రాజ్యప్రజఁ గొంతుకోయించునే! యింతకాఠిన్యమే? ధర్మమే యిద్ది సత్కర్మమే! వానరాధీశ! యీమాట, సీతావియోగంబుకంటెఁ మహా దారుణంబౌచు నా మానసం జేఁచు' నంచన్న;—

సుగ్రీవుఁ డామాటకుఁ భీతుఁడై లేచి కేల్మోడ్చి, యంగంబు కంపింపఁ దా నిల్చి పల్కాడు:-'నో దేవ, దేవేశ్వరా! నన్ను మన్నింపుమా! భీతిఁగొల్పంగ నేనట్లు శాసింతునే కాని వేఱొండుగా, దెన్నఁగా నట్టి నా శాసనంబుంటచే వానరుల్ తప్పుగావింపరెప్పాటునన్; వారు నాయాజ్ఞనెం దెప్పుడున్ దాఁటఁగాలేదు, నే నట్లుశిక్షింపఁగాలేదు, వా రెప్పుడేన్ దాఁటుచో,ముందు నే నట్లు గావింప శాంతింపుమా! నన్ను మన్నింపుమా!' యంచుఁ బ్రార్థింప, శ్రీరాముఁ డత్యంతహర్షంబునన్ బల్కు- 'సుగ్రీవ! పల్కుల్ మహాతీక్ష్ణముల్ గాని చిత్తమ్ము బల్ మెత్తనై యుత్తమంబై దయాయత్తమై యుండఁగా సజ్జనుండుండు నం, ద్రావిధిన్ నీవు చూపట్టుదౌరయ్య! సుగ్రీవ! సామాన్యదోషంబులన్ మించి మన్నించి, ధర్మైకమార్గంబునన్ భూప్రజన్ దిద్దుటే తేనికిన్ సర్వదాశ్రేయమౌఁ, గాంచ నేరానికిన్ దగ్గదండంబు గావించుటల్ రాజధర్మంబగున్; శత్రు నేరీతి నేన్ లొంగఁగాఁ జేయుటల్, వైరి ప్రార్థించినన్ బ్రాణదానంబుగావించుటల్ క్షాత్రధర్మంబగున్ జూవె!'- యం చిట్లు బోధించుచుండంగ, వాతాత్మజుం డంతటన్ మోడ్చు కేల్వట్టి విచ్చేయఁగా వానరుల్ వాని వెన్నంటిరాఁగా, విలోకించి రా,రామసౌమిత్రిసుగ్రీవు లత్యుత్సుకానంద చేతస్కులై;—

## ఆంజనేయుఁడు రామాదులయొద్ద కేతెంచుట

రాముఁ డవ్వారలందెల్ల సామీరినే మానకేచూచె; సౌమిత్రి వీక్షించు చొక్కొక్కరిన్, దెప్పనేన్ వాల్ప కామోముచిన్నంబులే

చూచె; సుగ్రీవుఁ, డాసీత నీవానరుల్ గాంచిరో, లేదో? ముందెట్టులో? యంచు యోజించు చవ్వారల౯ జూచె;- సామీరి మాటాడిన ట్లెంచి భ్రాంతాత్ముఁడై రాముఁ, డవ్వాని యోష్ఠంబులే గాంచె; వాతాత్మజుం డంత నేతెంచి శ్రీరాము నీక్షించుచు౯- 'లెస్సగా నుండె భూజాత,- యంచాడి సాష్టాంగముల్ సల్పె, నా రాముఁ, 'డేమంటి, వేమంటి సామీరి!' యంచాడ, నొక్కింత యొగ్గెత్తి గాంభీర్యమే పారఁగాఁ బల్కె- 'నేమంబుగా నుండె భూజాత! శాంతింపు మో దేవ! సర్వంబు మీ పాద సాన్నిధ్యమందే నివేదింతు' నంచాడె, శ్రీరాముఁ డా వానరశ్రేష్ఠుని౯ గౌఁగిట౯ గ్రుచ్చి యానందబాష్పంబులే తేర, రోమాంచపుంజంబు మై నిండ, నుత్కంఠతో మాటలే రాక, నిశ్చేష్టతా భార మేపార, సామీరి నెమ్మోమున౯ దృక్కుల౯ నిల్పి, తా జెప్పనే౯ వాల్పకే యూడ, నారీతి నే వాయుపుత్రుండు శ్రీరాము నెమ్మోము వీక్షింప,-ని ట్లొంటొరుల్ కొంత కు౯ దేఱ, నాపైని సామీరి తా నట్టి శ్రీరాము హస్తంబుల౯ దూఱి విచ్చేసి, యా రామునిఁ గాంచి ప్రేమారఁగా, భక్తిభావంబు రంజిల్లఁగా, హర్షముప్పొంగఁగాఁ బల్కె నీరీతిగా;—

**ఆంజనేయుండు సీతాదేవి క్షేమవార్త శ్రీరామచంద్రున కెఱింగించి, శిరోరత్న మప్పగించుట**

'దేవ! సుగ్రీవుఁ డెల్లెట్లుం విన్పించె, నారీతిగాఁ బోయి వీక్షించి, భూజాత నెందెందున౯ గానకే కుందుచుండంగ, సంపాతియ౯ పక్షినాథుండు తాఁ దెల్పె- లంకాపురి౯ సీత నేమంబుగా నుండెనన్వార్త; నా మీఁద నే నెంచి వారాశి లంఘించి, యా రాత్రి నాలంకలోఁ జొచ్చి, సర్వప్రదేశంబుల౯ గాంచితి౯, సీత నీక్షింపఁగా లేక నేరోసి, పోఁబోయి యందే యశోకావని౯ జొచ్చి, యందున్న భూజాత నీక్షించి హర్షించు చందున్న వృక్షంబుపై నెక్కి, శాఖాగ్ర భాగంబున౯ గుట్టుగా నుంటి; నం దెల్లర౯ నిద్రలో నున్న వేళ౯ విలోకించి భూపుత్రితో భాషణల్ సల్పితి౯, నేను నా తల్లి కర్పించితి౯ నీవు నా కిచ్చియున్నట్టి యా ముద్రిక౯'

నేనుగ్రైఁబూనితిన్ దేవినాకియ్యఁగా శ్రీశిరోరత్న, మామీఁద దైత్యాళికిన్ నాప్రతాపంబుజూపించి నీపేరుఁజాటింపకే పోవరాదంచులోనెంచి, యందున్నరక్షస్సమూహంబు నే లెక్కతో లక్షలన్ జంపితిన్, మీఁద నారాక్షసస్వామి పుత్త్రుండు తా నింద్రజి త్తంత బ్రహ్మాస్త్రమున్ వైవ, దైత్యేశు నీక్షించి దర్పంబుఁ జూపించు నాకాంక్ష లోఁగల్గి, యద్దానిచే బద్ధుఁడై పోతి; నాతండు నన్ దేరికిన్ గట్టికొంపోయి నన్నున్ దశగ్రీవు నాస్థానమం దుంచె, నారావణున్ గాంచి నీ నీతివాక్యంబులన్ బల్కితిన్ మించి యుష్మత్ప్రతాపంబు నాటోప మేపారఁగాఁ జాటితిన్, 'రావణా! రాఘవస్వామికిన్ లోకమాతన్ ధరాజాతయా సీత నర్పించి పాదాబ్జముల్ వట్టి ప్రార్థించి ప్రాణంబులన్ నిల్పుకొ'మ్మంటి, నాయంత కాతండు కాలాగ్నివోలెన్ గడున్ గ్రుద్ధుఁడై మించి, నాతోఁక గాల్పంగ వేయానతీయంగ, నన్ రక్కసుల్ బట్టి, నాతోఁకకున్ గోకలన్ జుట్టి నిప్పంటఁగాఁ జేసి, రావెంట నే లంకలో నంతటన్ జుట్టుచున్ వచ్చి, యింటింటి కావహ్ని నంటించి, యామంటచే లంకసర్వంబు నిర్మూలమున్ జేసి, యామీఁదటన్ బోయి భూజాతనీక్షించి, నామాతయా సీతకున్ ధైర్యమున్ జెప్పి విచ్చేసితిన్;—

రామ! యాసాధ్వి నీనామ మేప్రొద్దుఁ జింతించుచున్ నీపయిన్ చిత్తమున్ నిల్పి ప్రాణంబులన్ గాచెఁ, దా నన్నమున్ నీరమున్ నిద్రయున్ మాని కాలంబునీక్షించెడిన్, దేవ! నిన్నెంచి శోకించి శీఘ్రంబుగాఁ దోడితె మ్మంచు వాక్రుచ్చెఁ; సౌమిత్రి వే రెత్తి దుఃఖించె' నం చిట్లు భాషింప, నందున్ సభాస్తారు లా యాసమాచారమాలించి; రావేళ నిశ్శబ్దమైనుండె నాకొలువు;—

**శ్రీరామచంద్రుఁడు సీతాశిరోరత్నమును గ్రహించి, వాతాత్మజునిదీవించుట**

వాతాత్మజుం డంత శ్రీరామునిన్ డాసి నమ్రాంగుఁడై యుంచె సీతాశిరోరత్నమున్ రామభూనాథుహ స్తంబునన్, రాముఁ డద్దాని చేఁ బూని నేత్రంబులందొత్తి, హృత్సీమపై నుంచి మూర్ఛిల్లి యంతంత

ఖుఁ దేఁటి యీరత్నముఁ జూచుచుఁ బల్కు, 'సుగ్రీవ! యీరత్న మీడ్చుఁ జుమీ నాదుడెందంబు! నద్దాని నింద్రుఁడు, యజ్ఞంబులఁ మెచ్చి మా మామ హస్తంబునం దుంచె, నాతండు భూజాతమూర్ధంబు నఁ దీని గీల్కొల్పి, యానాఁడు నా కట్టులాకన్నియఁ దానముఁ జేసె; నట్టేటచే, నాసతీరత్న మీరత్నముఁ బ్రాణరత్నంబుగా నెంచి రక్షించు'- నం చాడి సామీరి నీక్షించి,- 'యోమారుతీ! సీతకుఁ బ్రాణపుఁ బ్రాణ మాదీని, బల్ సాహసంబేర్పడఁ దెచ్చి నాప్రాణముల్ గాచి నావార! నాప్రాణబంధూ! జగత్ప్రాణపుత్రా! సుఖం బుండుమా! బ్రహ్మకల్పం బుగా' నంచు, దీవించి, సుగ్రీవునిఁ గాంచె, నాయంత కాతండు- 'శ్రీరామచంద్రా! సమస్తంబు సిద్ధంబుగా నుండె, జాగేల? విచ్చేయుమా! లంకకుఁ బోదు' మంచాడెఁ, దా నంతటఁ లేచి శ్రీరామచంద్రుండు సౌమిత్రి తోఁగూడి, సుగ్రీవముఖ్యాదిశాఖాచరుల్ తన్ను వెన్నాడిరా, సైన్యముల్ గూడిరా, మాల్యవంతంబునం దుండి వేగఁ బ్రయాణంబు సాఁగించెఁబో, యంచు శ్రీనారదర్షీశ్వరుం డెంచి వాల్మీకికిఁ జెప్పెనిక్కువడిఁ;-

ఇద్ది శ్రీరామపాదాంబుజధ్యాననిష్ఠాగరిష్ఠుండు, విప్రుండు, వాసిష్ఠగోత్రోద్భవుం, డార్య వెంకోబరాయాత్మసంజాతుఁడుఁ, సాధ్వీలక్ష్మాంబికాగర్భసచ్ఛుక్తిముక్తాఫలంబైన,- అశ్వత్థరాయండు నిర్మించునీదండకో పాఖ్యరామాయణంబందు,శ్రీసుందరాఖ్యైకమౌకాండంబుమర్పించెదఁ గొమ్మిదే ఆంజనేయా! మహావజ్రకాయా! సదా రామకార్యప్రియా! ధర్మధౌరేయ! సద్భక్తగేయా! బుధశ్రేయ! దీనార్తసద్భక్తబంధూ! దయాసింధు! శ్రీవాయుపుత్రా నమస్తే! నమస్తే! నమస్తే! నమః.

సుందరకాండము - సమాప్తము

శ్రీ

శ్రీ సీతారామలక్ష్మణ పరబ్రహ్మణే నమః

# శ్రీ దండకరామాయణము.

## యుద్ధకాండము.

శ్రీనారదర్షీశ్వరుం డట్లు వాల్మీకి మునీంద్రుఁడు కథాభాగమున్ దెల్పఁ బ్రార్థింపఁగా, నారదుం డెంతయున్ హర్షితస్వాంతుఁడై పల్కు:-

మునీంద్ర! యిట్లా రఘూత్తంసు డావానరశ్రేణితో, మాల్యవంతంబునం దుండి విచ్చేసి, కొన్నాళ్లపై నిట్టి మహేంద్రాద్రికిం జెంచి, యాప్రాంతమందున్ బిడారంబులన్ వైచి సైన్యంబులన్ డించి, యాయద్రిపైఁ దాను సౌమిత్రిసుగ్రీవసామీరులన్ గూడి, యామేరయే మీఱి గంభీరమై ఘోరమై చూడ్కికేపారు వారాశి నీక్షించి, దానిన్ దరింపన్ సమాలోచనల్ సల్పుచుండంగ;—

## లంకలో, రావణుఁడు, సభాసమావేశము గావించుట.

నాలంకలో గూఢచారుల్ నివేదింపఁగా, నామహేంద్రాద్రిపై రాముఁ డావానరశ్రేణిలో నుండె నన్వార్త నాలించి, దైత్యేంద్రుఁ డారాత్రి చింతాసమాక్రాంతుఁడై పుచ్చి, బల్ వేకువన్ లేచి, యర్హక్రియల్ దీర్చి, తా నిష్టదైవంబు నాపార్వతీనాథుఁ బూజించి సేవించి, దివ్యాంబరానేకభూషావళుల్ దాల్చి, మున్ముందుగా వందులున్ మాగధుల్ స్తోత్రపాఠంబులన్ బాడఁగా, దాసదాసీజనుల్ పార్శ్వముల్ గొల్చుచున్ మార్గమున్ జూపి కొంచున్ బరాకంచు పల్గింప, భావించుచున్ బోయి, విభ్రాజమానంబునౌ కొల్వుకూటంబునన్ జేరి, సింహాసనం బెక్కి, యం

దాసభాస్కరులును లేచి కేల్మోడ్చి నమ్రాంగులై నిల్వ, వీక్షించి మందస్మితం బొప్పఁ గన్నన్నలను వారి.గూర్చుండఁగాఁ జెప్పె, వారెల్ల రాయర్హపీఠంబులందును సుఖాసీనులై యొప్పి రాపిమ్మటను వచ్చివేగను [1]విభీషాఖ్యుఁడును గుంభకర్ణాఖ్యుఁ డాయన్న పాదంబులను మ్రొక్కి నిల్వంగఁ, బ్రీతిని సమీక్షించి తత్సోదరద్వంద్వమును వేగ తత్తత్సమీపంబునం దున్న పీఠంబులను జూపి కూర్చుండఁగాఁ జెప్పె, వారలు సుఖాసీనులై రప్పు డామేఘనాదుండు విచ్చేసి కూర్చుండె, నంతను బ్రహస్తాఖ్యుఁడును వచ్చె, నావెంట యూపాక్షుఁడును సర్పరోముండు నాఖడ్గరోముండు ధూమ్రాక్షుఁడును రశ్మికేతుండునును, వజ్రదంష్ట్రాఖ్యుఁ డాదుర్ముఖుండును, మహాపార్శ్వుఁ, డాయగ్నివర్ణాఖ్యుఁడును, శోణితాక్షుండు, కుంభుండు నాకంపనుండును నికుంభుండు దేవాంతకుండును, మహాకాయముఖ్యుల్ సుతుల్, మంత్రులును, దండనాథుల్ మహామాత్యులును వచ్చి రాత్రించరస్వామికిని మ్రొక్కి యాజ్ఞప్తులై వార లందందు నర్హాసనాసీనులై యొప్పి రవ్వేళ, నిశ్శబ్దమై యుండె పేరోలగం, బప్పు డద్దాని నాయెల్లనేత్రంబులను దృష్టిసారించి, శీర్షంబులీరైదు నల్లార్చుచును మందహాసంబుఁ గావించి భాషించె తా నట్టహాసంబుమై నిట్టులను;—

సభాసదులతో రావణుని కార్యక్రమాలోచన.

మున్ను మీరెల్ల కన్నారఁ గన్నారుగా? మర్కటుం డొక్కఁ డేతెంచి, యీలంకలోఁ జొచ్చి, లంకాసతిని గూల్చి, భూజాతతో నేమొ మాటాడి పై నాయశోకావనిని బాడుగావించి, నాపుత్త్రుఁడౌ నక్షసూనును విదారించి, యీలంక వాలాగ్నిచేఁ గాల్చి, తాఁ జేతిలోఁజిక్కియును జావకే, తప్పిపోఁడే యదృష్టంబుకల్మిని? గనను వాఁడు శ్రీరాముతో నేమి వాక్రుచ్చెనో కాని, యామాటపై నాతఁ డాకొండలం దున్న భల్లూకలోకంబు నావానరానీకమును గూర్చి, సైన్యంబుగాఁ

1 గనిష్ఠానుజుండును మఱిని, అని పాఠాంతరము.

గొంచు విచ్చేసి, యీవార్ధి కాతీరమందున్న వాఁడంట, వారాశిబంధించి విచ్చేసి, తా నెల్లరన్ గెల్చి, నన్నోర్చి, భూజాత సాధించుపేరాసమై నింతకార్యంబుఁ జైఁబూనినాఁడంట, నా కాప్తులున్ విజ్ఞులున్ దంత్ర మంత్రజ్ఞులున్ దద్జ్ఞులున్ మీఱ, యోజించి వైశంబ కార్యం బెఱింగింపుఁడీ!' యంచుఁ బల్కన్, బ్రహ్మాస్తుండు వే లేచి- 'దైత్యేశ్వరా! మానవుల్ వారు, మేమో—మనుష్యాశనుల్; మమ్ము వా రెట్లు నిర్జింతురో? పిట్ట పిల్లిన్ విదారింపఁగాఁ జూచెఁబో! యేల యీవెఱ్ఱియాలోచనల్ సేయఁగా?' నంచుఁ బల్కాఁడి కూర్చుండె, నాపిమ్మటన్ మేఘనాదుండు పల్కెన్:—'నరుల్ వానరుల్ మమ్ము నోరోర! భంజించువారా? యహో! వజ్రి నోడించి దిక్పాలురన్ దంచి, యేరేరికిన్ దేఱిచూడంగ రానట్టి దివ్యప్రభావంబునన్ వెల్గమే మేము? నీకేల యీచింత లోకేశ్వరా! నెమ్మదిన్ సమ్మదం బొందుమా!' యంచు;-నామీఁద నారశ్మికేతుండు:—'విన్నంతనే నవ్వు నాకుప్పతిల్లున్ జుఁడీ! యుద్ధమంచందురే, యుద్ధమెవ్వారితో?.- ఘోరవారాశి వారెట్లు దాఁటంగలా, రేటిమాటల్? తరింపంగ మున్నీటిలోదూఁకి మన్నాదురవ్వారు, మీ కేటికీచింత లోఁగల్గెనో? నాకు బల్వింతగాఁదోఁచె'- నంచాడె;- నాపైన యూపాక్షుఁడున్ లేచి:-'దైత్యేశ్వరా! దేవుఁ డంచన్న నీవేకదా? నీవు గాకొక్కఁడౌ దేవుఁ డీరేడులోకంబులన్ గల్గఁడో ఱేఁడ! నీవిట్టు లాసీతకై మించి చింతింపఁగాఁ జెల్లునే? రాముఁ డట్లుండనీ, యుద్ధమే కాని, కాకుండనీ, దేవ! నీకై వసంబున్న యాకామినిన్ బట్టి లోకాంక్షతీరంగ భోగింపుమా! మీఁదటన్ రామసౌమిత్రు లీచోటికే తెంచుచో ముందు యోజింత మాకార్య' మంచాడె, నామాట కారావణుం డట్టిహర్షించి శీర్షంబు పంకించి పల్కాఁడు;—

'యూపాక్ష! నీవెంతయున్ లెస్సగాఁ బల్కినా, వైన నన్నున్ భయంబొందు బాధించు, నద్దాని నేఁ దెల్పెదన్ విన్ము, మున్నొక్కనాఁ డేను లోకేశునాస్థానమున్ జేరఁగాఁబోయి, మార్గంబునన్ బుంజికా

ఖ్యాతయౌ నాతినిఁ బట్టిభోగించితిఁ బల్కి, నద్దాని కా బ్రహ్మ కోపించి- 'ముం దింక నేకాంత నేఁ బల్కి భోగించినఁ, నీతలల్ వ్రక్కలై వేయిగా నంచు శాపంబు నాకిచ్చె, నా కారణం బుంటచేఁ గాంతయే యొప్పినఁ గాని నే బల్మి మైఁబట్టిభోగింప, భీతిల్లెదఁ జూవె!' యంచెంతయుఁ గుందుచుఁ బల్కు తా నా[1]విభీషాఖ్యదైత్యేంద్రు మోముట్టి వీక్షించె, నాతం డౌగిఁ లేచి కేల్మోడ్చి, యన్నఁ విలోకించి భాషించు నీరీతి;—

## విభీషణుని హితోపదేశము.

'ఓయగ్రజా! యాలకింపంగదే, పల్కు! నేఁ దొల్తనే సీతఁ దేఁబోవ రాదంచు బోధించితిఁ, గాని నామాట పాటింపలేకుంటి వోయన్న! కేల్మోడ్చి ప్రార్థించెదఁ, రాము నిల్లాలి సీతమ్మ నా తేని కర్పింపుమా! రాక్షసాధీశ్వరా! సాధ్వియౌ సీత నీకంఠ పాశంబగుఁ జూడుమా! యన్యకాంతాళిపై మానసం బుంచఁగా రాదు పాపంబగుఁ, నిందలుఁ గల్గు, ధర్మం బడంగుఁ జుమీ! ధర్మ మెవ్వానియం దుండదో, వాఁడు గోల్పోవునాయుస్సు, వంశంబుతో నాతఁడుఁ నాశముఁ బొందు, ధర్మం బులేకున్న దైవంబుతోడుండఁ, డీధర్మహీనంపుఁగార్యంబు నీ కొప్పునే? రాజు ధర్మంబు రక్షింప, రాజ్యంబు దేహంబు సర్వంబునేఁ వీడఁగా నొప్పు,- ధర్మంబె దైవంబు, ధర్మంబె సర్వంబు, ధర్మంబుఁ బాటింపుమా! రాముదేవేరి నారామభూజాని కర్పింపుమా! భార్యకై యెంతదుఃఖంచునో? భార్యయే కాదె ప్రాణంబు, మానంబు? ప్రాణేశ్వరీనామ మన్వర్థమౌఁగాదె యిల్లాలికిఁ? బూరుషుండెంచఁ బ్రాణంబునేఁ వీడినఁ వీడు నర్థాంగిఁ దానొడ్డ కొప్పించి శాంతింపఁగాలేఁడు, వి న్నాంధ్రపై నేరి కిట్లే కదా యుండు? యోజింపఁగా నన్యకాంతాపహారంబు నీచంబగుఁ; రాముఁడో సత్యసంధుండు, ధర్మాత్ముఁ డం భ్రాతఁడుఁ శత్రుఁడౌ కాఁడు, నిష్కారణం బిట్టు లమ్మాన్యుతో వైరముఁ బెంచ ధర్మంబె?-

---

1 కనిష్ఠాత్మసోదర్య అని పాఠాంతరము.

శ్రేయంబె? యోజింపుమా!' యన్న; నాతమ్మునిఁ జూచి దైత్యేంద్రుఁ డీరీతి భాషించు;—

రావణవిభీషణులసంవాదసంభాషణము.

'ఓసోదరా! న్యాయముం బల్కినా వీవు, నే మూర్ఖతన్ సీతఁ దేలేదు, యోజింపుమా సుంత-లోకంబు లేకంబుగా గెల్చి లోకైక వీరుండ నాఖ్యాతిమైమంటి, నాధాతసన్మానముం గంటి, ముక్కంటి చేతన్ వరంబుల్ దగన్ గొంటి, దేవేంద్రునిన్ గెంటి యున్నట్టినన్నైనఁ బాటింప కానీచుఁ డారీతి నాసోదరిన్ గర్ణముల్ ముక్కునున్ జెక్కి, నా కప్రతిష్ఠన్ ఘటించెన్ గదా! చెల్లెలిన్ జిత్తము౦దెంచ గుండెల్ గుభీలంచు డిందున్, వికారంబునౌ నేఁటి యాకాంతయాకారమున్ గాంచినన్ రోష ముప్పొంగు; నే ద్రోహ మేఁజేయ, నాతండె కాన్తొల్త నన్ రేఁపె? నీమానభంగంబు నిర్వీర్యుఁడై నన్ మదిన్ సైఁపఁగా సాధ్య మే? దోసమే లేదు నాయందు నాద్రోహి నిష్కారణం బిట్లు నన్ నొవ్వఁగాఁ జేసె, నే సైఁపలేకే ప్రతీకారమున్ గోరి సీతాసతిన్ దెచ్చియున్నాఁడ, నీసర్వమున్ నీకు వేద్యంబె కా? యేటి కీకంఠశోషల్? వెసన్ ముందు కార్యంబు విన్పింపుమా!' యన్న, నాపిన్నతమ్ముండు దైత్యేంద్రుతోఁ బల్కు;—

'ఓరాక్షసాధీశ్వరా! రాముసం దొక్కదోసంబుగన్పింప దొక్కింత యోజింపుమా! చూడ నా చుప్పనా కట్టు లమ్మానవ్యునిన్ గోరె, దానేకపత్నీవ్రతుండౌట శ్రీరాముఁ డాకాంతనున్ నీతులన్ జెప్పి వారించె, నాతన్వి పోకుండ నిర్బంధమున్ సల్పె, నాధీరుఁ డింకేమిగావించు? తా నాహరోద్యోగమీక్షించి యాధూర్తకర్ణంబులన్ ముక్కునున్ జెక్కెఁ, దప్పున్నదేదీన? నీకిష్టమే లేనితన్వంగి నిన్నిట్లునిర్బంధమేసల్పి యేయుండు చో ముక్కునే కాదు ప్రాణంబులన్ దీసియేయుందు వౌఁగాదె? చింతింపుమా! శాంతిమై' నన్న దైత్యేశ్వరుం డాడు నొక్కింతకోపంబుతో;—

'ఆఁ డదేమం తెఱుంగున్? ననున్ జూడకే, నాదు పేర్వాసిలక్షిం

పకే, నా ప్రతాపంబులోనెంచకే, వాఁడు నాచెల్లెలిన్ మానభంగంబుఁ గావించె, నే సైఁతునే? దుర్మదున్ద్రుంచి నామించుకోపాగ్నిఁజల్లార్చెదన్, ఖ్యాతిఁగైకొందు, సత్కీర్తిమైముందు, నాశంకరుం డడ్డమైవచ్చినన్ మాన కాదష్టప్రాణంబులన్గొందు నీనీతులున్ జాలు, నాసోదరీపుత్రునిన్, జంబుమాల్యాఖ్యునిన్, నాదుమేనల్లునిన్ వానితమ్ముండు సౌమిత్రియన్వాఁడు నిష్కారణంబై హతున్జేయఁడే? వాఁడు సన్మార్గుఁడే? వారలం దొక్క దోసంబులేదంచు వాదింతువే? యెప్డు డీఁట్టులే నీతులన్ బల్కుదౌరా! నీధర్మముల్ చాలుఁబో! పోల దీలీల' యంచావలన్ మోము త్రిప్పె, నంతన్ దదీయానుజుం డోర్మి నాప్రక్క కేతెంచి యన్నన్ విలోకించి బల్భక్తిభావంబు రంజిల్లఁగాఁ బల్కు;—

'ఓయన్న! కోపంబునై రింపుమా! కోపమే పాపమూలంబు శాంతింపుమా! సుంతయోజింపుమా! నేను నాపేరు నావీర్యశౌర్యప్రతాపంబులం చెంతువేకాని, న్యాయంబు పాటింపలేవే? యహంకారమే నీమదిన్ న్యాయమున్ దోఁపఁగా నీదుకాదే? యహంకారమే సర్వదుర్భావముల్ పుట్టుచోటౌ, నహంకారమే సర్వనాశంకరంబౌ; నహంకారమున్వీడి యోజింపుమా! సత్యమున్జూడుమా! జంబుమాల్యాఖ్యుఁడో, దుష్టుఁడై సర్వకాలంబులన్ సాధులన్ బాధలన్బెట్టుచుండెన్గదా! మౌను లద్దానికై వచ్చి సౌమిత్రిఁ బ్రేరేచి, రేద్రోహమున్గానఁ డాధీరుఁ, డంతన్ బొదన్ దూయఁగా ఖడ్గమున్జిమ్మె, నందున్ దపంబున్న మేనల్లుఁడో మ్రందె, నామాత్ర కారాఘుస్రుల్ ద్రోవఁగా లేవే? చూడు, నీ వెంచు నట్లారయన్ వారు నీశత్రులేయైనఁ గానిమ్ము, శత్రుత్వమున్ దీర్ప, శస్త్రాస్త్రముల్ దాల్చి పోరాడనౌఁగాని, యిట్లన్యభార్యాపహారంబు నీబోఁటికిన్ భావ్యమే చూడఁ దుచ్ఛంబు నీచంబగున్, ధర్మదూష్యంబగున్, నీతిబాహ్యంబగున్, బాపకార్యంబగున్; సీత నర్పింపుమా, రామభూనేతకున్, దైత్యలోకేశ్వరా! రాముపైఁ గోపమేకల్గినన్, యుద్ధరంగంబునన్ నీవు స్వేచ్ఛావిహారంబుఁ గావించి నీశత్రుసంహారమున్ జేసి సత్కీర్తి

నార్జింపుమా! లేక సంగ్రామమందున్ మహావీరు లార్జించు స్వర్లోకమున్ గెల్చి భోగంబు లవ్వారిగాఁ బొందుమా! నీచ మీయన్యకాంతాపహారంబు మానంగదే! సీత వీడంగదే!' యన్నఁ, గోపోగ్రుఁడై తమ్మునిన్ గాంచి దైత్యేంద్రుఁ డిట్లాడు;—

'నన్ బిచ్చివాఁ డంచుభావించి బోధింతువో సీత నిమ్మంచు? బల్ ప్రీతిమైఁ దెచ్చి సాధింపఁగాఁ జేతఁగాదంచు భీతిల్లి భూజాత నావైరి కర్పింపఁగావచ్చునే? నవ్వరే వీరులున్? నా కపఖ్యాతికార్యంబుబోధించునీ వెన్నఁగాఁ దమ్ముఁడో! శత్రుఁడో? నే నెఱుంగన్ జుమీ! చాలు నీనీతులున్, మాఱుమాటాడినన్ గోప ముప్పొంగు, నీ వింకమాటాడకిందుండు, మట్లుండఁగాఁగానిచో లేచిపొ' మ్మంచు గర్జించె;—

ఆమీఁద నాపిన్నతమ్ముండు చింతించి యన్నన్ విలోకించి, కేల్మోడ్చి యింకేమియో చెప్పనుంకింప, నంతన్ బ్రహస్తాఖ్యమంత్రీశ్వరుం డడ్డమైవచ్చి:- 'చాల్ చాలు నింకేల హా! స్వామికిన్ గోప ముప్పొంగె, నీధర్మశాస్త్రంబులే విప్పకే, కట్టుటో' మ్మంచు వాకొల్పె;- నాయంతలో మేఘనాదుండు 'నీయీ ప్రసంగంబులోఁ దారతమ్యంబులేకుండె, చాల్ చాలు నిఁకుండు, మీవట్టి వాకొట్టకే'యంచుఁ జీకొట్టె; యూపాక్షుఁ డాపిమ్మటన్ లేచి:- 'యిట్లేటి కిబ్బంగివాదాడ? నీసాయమున్ గోర, మేమోర్తు మారాము, నీజోలి నీకేటికో? పోల' దంచాడి కోపించె;—

నాపల్కులన్ సైఁచి యాతం, 'డోహో శూరు లీరైతి రింకేమి? నాతోడనా మీప్రగల్భంబు లౌరా! కనన్ మొన్న నే కాదొకో, క్రోతి రొక్కండు విచ్చేసి, వారాశి లంఘించి, యీ లంకలోఁ జొచ్చి, బల్ శూరులౌ దైత్యులన్ గొల్లఁగాఁ జంపి, యీవీటికిన్ వహ్నినిన్ దార్చి, మిమ్మెల్లనిక్ దంచి, భూజాతతో మించి భాషించి, యాయాసమే లేక తా నేగె, నానాఁడు ప్రాణంబుతోనుంటిరో? లేక మీరెల్లరున్ జచ్చియే యుంటిరో! యొక్కయామర్కటుం డింతగావించె, నట్లుండ నా రాము సైన్యంబునం దుండిరో! బంటు తానంతవాఁడయ్యె, నాస్వామి యింకెం

తవాఁడౌనో? యోజింపరే? యేల వాక్ప్రౌరుషంబుల్ వృథా? మేఘనాదా! కనన్ వజ్రివజ్రంబుకాదయ్య సైఁపంగ, శ్రీరాముకోదండకాండంబు దుర్వారమౌ; చూడ దిక్పాలురా! కాదు, దేవాదిదేవుండునౌ నాదిదేవుండు, శ్రీరామచంద్రుం, డదే వచ్చు సైరింపు! డానాఁడు నీతండ్రినిన్ వాలమూలంబునన్‌గట్టి వారాసులన్ ముంచఁడేవాలి? యావాలి తమ్ముండు సుగ్రీవుఁడేవచ్చెనున్, గాంచుమా! వానిపుత్త్రుండు దోర్విక్రముం, డంగదుం డీడ కేతెంచుఁ గాలాంతకుం డౌచు నాలంబుఁ గావింపఁగా, శూలినిన్‌బోలు నావాలి, లీలావిలాసంబుగా నొక్కకోలన్ ధరన్ గూలఁగా నేసె, నా శ్రీరఘూత్తంసు శౌర్యంబు నొక్కింతయూహించి మాటాడుఁడా! చాలుచా లీప్రగల్భంబు' లంచాడి యారావణున్‌జేరి తా నల్లనన్ బల్కు;—

## విభీషణునినీతిబోధనము; రావణుని తిరస్కారము

'ఓయన్న! నీ వెంతకోపించినన్ మానకే తెల్పెదన్ విన్ము, పౌలస్త్యసద్వంశనిర్మూలమున్ జేయుటల్ సైఁపఁగాలేక నేఁ దెల్పెదన్; ధర్మమున్ గావఁగా, నీదుదుష్కర్మమున్ మాన్పఁగా నెంచి, నే నింతబోధించెదన్, వీరియట్లిచ్చకంబుల్ వచింపన్‌జుమీ! నీహితం బెంచి నేదైవసాక్ష్యంబుగా సర్వశ్రేయస్కరంబైనధర్మంబె భాషించెదన్, దేవ! భూజాత నర్పించి, మన్నింప శ్రీరాఘవున్ వేఁడి వంశమ్ము రక్షింపుమా! ధర్మమార్గంబు పాటింపుమా! కీర్తి నార్జింపుమా! మత్తుఁడై నీవు శ్రీరాము నిర్జింతు నంచందువే? చూడు! నిన్ గట్టువాలిన్ హతున్ జేయుటల్ నిన్నుఁ దాఁ గెల్చుటౌఁగాదె? యోజింపఁగా నీసముల్ దూషణాదుల్ కదా? వారిఁ బోకార్చుటల్ నిన్ను భంజించుటౌఁగాదె? దైత్యేశ! నీమామ మారీచునిన్ జంప, నా చెంత నీ వుండి రక్షింపఁగాలేక, యీక్షింపవే నాఁడు! నేఁ డింతగర్వాంధకారంబునన్ మున్గి శ్రీరాము నిర్జింతు నంచందువే; యెంచ నేజన్మపున్ బాపమో? పైత్యమో నీకు? దైత్యాధిపా! నీహితం బెంచి బోధించెదన్, నీదుసోదర్యుఁడన్, శత్రుఁడన్‌గాను సైరింపుమా!

నమ్ము నామాట ముమ్మాటికిన్;- శ్రీమహావిష్ణువే రాముఁడై వచ్చె; నీలంక
కున్ సీతయే మృత్యువై పుట్టె, నాదేవతల్ క్రోతులై; రక్కటా! రాక్షస
శ్రేణికిన్ జేటుకాలంబుసంధిల్లె, సత్యంబు- సత్యంబు సత్యంబు! శ్రీరాము
దేవేరి వీడంగదే! అగ్రజా! వేఁడెదన్, పాదముల్ పట్టి ప్రార్థించెదన్,
నన్ను మన్నించి నామాటపాటింపవే!' యన్న, నాపల్కు లాలింపఁగాలేక
క్రోధాంతరంగుండు తామండుచున్ బల్కు; నోరోరి! యిష్టానుసారం
బుగాఁ బ్రేలెదే? తుచ్ఛ డౌమానవుండౌర, విష్ణుండఁటే? విష్ణువేయైన
నవ్వాని యర్థాంగి నేఁ దెచ్చుచో వచ్చి యాకాంతరక్షింపఁడేలా? వనిన్
గ్రోతులన్ గూడి నన్ జంప విచ్చేసెఁబో, దేవుఁడే! కొండలందున్న
ముచ్చుల్ మునుల్, దేవుఁడారాముఁడంచున్ గదున్ నీకుబోధించిరే?
దుర్మతీ! పందవై భీతిచే నిట్లు తబ్బిబ్బువై ప్రేలెదే! చాలు నీకున్భయం
బైన నీదేవుఁడౌ రామునిన్ గొల్వఁగాఁ బొమ్ము, పొమ్మంచు గర్జించె;-
నా వెంటనే మేఘనాదుండు:-'పొమ్మావు నీదేవునిన్ గొల్చి జీవింపుమా!
రాముఁడే విష్ణువేయైన మేలాయె, వాఁడెందున్ గానరాకుండె నీనాఁడు
నాచేతిలోఁ జిక్కె, బల్శత్రుఁడౌఁగాదొకో, రాక్షసశ్రేణికిన్? వాఁడు
నీదేవుఁడా? మేలుమేలాయె; తా నెంతవాఁడో, పరీక్షింతు, కౌక్షేయకం
బెత్తి శిక్షింతు; వక్షంబునున్ జీల్తు దక్షుండనై; వానిపక్షంబునన్ జేరఁ
బోపొమ్ముపొమ్మంచు తీక్ష్ణంబుగా నాడఁగా [1]నావిభీషాఖ్య దైత్యేంద్రు
డిట్లాడు;—

'ఓ మేఘనాదా! యిటుల్ కారులున్ బ్రేలఁగా నొప్పునే? నన్
దిరస్కారమున్ జేతువే? దుర్మతీ! చేటుకాలంబు వాటిల్లెఁగాకింక! నేభీ
తిచే నిట్లు వాపోదునం చెంతురే? నీతిభాషించితిన్ గాని నే భీతుఁడన్
గాను, నావిక్రమం బెంచవో? బ్రహ్మరుద్రాదులే పోరుగావించినన్
లెక్కసేయన్ జుమీ! విక్రమం బేల వాక్రువ్వ నానోటితోఁ? గాని, యి
ట్లీయధర్మంపుఁ గార్యంబు నే సైఁప; న్యాయంబుకై ప్రాణమే నిత్తు,
పోపోర!' యంచాడి తా నన్నదికై:- 'యహో, రాక్షసాధీశ్వరా!

1 రాక్షసస్వామిసోదర్యుఁ డిట్లాడు.

సీత శ్రీరామభూజాని కర్పింపు, దుర్వారగర్వాంధకారంబునన్ మున్గి నా వీవు! యోచింపుమా! భర్గుచాపంబుఖండింపఁగా, విష్ణువేగాక శక్తుం డౌనె మానవుం డెన్నఁగా? ఱాఁతినిన్ బాదసంస్పర్శచే నాతిఁగావించు నాదైవమాహాత్మ్య మూహింపకే, రామునిన్ మానవుండంచు భ్రాంతాత్ముఁడై పల్కుచున్నాఁడవే? దానవాధీశ్వరా! యింత నామాటపాటించి భూపుత్రి నర్పించి, శ్రీరాముపాదంబులన్ బట్టి ప్రాణంబులన్ గాచుకొమ్మా!'- యనన్, గోపతాపంబులున్ మీఱ, నేత్రంబులన్ జ్వాలలే పార ఘూర్ణిల్లు చాకుంభకర్ణున్ దైత్యేశుఁ డిట్లాడు;-

'ఓకుంభకర్ణా! కనుంగొంటివే వీనిదౌష్ట్యంబు? భూజాత నేఁ దెచ్చునాఁడాదిగా వీఁడు, నన్ దెప్పుచున్ శత్రునిన్ గొప్పగాఁ జెప్పుచుండెన్, మఱిన్ సైఁచికొన్నాఁడ నిన్నాళ్లు, నీనాఁడు నీభ్రష్టుదుర్నీతికిన్ మేరయే లేకపోయెన్ గదా! సైఁపఁగావచ్చునే? చెప్పుమీ'వన్న, నాకుంభకర్ణుండు భాషించు -'నోయగ్రజా! పిన్నితమ్ముండు ధర్మంబె వాక్రుచ్చె, నిప్డేమిలాభంబు, కార్యంబు మించెన్ జుమీ! యిప్పు డాసీత నారాము కర్పించుచో, లోకముల్ మెచ్చ, వెట్టైన యుద్ధంబు సిద్ధంబు;- కానున్న దెట్టైనకాకుండ, దిట్లేటికిన్ వాగ్వివాదంబుఁ నాకిప్పుడే నిద్రకున్ వేళ మించెన్ జుమీ! పోదు' నంచాడి తా నన్నకున్ మ్రొక్కి శయ్యాగృహం బేగె,—

రావణుఁడు కాలితో తన్ని విభీషణు నవమానించుట.

ఆమీఁద నాపిన్నతమ్ముండు దైత్యేశ్వరున్ డాసి భాషించు;- 'శాంతింపుమా, దేవ! భూజాత లోకైకమాతన్ మహాపూతచారిత్ర సీతన్, వెసన్ రామభూజాని కర్పింపుమా! యామె కోపింపకుండెన్ జుమీ! నాథు నాజ్ఞానుబద్ధాత్మయై;- సాధ్వి కోపింప, నీవంశ మీలంకతోఁ గాలి భస్మంబుగాఁ గూలిపోదే? నరుల్ వానరుల్ వీరులా వీరు, నన్ జంపఁగా నంచు గర్జింతువే? యబ్జజున్ గోరునాఁ డీవు వేరొక్కవుగా?

వానరానీక మట్లానరానీకముల్;- వీరులై వీరలై వచ్చినా రాసురల్; దేఁ; నంచిశ్వరుం డప్డు శాపింపఁడే? క్రోఁతులే నీపనిన్ గందురంచున్ నినున్; నేఁడు నీకున్ జయం బేమిచేకూఱు దీయుద్ధమం, దారయన్ రోగికిన్ బథ్యమే రోఁతమైనట్లు, నానీతి దుష్కాలమాసన్న మౌనీకురుచ్యంబు గాకుండె, యోజింపుమా! సీత నర్పించి మమ్మెల్ల రక్షింపుమా! నీవు జీవింపుమా! నీతి నాలింపుమా!' యంచు భాషించునాపల్కులున్ ముల్కులై కర్ణముల్ సోఁక, జీకాకుమై లోపలన్ సైఁపఁగాలేక, తా డిగ్గునన్ గద్దియన్ డిగ్గి, 'యోరోరి! యోవంశవిచ్ఛేదకా! భ్రాతృద్రోహీ! మఱింకేలరావాగె? దా బ్రహ్మరుద్రాదులే వచ్చి ప్రార్థించినన్ వీడ నాసీత, నీమాట నాకెక్కునే? దుర్మతీ! నీవుదాయాదివై పోరుదే? నాదుచావెంచుటే? చూడు ఖండింతు నీశీర్షమం చెత్తెఖడ్గంబు, వేగన్ బ్రహస్తుండు తానడ్డమైవచ్చి వారించె; నంతంతకున్ గోప ముప్పొంగ దైత్యేశ్వరుం డోపఁగాలేక వీఁకన్ స్వసోదర్యు మూర్ధంబుఁ దా వామపాదంబునన్ దన్నె నేతత్కిరీటంబు ధాత్రీస్థలిన్ ద్రెళ్లఁగా, నంతతోఁబోక శాంతింప కారశ్మికేతున్ విలోకించి:- 'వీనిన్ దురాత్మున్, కులద్రోహినిన్, వే సభాస్థానమున్ వీడిపోఁ ద్రోయుమా! కంఠమున్ బట్టి గెంటింపుమా!' యంచు గర్జించి భర్జింపఁగా, రశ్మికేతుండు తన్ డాయరాఁ గాంచి యాతండు కోపానలజ్వాల లాకన్నులన్ దోఁప, ఘూర్ణిల్లు చాయన్న కిట్లాడు;—

### విభీషణుఁడు దశగ్రీవుని దూషించి, సభనుండి లేచిపోవుట.

'ఓరోరి! నీవగ్రజుం డౌటచేఁ, దండ్రితోడన్ సమానుండవంచెంచి నే సైచితిన్, బాపకర్ముండ వీవౌట, న్యాయంబు నీనెత్తికిన్ బట్టదయ్యెన్, వినాశంపుకాలంబు నిన్ డాసె, తోఁబుట్టువౌనిన్నుఁ బాయంగ నాడెంద మత్యంతమున్ గుందు, నీపైనిప్రేమంబు నా కెంతయేనుండు జన్మస్థలంబైనయీలంక వీడన్ దలంపెంచినన్ గుండె నీరాడు, చేఁ దోడుగా నాకునున్నట్టి యీరాక్షసశ్రేణినిన్ వీడిపో దుఃఖమౌనాకు, నెట్లైన నీనాఁడు పో కెట్టులిందుందు? నేఁ బోయెదన్, ధర్మద్రోహంబునున్,

దైవద్రోహంబు, నీ రెండు నీయందు స్పష్టంబు గన్పట్టె, నిన్ సైఁపఁగా నోల్ల, నే ధర్మపక్షంబునన్ బోదు, పాపాత్ముఁ డౌనిన్ను సేవింపఁగా నోడితిన్, వంశవిధ్వంసకున్ నిన్ను నే రోసితిన్, బోదు' నంచాడి తాఁ గన్నులం దశ్రువుల్ గార్చుచున్ బోయె వేగన్ సభాస్థానమున్ వీడి;- యంతన్ దశగ్రీవుఁడున్ గొల్వు చాలించి కోపంబు తాపంబు దీపింప ఘూర్ణిల్లుచున్ బోయె నంతఃపురిన్ జేర;—

విభీషణుఁడు, శ్రీరాముని శరణువేఁడఁబోవ, తల్లి కైకసియాజ్ఞఁ బడయుట

అట్లాసురారాతి సోదర్యుఁ డేతెంచి తాఁ దల్లియౌ కైకసిన్ డాసి యామాతపాదంబులన్ వ్రాల, నాయమ్మ ప్రీతిన్ సుతున్ గౌఁగిటన్ గ్రుచ్చి, మూర్ధంబు మూర్కొంచు లాలించి,- 'విచ్చేయుఁగా నేమి వృత్తాంతమో?' యంచుఁ బ్రశ్నించెఁ, గన్నీళులన్ నించు చాధీరుఁ- 'ఓమాత! ధర్మచ్యుతుండౌ దశగ్రీవుఁ డాసాధ్వి సీతాసతిన్ దెచ్చుటల్ విందువే గాదె? భూపుత్రిఁ దద్భర్త కర్పించి ప్రాణంబులన్ గాచుకొమ్మంచు నే నన్నతోఁ జెప్పి ప్రార్థించితిన్, దాని కాతండు కోపించి 'నే వీడ నాసీత' నం చల్గి, నన్ దిట్టి శ్రీరాము దూషించి, తా వామపాదంబునన్ నాదు మూర్ధంబునన్ దన్నె నానిండు పేరోలగం బంతయున్ జూచుచుండంగఁ దా నంతటన్ బోవఁ డో మాత! యాస్థానరంగంబునందుండి నన్ గెంటఁగా దూతకున్ జెప్పె, నామానభంగంబు నే సైఁప కాదుర్మదున్ రోసి, శ్రీరామచంద్రున్, దయాసాంద్రునిన్ ధర్మసత్యావతారున్, దగన్ గొల్వఁ గాఁబోవ, నీయాజ్ఞకై వచ్చినానమ్మ! నాకానతీయంగదే!' యన్న, నాతల్లి నిట్టూర్పుఁబోఁబుచ్చి, లోనొచ్చి, తా నశ్రువుల్ వుచ్చుచున్ బల్కె;—

'ఓపుత్ర! యీయింతచారిత్రమున్ మున్నె నే విందు, శ్రీమన్మహావిష్ణువే రాముఁడై పుట్టి భూభారమున్ డించ, నీయన్నలౌ రావణున్ గుంభకర్ణున్ విదారించి, యీదానవశ్రేణి నిర్మూలమున్ జేయు నం చేర్పడన్ జెప్పె మీతండ్రి; నే నంతటన్ బల్వగన్ గుంది, లోఁగంది ప్రార్థించితిన్:- 'నాథ! నీవంశ మీపుత్రులం దెవ్వఁడీధాత్రి నిల్పంగ శక్తుండు

దెల్పంగదే!' యంటి; నామాట రామాన్యుఁ 'డోతన్వి! సత్యంబు ధర్మంబు, శౌచంబులన్ గల్గుచున్, సద్యశోవంతుఁ డైనట్టి నీపిన్న పుత్రుండు, దేవాదిదేవుండు శ్రీరామచంద్రుండు తన్ బ్రీతిమై నాదరింపన్ జిరంజీవియై లంకఁ బాలించు సద్ధర్మమార్గంబునం' దంచు వాక్రుచ్చి పోయెన్ దపోభూమికిన్, బుత్ర! నీచేత నీబ్రహ్మవంశంబు గావన్ బడున్, రావణుండో చెడున్; దండ్రి! ప్రారబ్ధమున్ మీఱరాదేరికిన్, శోకమింకేల? వేగంబ నీవేగి శ్రీరామునిన్ గొల్చి, సౌఖ్యంబుగాఁగన్ జిరంజీవివై, లంకఁ బాలింపుమా! వంశమున్ నిల్పుమా! పొ'మ్మటం చాజ్ఞనియ్యంగ;-

**శరణుఁజొచ్చిన విభీషణునకు రామచంద్రుఁ డభయమిచ్చి సముద్రపుటొడ్డున లంకాపురి పట్టము గట్టుట.**

ఆతల్లికిన్ మ్రొక్కి, తన్ బాయలేకెంతయున్ బొక్కుచున్ దీవనల్ సల్పఁ, నాతల్లినిన్ వీడిపోలేక కంటన్ దడిన్ బెట్టుచున్, గట్టిగాఁ జేసి డెందంబు శీఘ్రింబుగా నభ్రమార్గంబునన్ వచ్చి సంద్రంబు లంఘించి, తా నామహేంద్రాద్రి డాయంగ రాఁ గాంచి, బల్పర్వతాకారుఁ డీరక్కసుం డెవ్వఁడో? యంచు నాయంగదాదుల్ వడిన్ వృక్షముల్ ఉవ్వఁగాఁ గొంచు విచ్చేయ, వీక్షించి దైత్యేంద్రు తమ్ముండు భాషించు:- నోహో! ప్లవంగేంద్రులారా! వినుం డే[1]విభీషాఖ్యుఁడన్ దైత్యలోకేశుఁ దమ్ముండ, శ్రీరాముపాదంబులన్ బట్టి జీవింపఁగా వచ్చితిన్, మీర లీవార్త నాస్వామికిన్ దెల్పరే!' యన్న, వారేగి యావార్త విన్పింప, శ్రీరాముఁ డయ్యంజనాపుత్రునిన్ జూచె, సామీరి కేల్మోడ్చి- 'యోదేవ! నే నామహాయోగ్యు నానాఁడు గన్గొంటి, నాతండు ధర్మంబు బోధించె తా నన్ను కెన్నంగ సన్మార్గుఁ డాతండు; మన్నించుటే మంచి' దం చన్న, సుగ్రీవు నీక్షించి శ్రీరాముఁడిట్లాడు:— 'నోవానరోత్తంస! యర్థించినన్ శత్రు నేన్ గావ, మావంశమర్యాదయై యొప్పెడిన్, డేగకున్ దేహ మర్పించి తాఁ బిట్టప్రాణంబులన్ గాచు మాపూర్వజుం డౌశిబిన్ మీరు విన్నా

1 దశగ్రీవుసోదర్యులందున్ గనిష్ఠుండ.

రుగా! యీతఁడే కాదుపో, యాదశగ్రీవుఁడే వచ్చి ప్రార్థించినన్ గాచెదన్ దోడితెం డీర లాయర్థి' నంచన్న:—

వా రేగి యాయాసురశ్రేష్ఠునిన్ బంప, నాతండు విచ్చేసి కేల్మోడ్చి- 'శ్రీరామ! దీనావనా! భక్తమందార! మాంపాహి! మాంరక్ష!- యం చాడు చంఘ్రిద్వయిన్ వ్రాల, హర్షించుచున్ రాముఁ డాదైత్యునిన్ లేపి, వృత్తాంత మాతండు విన్పింప నాలించి సాంతంబుగా, మించి భావించి లాలించుచున్ బల్కు-:- 'నాకాప్తితమ్ముండవా నీవు? నాతమ్ముఁడై తింక భీతిల్ల'కం చాడి, సౌమిత్రి నీక్షించి, 'యిమ్మాన్యు నీలంకకున్ నేఁడె తేఁడంచుఁ బట్టాభిషేకంబు గావింపుమా! యన్న, సౌమిత్రి యాదానవోత్తంసునిన్ వార్ధి స్నానంబు గావింపఁగాఁ జేసి, పట్టాభిషేకంబు వారాశితీరంబునన్ సల్పె, నావానరుల్ చేసిరంతన్ జయధ్వానముల్; ఫాలదేశంబునన్ బెట్టిరక్షాతలన్, బాసికంబున్ దగన్ గట్టి, సౌమిత్రి, మూర్ధంబునందున్ గిరీటంబు నాదానవస్వామికిన్ బెట్టి, పట్టంపు గత్తిన్ కరంబందునన్ బట్టఁగా నిచ్చి యాశీస్సులన్ జెప్పె; జే,జే, మహాదైత్యలోకేశ్వరా! వీర! లంకాపురాధీశ్వరా! రామభక్తాగ్రగణ్యా! మహాధన్యమూర్ధన్య! జే,జే,' యటంచాడి కంఠంబునన్ జాంబవంతుండు పూమాలికన్ వేసె నావాయుపుత్రుండు, శ్వేతాతపత్రంబుగాఁ, దెల్ల వస్త్రంబు నల్వంకలందున్ కొసల్ క్రోతులున్ బట్టఁ, దన్మధ్యభాగంబునన్ కోలనెక్కించి, యద్దానిహస్తంబునన్ బట్టియా తేనిపార్శ్వంబునన్ నిల్చె, నీలుండునున్ జామరాల్ వీఁచె, నంతన్ గజుండుంచె పాదంబులన్ బావు కోళ్లన్, వెసన్ వచ్చి దండంబు లర్పించి సుగ్రీవుఁడే కాన్క చెల్లించె; నాయంగదుం డొక్కమత్తేభమున్ దెచ్చి ముందుంచి, యెక్కించి యద్దానిపై భావిదైత్యేశ్వరున్, మావటీఁడై తగన్ దానె సాగించె నాయుత్సవంబున్, వెసన్ వాద్యఘోషంబులన్ దివ్యమై శ్రావ్యమై పెక్కురీతుల్ వినోదంబుగాఁ జేసి రావానరుల్ నోటితో నీటుగా; వందులున్ మాగధుల్ వారలై చంద మేపారఁగా స్తోత్రపాఠంబులన్ జిత్రరీతిన్ వనా

టోత్రముల్ పాడి కొండాడి, రాకొండపై, నుత్సవం బేగి శ్రీరామ భూజాని కల్లంతదూరంబునన్ నిల్వ, దంతావళంబున్ వెసన్ డిగ్గి లంకాపురాధీశుఁ, డాముందు నేతేర సౌమిత్రి సుగ్రీవముఖ్యుల్, మహా భక్తిఁ దాఁ బాదసంచారియై మోడ్పుకేల్పట్టి, శ్రీరామనామంబు ధ్యానించుచున్ వచ్చి, యా రాముపాదంబులన్ వ్రాలె, శ్రీరాముఁ డాబ్రహ్మకల్పంబుగా లంకఁ బాలింపు మీ'వంచు, దీవించె- నామీఁద నాయెల్లరున్ గూడుచున్ స్వేచ్ఛమై ముచ్చటల్ ముచ్చటింపంగ సుగ్రీవుఁ డా రామునిన్ డాసి కేల్మోడ్చి యిట్లాడు:- శ్రీరామ! యానాఁడు శ్రీవాలినిన్ బోలు నా వాలి యుండంగనే, వానిరాజ్యంబు కిష్కింధ నేలింతు నీ'న్నంచు నీవట్లు మాటీయఁగా, దానికే విస్మయంబందితిన్; నేఁ డహో! మూఁడులోకంబులన్ గండఁడౌ రావణుం డేలఁగా భద్రమై, లంక నిశ్శంకమై వెల్గఁగా, జంకకే కొంకకే, నీవు నేశంకనేన్ బూనకే బింకమే పారఁగా సంద్రపున్ గట్టునన్ లంకకున్ బట్టమున్ గట్టినా వౌర! యీదిట్టకున్; గాంచ, నార్తావనప్రస్ఫురద్దక్షదీక్షాత్ములింకుండ రెన్నంగ నీబోఁటులౌపోటరుల్ రామ! యాఘోరబ్రహ్మాస్త్రమున్, శూలిశూలంబు నాకేశువజ్రాయుధం, జేనియున్ రాముబాణంబుతో సాటిరావంచు, నా వాలి నీకోలచే నేలపైఁ గూలునాఁడే మదిన్ భద్రమై నమ్మితిన్, దేవ! సందేహమే లేదు, నీ వా దశగ్రీవుసంహారమున్ జేయుటల్ సత్యమౌ; రామ! మూఢాత్ముఁడన్, నాకుసందేహ మొండుండె, బ్రశ్నింపఁగావచ్చునో, రాదొ? మన్నింపవే!' యన్న, శ్రీరాముఁ డక్టే విలోకించి సుగ్రీవునిన్, గన్నులందున్ బ్రసన్నత్వ మేపారఁగాఁ బల్కె- 'సుగ్రీవ! యిట్లేటికో సంశయింపంగ? నాతోడ మోమోటమే నీకు? బ్రశ్నింపుమా!' యన్న, సుగ్రీవుఁ డాడున్- 'ప్రభూ! లంకకున్ రాజుఁ గావించినా వీతనిన్ నేఁ, డిఁకన్ ముందునాఁడా దశగ్రీవుఁడే వచ్చి నిన్ వేఁడినన్ గావవే? యప్పుడీలంక నీయిర్వురం దెవరి కర్పింతువో? సుంత యోజింపుమా! శత్రునేన్ గావ నీధర్మమై యొప్పెఁగా? దేవ! నాఁ డామహావాలిసంహారకాలంబునం దిట్టె సందేహ

మయ్యెన్ జుమీ! నీవు నాపట్టునన్ గుట్టుగాఁ జెట్టుచాటుంటచే, వాఁడు ని న్గానఁడట్లౌటఁ, దా నీశరణ్యంబుఁ గాంక్షింపఁగా వీలుగాకుండె; నేఁ డాదశగ్రీవుఁడేవచ్చి, సీతమ్మ నర్పించి, నీపాదముల్ పట్టి ప్రార్థించుచో నెట్లు కావింతువో! మాట నేరీతి సాధింతువో? యంచు భీతిల్లెదన్, రాఘవా! యింతమాటాడుటన్ నన్ను మన్నింపుమా!' యన్న, నాలించి సౌమిత్రి హేలాగతిన్ బల్కు;—

'ఏమేమి సుగ్రీవ! శ్రీరామువాక్యంబు వ్యర్థంబుగానౌనె? యాలంక కీతండె రాజౌను, నిర్ధారణం బిద్ది, తా నాదశగ్రీవుఁడేవచ్చి ప్రార్థించినన్, నాకలోకాధిపత్యంబు నిత్యంబుగా మద్భుజాశక్తిమైఁ, గట్టి సత్యంబుగా వానిచే దేవసామ్రాజ్యమేలింతు, శ్రీబ్రహ్మలోకాధిపత్యంబు నాలంకరున్ సాటిగాఁ గోరినన్ ఘాటిమైఁ దెచ్చి యర్పింతు, నీకేటి కీచింత?' యంచాడె; నవ్వారిసంభాషణల్ విన్న శ్రీరాముఁ డల్లల్లనన్ నవ్వుచున్ బల్కు:- 'నో వానరాధీశ! నీవాడినట్టుల్ దశగ్రీవుఁడేవచ్చి దుర్వృత్తులన్ మాని ప్రార్థించినన్, బోల దాయింద్రునిన్ దోలి యేడ్పించుటల్! కూడ దాబ్రహ్మబాధించుటల్; వానరోత్తంసమా! మాయయోధ్యా మహాదివ్యసామ్రాజ్యసర్వస్వమున్ గట్టెదన్ వానికిన్ బట్టమున్; నాదుస్వత్వంబె కాయద్ది!' యంచిట్లుహర్షించుచున్ బల్కెఁ; సుగ్రీవుఁడామాటకున్- 'స్వామి! యట్లేల? నామాటపాటింపుమా! నాకు నీసంశయం బిప్పుడేకల్గి చింతించితిన్ జూవె! సందర్భ మారీతినే వచ్చినన్, దేవ! కిష్కింధనే వానికియ్యంగ నిర్ధారమున్ సల్పియేయుంటి నాలోన; ముస్ముందు నీసుద్ది మీయొద్ద విన్పించి యద్దానికిన్ మిమ్ము నొప్పింపఁగా నెంచి, యీప్రశ్న నే నిప్పుడిక్కెక్కువడిన్ బైటరాఁదీసితిన్, దేవ! మన్నించి నీసమ్మతిన్ దీని కియ్యంగదే!' యన్న, నాలించి యామాట కాజాంబవంతుండు భాషించు;—

'ముస్ముందు రానున్న సందర్భముల్ పోల యోజించుటల్ మంచిదౌఁగాని, యీరీతి మీరాడున ట్లేలసేయంగ? నే మేమివ్యత్యాసమే లేక

యీలంకకున్ బ్రక్కనే ధాతచేతన్ మఱియొక్క లంకాపురిన్ సృష్టిఁ గావింపఁగాఁజేసి, యీరావణున్ దానిఁ బాలింపఁ బంపంగవచ్చున్గదా!' యన్న, తా నా[1]విభీషాఖ్యుఁడాడున్;- 'దశగ్రీవుఁ డారీతిగా వచ్చి శ్రీరామునే వేఁడినన్బోలదే? తాను సన్మార్గుఁడై యొప్పినన్జాలదే? యన్న కాదే, యతం డెన్నఁగా నాకు? నా కంతకంటెన్ మహాభాగ్య మొండున్నదే? తత్క్షణం బేను లంకాపురీదివ్యసామ్రాజ్య మాయన్న పాదంబు ముం దుంచి, పట్టంబునుం గట్టి, పాలింపఁగా నిచ్చెదన్; మీరు నాకిచ్చుటన్ జేసి నాసత్త్వమయ్యెన్ జుఁడీయద్ది? రాజ్యంబునన్ సంపదన్ గోరి నే రానుగా? ధర్మపక్షంబుమై వచ్చితిన్; రాము శ్రీపాదసంసేవచే శేషకాలంబునే హాయిగాఁ బుచ్చెదన్, బ్రీతితో నన్ను కర్పించెదన్ రాజ్యమున్; జూత మానాఁటికామాట! కానున్న కర్తవ్యముల్ ముందు యోజింపుఁడా!' యన్న, శ్రీరాముఁ 'డో దైత్యలోకేశ్వరా! లంకతీ రెట్లు? మీయన్న శౌర్యం బదేపాటిదో? యాలకింపంగఁ గాంక్షింతునం చన్న; నా రావణుం గూర్చి తత్సోదరుం డిట్లు భాషించు;—

### విభీషణుఁడు శ్రీరామచంద్రునకు రావణునిబలము వినిపించుట.

'ఓదేవ! మాయన్న శౌర్యంబు నా యాదిశేషుండు వర్ణింపఁగా లేఁడు, దుర్భేద్య మాదేవదైత్యాళికిన్ లంక; నాలంకలోఁ గోట లేడుండు, నాకోట లొండొంటికిన్ ద్వారముల్ నాల్గు, నొక్కొక్క ద్వారంబునం దేడునూ ర్లెన్ని దక్షౌహిణుల్ సైన్యవారంబు కాపుండు, నొక్కొక్క యాకోటలో కోటలారుండు, నాకోట లొండొంటిలో నిచ్చలా ర్వేలుకోట్లాసురశ్రేణి కాపుండు, నయ్యయ్యెడన్ దిడ్డివాకిండ్లు వెయ్యార్లుగా నుండు, నొండొంటిలో నెన్బదార్వేలకోట్లుండు సైన్యంబు, బాజారు లొండొంటిలో నర్వదార్లక్షలార్నూరు సంఖ్యాకులేప్రొద్దు శస్త్రాస్త్రముల్ దాల్చి సంచారముల్ జేతు రోదేవ! యాకుంభకర్ణుండు తాఁ గాపురంబుండుగేహంబుద్వారంబునం దుండు రేడ్నూర్లక్షకోట్లాసురాదుల్; మఱిన్

1 దశగ్రీవుసోదర్యుఁడాడున్.

రావణాంతఃపురద్వారముల్ కాచు చొక్కొక్కచో నిక్కడిన్ లెక్కలే నన్ని సైన్యంబు లోరాఘవా! రాక్షసాధీశుపుత్త్రుల్ కనన్ లక్షకున్నార, లవ్వారికిన్ జ్ఞాతులన్ బాంధులన్ సంఖ్యతో మొత్త మిం తంచు లెక్కింపఁగాఁ జాలఁ డాధాత; వేర్వేఱుగా వార లొక్కొక్కరే మిక్కుటంబైనసైన్యంబులన్ గల్గి రోదేవ! యాకుంభకర్ణుండు దేవాదులన్ లెక్కకే తేఁడుపో! యింద్రజిత్తన్న దేవేంద్రునిన్ గెల్చె; నారావణుం డన్ననో, యగ్నికుండంబులోనన్ స్వశీర్షంబులన్ జెక్కుచున్ వైచి, ఘోరంబుగాఁగన్ దపం బుండి తా వత్సరాల్ వేయి, వాగీశుమెప్పించి మేలౌవరంబుల్ గడున్ బొందె; ముల్లోకముల్ గెల్చె; సర్వామరవ్రాతమున్ దోలె, గైలాస మెత్తెన్ జుమీ!' యన్న, శ్రీరామచంద్రుండు శీర్షంబుపంకించి పల్కుడు;-'మీయన్న తా నెంతవాఁడైన, దోడై మహాకాలుఁడే వచ్చి రక్షింపఁగా నెంచి పోరాడినన్, వీడకే వాని సంహారమున్ జేసి నిన్ లంక నేలింతు, నన్ నమ్ముమా!' యంచు గంభీరవాక్ప్రౌఢిమం బేర్పడన్ జెప్పె; నంతన్ సురారాతిసోదర్యుఁ డోదేవ! నీ వట్లుగావింతు సత్యంబు; నే నప్డు నీతోడుగా నిల్చి శస్త్రాస్త్రముల్ పట్టి రక్షస్సమూహంబు నే ధ్వంసమున్ జేతు, నావిక్రమం బప్డు వీక్షింతు వీ' వంచు వాక్రుచ్చె, శ్రీరాముఁ డామాట కాధీరునిన్ గౌఁగిటన్ గ్రుచ్చి లో మెచ్చె;—

### శ్రీరామభద్రుండు, సముద్రునిపై బాణమును, ప్రయోగించుట

ఆ మీఁద నారాముఁ డవ్వార్ధిఁ జూపించి, యేరీతిగా దీని దాఁటంగనౌఁ దెల్పుమా!' యన్న, నారాక్షసశ్రేష్ఠుఁ డిట్లాడు:- 'నోదేవ! యీఘోరవారాశినిన్ సైన్యముల్ దాఁటఁగాలేవు, సంద్రంబుఁ గట్టంగ నింద్రాదులున్ జాల రట్లౌటఁ, బ్రార్థించినన్ వారిధీశుండు ప్రీతిన్ బ్రసన్నుండునై నీకు మార్గంబుఁజూపించు' నంచన్న,- మోదించి శ్రీరాముఁ డావార్ధితీరంబునన్ దర్భతల్పంబునన్ బండి, యాహారనిద్రాదులన్ మాని నిష్ఠన్ సముద్రేశ్వరున్ ద్రోవ నిమ్మంచుఁ దన్మూర్తిఁ దా చిత్తమం దుంచి ధ్యానించుచున్ మూఁ డహోరాత్రముల్ పుచ్చె; నావార్ధి యంతంత

కున్ బొంగి, తోరంబులౌ బల్తరంగావళుల్ మించ, భోరంచు ఘోరం బుగా మ్రోఁగుచున్ బొంగి పొర్లన్; నిరీక్షించి శ్రీరాముఁ డాకన్నులన్ నిప్పుకల్ గుప్పుచున్ లేచి సౌమిత్రి నీక్షించి- 'యోలక్ష్మణా! కంటివే వార్ధిః! ప్రార్థించినన్ ద్రోవనీకుండుటే గాక, తా నుబ్బుచి ట్లట్టహాసంబు గావించుచున్ నన్ను లక్షించకుండెన్ జుమీ! లక్ష్మికిన్ దండ్రి వీఁడంచు భావించి ప్రార్థించితిన్, జక్రికిన్ వీఁడు మామంచు లోనెంచి సేవించితిన్, గాని నీచుండు వీఁడంచు నే నెంచలేనైతి, నాచాప మిట్లిమ్ము, వీ, డెట్టిఁడో చూతు' నం చాడి, తాఁ జాపమున్ బూని వే నారి మ్రోఁగించె, నాయంత దిగ్భాగముల్ మ్రోసె, శైలంబు లల్లాడె, నక్షత్రముల్ డుల్లె, శేషుండు భీతిల్లె, నీరేజగర్భుండు విభ్రాంతుఁడై చూచె, నంతన్ రఘూత్తంసుఁ డస్త్రంబుఁబోమీటి యావార్ధినీ రెల్ల బాణాగ్రమం దొక్కటే మక్కగాఁ దార్చినన్;—

గాంచి భీతిల్లి వేగన్ సముద్రుండు విచ్చేసి, కేల్మోడ్చి శ్రీరాముఁ బ్రార్థించె- 'రక్షింపుమా! దేవదేవేశ! నీమూర్తి నాకంటికర్వేల్కఁ దీరంగ నీక్షింపఁగాఁ గోరి యుప్పొంగితిన్ నింగినే దాఁకున, ట్లింత సత్యంబు, నిర్లక్ష్యతన్ గాదు మన్నింపుమా! నన్ను రక్షింపుమా! దీనునిన్ గావుమా! యంచు వేఁడన్ బ్రసన్నుండునై రాముఁ డావార్ధినీరంబుపూరంబుగాఁ బుచ్చి, వార్ధీశు నీక్షించి భాషించు,- 'నాదుష్టుఁడౌ రావణున్ జంపఁగా లంకకున్ బోవలెన్ మేము, వారాశి నేరీతి దాఁటంగనౌఁ దెల్పు' మంచన్న, మున్నీటిఱేఁ డాడు- 'శ్రీరామభద్రా! వెసన్ సేతువున్ గట్ట నేమింపుమా! కాంచఁగా మీ నలుం డెత్తి యీసంద్రమం దేమి తా నేసి నన్, మున్గకే తేలుఁగానన్, నలుం డొక్కఁడే శక్తుఁడౌఁ గట్టఁ గట్టంగఁ గట్టింపుమా! వానితో' నన్న, శ్రీరాముఁ డాశ్చర్యమగ్నాత్ముఁడై పల్కె;—

'ఓ వారిరాశీశ్వరా! మా నలుం డట్టిశక్తుండుకాఁ గారణం బేమి? తెల్పంగదే!' యన్న, భక్తిన్ సముద్రుండు భాషించు- 'శ్రీరాఘవా! యీతఁ డావిశ్వకర్మాఖ్యపుత్రుండు, నిర్మాణధౌరేయుఁ డీతండు, తా

పిన్నఁడౌ నాఁడు, వింధ్యాద్రిప్రాంతంబునఁ గణ్వమునాశ్రమంబున్న నం దేగి, యన్నానిసామగ్రులఁ దెచ్చి, యీతండు వారాశిలోఁ ద్రోయుచుఁ వచ్చె, నద్దాని నీక్షించి మౌనీశ్వరుం డల్క శాపింపఁగా బాలుఁడౌ లెంచి, మన్నించి, మార్గంబుకై సుంత యోజించి, యాపైన- 'నీ బాలుఁ డీవార్థి నేమేసినన్ మున్గకే తేలుఁగా'కంచు శాసించె, నామీఁద టాయన్ని సామగ్రులున్ దేలిరాఁగన్ గ్రహించున్ జుమీ! నిత్యమున్; రామ! యీకారణం బుంటచేతన్ నలున్ గట్టని మ్మంటి నీవారిధిన్, దేవ! నేఁబోదు' నంచాడి తాఁ బోయె;—

సేతు బంధనము.

ఆమీఁదటన్ రామునాజ్ఞానుసారంబుగా, వానరుల్ నేలయున్ నింగియున్ నిండు నట్లేగి, బల్ కొండలన్ గుండులన్ వృక్షముల్, తెచ్చి వేవేగ నందియ్యఁగా, నానలుం డవ్వి సంద్రంబునన్ బెట్టుచున్ గట్టెఁ దా సేతువున్; వానరేశుండు షడ్యోజనోన్నత్యమౌశైలమున్ దెచ్చి యిచ్చెన్, హనూమంతుఁ డాయంగదుం డాదిగానందఱున్ బీర మేపార సామర్థ్యముల్ మీఱి శైలంబులన్ దెచ్చి యందియ్యఁ, జోద్యంబుగా వాని సంద్రంబుపైఁ దేలఁగాఁ బెట్టె, ని ట్లొండొరుల్ వానరుల్ కూయు చున్, గేరుచున్ నవ్వుచున్ గొండలన్ నెత్తిపై మోసి యాటాడుచున్ బాడుచున్, గూడుచున్ వీడుచున్, బల్మిమై నోడుచున్ వచ్చి, యంది య్యఁగాఁ గొండకున్ గొండ చానించుచున్ గట్టె నానాఁడు తా నానలుం డిర్వదౌ యోజనాల్, సూర్యుఁ డంతంతకున్ గ్రుంకఁ, జాలించి యా నాఁటి, కావానరుల్ సాంధ్యకృత్యంబులన్ దీర్చి, రారాముఁ డర్హా క్రియల్ దీర్చి, తాఁ గందమూలంబులన్ దృప్తి సేవించి, భూశయ్య మేన్ వాల్చె;—

ఆరాత్రి నావానరుల్ నిద్రతోఁ బుచ్చి, బల్ వేకువన్ లేచి కాల్య క్రియల్ దీర్చి తామేగి రాసేతువున్ గట్టఁగా; నంగదుం డున్నతంబైన వింధ్యాద్రిశృంగంబునున్ దెచ్చె, సుగ్రీవుఁ డింకొక్కటౌ యోజనం

చెక్కడై యున్న శైలంబు వాలాగ్రమం దెత్తి తాఁదెచ్చె నాయంజనా
పుత్త్రుఁడున్ దొడ్డిదౌ యోజనంబుల్ విడంబించు శైలంబు హస్తాగ్రమున్
బూన్చి విచ్చేసె, నాయన్నిటిన్ బంతు లట్లెత్తి లీలన్ నలుం డుంచె సంద్రం
బుపైఁ దేలఁగాఁ; గొండ లెల్లన్ గుభీలంచు వారాశిలో వేయుశబ్దంబు,
తోరంబుగా వార్ధి యుప్పొంగి ఘోషించుశబ్దంబు, నావానరుల్
గేరుచున్ గంతులన్ వైచుశబ్దంబు, నీసర్వశబ్దంబు లేకంబుగాఁ జేరి మ్రోఁ
గంగ, భూభాగ మాకాశభాగంబులన్ మించి మార్మ్రోఁతలన్ సల్పె
ఘోరంబుగా;—

గొండలన్ దెచ్చు చందిచ్చుచున్, గాంచి వారొండొరుల్ మెచ్చు
చున్, వచ్చుచున్ బోవు చొక్కొక్కచో వా రెదుర్కొంచు సల్లాప
ముల్ సల్పుచున్, దిట్టుచున్ మొట్టికొం, చాడికొంచున్ బ్లవంగోత్త
ముల్ సేతువున్ గట్టి మధ్యాహ్నమౌటన్, వెసన్ వార లాయా ప్రదేశం
బులం దున్న వృక్షంబులన్ జేరి, రుచ్యంబులౌ పండ్లుఁ బూఁదేని యల్ గ్రోల్చి,
స్వాదూదకంబుల్ తగన్ ద్రావి, విశ్రాంతికై చెట్లనీడల్, గుహల్
గుండులన్ జేరి యొక్కింతసే పుండి, యామీఁద వారెల్ల రంతంతటన్
జేరుచున్ సేతువున్ గట్టి, సాయంతనంబౌట, నందందు నిద్రించి రత్యంత
మోదంబుతో; నిట్టులైదార్నాళ్లకా, సేతునిర్మాణకార్యంబు నూర్యోజనాల్
పూర్తి గావించి రాపిమ్మటన్;—

### శ్రీరామచంద్రుండు ఉడుతను లాలించుట.

వారిధిన్ దాఁటి శ్రీరాముఁ డాలక్ష్మణున్ గూడి, వెంటన్ సురా
రాతిసోదర్యుఁ డేతేర, నందందు వీక్షించుచున్ నిల్చుచున్ బోవుచో,
నొక్కచో నొక్క చిక్రోడ మావార్ధిలో మున్గి, తా సైకతంబందుఁ
బొర్లాడి, వేవచ్చి యాకట్టపై దేహ మల్లార్చి, మేనంటునా సైకతం బెల్ల
నాసందులన్ దార్చు, చీరీతి పల్మాఱు గావించుచున్నట్టి యాచిత్ర మీ
క్షించి, యాశ్చర్యమున్ బొంది రాముండు సౌమిత్రితోఁ బల్కెఁ-'గన్గొం
టివే సోదరా! నీవు చిక్రోడమున్; సేతువున్ గట్ట సాయంబుగా నెంచి,

యీరీతిగా సల్పెడిఁ జూవె! తా నెంతయో, తత్సహాయం బిదేమంత?
యం చేమిఁ జింతింప, కీరితిఁ గావించుఁబో' యన్న, సౌమిత్రి పల్కాడు-
'నో దేవ! కన్గొంటి, నీ భక్తి సేవించుచో, నల్పమే మేరుశైలంబుకంటెన్
గడుఁ దొడ్డదా! భక్తియే కారణంబౌను, వేఱేమియున్ గోర వీ' వన్న,
రాముండు సుగ్రీవునిం గాంచి, చిక్రోడమున్ దెమ్మటంచాడె, సుగ్రీవుఁ
డత్యాదరంబొప్ప నద్దాని హస్తాగ్రమందెత్తి వే తెచ్చి శ్రీరాము
హస్తంబునం దుంచె, రాముండు లో మెచ్చి హర్షించుచున్ హస్తమున్
దానిమూర్ధంబుపై నుంచి ప్రేమంబుతో దువ్వి లాలించె, నద్దాని కావెన్ను
నం దొప్పె ముద్దౌత్రిరేఖల్; రఘూత్తంసుఁ డామీఁదటన్ దానిఁ
బోవీడి ముం దేగుచుండన్ సముద్రుండు ప్రత్యక్షమై, కాన్కగా నిచ్చె
నానామణుల్, భూషణాల్, దివ్యశస్త్రాస్త్రముల్, వాని చేఁబూని
శ్రీరాముఁ డాకీశసైన్యంబులన్ గూడి యంభోనిధిన్ దాఁటి, యందున్
సువేలాద్రిపై సైన్యముల్ డించి సౌఖ్యంబుతో నుండఁగా;—

శుకసారణులు చిలుకలై వచ్చి, సుగ్రీవసైన్యంబుఁ జొచ్చుట.

లంకలో నింతవృత్తాంతమున్ జారులున్ దెల్ప నాలించి దైత్యేశుఁ డంతన్ శుకున్ సారణున్ బిల్చి 'మీ రేగి గుప్తంబుగా రామసైన్యంబులోఁ జొచ్చి, వా రెంతవారో? విధం బెట్టిదో? చూచిరం'డంచుఁ బంపంగ, వా రంతటన్ బక్షిరూపంబులన్ దాల్చి, శీఘ్రంబుగాఁ బోయి సుగ్రీవసైన్యంబులోఁ జొచ్చి, యందందు సంచారమున్ జేయుచుండంగ, గుర్తించి తా నా[1]విభీషాఖ్యదైత్యేంద్రుఁ, డావర్త్మమున్ జెప్ప, వామర్కటోత్తంసు లాపట్టిలన్ బట్టి, వే గొట్టుచున్ మొట్టుచున్ గూఁకలన్ బెట్టి, వారల్ మహాభీతి నార్వంగ, నద్దాని నాలించి శ్రీరాముఁ డేమద్ది!' యంచాడఁగాఁ గుంభకర్ణానుజుం డెల్లవృత్తాంతమున్ జెప్ప నాలించి, యారీతి వారించి శ్రీరాముఁ డవ్వారలన్ జెంత రావించి- 'మీ రేలవిచ్చేసినా'రంచుఁ బ్రశ్నించె, వారంత 'మాస్వామియౌ రావణేశుండు మీసైన్యమున్

[1] సురారాతిశమ్ముండు దైత్యేంద్రుఁడా.

గుప్తరీతిఁ బ్రవేశించి, మీ రెంతవారౌదురో కాంచిరం'డంచు, మమ్ముంప
మేమిట్లు మార్వేసముల్ దాల్చి యేతెంచినా మంచు భీతిల్లుచుఁ బల్క,
రాముండు- 'భీతిల్లఁగాఁ బోకుఁ డం చాడి సుగ్రీవుతోఁ జెప్పె-'నీవ్వారికిఁ
నీవు నీయెల్లసైన్యంబుఁ జూపించి, నేమంబుగా వెండి నీయిద్దఱిఁ దెచ్చి,
నఁ జెప్పుమీ!' యన్న, నాతండు వారిర్వురిఁ గొంచు నాసర్వసైన్యంబుఁ
జూపించుచుఁ బోవ, నందొక్కచోనున్న, యాయంజనాపుత్రునిఁ దప్పు
లఁ గాంచి వారల్ వడంకంగ, వీక్షించి- 'యేమంచు, సుగ్రీవుఁ డవ్వారిఁ
బ్రశ్నించె, వారంతభీతాత్ములై పల్కె- 'రోధీర! యాక్రోతి మాలంకలోఁ
జొచ్చి, మావారలఁ జంపి, మమ్మెల్ల మర్దించి, మాలంక వాలాగ్నిచేఁ
గాల్చె, నేమందు? మాలంకలో వీని పేరెత్తినఁ సర్వులుఁ భీతులౌ వార,
లామర్కటుండుండు నాచోటికిన్ మేమురాలే, లేమివెన్కకుఁ బోదు'
మంచన్న, సుగ్రీవుఁ డామాటకుఁ నవ్వి 'యే సుంటిఁగా! భీతి మీ కేల!
రం' డంచుఁ, గొంపోయి సర్వంబునౌ సైన్యముఁ జూపి, యాపిమ్మటఁ
వారి శ్రీరాముఁనిఁ జేర్చె, నారాముఁ డాదైత్యులఁ గాంచి- 'మాయెల్ల
సైన్యంబు సాంతంబుగాఁ గంటిరే?' యన్నఁ, 'గన్గొంటి మోదేవ! మా
వీటికిఁ మమ్ముఁ జేర్పంగదే! త్రోవలో మాకు నిక్రోతు లేకీడుఁ గావిం
తురో!' యిన్న, నయ్యంగదుఁ దోడుగానిచ్చి, యాకొంతదవ్వేగఁగాఁ
బంపె, నామీఁద యవ్వారలుఁ బోయి రాలంకకుఁ;—

శుకసారణులు సుగ్రీవసైన్యబలమును రావణునకు వినిపించుట.

సారణుండుఁ శుకుం డట్లు లంకాపురిఁ జేరి దైత్యేంద్రు నీక్షించి
సాష్టాంగముఁ సల్పి కేల్మోడ్చి భాషించి, 'ఓదేవ!—నీయానతిఁ మేము
మార్వేసముల్ దాల్చి, సుగ్రీవుసైన్యంబులోఁ జొచ్చి, సర్వంబునీక్షించు
చుండంగ, నీపిన్నతమ్ముండు గుర్తించి మాసంగతిఁ సర్వముఁ దెల్పఁగా,
వానరుల్ పట్టి మమ్మంతయుఁ గొట్టుచుండంగ, శ్రీరాముఁ డద్దాని
నీక్షించి వారించి, మా కెల్లసైన్యంబులఁ జూప సుగ్రీవుతోఁ జెప్పె,
నారీతి మేమేగి, యీసర్వసైన్యంబు నీక్షించి విచ్చేసినామయ్య! సంద్రం
బులో నీటిబొల్లించి యిన్నంచు వాక్రువ్వఁగా వచ్చివఁ వచ్చు, ధాత్రీ

రజంబంతయుఁ లెక్కఁగావింపఁగావచ్చు, సుగ్రీవుసైన్యంబు లక్షించి నిక్కంబు లెక్కింపఁగారాదు శేషాహికిన్; గాంచ వారెల్ల బలవిక్రమాఢ్యుల్ సుమీ! తేఱిచూడంగ రా దెరికిన్ వారి, నేకార్యమేన్ జేయఁగా శక్తులవ్వారలాలక్ష్మణుం డుగ్రదోర్విక్రమోపక్రముండౌను, ధర్మస్వరూపుండునై యొప్పు శ్రీరాముఁ డో దైత్యవంశాగ్రణీ! కాంచ గెల్వంగ రాదేమువారిన్, వృథావైర మిట్లేల భూజాత నర్పించుటే లెస్స' యంచాడ, నాలించి, రోషారుణాక్షుండునై దైత్యలోకేశుఁ:—'హోరోరి! మీరా మతుల్ మాకు బోధించువా' రంచుగర్జించె, వా రంత భీతాత్ములై - 'బుద్ధి! దేవా! మముఁ సైచు' మంచాడి పాదంబులన్ వ్రాల మన్నించె;-

{ లంకలో రావణుం డుత్తరగోపురం బెక్కి, రాఘవునకు సేనావైభవము చూపఁ వచ్చుట; శ్రీరాముఁడు శరలాఘవము చూపి రావణు నవమానించుట. }

ఆదైత్యుఁడా రాత్రి చింతానిమగ్నుండునై యుండి, తానాయుషఃకాలమం దక్షి మేల్కాంచి, యర్హక్రియల్ దీర్చి, భూషావళుల్ దాల్చి యామంత్రిసామంతవర్గంబు రావించి, వారెల్లరున్ గొల్వఁగా, దాసదాసీజనుల్ కోటికిన్ దాటుచున్ ఛత్రముల్ చామరంబుల్ దగన్ బట్టి సేవింపఁ, గైవారముల్ సల్పుచున్ వందులున్ మాగధుల్ వెంటరా, నట్టహాసంబుమైవచ్చి, తా నుత్తరాశన్ విభాసిల్లు చత్యున్నతంబైన లంకాపురీద్వారపున్ గోపురం బెక్కి, యందున్ విశాలప్రదేశంబునన్ నిల్చి, యాదవ్వులన్ జూడ్కి గన్పట్టు శ్రీరామసైన్యంబు నీక్షించుచున్నంత, శ్రీరాముఁ డాలక్ష్మణస్వామి సక్థిన్ దలన్ వాల్చి విశ్రాంతిమైఁ బండి తా నుండి, యాదవ్వులన్ గల్గుకోలాహలధ్వాన మాలించి, యాయంత వీక్షించి వేగన్ [1]విభీషాఖ్యదైత్యేంద్రునిన్ జేరి ప్రశ్నించె - 'నో రాక్షసాధీశ! యేమార్భటం బిద్ది? యా శ్వేతవర్ణంబులౌ ఛత్రముల్ లెక్కకున్ మించె, వింజామరంబుల్ గడున్ దోఁచె, దన్మధ్య నొప్పారు నాభూరిదేహుండు, మార్తాండతేజఃప్రభాపుంజుఁ డెవ్వాఁడు? వీరెల్ల రాచోటి కిట్లేటి కేతెంచిరో?' యన్న, 'నో రాఘవా! యాతఁ డే రావణుండయ్య! ఆదేవతల్ దానవుల్

[1]సురారాతిసోదర్యునిన్

శాన్కగానిచ్చియున్నట్టి భూషావళుల్ దాల్చి, శ్వేతాతపత్రంబులేపార, బల్ తీవిమైవచ్చె, మత్తాత్ముఁడై వైభవం బెట్టిదగా నీకుఁ జూపంగఁ, గన్గొం టివే' యన్న;—

లో నక్షోణం చట్టులేపండి, శ్రీరాముఁ డాచెంత నేయున్న విల్లందె, తా దక్షిణాంఘ్రి వదిల వింటికో పుంచి, యంగుష్ఠముల్ బూను చద్దాని బిట్టుగాఁబట్టి, డాచేత నస్త్రంబుసంధించి, వే నారిమ్రోఁగించి, పోమీలెు; నయ్యమ్ము తోల్దాల్త నొండయ్యు నామీఁద నద్దే పదుల్ నూఱులుగ వేలుగా మించి, శీఘ్రంబుగాఁబోయి, యాదైత్యసంఘంబు నం దెవ్వరిని దాఁకకే, వారిహస్తంబులం దున్న శ్వేతాతపత్రాళిని జాము రానీకముగ దాఁకి ద్రుంచంగ, ఝల్లంచుధ్వానంబులన్సల్పి, యభ్రంబు నం దవ్వినల్దిక్కులన్ బక్షులట్లాడియంతంతటన్ భూమిపై వ్రాలె, నీక్షించి దిగ్భ్రాంతుఁడై దైత్యలోకేశ్వరుండంత శీర్షంబు లల్లార్చుచున్ మెచ్చుచున్ బల్కె-'నౌరౌర! యీరేడులోకంబులన్ మేటివిల్కాఁడ వీవొక్కఁడౌ దయ్య!నిన్ మెచ్చఁగావచ్చు' నంచాడుచున్ ఖిన్నుఁడై వెంటనే డిగ్గి యాగోపురాగ్రంబునందుండి, నాయెల్లరున్దన్ను వెన్నాడ, నంతఃపురిన్ జేర వేవేగ మేపోయెు;—

## అంగద రాయబారము

శ్రీరాముఁ డామీఁదటన్ వానరానీకమున్ గాంచి భాషించు-'నోధీరులారా! యిదే మేము లంకాబహిస్సీమ కేతెంచినా, మైన ధర్మం బగున్ దాడికిన్ ముందుగా దాయతో సంధి సల్పంగ, సామంబు దానంబు భేదంబు దండంబునా నాల్గుమార్గంబులన్ వైరిసాధింపఁగా నీతిశాస్త్రంబు వాక్రుచ్చు, నట్లౌటచే రాయబారంబు మే మంపఁ గానొప్పగున్; జెప్పుఁ డెవ్వారలన్ బంపవా' నన్న, సుగ్రీవుఁ 'డేఁ బోదు' నం చాడె, నీలుండు నాయంగదుండున్ హనూమంతుఁడున్, దమ్ముఁ బంపంగఁ బ్రార్థించి ర ష్టారఘూత్తంసుఁ డిట్లాడు 'సుగ్రీవుఁ డో, రాజు తానౌటచేఁ బంపరా దాలనిన్, వాయుపుత్రుండు ము న్నేగి యుండెన్ గదా! న్యాయశీలుండు

దోర్విక్రమోపక్రముం డంగదుం డొప్పు నిప్పట్టునఁ సంధి గావింపఁగా నన్న,- సుగ్రీవుఁ 'డౌఁగాక!' యంచాడి, తా నాజ్ఞ నవ్వానికిచ్చెఁ, దగఁ రాముఁ డయ్యంగదుఁ జేరి యిట్లాడు- 'నో ధీయుతా! రావణుఁ జేరి యుక్తప్రసంగంబు గావించి,భూజాత నర్పింపఁగాఁ జెప్పి, సాధ్యంబ యేనిఁ వెసఁ యుద్ధముఁ మాన్పఁగాఁ జూడుమా! పోయిర' మ్మన్న, నయ్యంగదుం డంతఁ జిత్తం బటంచాడి, శ్రీరామసౌమిత్రిసుగ్రీవపాదం బులఁ వ్రాలి, తాఁ బెద్దలౌ వారికిఁ మ్రొక్కి, చేతఁగదఁ బూని వే ఁజివ్వునఁదాఁటె నాకాశమార్గంబునఁ బోవఁగఁ;—

లంకలో మంత్రి సామంతులుఁ దండనాథుల్ మఱిఁ మిత్రులుఁ బుత్రులుఁ భృత్యులుఁ నిండుకొ ల్వుండ, సంగ్రామకార్యక్రమాలోచనా మగ్నుఁడై సింహపీఠంబునం దుండి తా నాదశగ్రీవుఁ డవ్వారితో భాష ణల్ సల్పుచుండంగ, నాకాశభాగంబునందుండి యవ్వాలిపుత్రుండు వే ఁజివ్వునఁడిగ్గి, చేతఁగదఁ బూని, తా నాసభాస్థానమధ్యంబునఁ నిల్చి, నల్దిక్కు లీక్షించి దైత్యేంద్రునిఁ గాంచి, శీర్షంబుపంకించి, యాఁముం దఱిఁ వాలముఁ మించఁగాఁ బెంచుచుఁ జుట్టగాఁజుట్టి, యెత్తైనపీఠంబు గావించి, యద్దానిపై ఠీవిమైఁ దాను గూర్చుండ, నాయంగదుఁ గాంచి యాశ్చర్యముఁ బొంది, దిగ్భ్రాంతులౌచుఁ లభాస్తారు లవ్వాని వే చూచి, రాదైత్యలోకేశుఁ డావానరశ్రేష్ఠునిఁ గాంచి కోపంబునఁ గీటుచుఁ బండ్లఁ గ్రుడ్లెఱ్ఱగాఁజేసి, రుద్రుండునై గర్జనన్ సల్పుచుఁ బల్కు;—

'ఓమర్కటా! కాంచ నీ కెంత గర్వంబు? నిర్భీకుఁడై శత్రుమధ్యం బునఁ నిల్చి తయ్యారె! ప్రాణంబుపై నాసఁ బోనాడితో? కావరంబో? కదుఁ బిచ్చివాఁ డౌదువో? కానిచో, నాదుసోదర్యున ట్లీవునుఁ బ్రీతిఁ బ్రాణార్థమై, నన్నుఁ బ్రార్థించి జీవింపఁగా నెంచి విచ్చేసితో? నీదు నూరేదొ? పేరేదొ? నీ వెవ్వఁడో? పల్కు'మం చన్న, నాయంగదుం డల్ల నఁ నవ్వి శీర్షంబునల్లాచుఁ బల్కు:-'నో రావణా! మున్ను నఁ గానవో? విస్మృతిఁ గంటివో? మద్యముఁ ద్రావినావో? కనఁ బుద్ధి స్వాధీనముం

దూఁపవో? నన్ను గుర్తింపవో? మించి గుర్తించియున్ గూడ నీ విట్లు వర్తింతువో? కానిలె మ్మెట్టులో; విన్ము నేఁడెల్పెదన్, నిన్నుసప్తాంబుధుల్ ముంచి, వాలంబునన్‌గట్టుచున్ దెచ్చి, మాతండ్రి యావాలి, నాతో ట్లకున్‌గట్టఁగా బాపఁడా నేను నిన్ వింతయాపుర్వుగా నెంచి, నీముక్కు పట్టిద్వానే? నొప్పిచే నీవు రోదింపవే నాఁడు? నావీరవర్యుండునౌ వాలి పుత్త్రుండ, నే నంగదుండన్ జుమీ! జ్ఞప్తికిన్ దెచ్చుకొ'మ్మన్నఁ, దా మందుచున్ రావణుం డాడెడిన్;—

'వాలిపుత్త్రుండవా నీవు? నిక్కంబు నాచేతిలోఁ జిక్కినా, వెట్లు నన్ దాఁటిపోలే,విదే లిట్టులన్ బ్రేలెదో! దుర్మతీ! మొన్న నీలంక కేతెంచి యుండెన్ హనూమంతుఁడన్ గ్రోతి, మావారలున్ వాలమున్ గాల్చి పోవీడినన్ బాఱిపోయెన్‌గదా, వాఁడునున్నాఁడె? నీ పట్టులేచేయఁగా నెంచి, విచ్చేసినా వేమొ? నే, నీపనిన్‌గందు' నం చాడఁగా, నంగదుం డప్డు భాషించు,- 'విన్మా! హనూమంతు నానాఁడు సుగ్రీవుసైన్యంబు నందున్ మహావీరులౌ వానరుల్ పట్టి-"లంకాపురిన్ జొచ్చి, నీవైరిచేఁజిక్కి వాలంబుఁగాల్పించుకొంటే? యపఖ్యాతి మాకెల్లనున్ దెచ్చితే? లంక వాలంబుతోఁజుట్టి యాగట్టు రాపీకి, నీచట్టియద్దానిఁ దేలేకపోతే? దశగ్రీవునిన్ బట్టి మట్టేయ లేవైతె? ఛీ!" యంచు, నావానరున్ జెంపలన్ గొట్టి, ఛీకొట్టిరో రావణా! వానరానీకమందా హనూమంతుఁడొక్కండు, నే నొక్కఁడన్ జేతఁగానట్టివారుంటి, మట్లౌట మ మ్మిట్టిస్వల్పంబులౌ కార్యముల్ సేయనేమించు సుగ్రీవుఁ' డంచన్న, లో విస్మయంబంది దైత్యేశుఁ డాయంగదున్ జూచుచుండంగ, నవ్వాలిపుత్త్రుండు తాఁ గ్రమ్మఱన్ బల్కు; 'నో రావణా! రాముఁడంపెన్ జుమీ! రాయబారంబునై, వీడు మీగర్వమున్, సీత నర్పించి శ్రీరామునర్థించి జీవింపుమీ! లంక నీవింకఁ బాలింపఁగా లేవు, నీపిన్నతమ్ముండె యీలంక నేలంగ శ్రీరామచంద్రుండు గట్టెన్ జుమీ! పట్టమున్; జెప్ప నీకింతగా బుద్ధి నన్నంపె, నో రాక్షసా! వీడు దుర్బుద్ధి; వైదేహి నర్పింపుమా! పాపకర్మంబులన్ సల్పి,

నిర్భాగ్యుఁడవై పోతివే! రామునితో వైరమా! సాహసం బిద్ది, మోడిం పుమా! నిన్ను నీశస్త్రముల్ ద్రుంచు శ్రీరామబాణంబు నీకంతముగా పోఁకిరియై యున్న, నీపాటి కిట్టింపు నీవుందువే? నే నిటుల్ సంధికై వచ్చి నీమోహము నీక్షింపఁగా నుంటినే! శ్రమఁ జాతంబు మన్నించినాఁ డింత నీబుద్ధి నూహింపుమా! పాపకార్యంబుఁ గావించి చేసేత నీపాటు నీ విట్టులన్ దెచ్చుకొన్నావు. బ్రహ్మప్రసాదంబుచే మేల్వరంబుల్ నిచ్చగా గాంచనం చెంచి గర్వించితో? మూర్ఖ! యా బ్రహ్మరుద్రాదులే వచ్చి రక్షింపఁగా నిల్చినన్, రాముఁడే యుద్ధినన్ నిన్ను ఖండించు, నీశీర్షముల్ ద్రుంచు సత్యంబు; నానీతిలో నెంచి, భూజాతనర్పించి, నీప్రాణముల్ గాచుకొమ్మన్న, వాలంబుపైఁ ద్రొక్కఁగాఁబడ్డ కాలాహిలీలన్ గడునారోషమునన్, దైత్యనాథుండు గర్జించు నీకేతి;-

'నోరోరి! యామానవుండా నరున్ జంపు! నా క్రోతులా, మమ్ము నిర్జించువారౌర! నే నెవ్వఁడం చెంచితో? దేవగంధర్వసిద్ధామరవ్రాతముల్ దంచి, కైలాసశైలంబు నాబాహువీర్యంబునన్ బట్టిపైకెత్తి యుట్టూఁత లూఁగించి, యింద్రాదులన్ గెల్చి, వెల్గొందువాఁడన్ జుమీ! ధాత లో మెచ్చినాకిచ్చె దివ్యాయుధంబుల్ వరంబుల్, గనన్ భర్గుఁడే యిచ్చెఖడ్గంబు, నాపాటివా రుందురే? యీనరుల్ వానరుల్ మమ్ముఁ బోకార్తురే? చాలుపో, దుర్మదా! సంధియా నాకు నల్పాత్ములై నట్టిమీతోడ? నత్తైనచో నవ్వరే దేవతల్?—

'భావ్యమే నీకు, నోయంగదా! రామునిన్ గొల్వఁగా? సిగ్గుకాదే! మహాశూరుఁడౌ వాలికిన్ బుత్రుఁడై తండ్రివైరంబు దీర్పంగ నీకొప్పదే? రమ్ము నాతోడుగాఁ జేసు; పై నిర్వు రవ్వారలన్ జంపి హర్షింతుమో ధీనిధీ! విక్రమాఢ్యుండవీ వెన్నఁగన్, రామునిన్ బెద్దగాఁ జెప్ప కీర్తింతువే? లోన భీతిల్లితో? యౌర! యా రామశౌర్యంబు నేమందు బో? ప్రాఁతదౌ భర్గువిల్లంచె, నా యాఁటదౌ తాటకన్ గూలిచెన్, ఆ శిలన్ నాతి గావించి తా యక్షిణిన్ జేసెగా? ఛాపనిన్ జామదగ్నిన్ ధరన్

గాల్చి, బల్ వృద్ధశౌ దూషణాఖ్యుల్ ఖరున్ గూల్చి, మారీచుఁడన్ జింకఁ బోకార్చి, నాక్రోశియై వాలిఁ గూలంగఁ జేసెన్ గదా! వారిధిన్ గట్టెఁబో? విక్రమంబార! యామహాశ్చర్యంబు! - నన్ గానవో? చెప్పఁగానైన విన్నాఁడవో లేవో! నాపేరు విన్నన్ వడంకున్ గదా, లోకముల్! దేవతల్ చూడ దాసుల్ సుమీ, నాకు! నీవారిధీశుండు నాయాజ్ఞ వర్తించు, నారాముఁ డేమంత కార్యంబు సాధించె? నాముల్లు నీ వింతగాఁ జెప్పచున్నా' వటంచుం జెప్పి, నామంగళుండా తఁడు;—

'నోరోరి! శ్రీరాముఁ దూషించెదే క్రూరకర్ముండవై? తుచ్ఛుఁడా నీకు నా దేవదోర్విక్రమం బెట్టిదో గంగనా? దుర్మతీ! బ్రహ్మరుద్రాదులే కానరాసత్యమున్, దానవాధీశ! పుట్టింప గిట్టింప, సర్వంసహాధాత్రి, తానొక్కఁడే శక్తుఁడౌ జిష్ణు, యాసోమకున్ జంపి వేదంబులన్ వేధ కర్పించె నెవ్వండో? యామీనమత్స్యంబు రాముండు; భూదేవినిన్ గోటిపై నెత్తి రక్షించె నెవ్వండో, యాయాదికూర్మంబు రాముండు; క్రూరాత్ముఁడౌ నాహిరణ్యాక్షు శిక్షించె నెవ్వాఁడో, యా శ్రీవరాహంబు రాముండు; ప్రహ్లాదు రక్షింప స్తంభంబునం దుద్భవంబైన శ్రీనారసింహుండు రాముండు, దైత్యేశ్వరుండౌ బలిన్ ద్రొక్కి పాతాళమున్ జేర్చి, స్వారాజ్య మాదేవతానేత కర్పించెనో యెవ్వఁ, డావామనస్వామి రాముండు, బల్ రాజసం బొప్ప నున్మత్తులౌ రాజులన్ ద్రుంచి సంగ్రామదక్షుండునా వెల్గు, నాజామదగ్న్యుండు రాముండు బుద్ధుండు రాముండు, కల్కిస్వరూపుండు రాముండు, బోధించితిన్ సత్యమున్ నీకు; నాతండ్రికీవెన్నఁగా మిత్రుఁడై యుంటి వాకూర్మిచే నింత విన్పించితిన్,- రావణా! నమ్ము నామాట- ముమ్మాటికిన్ జెప్పెదన్, సీత నర్పించి శ్రీరాముతో సంధినర్థించి, నీవారలన్ గాచి, నీలంక రక్షించి, నీప్రాణముల్ గాచుకో;—

నన్ను, నిన్ గూడి శ్రీరాముతోఁ బోరరమ్మందువే? యేలదుర్బుద్ధి? నీతోడ నేరాను, నాతోడ విచ్చేయుమా! యుర్వరన్ బోయి ప్రార్థింత మా దేవునిన్,- రాముఁడో, దీనరక్షాసుదీక్షుండు, నార్తావనుండౌట-

మన్నించి నీకు గాచు, భూజాత నర్పింపుమా! మూర్ఖుండవౌచుఁ జెడకఁ
బోకుమా! నాహితంబింతె లోఁగొనుమా!' యన్న, దైత్యేశ్వరుం డాగ్ర
హోదగ్రుఁడై మించి, దీప్తాయతా జ్వాల లాయకములఁ గ్రక్కుచుఁ
వాలుమ్మటిం జూచ్చుచుఁ బల్కె:- 'ఓ రాక్షసశ్రేష్ఠులారా! వేగ వీనిఁ
బట్టుఁడీ! కట్టుఁడీ! కొట్టుఁడీ! చించి చెండాడుఁడీ!' యన్న, నా రాక్షసుల్
లక్షకోట్లొక్కుమ్మడిఁ లేచి, ఖడ్గంబులుఁ, శూలముల్, పట్టిసల్, భిండివాలం
బులుఁ బట్టి యయ్యంగదుఁ బట్టనుంకింప;—

అవ్వాలిపుత్త్రుండు శీఘ్రంబుగా దైత్యలోకేశుకీర్తాళిపై దూఁకి, తా సావలల్ ద్రొక్కి, భూమిఁ గిరీటంబులఁ డొల్లఁగాఁ జేసి, బిట్టార్చి, పట్టేచ్చి, యిట్టట్టుగావించి యాఁతేనిమర్దించి, విభ్రాంతులై తన్ను నారక్కసుల్ చూడ, నభ్రంబునుఁ ఆవ్వాడఁ జేరంగా; దానవుల్ పోయి యాకాశభాగంబునం దాతనిఁ బట్టి, ఖల్ శూలముల్ గ్రుచ్చుచుఁ గ్రుద్ధులఁ దంచుచుఁ బెద్దగాఁ బోర, వాయుంగదుం డంతఁ గోపించి, యాదైత్యులఁ గాళులఁ జేతులఁ వాలమూలంబునఁ బట్టుచుఁ గట్టుచుఁ గొట్టుచుఁ నేలకుఁ బెట్టి, తా నంతటఁ బోయి శ్రీరామపాదంబులకు వ్రాలి, యేత త్సమాచార మాద్యంతమునుఁ జెప్ప, నాలించి రాముండు సుగ్రీవు నీక్షించి భాషించు;—

{ శ్రీరామచంద్రుండు, యుద్ధమున కాజ్ఞ నిచ్చుట; వానరరాక్షసుల మొదటినాటియుద్ధము. }

'యుద్ధంబె గా కింక గత్యంతరం బొండు లేదయ్యె, నీ లంకనుఁ ముట్టడింపంగ, సైన్యమ్ములఁ బంపుమీ! యప్రమత్తుండవై యుద్ధకార్యంబుఁ గైకొనుమీ!' యన్నఁ, జిత్తంబటం జూడి సుగ్రీవుఁ, డంతఁ నలుఁ నీలునిఁ జాంబవుఁ, వాయుపుత్త్రాదులఁ గాంచి, తా నానతిచ్చెఁ, వెసఁ సైన్యములఁ గొంచు నాలంకఁ, నర్దిష్కులఁ ముట్టడింపంగ; నావెంట నవ్వార లాలంకదిగ్భాగముల్ చుట్టి, కోటల్ విదారించుచుఁ, వహ్నినంటించుచుఁ, వాకిళుల్ చీల్చుచుఁ, మించియాఁర్భాటముల్ సల్ప, నీక్షించి యాలంకలో రాక్షసశ్రేణి కాదైత్యలోకేశుఁ డాజ్ఞాపచస్సి

య్యేఁగా, యుద్ధముఁ జేయ సన్నద్ధులై వారు శస్త్రాస్త్రముల్ దాల్చి, వేదండతండంబులున్ వాజు లుష్ట్రంబులున్, సింహశార్దూలముల్ వాహనాల్ గాఁగ నారూఢులై, భేరులున్ మ్రోఁగ, శంఖారవంబుల్ మహాకాహళధ్వానముల్, వీరనాదంబులున్, వాజిహేషారవంబుల్, భుజాస్ఫాలనారావముల్, గర్జనల్ భర్జనల్ గూడి, యొండొంటి నాదంబు బ్రహ్మాండముల్ నిండ, లంకాపురీదుర్గమందుండి విచ్చేసె రక్షస్సమూహంబు, లావిష్మటన్ రెండుసైన్యంబు లొండొంటితో వాఁక, దిగ్వీథి నాదేవతల్ వచ్చి వీక్షించి రాయుద్ధ మాశ్చర్యమగ్నాత్ములై;—

తుంటలౌ వింట్లు, ఖండింపఁగాఁ బడ్డహస్తంబులున్, జెక్కఁగాఁబడ్డ జంఘోరువుల్, ద్రుంచఁగాఁబడ్డకంఠంబులున్, శూలముల్ గ్రుచ్చఁగాఁ బడ్డడొక్కల్, ధరన్ గూల్పఁగాఁబడ్డశీర్షంబులున్, బీకఁగాఁబడ్డ నేత్రంబులున్, గోయఁగాఁబడ్డవౌ, నాల్కలున్, రాల్పఁగాఁబడ్డకోటీరరత్నంబులున్, జీల్పఁగాఁబడ్డదంతావళుల్, కూల్పఁగాఁబడ్డగుఱ్ఱంబులున్, వ్రక్కలై యున్న తేరుల్, మఱిన్ బ్రక్కలన్ జెక్కఁగాఁబడ్డ శార్దూలముల్, ముక్కలై యున్న శస్త్రాస్త్రముల్, నిండి యొండెందునన్ రక్తపున్ గాల్వలే పాఱఁగా, నా ప్రవాహంబునన్ మాంసపున్ ముద్దలున్, శల్యపున్ బంజరాల్, తేలియాడంగ, సంగ్రామరంగంబు భీభత్సమైయొప్పె, బల్ ప్రేతముల్ భూతముల్ శాకినుల్ ఢాకినుల్ గూడి సంచారముల్ సల్పె, నానాఁటియుద్ధంబునన్ దైత్యులే మ్రగ్గి రేమాయయో కాని, యావానరానీకమం దొక్కరున్ జావ, కవ్వారలెంతో విజృంభించి హర్షించుచున్ జోరి రత్యంతమున్;—

రావణుండు మహాపార్శ్వాదియోధులను, యుద్ధమున కంపుట.

వారు లేతెంచి యానాఁటిసంగ్రామమం, దెల్లరక్షస్సమూహంబు, నిర్నామమై పోవుటల్ దెల్ప, దైత్యేశుఁ డాశ్చర్యమున్ బొంది, యొక్కింతచింతించి, హెచ్చుకోపంబు రేకెత్తఁగాఁ జీరి, రప్పించె వేగన్ బ్రజంఘాఖ్యు, ధూమ్రాక్షు, మహోదరున్, గంపనున్ గర్జకేతున్.

మహాపార్శ్వుఁ, గుంభుఁ, నికుంభుఁ, విరూపాక్షు, సుప్తఘ్ను, నా వజ్రనాభుఁ, మహాకాయునిఁ, గాలదంష్ట్రుఁ, మఱిన్ గ్రూరులైనట్టి యోధాగ్రగణ్యుల్ వేగ రాగ, నీక్షించి భాషించు. 'మీరెల్ల మీ సైన్యముల్ గొంచు యుద్ధావనిన్ జేరి, క్రుద్ధాళులై పోరి, యావానరానీకమున్ ద్రుంచి, యా రాఘవద్వంద్వమున్ జంపి, వీరకీర్తి దిగ్దేశముల్ నిండ రం, డింకఁ బొం' డంచు నాడంగ, దివ్యంబులౌ బాణతూణీరముల్ పూని, హర్షంబునన్ గంధమాల్యాంబరాశేషభూషావళుల్ దాల్చి, వారెల్లరున్ బెండ్లికై పోవువారట్లు మోదించుచున్, స్యందనారూఢులై సారథుల్ వేగ రథాశ్వంబులన్ దోల, వాద్యాదు వేర్వేఱుగా వారిసైన్యంబులన్ గొంచు మున్ముందుగన్ యుద్ధవాద్యంబులేపారఁగా, సింహనాదంబులన్ సల్పుచున్, భీకరాకారులై యట్టహాసంబులన్ మీఱి, నేలీనినట్లెల్లెడన్ సైన్యముల్ గూడిరా, నేగి యుద్ధావనిన్ జేర, నీక్షించి యత్యుగ్రులై వానరశ్రేష్ఠు లామొల్లసైన్యంబులన్ గూల్చి, వృక్షంబులన్ రువ్వుచున్ శైలముల్ వైచుచున్ దాఁక నారెండుసైన్యంబు లావేళ వారాసులొండొంటితోఁ బోరినట్లుండె;—

ఆపిమ్మటన్, మొండెముల్ దుండముల్ బంతుల ట్లభ్రదేశంబునన్, లెక్కలేకుండఁగా నాడె, నాకౌకఘూకంబు లాకాశభాగంబునందున్ విమానంబులట్లాడె; నొండొందు బాణాస్త్రలేపారె, ఖడ్గంబు లొండొంటితోఁ దాఁకి, క్రొక్కారుమెఱుంగుల్ బలెన్ జూడ్కికిన్ జిఱ్ఱ్వచూపారెఁ; నావింటిటంకారముల్, భేరిభాంకారముల్, వీరహుంకారముల్ వాజిహేషారవంబుల్ ధరాకాశముల్ నిండె, నారీతి నారెండుసైన్యంబు లాహారనిద్రాదులన్ మాని, కొన్నాళ్లహోరాత్రముల్ ఘోరమై తీరికల్ మానిపోరాడ, నానాఁటికిన్ దైత్యసైన్యంబులున్ జచ్చి సన్నంబులై పోయె; నానిల్వ కొంచెంపు సైన్యంబు ప్రాణేచ్ఛమైపాఱె, నల్దిక్కులన్ బట్టి హా! హా! యటం చార్చుచున్;—

భారులన్ లంకలోఁ జొచ్చి, దైత్యేశ్వరున్ దాఁచి, కేల్మోడ్చి

విన్పించి రీరీతిగన్- 'దేవ! ధూమ్రాక్షుఁడో చచ్చె, దేవాంతకుం డీల్గె, వ్రగ్గెన్ బ్రజంఘుండు, వ్రంచెన్ ద్రిశీర్షుండు, నాకంపనుం డేగె, సుప్తఘ్నుఁడున్ గూలె, యూపాక్షుఁ డీల్గెన్, మహాపార్శ్వుఁడున్ జచ్చె, నావజ్రనాభుండు ధాత్రీస్థలిన్ వ్రాల్గెఁ, గుంభుండు నుగ్గయ్యె, నాకాల దంష్ట్రుండు నూచయ్యె, స్వామీ! మహాకాయుఁ డీలోకమున్ వీడె, సంగ్రామరంగంబునందున్న యావచ్ఛేషంబు దైత్యసైన్యంబు నీఱయ్యె, నీలతుపుత్రౌఘమం దొక్కఁ డీమేఘనాదుండు మాత్రంబు ప్రాణంబుతో నిల్చె' నంచార్వఁగన్;—

మేఘనాదుఁడు యుద్ధమునకుఁ బోవుట.

విస్మయంబంది దైత్యేశ్వరుం డాత్మలోనొచ్చి బల్ విన్ననౌ మోమునన్ బ్రక్కనేయున్న యా మేఘనాదున్ విలోకింప, నాయింద్రజిత్తంత నాటోపమేపారఁగాఁ దండ్రితోఁ బల్కె- 'నోతండ్రి! నీ కేటి కిభ్రీతి నేనుండఁగా? తేఁడ! వీరాదివీరుల్ మహాశూరులౌ దైత్యులీనాఁడు నిర్మూలములై పోయిరే క్రోతులన్ దాఁకి? యౌరౌర! కానిమ్ము, నేఁబోదు, నా రామునిన్ లక్ష్మణున్ ద్రుంచి విచ్చేసెదన్, జూడు నా శౌర్యమున్ వీర్యమున్, విక్రమాటోపమున్, దండ్రి! నీ విట్టులన్ మోమువాడ్చార జింతింపఁగా నేటికో? యాత్మజుల్ చచ్చుటన్ జేసి లోఁ గుందుటన్ గందెనో మోము! నీవీరసైన్యంబు నిర్మూలమౌ టెంచి నిర్వీర్యతన్ గ్రుక్కితో? తక్కుతో ధైర్యమున్? చచ్చువారిన్ దలంపెంచి శోకింతురే ప్రాజ్ఞులున్? వీరవర్యుండవే? శూరలోకాగ్రగణ్యుండవే! ముందు కార్యంబు సాధింపఁగాఁ జూడు' మంచాడి, తా డిగ్గునన్ లేచి శస్త్రాస్త్రముల్ దాల్చి, వే వచ్చి యా తండ్రికిన్ మ్రొక్కి, యెంతేనియున్ సైన్యముల్ గూడి రాఁ, గాలకాలుండునా దోఁపఁగా భీకరాకారుఁడై గర్జనల్ సల్పుచున్ బోయె నా దేవతల్ భీతులై, హా! యటం చార్వఁగన్;—

మేఘనాదుఁడు బ్రహ్మాస్త్రముచే రామలక్ష్మణులను వానరసేనను మూర్ఛఁగొలుపుట.

ఆమ్మహాదైత్యపుత్రున్ విలోకించి సుగ్రీవసామీరు లాజాంబ

వంతుండునుఁ సైన్యములఁ గూడి డాఁకంగ, పోరాడె శస్త్రాస్త్రములఁ
పుచ్చుచుఁ, వానరుల్ శైలములఁ దెచ్చివైవంగ, ఖండించు నస్త్రంబుచేఁ
దుండ్లగాఁ; వానరుల్ దువ్వృక్షంబులఁ జెక్కు వేముక్కలౌనట్లు; వెం
వెక్కి యొందెందునఁ దానయై, మృత్యురూపంబుగా వానరానీకముఁ
గొట్టి, వీక్షించి శ్రీరామసౌమిత్రు లస్త్రంబులఁ దాల్చి పోరాడి రత్యంత
చిత్రంబుగాఁ; బుచ్చుబాణంబు లానచ్చుబాణంబులఁ ద్రచ్చుబాణంబు
లఁ ద్రెంచి యొందెందునఁ దోఁచె, నెవ్వారివో యన్విగుర్తింప
రాకుండెఁ, గాలాగ్నులైమించె బాణాగ్ను, లావా! యటంచార్పుచుఁ
గూలుగాత్రంబు లవ్వారిగానుండె, శ్రీరాముఁ డాయంత నత్యుగ్రుఁడై,
రాక్షసానీకముఁ ఘోరబాణంబులఁ జిక్కులఁ జెక్కుచుండంగ,
వీక్షించి యమ్మేఘనాదుండు దిగ్భ్రాంతుఁడై యింత చింతించి యాటోప
మేపార బ్రహ్మాస్త్రముఁ బ్రసంధించి బ్రహ్మాండమల్లాడఁగాఁ బుచ్చినఁ,
ఘోరదావాగ్నులఁ గ్రక్కుచుఁ దిక్కులఁ బిక్కటిల్లంగ నార్భాట
ములఁ జేయుచుఁ వచ్చి సుగ్రీవసైన్యంబునఁ జొచ్చి, శ్రీరాముతోఁ
దమ్ముతోఁగూడ నాసర్వసైన్యంబుఁ నేలకుఁ బెట్టె; - శ్రీబ్రహ్మచేతఁ
వరంబొందియున్నట్టి సామీరినిఁ, బ్రహ్మమంత్రప్రభావంబునఁ వెల్గు
వాఁడౌ సురారాతి సోదర్యునిఁ మాత్ర మాయస్త్రరాజంబు స్పృశ్యింపఁ
బోకుండె; నావానరుల్ నేలపైఁ గూల హర్షించుచుఁ మేఘనాదుండు
రక్షస్సమూహంబుతోఁ బోయి నేతత్సమాచారముఁ దెల్పఁగఁ
దండ్రికిఁ;—

## హనుమంతుఁడు సంజీవకరణిం దెచ్చి శ్రీరాఘవులను కపిసైన్యమును, మూర్ఛఁ దేల్చుట.

బిమ్మటఁ రాత్రియుద్ధావనిఁ వాయుపుత్రుండు, నాకుంభకర్ణా
నుజుఁ గూడి ధాత్రిస్థలిఁ వ్రాలియున్నట్టియవ్వానరలం దేరు జీవించిరో,
యేరు ప్రాణంబులఁ బాసిరో! కాంచునాకాంక్ష, గాఢాంధకారంబునఁ
దివ్విటీల్ పూని శోధించుచుఁ బోయి, కేశంబులఁ ముట్టుచుఁ దట్టుచుఁ
జీరుచుఁ. రక్తమాంసంబులఁ గ్రోలుచున్నట్టివౌ శాకినీఢాకినీ భూత

వేతాళసంఘంబులన్ దోలుచున్ బోయి యందొక్కచో నేలపైఁ బ్రాలి
యున్నట్టి యాజాంబవంతున్ విలోకించి వేగన్ [1]విభీషాఖ్యదైత్యేంద్రుఁ
డిట్లాడు:- 'ఋక్షేశ్వరా! ప్రాణముల్ గల్గియున్నాఁడవే? వానరుల్ రాఘ
వుల్, మూర్ఛమై వ్రాలియున్నార, లిం కేయుపాయంబునన్ జేల్పఁగా
నేను వెల్పంగదే!' యన్న, నాజాంబవంతుండు, లోనొచ్చి, నిట్టూర్పు
పోఁబుచ్చి, భాషించు- 'దైత్యేశ్వరా! కన్నులన్ నేఁడు నాబాణముల్
గ్రుచ్చుటన్ జేసి వీక్షింపరాకుండెఁ గా, చెప్పుమా! జీవితుండౌనె యవ్వా
యుపుత్రుండు పల్కాఁడుమా!' యన్న, దైత్యేశ్వరుం డాడు:- 'నోధీవరా!
రాము నేమంబు సౌమిత్రి నేమంబుఁ బ్రశ్నింపవే? రాజుసుగ్రీవుసౌఖ్యంబు
నాసింపవే? వాయుపుత్రున్ విచారింతువేలా? మహాశ్చర్యమైతోఁచె
నంచన్న, నాజాంబవంతుండు- 'దైత్యేశ్వరా! యెవ్వరేమైనఁగానిమ్ము,
సామీరిమాత్రంబు ప్రాణంబుతో నుండెనా చాలు, వాఁ డెల్లరన్ బ్రోచు,
విన్పింపుమా! మాహనూమంతుఁ డున్నాఁడె నేమంబుగా?' నన్న, నా
ప్రక్కనే యున్నసామీరి తాఁ గ్రక్కునన్ జాంబవంతున్ సమీపించి,
తత్పాదముల్ బట్టి- 'యున్నాఁడ సౌఖ్యంబుగా నీకృపన్, నాకు నేమాజ్ఞ'
యంచన్న, వాతాత్మజున్ జేరఁగాఁదీసి యాజాంబవంతుండు. 'నోపావనీ!
వేగ నీవేగి, యాయుప్పుసంద్రంబులంఘించి, యాశీతశైలంబు, నావెండి
కొండన్ మఱిన్ శ్వేతశైలంబులున్ దాఁటి, యానేఁటిసంద్రంబులంఘించి,
ద్రోణాద్రిమధ్యంబునందున్న సంజీవనాభిఖ్యదివ్యౌషధిన్ దెచ్చి, శ్రీరాఘ
వద్వంద్వమున్ దేర్చి, సైన్యంబులన్ గాచి, సత్కీర్తి నార్జించి, నీస్వామి
కార్యంబు సాధింపుమా!' యన్న, సామీరి యంతన్ మనోవేగియై యభ్ర
మార్గంబునం దేగి యారాత్రియే వచ్చి దివ్యౌషధాద్రిన్ దలన్ దాల్చి;
యంతన్ నలుం డేరి సంజీవనిన్ గొంచు నద్దానితో, రామసౌమిత్రులన్
వానరానీకమున్ వే స్పృశింపంగ, వారందఱున్ మూర్ఛలన్ దేఱి,
రాపిమ్మటన్ పర్వతంబున్ దదాస్థానమున్ జేర్చి విచ్చేసె సామీరి;—

1 ఘోరారాతితమ్ముఁడుపల్కాఁడు.

శ్రీరామసౌమిత్రులున్ వానరశ్రేణితోఁ జచ్చిరంచన్న నయ్యింద్రజిద్వాక్యముల్ చల్లఁగా వీనులన్ సోఁక, హర్షించి యుప్పొంగుచున్ హాయిగా దైత్యలోకేశుఁ డా రాత్రి సౌఖ్యంబుగా నిద్రతోఁ బుచ్చి, తాఁ బ్రొద్దునన్ లేవఁగాఁ, జారుఁ డొక్కండు విచ్చేసి- 'లంకేశ్వరా! రామసౌమిత్రులున్ వానరుల్ నిన్న నేచచ్చి యీనాఁడు జీవించి, వారెల్లరున్ యుద్ధసన్నద్ధులై వచ్చి, సంగ్రామరంగంబునన్ వేఁచియున్నా'రనన్, వాఁడు దిగ్భ్రాంతుఁడై 'చచ్చి వారెట్లు జీవించిరో? రాముఁ డామంత్రమున్ నేర్చెనో? తంత్ర మేచేసెనో? అందఱున్నట్టు లాతండు దేవుండో? ఆశ్చర్యమాశ్చర్య మీచిత్ర మెన్నంగ, మత్సర్వసైన్యంబు నిర్మూలమాయెన్, గటా! యక్షగంధర్వసిద్ధామరవ్రాతమున్ లెక్కకే లేని దోర్విక్రమప్రక్రమాగ్రేసరుల్ దైత్యవంశోత్తముల్ ధాత్రిపైఁ గూలి నిర్నాములై పోయిరే!' యంచు నొక్కింత చింతించి, దర్పంబు లోనెంచి ధైర్యంబు దీపింప నవ్వారి కిట్లాడు;—

కుంభకర్ణుని నిద్రాభంగము; వాఁడు యుద్ధముఁ జేయఁబోవుట.

'నాతమ్ముని న్గుంభకర్ణాఖ్యునిన్ లేపరే! యామహావీరుఁ డివ్వారలన్ జంపఁగా శక్తుఁ' డంచాడె, నామాటపైఁ బోయి రాక్షసుల్, నిద్రలోనున్న యాకుంభకర్ణాఖ్యునిన్ లేపఁగన్; బోయి, యాదైత్యసద్మంబునన్ జొచ్చి గాఢంబుగా నిద్రలోనున్న యాకుంభకర్ణాఖ్యునిన్ డాసి, నిస్సాణభేరీమృదంగాదివాద్యంబులన్ మ్రోఁగఁగాఁ జేసి, వారెల్లరున్ గూయుచున్ గంతులన్ వైచి, రాభీకరధ్వానముల్ సోఁకుటన్, దిగ్గజశ్రేణికర్ణాంతరాళంబులున్ బీటలై పాఱె, నట్లయ్యు నద్దైత్యుఁడున్ లేవకున్నంత, రక్షస్సమూహంబు బల్ ఖడ్గముల్ కుంతముల్ గ్రుమ్ముచున్, భిండివాలమ్ములన్ జిమ్ముచున్, గుట్టలన్ జెట్టులన్ మేనిపై నెట్టుచున్, శూలముల్ గాలముల్ వీనులన్ గ్రుచ్చుచున్, సమ్మెటల్ వట్టి వ్రాల్ఫ్రీతిపైఁ గొట్టుచున్, గ్రాఁగు తైలంబు నిండారఁ గుంభంబులన్ నించి కర్ణంబులన్ బోయుచున్, పారలన్ గోళ్లన్ గ్రుచ్చుచున్, దంతులన్ దోలి దేహంబుఁ

ద్రొక్కించుచున్, గొంతకాలంబు నీరీతిఁ గావింపఁగాఁ, గుంభకర్ణుండు తా నెట్టటో యింత మేల్కాంచి, హుమ్మంచు నుగ్రంబుగానీల్గి, శేషో గ్రహస్తంబులన్ సాచి, పెన్గహ్వరం బైననోర్విచ్చి, జంఝానిలంబట్టివా నావలింతల్ కదుర్బుచ్చి, యాయగ్నిగోళంబులన్బోలు నేత్రద్వయిన్ విచ్చి రక్షస్సమూహంబు నీక్షించి- 'యిట్లేల నానిద్రకున్ భంగమున్ సల్పినా'రంచు గర్జించె, వా రంతభీతాత్ములై మోడ్పుకేల్వట్టిభాషించి- 'రో దేవ! నిన్ లేపఁగా లోకనాథుండు మీయన్న మాకాజ్ఞనియ్యంగ, మేమిట్లు కావించినామంతె, మన్నింపుమా! య' ప్మటంచన్న, నాతండు తా దిగ్గునన్లేచి కొండట్లు కూర్చుండె; వా రంతటన్ మాంసపుం రాసులన్దెచ్చి ముందుంచ నాయన్నియున్ మెక్కె, నాపిమ్మటన్-రక్త కుంభంబులన్ మద్యభాండంబులన్దెచ్చి యందియ్యఁగాఁ ద్రావె, నా పైని దివ్యాంబరాశేషభూషావళుల్దాల్చి యున్మత్తుఁడై వచ్చెఁ దా నన్నయాస్థానమున్ జేరఁగన్;—

వచ్చి యాయన్నకున్మ్రొక్క, నాతండు నాసోదరున్ బ్రీతిమైఁ గౌఁగిటన్గ్రుచ్చి యాచెంతనేయున్న పీఠంబుఁ జూపించె, వాఁ డంతఁ గూర్చుండి దైత్యేశ్వరున్ గాంచి భాషించు- 'నోయన్న! సౌఖ్యంబెగా నీకు నీవారికిన్? రాక్షసాధీశ్వరా! లంక నింకేమి యుత్పాతముల్ పుట్టె మున్నేన్, గదన్ నిద్రలోనున్న న న్నిట్లు మేల్కొల్పఁగా? నేరిపైఁబోరికిన్ బోవలెన్? దెల్పుమా!' యన్న, నారావణుం డాడు:- 'నాతమ్ముఁడా! మున్ను విన్నాఁడవోఁగాదె, భూజాత నేఁ దెచ్చుటల్? దానికై రామ సౌమిత్రు లాక్రోతులన్గూడి విచ్చేసి, నాతోడ యుద్ధంబు సాగించి రత్యంతఘోరంబుగాఁ, జూడఁగా నేఁడు రక్షస్సమూహంబు, సంగ్రామ మం దెంతయోకూలె; సామంతులున్ మంత్రులున్ మంత్రిపుత్రుల్, మహాయోధు లిం కెందఱోవచ్చి రేమందు? నాపుత్రులున్ లక్షసం ఖ్యాకులున్ దీఱి, రామేఘనాదుం డొకండేసుమీ! నిల్చె నీనాఁటి, కా పిన్నతమ్ముండు వన్నీవిడి తాశత్రువున్ గొల్వఁగాఁబోయె; నేమందు? నింత

యయ్యొ నీశౌర్యవీర్యప్రతాపంబులన్ నమ్మి నే నింతధైర్యంబుతో నుంటి, నాదిక్కు నీ వొక్కఁడే' యంచుఁ దాఁ గన్నులన్ నీరువెట్టంగ, వీక్షించి యాకుంభకర్ణుండు లోకంబు లల్లాడ గర్జించుచున్ లేచి, కోపించి, నేత్రద్వయిన్ విస్ఫులింగంబులన్ గుప్పుచున్ బల్కు- 'నౌరౌర! యాదుర్మదుల్ లంకలో నింతకార్యంబుఁ గావించిరే! కన్నులన్ గానరో, వారలే నాఁడొనన్ నన్ను? విన్నారుకాదో, మదీయాద్భుతంబైన వీర్యప్రతాపంబులన్ మున్ను? వీక్షింపుమా! నేఁడు నే విడకా రామసౌమిత్రులన్ జించెదన్, వానరానీకమున్ దంచి యేతెంచి హర్షాంబుధిన్ ముంచెదన్ నిన్ను, నన్ గాంచు' మంచాడి వే లేచె; నావెంట స్వసైన్యముల్ గూడి యేతెంచెఁ, గాలాంతకుండట్లు గర్జించుచున్ బోవ, నాధాటికిన్ భూమి యూటాడె;—

## యుద్ధరంగమునఁ గుంభకర్ణుని స్వేచ్ఛావిహారము.

ఆదానవుం డట్లువిచ్చేయ, వీక్షించి యావానరుల్ చెచ్చెరన్ వృక్షముల్ శైలముల్ దెచ్చి యాదైత్యుపై స్వేచ్ఛమై రువ్వుచున్ బోవ, లోనవ్వు చాదైత్యుఁ డవ్వారితో నాడు- 'నో క్రోతులారా! వినుం, డల్పప్రాణుల్ సుఁడీమీర, లే లిట్లు శ్రీరామునిన్ నమ్మి చావంగ నున్నారు? ప్రాణంబు లే మంతభారంబులే? పొండుపొం, డేను శ్రీరాముతోఁ బోరఁ గాఁ బోదు, నాకడ్డమై రాకుఁడీ' రన్న, సుగ్రీవ సామీరి నీలాంగదాదుల్ వెసన్ బ్రోగుగాఁ జేరి, సైన్యంబులన్ గూడి, యాకుంభకర్ణాసురున్ జుట్టి, బిట్టార్పుచున్ బోరుగావించినన్, వాఁడు హస్తంబులన్ సాఁచి కీశేశులన్ గోట్లసంఖ్యాకులన్ బట్టి యొక్కుమ్మడిన్ మ్రింగుచున్, గాళులన్ రాయుచున్ గాలకాలుండునై మించి సంగ్రామరంగంబులో నెంపుఁ దానొక్కఁడై నిక్కి స్వేచ్ఛావిహారంబుఁ గావింప; నాధాటి సైరింప కావానరుల్ దిక్కులన్ బట్టి, రంతన్ హనూమంతుఁడున్ సూర్యపుత్రుండు నీలాదులున్ దిట్టలై నిల్చి ఘోరంబుగాఁ బోరుఁ గావించుచుండంగ సుగ్రీవుఁ డుగ్రుండునై పూని చేతన్ గదన్, దైత్యుపైఁ దూఁకె, నద్దాని

నాదవ్వినఁ రాముఁ డీక్షించి తా నా[1]విభీషాఖ్యదైత్యేంద్రుతోఁ బల్కు- 'లంకేశ్వరా! కంటివే, కాలరుద్రుండు నావచ్చు నాఘోరక్రూరాత్ముఁ డెవ్వాఁడు? మాసైన్యముల్ వాని నీక్షించి దిగ్దేశముల్ బాఱె, సుగ్రీవుఁ డాదైత్యుతోఁ బోరఁగాఁ జేరె' నంచన్న, నాస్వామితో నాతఁ డిట్లాడు;—

విభీషణుండు శ్రీరామచంద్రునకుఁ గుంభకర్ణుని వృత్తాంతమునుఁ దెలుపుట.

'ఓ రాఘవా! యాదశగ్రీవుతమ్ముండు నా కగ్రజుం డీతఁడే కుంభకర్ణాహ్వయుండౌను, నీవీరుఁ డాదేవతానీకముఁ దోలెఁ బల్మాఱు, వీతండు బ్రహ్మాండముం బ్రద్దలౌనట్లు గ్రుద్దంగ శక్తుండు, వీరుండుఁ గ్రూరుండగుం; ధాత యీనీచు దుర్వర్తనం గాంచి- 'నీవాఱుమాసంబులుం నిద్రలోనుండు, మింకాఱుమాసంబులుం మేలుకొమ్మంచు శాసించె; నా మేలుకొన్నట్టినాళ్లీతనిం రుద్రుఁ డేం జాలఁ డోపంగ, నిర్బంధమై నిద్రలోనుండఁగా లేపినం, వీఁడు సంగ్రామమేసల్పుచోఁ జచ్చు' నంచుం విధించెం జుమీ! బ్రహ్మ; నే నిందువిచ్చేయునాఁ డీతఁడుం బోయె నిద్రింపఁగా, నేఁటి కీతండు నిద్రం బదార్నాళ్లమాత్రంబె పోఁ బుచ్చెఁ-బూర్ణంబుగాకుండ నే నిద్ర, నిర్బంధమై లేపె వీనిం దశాస్యుండు, కానం నిజం బీతఁడుం జచ్చు నీచేత నేఁ' డంచు వాక్రుచ్చెఁ; రాముండు కానిమ్మటంచాడె, సుగ్రీవుతోఁ బోరఁగావించుచున్నట్టిఁ డౌకుంభకర్ణుం విలోకించుచుండంగ నాయంతలో దైత్యుఁ డుగ్రుండునై ముష్టిచేఁగొట్టె సుగ్రీవు, నాపెట్టుచే వానరేశుండు మూర్ఛిల్లె;—

మూర్ఛనొందిన సుగ్రీవుఁగొని కుంభకర్ణుండు, లంకకుఁబోవుట.

ఆకుంభకర్ణుండు హర్షాత్ముఁడై- 'చిక్కెఁబో, క్రోతిఱేఁ, డీతనిం బట్టి, నేఁ గాన్కగా నన్న కర్పించి, మోదింపఁగాఁ జేతు నీనాఁడు, నా వీరాఁదటం రామసౌమిత్రులం జాతు'నం చెంచి, బల్మూర్ఛమై వ్రాలియున్నట్టిసుగ్రీవునిం బట్టి, తాఁ జంకలోఁ బెట్టి, లంకాపురీమార్గముం బట్టె, దైత్యుల్ మహాసంధులై పొంగుచుం గంతులం వైచుచుం

1 సురారాతిశత్రుండు దైత్యేంద్రుతోఁ బల్కు;— పా.

బోయి, రావానరుల్ ఖిన్నులై కుంది రావాయుపుత్త్రుండు, నీలుండు, నయ్యంగదుండుఁ నలుం, డాదియగా వానరశ్రేష్ఠు లేమేమియుఁ జేయఁగాఁజాల కాదైత్త్యు వెన్నంటి, డాదవ్వులఁ బోవుచుఁ యోజనల్ నల్పుచుండంగ, లంకాపురిఁ జేరె నాకుంభకర్ణాఖ్యుఁ, డవ్వేళలోఁ జంక లోఁజిక్కియున్నట్టి సుగ్రీవుఁడుఁ మూర్ఛ మేల్కాంచి, తద్దుస్థితిఁ గాంచి లోఁగుందుచుఁ సందుకై వేచి తా నుండఁగా, మద్యపానంబుచే మత్తుఁడై దైత్త్యుఁ డాచంకసల్లంతనల్లార్చె, నాసందునఁ జాఱవిచ్చేసి సుగ్రీవుఁ డాదైత్త్యుకర్ణంబులఁ ముక్కునుఁ బండ్లతోఁ బీకి, శీఘ్రంబుగా నభ్రమార్గంబునఁ దాఁటు, నీక్షించి యవ్వాయుపుత్త్రాదు లాధీరునిఁ జేరి, హర్షించుచుఁ రామునిఁ జేరఁగాఁ బోయి, రాపైనదైత్త్యుండు మత్తాత్ముఁడై యావిచారంబు నేమేమియుఁ గానకే, లంకలో రాజమార్గంబునఁ బోవుచుండంగఁ- 'దా వానరాధీశు సుగ్రీవునిఁ బట్టి, బల్ దిట్టయై గుంభకర్ణుం డిదే తెచ్చు' నన్వార్త నాలించి, హర్షించుచుఁ దానవస్త్రీలు, వాద్యంబులుఁ దోడరా, హారతుల్ దెచ్చి యాకుంభకర్ణుఁ విలోకించి, బల్ రక్తసిక్తంబునౌ మొండిముక్కుఁ, మఱిఁ మొండివౌవీనులఁ గాంచి దిగ్భ్రాంతులై వార్త విన్పింపఁగా, దైత్త్యుఁ డద్దాని కాశ్చర్యమగ్నుండునై, ముట్టిముక్కుఁ నిజంబెంచి నిర్విణ్ణుఁడై, మానభంగంబు లోనైపఁగాలేక- 'నీమోముతోఁ రావణుఁ జూడలే' నంచు సిగ్గెంచి- 'యారామసౌమిత్త్రులఁ ద్రుత్తు నొంచెదఁ రణాగ్రంబునఁ జత్తునొండెఁ మ ఱింకొండు నేనొల్ల' నం చల్గి, తా వెన్కకుఁ బోయె, యుద్ధావనిఁ జేరఁగ;—

## కుంభకర్ణుండు మఱలయుద్ధమాడవచ్చి, శ్రీరామునిచేఁ జచ్చుట.

ఘోరదుర్వారకోపంబునఁ జేరి దైత్త్యుండు యుద్ధావనిఁ, జేరుచుఁ వీరసంచారముఁ జేయుచుఁ మీఱి స్వేచ్ఛఁ గపివ్రాతముఁ బట్టుచుఁ గొట్టుచుఁ నేలకుఁ బెట్టుచుఁ దిట్టయై భ్రమ్మరఁ; దాళఁగా లేక సుగ్రీవుఁడుఁ దాఁగె, నాయంగదుం డంప నెందెందు రాకుండె,

నవ్వాయుపుత్త్రుండు దౌదవ్వులం దుండె, నీలుండు భీతిల్లి యాదైత్త్యు నిన్ జేరఁబోకుండెఁ, దారుండు జాఱెన్, నలుం డందు లేకుండె, భీతిన్ బ్లవంగుల్ వెసన్ బాఱి రాచెట్టులన్ గుట్టలన్ బట్టి బిట్టార్చుచున్; జాంబవంతుండు దూరంబుగానిల్చి, నీయల్లకల్లోలముల్ గాంచి దిగ్భ్రాంతుఁడై చేష్టలన్ దక్కి వీక్షించుచుండెన్;- మహోన్మత్తుఁడై కుంభకర్ణుండు శ్రీరామునిన్ డాయరాఁ, గాంచి యారాముఁడున్ వింట నస్త్రంబు సంధించి దైత్త్యున్ నిరీక్షించుచుండంగ, నార్భాటముల్ సల్పుచున్ గుంభకర్ణుండు విచ్చేసి యారాఘవస్వామితోఁ బల్కు:- 'నో రామ! నీకాయువ్వున్ దీఱె, నేఁ గుంభకర్ణుండ, నీమూఁడు లోకంబులన్ నాదువేరన్నచో, దేవతల్ దానవుల్ భీతులై, నాకు జోతల్ సమర్పింతు, రెన్నన్ నరుం డీవు నన్నోర్తువే?' యన్న;—

శ్రీరాముఁ 'డో దానవా! యేటికీ రిత్తయార్భాటముల్? చూపఁగా రాదె నీశక్తి?' నంచాడె, నాకుంభకర్ణానుజుండంతటన్ వింటినిన్ బూని, బాణంబుసంధించి వేవచ్చి శ్రీరాముపార్శ్వంబునన్ నిల్చెఁ, బోరాడఁగాఁ, దమ్మునిన్ గాంచి యాకుంభకర్ణుండు-'నౌలే, బళీ! సార్థకం బిప్పుడయ్యెన్ జుమీ! సోదరుండౌటకున్ బోరు నాతోడఁ గావింపఁగా' నన్న, నేత్రంబులన్ నిప్పులన్ గ్రుక్కుచున్ బల్కు నాతండు- 'నో యగ్రజా! జానకీనేతకున్ సీత నర్పింపుమం చెంతయో నీతి బోధించితిన్, గాల మాసన్న మౌటన్ మదీయోక్తులన్ గర్ణమున్ జొన్పకుండెన్ దశగ్రీవుఁడట్లౌటచే ధర్మపక్షంబునన్ జేరితిన్, దల్లియాజ్ఞానుసారంబుగా, వంశముం గానిల్పఁగా' నంచు వాక్రుచ్చె;—

ఆకుంభకర్ణుండు భాషించు- 'నెట్లైన నీవిట్టియిక్కట్టులన్ తేని, నీయగ్రజున్ వీడి రాధర్మమే?' యంచనన్, 'ధర్మమున్ దైవమున్ జూడఁడేన్ దండ్రి నేన్ బాయ న్యాయంబగున్ సుమ్ము! నీయిష్టమే' యన్న- 'నేతేని యాజ్ఞానుసారంబుగాఁ బోరెదన్, బ్రాణమేనిన్ దృణప్రాయమన్నించి వర్జించెదన్ గాని నీవాక్యమే నొల్ల' నంచాడి, శ్రీరాముదిక్కై

శరంబొండు పోమిరాలె, నారాఘువుం డద్దిఖండించె, నామీఁద వారిర్వు రత్యంతఘోరంబుగా మీాఱి, శస్త్రాస్త్రనైపుణ్యముఁజూపుచొ నొండొరుల్ తీసిపోకుండ దిగ్దేవతల్ భీతులై చూడ యుద్ధంబు గావించి ర, ద్దైంతొ కాలంబుమీాఁదన్ వెసన్- గుంభకర్ణానుజుం డాడు శ్రీరాముతో- 'దేవ! యేలింకనాలస్య, మీాదైత్యునిన్ జంపుమా! లీలకున్ వేళగాదిద్ది, భాస్వంతుఁ డస్తాద్రినిన్ గ్రుంకుచో, రాక్షసుండౌట నీతండు బల్మాయలన్ బన్న నేర్చున్ జుమీా!' యన్న, రాముండు ఘోరాస్త్రపాళిన్ బ్రయోగించి యద్దైత్యుహ_స్తంబులన్ ద్రుంచె, నారక్కసుం డంత శ్రీరాముపై దూఁకనుంకింప, వీక్షించి వే వహ్నిబాణంబునన్ వానిపాదంబులన్ ద్రుంచె, నార్భాటముల్ సల్పుచున్ మొండె మేతెంచుటన్ గాంచి యైంద్రాస్త్రమున్ బుచ్చి ప్రాణంబువోకార్చె, నంతన్ [1]విభీషాఖ్యదైత్యేంద్రుఁ డాయన్న నీక్షించి- యయ్యో!' యటంచార్చె, దిగ్దేవతల్ మెచ్చి కీర్తించి దీవించిరా రాఘువున్! లక్ష్మణుం డంతవిచ్చేసి శ్రీరాముహ_స్తంబునందున్న విల్లంది శాంతింపఁగాఁజెప్పి, యాకుంభకర్ణానుజున్ జేరి, యు క్తప్రసంగంబు గావించి యోదార్చె;—

## రావణునిమూలబలమును రామచంద్రుఁడు ధ్వంసమొనర్చుట.

ఆపిమ్మటన్ దూత లాలంకలోఁజొచ్చి, యారాక్షసాధీశునాస్థానమున్ జేరి విన్పించి రాకుంభకర్ణుండు యుద్ధంబులోఁ జచ్చుటన్, దాని విన్నంతనే మూర్ఛమైవ్రాలె దైత్యేంద్రుఁ, డందున్ సభాస్తారులున్ దిగ్భ్రమన్ జెంది లోఁగుండి; రాపిమ్మటన్ దేఱి శోకించెఁ దానశ్రువుల్ పుచ్చుచున్ దానవేంద్రుండు- 'హాసోదరా! నీదు పేర్విన్న దిగ్దేవతల్ దిక్కు_ఁకన్ బట్టిరే! యట్టినిన్నున్ నరుల్ చంపిరంచన్న నేమందు? నాగుండె నీరయ్యెఁగా! నిన్నుఁబోల్ తమ్ముఁడున్ దక్కు_నే నాకు? నాబాహు శౌర్యంబు డిందెన్ గదా నేఁడు! నాదైర్యలక్ష్మీవియోగంబు నేఁ గంటి నీనాఁడు, జీవచ్ఛవంబయ్యె నీరావణుం'డంచు వాపోవుచున్ మించి

1 దదీయానుజుండైనదైత్యేంద్రుఁ;—పా.

శోకించి, యామినీచరుఁడు ధైర్యముఁ జేసి, రోషారుణాక్షుండునై చారులఁ గాంచి గర్జించుచుఁ బల్కు:- 'నా ప్రాణ ప్రాణంబునౌ మూలసైన్యంబు యుద్ధావనిఁ జేరఁగాఁ జెప్పుఁ' డంచన్న, వారేగి విన్పింప నా మూలసైన్యంబు సంగ్రామరంగస్థలిఁ జేరె, శస్త్రాస్త్రముల్ దాల్చి, దిగ్దేశముల్ నిండి తండోపతండంబులై వచ్చె; దిగ్భాగముల్ మ్రోఁగె నావీర హుంకారనాదంబుచేఁ, బాదసంఘట్టనన్ క్షోణి కంపించె, రాముండు విభ్రాంతుఁడై యాసురారాతితమ్ముండు దైత్యేంద్రుతో నాడు-'నేమబ్బురంబిద్ది? యీలెక్కలేనంతసైన్యం బదెందుండివచ్చెనె? విన్పింపవే!' యన్న, నాధీరుఁ డారామునితోఁ బల్కు;—

'ఓరాఘవా! దేవదేవేశ్వరా! యా దశగ్రీవు నత్యంతమా మూలసైన్యంబు సుమ్మిద్ది! యిద్దాని సాయంబునన్ గెల్చె, నాదైత్యనాథుండు ముల్లోకముల్, దీని నిర్జింపఁగా వానరుల్ చాల రో దేవ! బాణంబుసంధింపుమా!' యన్న శ్రీరాముఁ డొక్కింత యోజించి సమ్మోహనాస్త్రంబు సంధించి పోనీలె, నయ్యస్త్ర మా దైత్యసైన్యంబులోఁ జొచ్చె సూర్యాగ్ని తేజంబునన్ వెల్గుచున్, బాణమాహాత్మ్య మేమో కదా! యొక్కనిన్ జూడ నాతండె శ్రీరాముఁడై తోఁప విభ్రాంతులై వార లొక్కొక్కనిన్ రాముఁడంచెంచి సంగ్రామముం జల్పి రా దైత్యులం దొండొరుల్-;వానరుల్ దైత్యులన్ జంపఁగాఁ జొచ్చి, రంతంత బీభత్సమై యొప్పె నయ్యాజి, నీరీతి నామూలసైన్యంబు నామూల మారాముసమ్మోహనాస్త్రంబు పోకార్చుచో; నైదువేల్ దంతులున్, వాజులార్వేలు, లక్షల్ రథంబుల్ మఱిన్ గాల్బలం బొక్కపద్మంబుగా గూలుచో, నాలమందా రఘూత్తంసు చాపంబునందట్టెయొండాడు, నట్లట్టులుం గోటికాఁడంగ నావింటికిన్ గట్టఁగాఁ బడ్డగం టొక్కనాదంబు సేయుం ఖణీలంచు, నానాఁడు శ్రీరాముచాపంబునందొప్పునీరేడుగంటల్ కడున్ మ్రోఁగెఁ బో జాముసేపాఁగ, నామూలసైన్యంబు సర్వంబు నిర్మూలమైపోయె, శ్రీరాముఁ డావింటినిన్ డించి సౌమిత్రి చేనుంచి, యాకుంభకర్ణానుజున్

గాంచి పల్కాడు-'ఓ దైత్యలోకేశ్వరా! కాంచ సమ్మోహనాస్త్రం బిదే సుమ్ము! నేనొండె శ్రీనీలకంఠుండు తా నొండె దీనిఁ బ్రయోగింప సంహారముఁ సల్ప, నీ రేడులోకంబులఁ గల్గరిం' కంచు వాక్రుచ్చె, నాయభ్ర దేశంబునందుండి యుద్ధంబు నీక్షించుచున్నట్టి గీర్వాణులఁ మెచ్చి కీర్తించుచుఁ బోయి రా రామునిఁ మిక్కిలిఁ;—

ఇంద్రజిత్తు నికుంభిని యాగముఁ జేయుచుండ, లక్ష్మణస్వామి కపిసేనతో వచ్చి యాగముఁ ధ్వంసమొనర్చుట.

జారులుఁ బోయి వేగఁ దశగ్రీవుస్థానముఁ జొచ్చి యాసర్వ వృత్తాంతముఁ జెప్ప, విభ్రాంతుఁడై మోమువాడ్వాఱ, డెందంబునఁ గుందుచుండంగ, నా చెంతఁ బీఠంబుపై నున్న యమ్మేఘనాదుండు తండ్రిఁ విలోకించి తా నంతటఁ లేచి దర్పంబునఁ బల్కె-'దైత్యేంద్ర! చింతింపఁగాఁ బోకుమీ! నీకు మాకుండు నేనుంటి నా మేనఁ బ్రాణంబులుండంగ నీ కేటికిఁ గుంద? నే నల్గినఁ లోకముల్ నిల్చునే! పోయి నేనిప్డు డా రామ సౌమిత్రులఁ ద్రుంచి, శీఘ్రంబుగాఁ వచ్చి భూజాతకుఁ నీకు నేఁ బెండ్లి గావించి, హర్షాంబుధిఁ దేల్తు ని' న్నంచు నాటోపమేపార, నాస్థానముఁ వీడి వెన్వెంట నేతెంచు సైన్యంబులఁ గూడి తా స్యందనం బెక్కి విచ్చేసి యందొక్కచో డిగ్గి, నల్దిక్కులఁ దైత్యులఁ గాపుగా నుంచి, తన్మధ్యలో వేదిపైఁ జేరి, పద్మాసనాసీనుఁడై యొప్పి, వేదోక్తమై హోమముఁ వేల్చుచుఁ, మంత్రముల్ చెప్పుచుఁ, నిష్ఠ చెన్నారఁ ధ్యానంబు తాఁ బూనియుండంగ;—

నెట్లట్లో నేతత్ప్రవృత్యుండు దైత్యేంద్రుఁ డద్దాని గుర్తించి, శ్రీ రామునిఁ డాసి కేల్మోడ్చి విన్నించె- 'ఓ రాఘవా! మేఘనాదుండు ఘోరంబుగా హోమముఁ సల్పు కార్యంబునందుండె, నా హోమ మీడేఱేనఁ వాని సంహారముఁ జేయఁగా సాధ్యమే కాదు, తద్విఘ్నముఁ సల్పఁగా లక్ష్మణుఁ వేగమే పంపుమా!' యన్న, శ్రీరాము నాజ్ఞానుసారంబుగాఁ బోయె సౌమిత్రి తా నా హనూమంతుపై నెక్కి, సుగ్రీవ

నీలాంగదాదుల్, మఱిన్ జాంబవంతుండు వెన్వెంటనే తేర, నాకుంభ
కర్ణానుజుండున్ వెసన్ ద్రోవఁ జూపించుచున్ ముందుముందేగ, విచ్చేసి
యందొక్కచోఁ గూడి నల్దిక్కులన్ జుట్టియున్నట్టి రక్షస్సమూహంబుపై
సంప్రవర్షంబు గుప్పించి, తత్సైన్యమున్ జించి, కాసారమున్ జొచ్చి క్రీడించు
వేదండరాజంబు వోలెన్ దదాస్థానమధ్యంబునన్ నిల్చి, బాణంబులన్
గోటికిన్ దాఁటఁగా ఘాటిమై మీటి, యమ్మేఘనాదున్ గడున్ నొవ్వఁగా
జేయ, సైరింపఁగాఁజాల కాదైత్యుఁ డాహోమమున్ మాని, కోపంబు
దీపింపఁగా విల్లుకేలన్ దగన్ బూని, భోరంచుఁ దా బాణవర్షంబు వర్షించె
సౌమిత్రిపై:—

## మేఘనాదుఁడు సౌమిత్రిచేఁ జచ్చుట

వాని నన్నింటి వెన్వెంటనే దున్మి సౌమిత్రి వెంటన్ బ్రయోగించె
దివ్యాస్త్ర, మద్దానిఖండించె క్రుద్ధుండునై దైత్యపుత్రుండు, ఘోరం
బుగా నాల మీరీతి వారిద్దరున్ సల్ప, రా మీఁదటన్ లక్ష్మణస్వామి
యాదైత్యుహస్తంబునందున్న చాపంబుఁ దా నొక్కతూపున్ బ్రయో
గించి ఖండించె, నాయంత నా మేఘనాదుండు బిట్టల్కఁ జేతన్ గదన్ దాల్చి
సౌమిత్రిమూర్ధంబుపైఁ గొట్టరాఁగాంచి సౌమిత్రి శీఘ్రంబుగా బాణ
మున్ బుచ్చి తా నాగదన్ దుండ్లుగావించె, నాదైత్యుఁ డంతన్ నభో
వీధికిన్ దాఁటి, మేఘంబులన్ డాఁగియున్, దా నదృశ్యుండునై ఘోర
నారాచముల్ వుచ్చి కీశేశులన్ దోలుచున్, బొంచి రామానుజున్ మించు
నస్త్రంబులన్ ముంచి నొప్పింప:—

వీక్షించి సౌమిత్రియున్ దా సమీరాస్త్రమున్ వే ప్రయోగించి,
యా మేఘముల్ దోలి, యాగ్నేయబాణంబునన్ దైత్యుమాయల్ నివా
రింప, వాఁ డల్గి రౌద్రంబుమై భూమికిన్ డిగ్గి, తాఁ గృత్తియన్ శక్తి
నేయంగ నుంకింప, నద్దాని సౌమిత్రి యస్త్రంబునన్ జెండె, నయ్యింద్రజి
త్తంత నానాస్త్రముల్ గుప్పి సౌమిత్రి నొప్పింపయత్నింప, నాతండు

నాయన్నిటికి మధ్యనే దున్ని తా నాజిటుల సారథిఁ, మూఁట గుఱ్ఱం బులఁ, నాల్గిటఁ స్యందనంబుఁ విదారించి, దేవేంద్రదత్తంబునౌ శ్రీ భుజంగాస్త్రముఁ వింటసంధించి శుద్ధాత్ముఁడై రాముధ్యానించి;—

వేదంబు సత్యంబయేనిఁ, రఘూత్తంసుఁడౌ రామచంద్రుండు ధర్మాత్ముఁడేనిఁ ధరాజాతయౌ సీత పూతాత్మయౌనేని, నే జాలశుద్ధుఁ డనేయేని, నాయీశరం బిప్పుడే దున్ను నీయింద్రజిచ్ఛీర్ష మం చేకచిత్తం బునఁ ఘోరనారాచముఁ మీఁటె; నయ్యమ్ము కాలానలాభీలకీలావళిఁ గ్రక్కుచుఁ వచ్చి యద్దైత్యశీర్షంబు ఖండించె, మింటఁ సుపర్వుల్ దగఁ పుష్పముల్ చల్లి రాలక్ష్మణస్వామిపై, దుందుభుల్ మ్రోఁగె, రక్ష స్సమూహంబులుఁ బాఱఁగాసాఁగె, సౌమిత్రి సైన్యంబులఁగూడి విచ్చేసి, తా నన్నపాదంబులఁ వ్రాలి, యేతత్సమాచార మాద్యంత ముఁ జెప్పఁ, దా నక్కునఁ జేర్చి సౌమిత్రి దీవించి మోదాత్ముఁడై రాఘవుండుండె;—

### రావణుఁడు స్వయముగా యుద్ధమాడవచ్చుట

లంకాపురిఁ రావణాస్థానముఁ జేరి చారుల్ నివేదింపఁగా, మేఘనాదుండు సౌమిత్రిచేఁ జచ్చెనన్వార్త నాలించి తా మూర్ఛమై వ్రాలె నా దానవేంద్రుండు, శైత్యోపచారంబులఁ దేటి శోకించె బాష్పంబువుల్ రాల- 'హాధీర ! హావీర ! హాపుత్త్రమారా ! కులాం బోధిచంద్రా ! సుతా ! పోయితే, యొంటిగాఁజేసి నన్నిట్లు? లోకంబునం దెల్ల నేకైకవీరుండవౌ నిన్నుఁ బోకార్చిరే తుచ్ఛులౌమానవుల్? సూదు దుర్దైవ మీరీతిగావించెనే?' యంచు రోదించిరోదించి, రోషంబు రేకెత్త బల్ భీషణోద్దండమార్తాండుఁడై మండుచుఁ, దాఁ గఠోరంబుగాఁ జీరు చుఁ వే రథంబెక్కి బల్ సైన్యముల్ గొల్వ, దివ్యాస్త్రముల్ పూని, ఘోరంచువాద్యంబులేపారఁ, దాఁ జేరఁగాఁబోయె సంగ్రామరంగంబు, నాఘాటికిఁ భూనభంబులఁ వడంకంగ నారీతి నేతెంచు దైత్యేం

ద్రునిన్ గాంచి యావానరుల్ గుంపుగాఁ గూడి దాఁకంగ రా, దానవాధీశ్వరుండల్గి తా నంపవర్షంబువర్షింపఁగా, నంధకారంబు దిగ్దేశముల్ నిండె, సైరింప కాఘాటి నల్దిక్కులన్ బాఱిరావానరుల్, సూతునిన్ గాంచి దైత్యుండు ‘మా శేరు నారాముపైఁ దోలు’మంచాడ, నాతండటుల్ సల్ప, సౌమిత్రి శస్త్రాస్త్రముల్ దాల్చి యారావణున్ దాఁకఁగావచ్చె, నంతన్ [1]విభీషాఖ్య, దైత్యేంద్రుఁ డస్త్రంబు చేఁబూని, సాయంబుగావచ్చి సౌమిత్రిపార్శ్వంబునన్ నిల్చె నావానరుల్ ప్రోవులై వచ్చి యాలక్ష్మణస్వామినిన్ జేరి రాయెల్ల రేకంబుగాఁదాఁకి రారావణున్;-

### రావణుఁడు శక్తిన్ బ్రయోగించి లక్ష్మణస్వామిని మూర్ఛిల్లఁజేయుట

రాక్షసాధీశుఁ డాలక్ష్మణుం డట్టులన్ బోరఁగావించి శస్త్రాస్త్రసంధాననైపుణ్యమున్ జూపు చానాఁడు, వా రంత నంతంతకున్ మీఱు రోషంబునన్ బోరుచుండంగ నంతన్ సురారాతితమ్ముండు తా ముందు కేతెంచి బాణంబుసంధింపఁగా, రావణుం డంతటన్ సోదరున్ గాంచి తీక్ష్ణారుణాక్షుండునై పల్కు- ‘దాయాదివై నాదులోఁగుట్టులన్ జెప్పి మమ్మెల్ల నాశంబుఁగావింపలోనెంచితే? దుర్మతీ! నేఁడు నిన్ ద్రుంచెదన్ జూడు’ మంచాడి, దుర్వారమాశక్తినిన్ దాల్చి దోశ్శక్తిమై నేయనుంకింప, వీక్షించి సౌమిత్రి- ‘హా! చచ్చెనయ్యా! మహాభాగుఁడంచార్చి, శీఘ్రంబుగా నాతనిన్ వెన్కఁబోనిడ్చి తా ముందుభాగంబునన్ నిల్చె, నాభక్తునిన్ గావఁగానెంచ; నాశక్తి కాలాగ్నికీలల్ కడున్ గ్రక్కుచున్ వచ్చి యాలక్ష్మణస్వామివక్షంబునన్ గాఢమైనాటె, నాఘాటికిన్ భూమిపైవ్రాలె సౌమిత్రి, యాధీరు వక్షస్థలిన్ నాటి యున్నట్టిదుర్వారమాశక్తినిన్ బీకఁగాలేక యవ్వానరశ్రేష్ఠు లాజ్వాలలీక్షించి నిర్విణ్ణులై గుందుచున్నంత, నాదవ్వులందున్న శ్రీరాముఁ డద్దాని నీక్షించి శీఘ్రంబుగావచ్చి, యాశక్తినిన్ జేతతోఁ బట్టి తా నట్టెపోమీటి, కీశేశులన్ గాంచి తా నశ్రువుల్ నించుచున్ బల్కు- ‘శోకింపఁగా వేళకాదిద్ది,

1 సురారాతి సోదర్యుఁడు పా. అ.

యీలక్ష్మణుఁ గాచి మీరుండుఁడీ! నేను నద్దైత్యుతో నింక యుద్ధంబుఁ గావింతునంచాడి, శస్త్రాస్త్రముల్ పూని, దుర్వారకోపంబునన్ దుర్నిరీక్ష్యాకృతిన్ వెల్గుచున్ వచ్చి- 'యీభూమిపై రాముఁడో, రావణుండో, మనన్ జెల్లుఁగా, కిర్వురుండంగ సాధ్యంబుకాదింక, నావిక్రమంబిప్పుడీరెల్లరున్ గాంచుఁడీ!' యంచు విల్లెత్తి నారిత్రినిత్రుంచి, లోఁ దల్లడంబంది తాఁ బాఱవేగన్ దశాస్యుండు యుద్ధావనిన్ వీడి లంకాపురిన్ జేరఁగన్;-

### మూర్ఛిల్లిన సౌమిత్రినిగాంచి శ్రీరాముఁడు శోకించుట.

గాంచి రాముండు శీఘ్రింబవిచ్చేసి, మూర్ఛాన్వితుండౌ సుమిత్రాత్మజున్ బాహుమూలంబునం దెత్తి, మోమున్ విలోకించి శోకించెఁ గన్నీరుమున్నీరుగాఁగాప్పుచున్- 'సోదరా! సూర్యవంశప్రదీపా! స్ఫురద్రూప! హా! వర్ణనాతీతవీర్యప్రతాపా! సుమిత్రాతనుజాత! హాలక్ష్మణా! పోయితే నన్నిటుల్ వీడి? యయ్యో! ననున్ దండ్రిగా, సీతనున్ మాతఁ గానెంచి సేవింపవే? నాకునై తల్లినిన్ దండ్రినిన్ వీడి, యిల్లాలిఁ బోనాడి, యీకానలో నష్టకష్టంబులన్ గుందవే? నిన్నుఁ బోల్ సోదరుం, డక్కటా! దక్కునే నాకు? నీతల్లి, మాలక్ష్మణుండేడయంచన్న, నేమందు? శత్రుఘ్నుతో నేమివాక్రుత్తు? నిర్భాగ్యుఁడన్ నేను, నిన్ బాసి నాకేల రాజ్యంబు? నాకేటికా సీత? భోగంబులేలా? కనన్ బ్రాణమేలా? యయో! తమ్ముఁడా!' యంచు శోకించిశోకించి, సుగ్రీవునిన్ గాంచి గాద్గద్యమేపారఁగాఁ బల్కు- 'సుగ్రీవ! నీసైన్యముల్ గొంచు నెందేనిఁ బొమ్మింక, నేనొల్లభూజాత, నేనొల్లదేహం' బటంచాడి, యాకుంభకర్ణానుజున్ గాంచి- 'యోసద్గుణోత్తంస! నీభ్రాతలన్ బంధులన్ వీడి, నన్నే మదిన్ నమ్మి సేవించితీవక్కటా! నీకు నాలంకనిప్పింపలేనైతి, నాబాస నీడేర్పలేనైతి నన్ సైఁపుమా! బొమ్మటంచాడి తా నశ్రువుల్ వీడ, వీక్షించి వేగన్ సుషేణుండు పల్కాడు!—

### హనుమంతుఁడు సంజీవకరణిన్ దెచ్చి, సౌమిత్రిమూర్ఛఁ దేల్చుట

'శ్రీదేవదేవేశ్వరా! రామభద్రా! కటా! ప్రాకృతుండట్లు శోకింతువే

నీవు? సౌమిత్రి ప్రాణంబులఁ బాయఁ డొక్కింత శాంతింపుమా! మోము చెల్వంబు నీక్షింపుమా! మూర్ఛమైనుండెనే కాని వేఱొండు గా దింత యోజింపుమా!' యంచు నోదార్చి, యవ్వాయుపుత్త్రుఁ విలోకించి భాషించు- 'నోపావనీ! నాఁటిసంజీవనీనామకంబైన దివ్యౌషధంబుండె, శీఘ్రంబుగా నేగి, యీరాత్రియే తెచ్చి, సౌమిత్రిప్రాణంబులఁ గావు' మంచాడె, శ్రీరాముఁ డామాట కాధీశునిఁ గాంచి- 'యోమారుతీ! నల్వురే కాదు, నీతోడ మే మేవురైనాముగా, సోదరుల్, సోదరా! సోదరుఁ గావుమా!' యంచు వావిచ్చె, నామాట కాయంజనాపుత్త్రుఁ డారాముపాదాబ్జముల్ పట్టి- 'నాస్వామి! నీభృత్యుఁడఁ నేను కల్గంగ శోకింపఁగాఁ జెల్లునే? నేను సంజీవనిఁ దెచ్చెదఁ, దానిచేఁ గానిచో, మృత్యువుఁ బట్టి సౌమిత్రిప్రాణంబులఁ వెన్కకిమ్మంచుఁ దట్టించి, యట్టిట్టు బట్టీడ్చి, నేచావఁగాఁ గొట్టెదఁ; మృత్యుచేఁ గానిచో, ధాత రప్పించి సౌమిత్రియీ వ్రాతఁ దుడ్పించి, యాయుస్సు నిండారఁగాఁ గ్రొత్తగా ఫాలభాగంబునఁ, లేఖినిఁ బట్టి వ్రాయించెదఁ, శోకముఁ జేయఁగాఁ బోకు నాస్వామి నీదుఃఖముఁ జూచి నే సైఁపఁగానోప, సైరింపు- నావిక్రమంబింత వీక్షింపు' మంచాడి, తా జెవ్వునఁ దాఁటి యాకాశభాగంబునఁ బోయి, ద్రోణాద్రినిఁ జేరి, యందున్న సంజీవనీశైలముఁ మూఁపునఁ దాల్చి వేవేగమే యభ్రభాగంబునఁ వచ్చుచుండంగ;—

సంగ్రామరంగంబునఁ మూర్ఛమై నేలపైఁ గూలియున్నట్టి సౌమిత్రిపై వ్రాలి, రాముండు నానాప్రకారంబులఁ శోకముఁ సల్పి, నావానరుల్ చుట్టుఁగా మూఁగి రోదించి రత్యంతముఁ, బిమ్మటఁ బూర్వభాగంబునఁ దివ్యతేజంబు వెల్గొంద వీక్షించి రాముండు విభ్రాంతుఁడై పల్కె;- 'సుగ్రీవ! కంటే, యదే భానుఁ డాపూర్వశైలంబునఁ దోఁపఁగాఁ జూచె, మాయాంజనేయుండు రాకుండె, సౌమిత్రి యింకెట్లు జీవించు? దౌర్భాగ్య మేమందు? మావంశపుఁ గర్త వీఁడంచు భావించితిఁ గాని, సూరుండు కారుణ్యదూరుండునై యొప్పె, నాచాపముం ద్రిమ్ము, నారాచ మిట్లిమ్ము, నే వీనిరూపాఱఁగాఁ జేతు' నం చుగ్రుఁడై నిల్వ, నంతఁ సుషే

ణుండు కేల్మోడ్చిభాషించు,- 'నోదేవ! సూర్యుండుగాఁ డారయఁగ వాయుపుత్త్రుండు సంజీవనీశైలమ్ముఁ గొంచుఁ, దావచ్చుచుండెఁ జుమీ! దాన దివ్యౌషధుల్ వెల్గు నిక్కైవడిఁ గొంత శాంతింపుమా!' యంచుభాషించుచుండఁగ, సామీరి సంజీవనీశైలముఁగొంచు భూమీస్థలిఁ డిగ్గి, యామూఁపునందున్న శైలంబు క్రిందుంచి, శ్రీరాముపాదంబులఁ వ్రాలె, నంతఁ సుషేణుండు నాపర్వతంబందు నందందుశోధించి సంజీవనీనామకంబైన దివ్యౌషధిఁ దెచ్చి సౌమిత్రినిఁ స్పృశ్యగావింపఁగా, నిద్రలోనుండి మేల్కాంచి నట్లాతఁడుఁ లేవ, శ్రీరాముఁ డాసోదరుఁ గౌఁగిటఁ గ్రుచ్చి హర్షాశ్రుపూరముల్ రాల్చె, నావానరుల్ మోదితస్వాంతులై మించి హర్షాంబుధిఁ దేలి, రాపిమ్మటఁ రాముఁ డామారుతిఁ గాంచి తచ్ఛైలముఁ వేగ స్వస్థానముఁ జేర్చిర మ్మన్న, నాతండు నారీతిఁ గావించె;—

## లంకలో, రావణుండు దిగులున నిద్రరాక పరితపించుట.

ఆలంకలో రావణుం డట్టులా రాత్రి, దిగ్గంబునౌశయ్యపైఁ బండియుఁ గంటికిఁ గూర్కురాకుంటచేఁ బొర్లుచుఁ యోజనల్ సల్పెఁ- 'గట్టా! ప్రమాదంబె కల్గెఁగదా! నేఁటి కీత నా పాలికిఁ మృత్యువే యాయె, శ్రీరాముఁ డావిష్ణువేయేమొ? యానిక్కముఁ నీతివేదిఁ మహావీరునిఁ శీలసంపన్ను నాపిన్నతమ్ముఁ మదోన్మత్తుఁడై తిట్టితిఁ, దన్నితిఁ, నిండుపేరోలగంబందునఁ మానభంగంబుగావించితిఁ, జూడ నాఘోరదోషంబు నన్వీడునే తత్ఫలం బిట్లుగుడ్పింపకే? ప్రీతిమై నాకు నాతండుబోధించునానీతి నాలింపలేనైతి, దుష్ప్రాప్తిచే బుద్ధి దుర్మార్గముఁ బట్టె, లంకాపురంబెల్ల నిర్మూలమైపోయె బల్విక్రమోపేతులై చుక్కలన్లెక్కుడౌరక్కసుల్, దక్కకే యొక్కరుఁ జచ్చిరి ట్లక్కటా! దిక్కునేఁ గానకే దీనుఁడై చిక్కితిఁ గాదె? చేనేత నీదుర్దశఁ దెచ్చుకొంటిఁ, భయం బయ్యె, నెందెందునఁ రాముఁడే కన్పడుఁ, సత్యమో, లేకిదేపైత్యమో? నిద్రయేరాదుగా? డెందమో, భద్రతఁ గాన దేమో

కదా! యంచుఁ జింతించి చింతించి, యాకొంతలోఁ బంతమేపార, బల్ వింతగాఁబల్కు- 'నౌరౌర! నేనల్ల, ముక్కంటి యాయొక్కఁడో కన్ను మూయింపనే? ధాతనే భిక్షుఁగావింపనే? చక్రిచక్రంబునే వ్రక్కలౌనట్లుగాఁ గుక్కనే, చెక్కనే? నాకు భీరత్వ మిప్డేటికిన్ గల్గె? భీతిల్లినన్ నవ్వవే యెల్లలోకంబు? లింకేటికీజన్మమున్ బెంప? శ్రీరాముఁ డావిష్ణుఁడే కాని, నేజిష్ణుఁడన్ వానికిన్, వానరుల్ గాసురల్ పుట్టియే యుండనీ! నేను నవ్వారికిన్ మృత్యువై పట్టి వారెల్లరన్ ధాత్రికిన్ బెట్టెదన్, గీర్తికన్యామణిన్ మద్భుజాశక్తిపాశంబునన్ గట్టెదన్, సీతచేపట్టి సౌఖ్యాబ్ధి నల్లట్టులన్ జొక్కెదన్, మీసలన్ దిద్ది నాశత్రులన్ గొట్టెదన్, రోష మేపారఁగా మృత్యువున్ ముందలన్ బట్టి ముమ్మారులూఁగార్చెదన్, ధాత భీతిల్లఁగాఁ బోరెదన్ గాక' యంచెంచి, లోమించి యోజించుచుండంగఁ దూర్పెఱ్ఱఁగాఁదోఁచె, భానుండు పూర్వాద్రిపై లేచె;—

## రావణుఁడు పాతాళహోమంబు సల్పుట

దైత్యేంద్రుఁ డావేళలో లేచి, కాలక్రియల్ దీర్చి, స్నానంబు గావించి, రక్తాంబరంబుల్ మెయిన్ గట్టియున్ రక్తమాల్యంబులన్ రక్తగంధంబు రక్తాక్షతల్ రక్తపుష్పంబులన్ బళ్లెరంబందుఁ దాఁగొంచు, వెన్వెంటనే హోమసామగ్రులన్ బూని భూదేవతల్ రాఁగ నేతెంచి, వేవేగఁ దానొక్క శుద్ధప్రదేశంబునన్ జేరి కూర్చుండి, పద్మాసనాసీనుఁడై, సర్వసామగ్రులున్ జెంతలోఁ జేర్చియున్, హోమకుండంబునం దగ్ని మంత్రోక్తమై వెల్గఁగా రేపి, లాజాక్షతల్ దూర్వముల్ దర్భలున్, గుగ్గిలంబుల్ ఘృతంబున్ దధిన్, దేనెలున్ బాయసాన్నంబులున్ దొప్ప లందెత్తి శాస్త్రప్రకారంబుగా, వేదమంత్రోక్తిమై వాని నాయగ్నిలో వేల్చుచున్, ముందుసాఁగించుచుండెన్ మహానిష్ఠఁ బాతాళహోమంబు భీతాత్ములై దేవతల్ సూడఁగన్; సైన్య మత్యంతమున్ జుట్టునున్ జుట్టి శస్త్రాస్త్రముల్ దాల్చి కాపుండి రక్షింప;—

## పాతాళహోమవిఘ్నమునకై వానరులు లంక కేతెంచుట

ఆహోమధూమంబు నల్దిక్కులన్ నిండి, యాకాశదేశంబునన్ జేరి, భాస్వంతునిన్ మాటుచున్ మేఘజాలంబులన్ మూఁగ, వీక్షించి లో నబ్బురంబంది పల్కెన్ సురారాతితమ్ముండు దైత్యేంద్రుఁడా రామునితో- 'దేవ! మాయన్నయా రావణుండిప్డు గావించుచున్నాఁడు పాతాళ హోమంబుఁ గన్గొంటెధూమంబు? నాహోమమున్ బూర్తి గావించినన్ వాని నిర్జింపరాదంచు నాభర్గుఁ డిచ్చెన్ వరంబున్, మహాత్మా! వడిన్ దానికిన్ విఘ్నమున్ సల్పఁగాఁబంపుమా! వీరులౌ వానరశ్రేష్ఠులన్ దేవ!' యంచన్న, సుగ్రీవుమోమ్మట్టివీక్షించె రాముండు, వే యాజ్ఞ సుగ్రీవుఁ డీయంగ, నాయంగదుండున్ గవాక్షుండు, తారుండు; మైందుండు, నీలుండు, వయ్యాంజనేయాది కీశేశ్వరుల్ గుంపుగాఁ బోయి, లంకాపురి ద్వారమందున్న రక్షస్సమూహంబుఁ జక్కాడి లోఁజొచ్చి, యందందు వీక్షించి యాలంక బిట్టల్లకల్లోలమున్ జేసి, యందొక్కచోటన్ గుహన్ జేరి పద్మాసనాసీనుఁడై, శుద్ధభావంబునన్ ధ్యానియై మౌనియై హోమమున్ వేల్చుచున్నట్టివాఁడౌ రావణున్ గాంచి, వారెల్లరున్ సింహనాదంబు గావించి, యామూఁగియున్నట్టి రక్షస్సమూహంబు నాశంబుగాఁ జేసి, వేగన్ దశగ్రీవునిన్ డాసి భాషించి రీరీతిగన్- 'రావణా! ధర్మమే దాఁగి నీ విట్టులుండంగ? శ్రీరామసౌమిత్రు లాయుద్ధరంగంబునన్ గాచి యున్నారు, సంగ్రామమున్ సల్ప కీహోమమున్ సల్పుదే? చాలు నీచేతఁ గానట్టియీచేతలంచాడఁగాఁ, గొందఱవ్వానిశీర్షంబులన్ ద్రొక్కి బల్ ఘర్షణల్ సల్పఁగాఁ గొందఱో, మీసలన్ గడ్డముల్ పట్టి యుయ్యాల లూఁగంగ, నేకొందఱో వానికర్ణంబులన్ బీఁటలున్ వాఱఁగాఁ గూసి, రక్తైన నాధీరవర్యుండు నిశ్చింత నిష్ఠాప్తిధ్యాసంబునన్ మంత్రమున్ వీడకే, తంత్రమున్ మానకే, హోమమున్ వేల్చుచుండంగ, వీక్షించి యాశ్చర్యమున్ బొంది, యావానరుల్ హోమపాత్రంబులన్ దిక్కులన్ జల్లి, యిధ్మంబులన్ దోచి, బిట్టార్చుచున్ బట్టి తన్నిడ్చుచున్ రట్టు గావించుచుండంగ;—

{ అంగదుఁడు మందోదరి నీడ్చి తెచ్చి, రావణునిమఖము భంగమొందించుట; మందోదరిప్రలాపము }

నాయంతలో నంగదుం డేగి, యంతఃపురిన్ జొచ్చి, మందోదరిన్ గేశముల్ పట్టి తానీడ్చుచున్ దెచ్చి, వేగన్ దశగ్రీవుముం దుంచి బాధింపఁగాఁ జొచ్చె, నక్కాంత కాంతున్ విలోకించి, రోషంబునన్ మించి, శోకించుచిట్లాడు- 'శ్రీరాముఁడే యాదినారాయణుండంటి, నావానరుల్ దేవతల్, నాథ! భూజాత శ్రీరామభూనేత కిమ్మంచుఁ బ్రార్థించితిన్, మాటపాటింప కీపాటుగంటే? యయోనాథ! నీపత్ని నీదుష్టు లీరీతి భంగంబుఁ గావించుచున్నారు, రక్షింపవే! చూచు చిట్లుంటి వేధర్మమో? భార్యగోడెన్నఁగాలేని నీపౌరుషం బేటికో? నాథ! దేవేంద్రునిన్ గెల్వఁగాఁ గన్న దోశ్శక్తియుక్తుండు నాపుత్త్రుఁడున్ జచ్చెఁగా? వీరులౌ విక్రమోదారులౌ నీదుప్రాణంబులౌ సోదరుల్ మ్రందరే? ఘోరశౌర్యక్రమాటోపసైన్యంబు నీపుణ్యభాగ్యంబు, ధైర్యంబు సర్వంబు నిర్మూలమై పోయె, నిర్వీర్యుఁడై యొంటిగా నిల్చినావేకదా! కీర్తి కైజాఱె, దుష్కీర్తి చేకూరె, నింకేటికో యాస, లిక్కేటికాయాస, మేసౌఖ్యముల్ పొంద నాశించితో? నాథ! నామానభంగంబు నీక్షింప నీకిష్టమే? శ్రేష్ఠమే? కష్టమైతోఁపదే? భ్రష్టకార్యంబనన్ గాదె? నీకేటికీదీనమావృత్తి? వీరాది వీరుండవే? విక్రమోదారశూరుండవే? రాముతో ఘోరసంగ్రామభీముండవై పోరుమా! గెల్చినన్ గీర్తి నాచంద్రతారార్క మార్జింపుమా! లేక, యాదేవుబాణానలజ్వాలకున్ బ్రాణ మర్పించి, ధన్యత్వమున్ గాంచి శ్రీమోక్షసామ్రాజ్యసౌభాగ్యముల్ పొందుమా! యేల భీరుండవై యిట్టిలీలన్ మదిన్ బెట్టితో?' యంచు దీనాస్యయై వెల్లుదుగఖించు నర్ధాంగిపా టెంచి, వాక్యంబు లాలించి, లోనైఁ పఁగా లేక, తా దిగ్గునన్ లేచి, నిల్చెన్ దశాస్యుండు, బలభీకరాకారుఁడై లోకముల్ బెగ్గిలన్ మేఘగంభీరమౌగర్జనల్ సల్పుచున్, వానరానీకమున్ గొట్టుచున్, నేలకున్ బెట్ట రాఁగాంచి యావానరుల్ మోదితస్వాంతులై కూఁకలన్ బెట్టుచున్ బాఱఁగా;—

### రావణుఁడు మందోదరినూఱడిలఁజేసి, యుద్ధరంగమున కేగుట

రావణుం డంత మందోదరి౯ జేరి, కేల్వట్టి మోమెత్తి వీక్షించి, భాషించు- 'నేనుండ నీకేటి కీదైన్య మోదేవి! సౌఖ్యంబుమై నుండుమా! నాప్రతిజ్ఞ౯ సమాలింపుమా! నేఁడు నారాఘవు౯ జంపెద౯ లేనిచో వానిచేఁ జత్తునే కాని నే రానిఁక౯ లంకకు౯; నీవు నంతఃపురంబేగు' మంచాడి యోదార్చి, యాకామిని౯ బంపి, శీఘ్రింబుగాఁ గొల్వుకూటంబున౯ జేరి, భూషావళుల్ దాల్చి, దివ్యాంబరంబుల్ మెయి౯ గట్టి, కస్తూరిగంధంబు గాత్రంబున౯ బూసి, తాఁ బారిజాతప్రసూనంబుల౯ దాల్చి, దివ్యాంగసౌందర్యసమ్మోహనాకారుఁడై మించి, సంగ్రామవాద్యంబుల౯ మ్రోఁగఁగాఁ జేసి, రాహుత్తుల౯ వేగ రావించె, శస్త్రాస్త్రముల్ దాల్చి సైన్యంబువిచ్చేసెఁ, దా నంతట౯ దివ్యరత్నాంచితంబౌ రథంబెక్కి యంతంతట౯ హారతుల్ పట్టి రా దైత్యకాంతల్, జయధ్వానముల్ మిన్నుముట్టె౯, మహావైభవంబొప్ప ముక్తాతపత్రంబుల౯ బట్టి పార్శ్వంబున౯ గామినుల్ గొల్వఁగాఁ, జామరంబుల్ తగ౯ వీచుచు౯ సుందరుల్ ముందుముందేగఁగాఁ, బంక్తికంఠుండు తా నట్టిహాసంబున౯ - మార్గమందెన్ని యోదుర్నిమిత్తంబులు౯ దోఁప, లక్షింపకేపోయి సంగ్రామరంగంబున౯ జేరె;—

### మాతలిదేవేంద్రుపంపున పుష్పకముందెచ్చి, శ్రీరాము నధిష్ఠింపఁ బ్రార్థించుట

దేవేంద్రుసారథ్యము౯ సల్పునాసూతుఁ డేతెంచి, తా నభ్రమార్గంబునం దుండి దివ్యంబునౌ తేరిపై నెక్కి తా ఱివ్వున౯ ధాత్రికి౯ డిగ్గి, శ్రీరాముని౯ డాసి దండప్రణామంబుఁ గావించి, భాషించు- 'నో దేవ దేవేంద్రుఁ డీస్యందనం బంపె, నీవివ్యమాపిల్లు, నీబాణ మామేటివక్రాంగకంబుల్, సమర్పింపఁగా మీకు నన్నంపె, యుద్ధంబున౯ దాల్పు వైతథ్యము౯ గూల్పఁగా నిన్నుఁ బ్రార్థించె, సారథ్యము౯ సల్పఁగాఁ నాజ్ఞ నాకిచ్చె,' నంచాడి యర్పింప, నవ్వానికైఁ బూని హర్షించుచా రాముఁ డా దివ్యమౌ స్యందనం బెక్కి మధ్యందినాదిత్యునట్లొప్పెఁ, గీశేశులంత౯ జయ

ధ్వానముల్ సల్పి, రామిూఁదటన్ మాతలిన్ గాంచి, వే స్యందనంబున్ దశగ్రీవునిన్ డాయఁగాఁ దోలవిన్పింప, నాతం డటుల్ సల్పె;—

## రణరంగమున రామరావణుల వాక్ప్రకర్షము

నామిూఁద శ్రీరాముఁ డారావణున్ గాంచి,- 'చోరాగ్రగణ్యుండవై యన్యకాంతౌఘమున్ బల్మిమైఁబట్టి, లోకంబునన్ సాధులన్ బాములన్ బెట్టి, న్యాయ్యంబు, ధర్మంబుఁ బాటింప, కిన్నాళ్లు మత్తుండవై, నీవు వర్తించి తాపాపమో హెచ్చె, నీబాడికిన్ లోకముల్ నొచ్చె, దుష్టాత్ము నిన్ జంపి క్ష్మామండలిన్ శాంతిస్థాపింప లోనెంచితిన్, నీవు నింకైన సన్మార్గమున్ బట్టివర్తింతునంచున్ బ్రమాణంబుఁగావించి భూజాత నర్పింతువేనిన్ నినున్ గాతు నీపాపముల్ సైఁతు భాషింపుమా!' యన్న, నాపంక్తికంఠుండు తా మందహాసంబుగావించుచున్ బల్కు- 'నోరామ! యీప్రల్లదా లేల? భూజాత నేనియ్య, నీకేటి కాభ్రాంతి, నాబాణవర్షాగ్ని సైరించి ప్రాణంబులన్ గాచునో? సీతకై కాదు నీకై సుమీ! సీత నారీతి నేఁ దెచ్చితిన్, జోరుఁడన్ గాను నే వీరుఁడన్, వచ్చినా వీవు నాయిష్టమీఁదేతెఁ బోరాడుమా! నాభుజాటోపవీర్యంబు సైరింపలే కీవు మున్నీటిలో మున్గినన్, భీతి శైలంబుక్రిందన్ వెసన్ దూరినన్, భీకరాకారతన్ సూకరుండై పొదన్ సొచ్చినన్, సింహసత్త్వుండవై నిల్చిపోరిచ్చినన్, మించి మాయావివై మోసగింపంగ యాచించినన్, బాపఁడై కోపమున్ జూపినన్, క్షత్రియోత్తంసుఁడన్ ఖిల్లునన్ దివ్యశస్త్రాస్త్రముల్ దాల్చి యీరీతిగా వచ్చి, ఘోరంబుగా నిల్చి పోరిచ్చినన్ శౌరివై తాఁకినన్, బుద్ధుఁడై క్రుద్ధతన్ యుద్ధమున్ సల్పినన్, కల్కివై యూఁచి బిట్టుల్కు దట్టించినన్, నిన్ను నే మాన, నీయాన, నాశౌర్యవీర్యంబులన్ జూపి నేఁ బోరుదున్ బోలదీలీల, నాలంబుఁ గావింపుమా!' యన్న, శ్రీరాముఁ డల్లల్లనన్ నవ్వి, శీర్షంబు పంకించి, బాణంబుఁ బోమీటి, శీఘ్రంబుగా రావణుం డస్త్రమున్ బుచ్చెఁ, బోరాటమున్ గాంచ దిగ్దేవతల్ గుంపులై యభ్రమార్గంబునన్ జేరి, వీక్షించుచున్ [illegible], [illegible] శైలాగ్ర

భాగంబులన్ దాపసుల్ నిల్చి- 'సన్మంగళంబౌత శ్రీరాఘవా!' యంచు నాశీస్సులన్ బాడి హర్షించిఘర్షించి రాపిమ్మటన్;—

## రామ రావణ యుద్ధము

యుద్ధమో- యభ్రమభ్రంబునన్, భూమియున్ భూమియున్ సంభ్రమున్ సంద్ర, మొండొంటి దార్కొన్న యట్లుండె, నావ్వీరద్వ యుద్ధంబు వర్ణింపఁగా రానిదై, చూడ్కికిన్ ఘోరమై యూహ కత్యంతమై యొప్పెం బో!- యొండొరుల్ హుమ్మటంచార్చుచున్, గర్ణభేద్యంబుగా వింటిటంకారముల్ పుచ్చుచున్ ప్రచ్చుచున్, గర్వమే పొంగఁగా, దర్పజాటోపముల్ మీఱఁ, గోదండపాండిత్య మత్యంతచిత్రంబుగాఁ జూపి రాయిర్వురొక్కింతకాలంబు; వే దప్పకొం, చస్త్రముల్ గుప్పుచున్, దెప్పనన్ రొప్పుచున్, తెప్పపాటంతలో బాణముల్ వే పదుల్ నూఱులున్, లక్షలున్, గోటు, లంతంతకున్ శంఖముల్ పద్మముల్ దాఁటిపోఁగా నసంఖ్యాకమై కాండముల్ దండిగా నిండి, దిగ్దేశ మెందెందు గాఢాంధకారంబు పైఁగప్పినట్లుండ, నాయంతలో నంతయున్ వే పటాపంచలై పోయి, బ్రహ్మాండమే కాల్చిన ట్లగ్నులన్ గ్రక్కుచున్, మండు నారాచముల్ మెండుగా నిండ నొండొండు నిర్ఘాతనాదంబులన్ సందడుల్ సల్పఁ బోరాడి రావీరులున్;—

రావణున్ మెత్తు రొక్కప్డు, శ్రీరామునిన్ మెచ్చి కీర్తింతు రొక్కప్డు మిన్నీధి నా దేవతల్, బాణసంధానసంహారనైపుణ్యముల్ గాంచి;- వారిట్టు లాయొండొరుల్ తీసిపోకుండ సంగ్రామమున్ సల్ప, నాకొంత కా రావణుండేసె శ్రీరాము దేహంబునన్ నెత్తురుల్ గార, నద్దాని కా రాముఁ డత్యంతకోపంబు దీపింపఁగా, బాణవర్షంబుఁ గావించె దైత్యేశుఁడున్ గాలుఁ గేలార్ప రాకుండ; నాఘాటికిన్ దేరిపై వాఁడు మూర్ఛిల్లి చున్ వ్రాలె' నాదుస్థితిన్ గాంచి సూతుండు శీఘ్రించె యుద్ధావనిన్ వీడి పోఁదోలి తత్స్యందనం బొక్కచో నిల్పి, శైత్యోపచారంబులన్ తేనికిన్ జేయుచుండంగఁ, దా మూర్ఛఁబోనాడి కన్విచ్చి దైత్యేశుఁ డాహా

తునిఁ గాంచి రోసంబునఁ బల్కు- 'నోరోరి! నాశత్రువుల్ నవ్వఁగా, స్వాం దనం బిట్లు యుద్ధావనిన్ వీఁటితేవచ్చునే? తోలు శ్రీరాముపై' నంచు ,గర్జించె;-

శ్రీరాముఁ డామాతలిన్ గాంచి-'దైత్యుం డదేవచ్చె నీతేరు నా చోటికిన్ దోలుమం' చాడె, నాసూతు లాతేరునన్ దోలి ప్రత్యక్షమం దుంచ, శ్రీరాముఁ డా రావణున్ గాంచి భాషించు- 'ధాతృప్రసాదంబు లౌ మేల్ వరంబుల్ నిజున్ గాచు నం చింతగర్వంబునన్ బొంగుదే! దుర్మతీ! ధాతకున్ దాతనై మించి, నీయీతలల్ ధాత్రిపైఁ గూలఁగా నేతు, నన్ గానవో రాఘవున్? దుర్మదా! యేకవాక్యంబు నేకైక బాణంబు, నే నేకపత్నీవ్రతస్థుండ, నేకైకవీరుండ నీ రేడులోకంబులన్ జించెదన్ నిన్ను నీనాఁడు, నాశంకరుం డడ్డమైవచ్చినన్ మానఁ, బొంకం బుగా నిల్చి లోశంకలన్ మాని, నీబింకమున్ గొంకకే చూపు, నిన్నింక నేనైఁప! నంచన్న,' నారావణుం డట్టహాసంబుఁ గావించి, దృష్టించి శ్రీరామునిన్ దిట్టయై పల్కు;—

'ఔరౌర! నీవంతశూరుండవే, యీప్రగల్భంబు లేలా? సుపర్వుల్ దివిన్ జేరి వీక్షించుచున్నారదే, నీప్రతాపంబుఁజూపింపుమా! నాప్రతిజ్ఞా ప్రకారంబు నాలింపుమా! నేఁడు నీతమ్మునిన్ గూడ నిన్ జంపి, మీరక్త మాంసంబులన్ గ్రోమిాలిప్రేవుల౯, హారముల్ గాఁగఁ గంఠంబునం దుంచి మీశీర్షముల్ చేతులన్ బట్టియే కాని, నేఁ బోవ నాలంకకున్ జూడు!' మంచాడ, శ్రీరాముఁడున్ మందహాసంబుఁగావించె, నాయంత కాయిర్వు రున్ బాణముల్ పుచ్చి, ఘోరంబుగాఁబోరి రాహారనిద్రాదులన్ మాని, వా రేడహోరాత్రముల్ వీఁకతో;—

అంత వేసారి పోరాటముల్ సిల్పి వారాత్రణం బాఁగి, వీక్షించు కొంచొండొరుల్ మెచ్చి శీర్షంబు లల్లార్చి, భ్రూయుగ్మముల్ గంటుగాఁ గూర్చి, బల్ తీక్ష్ణరూక్షేక్షణంబుల్ ప్రసారించి వీక్షించి, యాతత్క్షణం బెత్తి వింటన్, మహానాదముల్ గొల్పి, బాణంబులన్ బుచ్చి యొక్కింత

పోరాడి, రామిుఁదటఁ రాముఁ డుగ్రాస్త్రముఁ మీఁటె, భూభాగ మల్లాడఁగా, నద్ది దావాగ్నియై సూటిగాఁబోయి దైత్యేంద్రు కంఠంబు లఁ ద్రుంచి ధాత్రిస్థలిఁ డొల్లఁగాఁజేసె, నభ్రంబునఁ దేవతల్ మెచ్చి కీర్తించి, రాయంతలో దైత్యు కంఠంబులుఁ మొల్చె, నాశ్చర్యముఁ బొంది వీక్షించి రాయొల్లరుఁ; రాముఁ డత్యంతవిభ్రాంతుఁడై, యింత యోజించి బాణంబు సంధించి వేవేంటనే మీటుచుఁ బాహువుల్ శీర్షముల్ ద్రుంప, నావెంటనే మొల్చుఁబో! క్రొత్తగా బాహువుల్ కంఠముల్;- వీడునారాచముల్, భూమిఁ బొల్లాడుశీర్షంబులుఁ బాహుబుఁ లెక్కసేయంగ రాకుండె, నంతంతలో మొల్చుఁగంఠంబులుఁ, బాహులిట్లంచువర్ణింపరాకుండె;—

**విభీషణుఁడు శ్రీరామచంద్రునకు; రావణుని ఆయువుపట్టు నెఱిఁగించుట**

శ్రీరాముఁ డస్త్రంబుఁ బోమీటుచిత్రంబు, నావెంట బాణంబులాశీర్షముల్ ద్రుంచుఁజిత్రంబు శైలోన్నతిఁ ధాత్రిపై శీర్షముల్ వ్రాల్చుఁజిత్రంబు, వెన్వెంటనే కంఠముల్ మొల్చుఁజిత్రంబుఁ జిత్రంబుగాఁ జూచి గీర్వాణు లాశ్చర్యముఁ బొంది భాషించి రీరీతిగఁ - 'రాముఁ డీదైత్యుకంఠంబులఁ ద్రుంచుటే దొడ్డయో? నెత్తురఁ గ్రమ్మకుండంగ ముం దట్లె మొత్తముగా శీర్షముల్ మొల్చుటే దొడ్డయో? చెప్పఁగారా' దటంచాడి విభ్రాంతులై కంటిపై ఱెప్పవేఁ వేయకే చూచుచుండంగ, శ్రీరాముఁ డాదైత్యుశీర్షంబులఁ ద్రుంచియుఁ ద్రుంచియుఁ జాల వేసారి యోజించుచుఁ నిల్చె, నారీతి నీక్షించి వేగఁ [1]విభీషాఖ్యదైత్యేంద్రుఁ డేతెంచి శ్రీరామతోఁ జెప్పెఁ గర్ణంబునఁ బల్ రహస్యంబుగఁ - 'నాభిమూలంబునందుఁ సుధఁ దాల్చె నీతం, డహో రాఘవా! వహ్నిబాణంబునఁ నాభి భేదించి, యద్దానినిఁ గాల్చి, యాపైన నూటొక్కమాఁ ల్లెంచి ఖండించుచో శీర్షముల్ పుట్టవిం' కన్న, శ్రీరాముఁ డాశ్చర్యమగ్నుండునై

1 సురారాతికమ్ముందు, పా-

వహ్నిబాణంబునన్ నాభి భేదించి, నూటొక్క మూర్ధించి శీర్షంబులన్ ద్రుంపఁగా, నొక్కశీర్షంబు బాహుద్వయం బేర్పడన్ నిల్చె, దైత్యేంద్రుఁ డత్యుగ్రహోదగ్రుఁడై - 'నారహస్యంబులన్ వైరితోఁ జెప్పి న న్నిట్లు గావింతువే?' యంచు, రోషారుణాక్షుండునై పండులన్ గీటుచున్, ఘూర్ణితస్వాంతుఁడై మించి గర్జించి, దిగ్దేశముల్ వే వడంకన్ స్వసోదర్యపై నుగ్రమౌ శక్తి నేయంగ సుంకింప, వీక్షించి తూర్ణంబుగా వచ్చి శ్రీరాముఁ డడ్డంబుగా నిల్చి, పెన్ జిమ్ములన్ జిమ్ముచున్ మిత్త్రియై మీఁదికిన్ వచ్చు నా శక్తిఁ దా నట్టి హస్తంబులన్ బట్టి వే రుద్ది చీకాకుగావించి నిర్మూలమున్ జేసె, నద్దాని వీక్షించి దైత్యుండు రుద్రుండునై రాముపై ఘోరశస్త్రాస్త్రముల్ గుప్పుచున్ రాఁగ, వేగన్ సురారాతితమ్ముండు దైత్యేంద్రుఁ డా రాముతోఁ బల్కు- 'దేవేశ్వరా! యొక్కడౌ కంఠముల్ పోయె నింకే మటం చీవు నీదుష్టుఁ దాత్సారమున్ జేయఁగాఁ బోకు, వైళమ్మె బ్రహ్మాస్త్రమున్ బుచ్చి సంహారమున్ జేయు'మం చన్న;—

శ్రీరాముఁడు బ్రహ్మాస్త్రముచే రావణుని జంపుట

రాముండు బ్రహ్మాస్త్రమున్ వింటి కెక్కించి, యాకర్ణమున్ నారినిన్ లాగి, లక్ష్యంబు నా దైత్యకంఠంబునం దుంచి-'నేనే త్రిమూర్త్యాత్మకుండౌ పరబ్రహ్మ నేనిన్, సమీక్షించి వేదంబులన్ ధర్మమున్ గావ జన్మించియే యుంటినేనిన్ క్రమంబొప్ప బ్రహ్మాస్త్ర మీ దైత్యు ప్రాణంబుఁ బోకార్చు'నం చాడి, బాణంబుఁ బో మీటె, నా ఘోరనారాచ మాభీల వేగంబుతోఁ గోటిసూర్యప్రకాశంబునన్ వచ్చి యద్దైత్యుకంఠంబు గెంటించె, నా వెంటనే గాత్ర మురీస్థలిన్ గూలె; నా గాత్రభారంబునన్ గ్రుంగె బృథ్వీస్థలం బింత, శైలంబు లూటాడె, దిగ్దంతు లల్లాడె, భూభారమున్ దాల్చి యున్నట్టి భోగీంద్రు శీర్షంబు లల్లాడె;—

నా మీఁదటన్ రామచంద్రుండు చాపంబు మున్ డించి, సౌమిత్త్రి కందిచ్చి శాంతించె, లోకంబులున్ మెచ్చె, మౌనుల్ మహానందమున్ బొందె, రా దేవతల్ మోదితస్వాంతులై పొంగి కీర్తించి, రా సిద్ధులున్

బాడి, రాసాధ్వు లాటాడి, రాయక్షగంధర్వనాగుల్ గరుత్మంతులుఁ గాంచవిద్యాధరుల్ మించి హర్షించి, రంతఁ సురారాతిసోదరుం డాయన్న వక్షంబుపై వ్రాలి కన్నీరు మున్నీరుగా నేడ్చె, శుద్ధాంత కాంతాజనం బెంత యో వచ్చి రోదించె, మందోదరీనారి దైత్యేంద్రుపై వ్రాలి నానా ప్రకారంబులన్ దాఁ బ్రలాపించి దుఃఖించె; శ్రీరాముఁ డాకుంభకర్ణానుజున్ జేరి దుఃఖంబుమాన్పించె, నారాక్షసేశుండు తా నగ్ని సంస్కార కార్యంబు నాయన్నకుం సల్పె, నాపిమ్మటన్ రాముఁ డాలక్ష్మణుం బంపి, పట్టంబుగట్టించి సింహాసనాసీనునిం జేసె, నాపంక్తికంఠానుజున్; రాక్షసేంద్రుండు రత్నంబులన్ జీని-చీనాంబరంబుల్ దగన్ గానుకల్గాఁ దెచ్చి శ్రీజానకీనేతకర్పించి పాదద్వయిన్ వ్రాల, రాముండు దీవించె, నాకానుకల్ మాతలిన్ గైకొనన్ జేసి నమ్రోక్తులన్ దన్పి స్వర్గంబునన్ జేరఁగాఁ బంచె, శ్రీరామచంద్రుండు దైత్యేంద్రు నీక్షించి- భూజాత నిచ్చోటికిన్ దోడితెం' డన్న, నాదానవాధీశుఁ డర్ధాంగితోఁ జెప్పె, నాకాంత పన్నీట స్నానంబు చేయించి, దివ్యాంబరంబుల్ మెయిన్ గట్టి భూషావళుల్ పెట్టి శ్రీపారిజాత ప్రసూనంబులన్ వేణికిన్ జుట్టి, శ్రీగంధకస్తూరికాచర్చ గావించి శ్రీకాంతతోఁ బోలు భూకామినీజాతయౌ లోకమాతన్ మహాపూత సీతన్, గడున్ భక్తితోఁ బల్లకిన్ దెచ్చి శ్రీరామభూకాంతు నాస్థానమున్ జేర్చినన్ సీత బల్ భక్తిమై భర్తకున్ మ్రొక్కి తత్పార్శ్వమున్ జేరరాఁ గాంచి శ్రీరామచంద్రుండు భూజాత కిట్లాడు;—

## సీతామహాదేవి యగ్నికుండమున్ బ్రవేశించుట

'ఓమానినీ! నిన్ జెఱన్ గొన్న దైత్యాధమున్ జంపి, నీబాధ తప్పించితిన్, ఘోర దుష్కీర్తినిన్ బాసితిన్, నేను నీ రెంటికై యింత కార్యంబుగావించితిన్, గార్యమున్ దీతె, హర్షించితిన్, నిన్ను నేనొల్ల, నెందేనియున్ బొమ్మనన్, గొంత దిగ్భ్రాంతయై భూమిపై వ్రాలి, యాకొంతకున్ దేఱి, తాఁ గంటికిన్ మంటి కైకైకథారాగతిన్ గారఁగా నశ్రువుల్, భోరుమంచేడ్చుచున్, నారి యాధీరుమో మల్లనన్ గాంచి, యిట్లాడు- 'నాయుల్లమున్ దెల్లమున్ జేతు మీ రెల్లరీక్షింపుఁడీ!' యంచుఁ

దా నగ్ని ధ్యానింపఁగా, వహ్ని ప్రత్యక్షమై యుండ, నయ్యగ్నికుండం బునన్ దూఁకె దిగ్దేవతల్ సూడఁగన్;—

### అగ్నిదేవుఁ డర్పింప, దశరథు నానతిని, శ్రీరామచంద్రుండు సీతాదేవిని బరిగ్రహించుట.

రాముఁ 'డాహా!' యనెన్ లక్ష్మణుం డయ్యయో! యంచు బిట్టార్చె, నావానరానీక మేడ్చెన్, మఱిన్ దైత్యులున్ మించిశోకించి, రా దేవతల్ గుంది, రా తాపసుల్ గంది, రంతంత కయ్యగ్ని జూడన్ ధరా కాశ మేకంబుగా మండుచున్ నిండె' నం దగ్నిదేవుండు ప్రత్యక్షమై భూసుతన్ దెచ్చి- 'యీసాధ్విని రామ! కైకొ' మ్మటం చిచ్చె, నంతన్ దశస్యందనుం డాకసంబందుఁ బ్రత్యక్షమై కొడుకులన్ గోడలిన్ బ్రీతి మై గౌఁగిటన్ గ్రుచ్చి:- 'బల్ పూతచారిత్ర యీసీతఁ జేపట్టు' మంచాడె, మోదించి రాముండు భూజాతపాణిన్ దగన్ బట్టె, గీర్వాణు లాయాజిలోఁ జచ్చియున్నట్టికీశాళికిన్ బ్రాణదానంబులన్ జేసి, రాయెల్ల రంతన్ దిరోధానులై పోయి రామీఁదటన్;—

### శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణసమేతుఁడై, విభీషణసుగ్రీవాదులతో నయోధ్యకు వెళ్లుట.

రాముఁ డాభానుపుత్త్రాదికీశేశులున్ దోడరా, దైత్యనాథుండు నున్ దైత్యులున్ గూడిరా, జానకిన్ లక్ష్మణున్ గూడి తాఁ బుష్పకం బెక్కి వేగన్ బ్రయాణంబు సాఁగించె లంకాపురిన్ వీడి సాకేతమున్ జేరఁగన్, మార్గమధ్యంబునన్ సీత కాతావులన్ జూపు చందందుఁ దత్తత్కథల్ చెప్పుచున్ బోయి, యాశ్రీభరద్వాజఋష్యాశ్రమంబందునన్ డిగ్గి, యమ్మౌనిచే సత్కృతుల్ వొంది, యీమీఁద సామీరినిన్ నంది గ్రామంబునన్ గైకపుత్త్రున్ విలోకించి, తా వచ్చు వృత్తాంతమున్ ముందుఁగాఁ దెల్పఁగాఁ బంపి, యానాఁడు వారెల్లరన్ గూడి తా నాభరద్వాజఋష్యాశ్రమంబందునన్ నిల్చె, నమ్మౌని మృష్టాన్నపానంబులన్ వారలన్ దృప్తిఁగావించె, నావేకువన్ లేచి శ్రీరాముఁ డాయెల్లరన్ గూడి వే పుష్పకం బెక్కి ముందున్ బ్రయాణంబు సాఁగించె;—



శ్రీ రామ పట్టాభిషేకము.

### భరతుఁడు శ్రీరామాదుల నెదుర్కొని, యయోధ్యకుఁ దోడితెచ్చుట

సామీరి యానందిగ్రామంబునుఁ జేరి, శ్రీరాముఁడే తెంచు వృత్తాంతముఁ జెప్పఁగాఁ, గైకపుత్త్రుండు హర్షించి, శత్రుఘ్నునిన్ గూడి, యా మంత్రిసామంతులున్ దల్లులున్ బంధువుల్ తోడరా, మంగళధ్వానముల్ మ్రోఁగఁగాఁ, దా నెదుర్కొంచు, శ్రీరామసౌమిత్రులన్ జానకిన్ గాంచి సాష్టాంగదండప్రణామంబులన్ జేసి, కేల్మోడ్చి నిల్చున్న, నాతమ్మునిన్ గాంచి శ్రీరాముఁ డాత్రంబునన్ గౌఁగిటన్ గ్రుచ్చి, శత్రుఘ్ను దీవించి, యాచార్యపాదంబులన్ వ్రాలి, తా మాతలన్ జేరి సాష్టాంగ మర్పించె, నామీఁద వారెల్ల రాయొండొరుల్ పిన్నలున్ బెద్దలున్ యుక్తరీతిన్ నమస్కారముల్ దీవనల్ సల్పి మోదించుచున్ బోయి, రాపుష్పకంబున్ గుబేరున్ వడిన్ జేరఁగాఁ బంపె;

### శ్రీరామపట్టాభిషేకము

శ్రీరాముఁ, డామీఁద గైకేయిపుత్త్రాలయంబున్ బ్రవేశించి, దానంబు ధర్మంబులన్ గొల్లగాఁ జేసి, శ్రీరామసౌమిత్రులున్ సీతయున్ గైకపుత్త్రుండునున్ వే జటావల్కముల్ వీడి, దివ్యాంబరాశేషభూషావళుల్ దాల్చి, రాయెల్లరున్ గూడి మృష్టాన్నపానంబులన్ దృప్తి సేవించి యారాత్రి యందుండి, మర్నాఁడు నాయందఱన్ గూడి శ్రీరామచంద్రుండు తా నాయయోధ్యాపురిన్ జేరి, యాచార్యునాజ్ఞానుసారంబుగా మంచిమూర్తంబునన్ భద్రసింహాసనం బెక్కి పట్టాభిషిక్తుండునై, ప్రీతి సంతృప్తిగా నిచ్చె నిష్టార్థమర్థ్యాళికిన్; గొన్నిమాసంబు లట్లేగఁగా, వానరశ్రేష్ఠులన్, రాక్షసాధీశునిన్ భూరిసన్మానముల్ సల్పి వీడ్కొల్ప, వా రేగి రంతన్ నిజాస్థానముల్ సేరఁగన్;—

రాముఁ డామీఁదటన్ గొంతకాలంబుపైఁ బుత్త్రులన్ గాంచెఁ, దానశ్వమేధంబులన్, రాజసూయంబులన్ జేసె, సౌఖ్యంబుగా బిడ్డలట్లెంచి పోషించె ధాత్రీప్రజన్, జోరబాధల్ నివారించె, జారాలి లేకుండఁగాఁ జేసె, దుష్టాత్ములన్ ద్రుంచె, శిష్టాళిఁ బాలించె, సత్యంబు ధర్మంబు

శీలంబులన్ గాచె, శ్రీరామరాజ్యంబునా కీర్తినిండారఁగాఁజేసె, ఽ న్నెచ్చికొండాడఁగా ధాత్రిఁ బాలించె సౌఖ్యంబుగా;—

మాసమాసంబునన్ వర్ష మవ్వారిగావచ్చె, క్షామంబు నిర్నామమైపోయె, నెందెందునన్ బంటలున్ బండె, జాడ్యంబు లేకుండె, ధాత్రీప్రజల్ నిండునూఱేండ్లు జీవించి, రవ్వారు శ్రీమంతులై, శాంతులై దాంతులై యుండఁగా, రామభూపాలుఁ డేలెన్ బదిన్నొక్క-వేయేఁడు లాదర్శభూకాంతుఁడై;- అంత స్వస్థానమౌ విష్ణులోకంబుఁ దాఁ జేరె;-

ఈదివ్యచారిత్ర మెవ్వారలేన్, భక్తిభావంబుచేతన్ బఠింపన్, వినన్, వ్రాసినన్, వారు శ్రీరాముకారుణ్యమున్ గల్గి యీలోకమందెల్ల కామ్యార్థముల్ పొంది, యాపిమ్మటన్ విష్ణుసాయుజ్యమున్ గందు, రీయంత సత్యంబటంచున్ మహామౌనివాల్మీకికిన్, నారదర్షీశ్వరుం డిట్లు రామాయణంబున్ వచించెన్ సమాప్తంబుగా;—

ఇద్ది శ్రీరామపాదాంబుజధ్యాననిష్ఠాగరిష్ఠుండు, విప్రుండు, వాసిష్ఠగోత్రోద్భవుం, డార్యవెంకోబరాయాత్మసంజాతుఁడున్, సాధ్వీలక్ష్మాంబికాగర్భసచ్ఛుక్తిముక్తాఫలంబైన, అశ్వత్థరాయండు నిర్మించునీదండకోపాఖ్య రామాయణంబందు శ్రీయుద్ధకాండంబు సర్పించెదన్ గొమ్మిదే ఆంజనేయా! మహావజ్రకాయా! సదా రామకార్యప్రియా! ధర్మధౌరేయ! సద్భక్తగేయా! బుధశ్రేయ! దీనార్తసద్భక్తబంధూ! దయాసింధు! శ్రీవాయుపుత్రా నమస్తే! నమస్తే! నమస్తే! నమః.

దండకరామాయణము సమాప్తము

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1948

# తప్పొప్పుల పట్టిక

## నాందిప్రస్తావన.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 17 | గూర్పి | గూర్చి |
| | 19 | భూరిహోమాభిషేకాది | భూరి హేమాభిషేకాది |
| ౬ | 4 | ప్రాణంబులై జేనికినిన్ | ప్రాణంబులై జేనికిన్ |
| | 13 | రామలింగున్ మఱిన్ | రామలింగున్ సతిన్ మొల్లమాంబన్ మఱిన్ |
| | 24 | ధాయరేతాగణ్యులై | ధౌరేయతాగణ్యులై |
| 6 | 11 | సాహాయ్యమునన్ | సాహాయ్యమున్ |

## బాలకాండము.

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 15 | ఖ్యాతచేతస్కులై | భ్రాంతచేతస్కులై |
| | 16 | బుగాన్, | బుగాఁ, |
| | 23 | భార్యలన్ జేరి, యూపా | భార్యలన్ జేరి, యూపాయ |
| 4 | 1 | నాయూతలన్ జాతకర్మంబులన్ | నాయూతలన్ దండ్రియున్ జాతకర్మంబులన్ |
| 13 | 10 | గాకార్యంబు నింకేమి! | గార్యంబు నింకేమి ! |
| 24 | 14 | నేనథాకృతిన్ | నేనసాధాకృతిన్ |
| | 20 | కోరుమచన్న | కోరుమంచన్న |
| 43 | 23 | దోడి తెమ్మన్న వేడ్కతో డ్తెచ్చె | దోడి తెమ్మన్నఁదో డ్తెచ్చె |
| 49 | 13 | యూకోసన్ | యూకోసలన్ |
| 51 | 20 | స్నావాదికృత్యంబులన్ | స్నానాదికృత్యంబులన్ |
| 53 | 18 | నదిన్ శబ్జమే తేర | నదిన్ శబ్దమే తేర |
| | 24 | బుత్రలోకంబునన్ | బుత్రశోకంబునన్ |
| 57 | 3 | పిశాచీ! ఆహా | పిశాచీ ! అహా |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 60 | 1 | నేమాని వేసంబుతో | నేమాని వేషంబుతో |
| | 6 | మీరెల్లరుఁ వింటివే! | మీరెల్లరుఁ వింటిరే! |
| 65 | 13 | మహానిష్ఠతఁ | మహానిష్ఠతో |

## అరణ్యకాండము.

| | | | |
|---|---|---|---|
| 85 | 3 | కడుఁ భ్రాతుఁడై | కడుఁ భ్రాంతుఁడై |
| 87 | 20 | నీకీఘోర | నీఘోర |
| 89 | 14 | సై పుయా ! | సై పుమా! |
| 91 | 3 | జెలునే నీకు ? | జెల్లునే నీకు ! |
| | 4 | మేనెల్లగిఙ్మండలిఁ | మేనెల్లదిఙ్మండలిఁ |
| 96 | 6 | దేసాన్నిధ్యమా | దేవసాన్నిధ్యమా |
| | 7 | భద్ద | భవద్ద |

## కిష్కింధాకాండము.

| | | | |
|---|---|---|---|
| 106 | 13 | బట్టలేఁడింద్రుం, | బట్టలేఁడింద్రుఁ, |
| 109 | 12 | నామ్రోఁగర్జించు | నామ్రోలగర్జించు |
| 111 | 17 | గొట్టుటఁ గాదు | గొట్టుటఁ రాదు |
| | 20 | యింటినేనిఁ నెఱఁ | యింటినేనిఁ వెఱఁ |
| | 24 | నీట్లిష్కింధలో | నీవట్లు కిష్కింధలో |
| 126 | 4 | ఘోరులై పోలేదా | ఘోరులై పోరలేదా |
| | 19 | వేఱు వేఱొక్క | లేఱు వేఱొక్క |

## సుందరకాండము.

| | | | |
|---|---|---|---|
| 133 | 11 | సంలదుఁ | సందులఁ |
| 134 | 7 | హారహారావళుల్ | హీరహారావళుల్ |
| 136 | 9 | యొక్కింతయూ | నంచాడియూ |
| 139 | 21 | పుట్టముఁగట్టి గందముఁ | పుట్టముఁగట్టి శ్రీగంధముఁ |
| 141 | 21 | మారాణి కష్మంచుఁ | మారాణి కష్మంచు |
| 142 | 22 | తానాత్మశంంచు | తానాత్మ శంకించు |
| 143 | 8 | గాన కేశోకముఁ జేయుచుఁ | గాన కెంతేని శోకించుచుఁ |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 144 | 25 | సంవతర్సంబైన | సంవత్సరంబైన |
| | 25 | వాయు సంజాయ | వాయు సంజాత |
| 145 | 1 | గాంచి నాసీవు | గాచి నాపీవు |
| 145 | 16 | నన్ బల్కు | నన్నన్న |
| 148 | 2 | నీకెల్లడన్ | నీకెల్లెడన్ |
| 150 | 14 | తద్బాణవర్షంబుగాఁ | తద్బాణవర్షంబుగాఁ, |
| 152 | 8 | దోరణాగ్రహంబు | దోరణాగ్రంబు |
| 156 | 22 | నల్లకల్లోలము జేసెఁ | నల్లకల్లోలముం జేసెఁ |
| 157 | 15 | శర్శచేలేచి | ర్శచేలేచి |
| 159 | 17 | వార్ధిలంగించి | వార్ధి లంఘించి |
| 163 | 18 | సుగ్రీవుండెట్లెట్లుం విన్పించె | సుగ్రీవుఁడెట్లెట్లు విన్పించె |
| 164 | 7 | గాంచినీ నీతివాక్యంబులన్ | గాంచినే నీతివాక్యంబులన్ |
| | 8 | యుష్మత్పతాపంబు | యుష్మత్ప్రతాపంబు |
| 165 | 2 | నద్రానినింద్రుండు | నిద్రానినింద్రుండు |
| | 18 | కాండంబు షర్పించెదన్ | కాండంబు నర్పించెదన్ |
| 168 | 5 | బ్రహ్మహస్తుండు వేలేచి | బ్రహహస్తుండు వేలేచి |
| 169 | 2 | నీతలల్ వప్రక్కతో | నీతలల్ ప్రక్కతో |
| 171 | 16 | జంబు మాల్యాఖుఁడో | జంబు మాల్యాఖ్యుఁడో |
| | 18 | నికై వచ్చి | నికై నొచ్చి |
| 172 | 8 | నేసెయుఁగన్ | నేనెయుంగన్ |
| | 16 | చాలునికుండు | చాలునింకుండు |
| 173 | 19 | కీర్తినార్జిపుమా! | కీర్తినార్జింపుమా! |
| 174 | 7 | విష్టువేర్యైన | విజ్ఞువేర్యైన |
| | 14 | వాఁడెందున్ | వాఁడెందునన్ |
| 175 | 8 | కుంభకర్ణున్ ద్రైత్యేశుఁ | కుంభకర్ణున్ విలోకించిదైత్యేశుఁ |
| 176 | 11 | బ్రహ్మాహస్తుండు | బ్రహహస్తుండు |
| 177 | 17 | నన్ గెటఁగా | నన్ గెంటఁగా |
| 182 | 8 | నాసత్త్వమయ్యెన్ | నాస్వత్వమయ్యెన్ |
| 188 | 11 | టేమివెన్కన్ | మిటేవెన్కన్ |
| | 24 | మమ్మంతయున్ | మమ్మెంతయున్ |

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 190 | 6 | నస్త్రంబు సంధించి, వేనారి మోహరించి | వేనారి మోహరించి, యస్త్రంబు సంధించి |
| 191 | 17 | లభాస్తారు | సభాస్తారు |
| 196 | 25 | హెచ్చు కోపంబు | లోహెచ్చుకోపంబు |
| 197 | 16 | దుండముల్ | రుండముల్ |
| 198 | 6 | యావద్విశిష్టంబుదై త్యసైన్యంబు | యావద్విశిష్టంబు నా దైత్య సైన్యంబు |
| 213 | 11 | తనుజాత | తనూజాత |
| 222 | 9 | చూచు చిట్లంటి | చూచు చిట్లుంటి |
| 222 | 18 | గ్రోమిాలి | గ్రోలి మిా |

# పండితాభిప్రాయము

విద్వాన్ చె. వేంకటరమణశాస్త్రి,
ఉభయభాషాప్రవీణ
చె. వేంకటకృష్ణశర్మ, P. O. L.,
పండిత సోదరులు, కర్నూలు

శ్రీయుత అశ్వత్థరావుగారి గ్రంథరచనోత్సాహము చిరకాలము నుండి చూచుచుండినభాగ్యము మాకుఁ గలదు. దండకరామాయణపఠనముతో వారిరచనావిషయమున మాయభిప్రాయ మీయవకాశ మొదవినది. కర్మవీరుఁడగు శ్రీరామచంద్రమూర్తికథను విలిఖించి శ్రీరావుగారు ధన్యతములైరి. వారిరచన మింపునింపునదై పండితపామరరంజకంబై యలరారుచున్నది. గ్రంథమంతయు నొకేదండకం బగుట పఠనాసౌలభ్యము నొసంగి రసపిపాసులకు మోదావహమైయున్నది. కథావృత్తము స్వభావముగ సరళమైనదైనను వీరిరచన దానికి మఱింత మనోహరత నీయ సమర్థమైనది. సర్వవిధముల నిది యాంధ్రసోదరుల కానందము నొసంగునదై యుండు నని యాశించు

భాషాసేవకులు
పండితసోదరులు

---

## గ్రంథకర్తచే రచింపఁబడిన గ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| మయూరధ్వజనాటకము | ... | 1 | 0 |
| యువతీవివాహభాగ్యోదయము (నాటకము) | ... | 1 | 0 |
| అశ్వత్థేశశతకము | ... | 0 | 4 |

అనుభవామృతము (అద్వైతగ్రంథము - పద్యకావ్యము)
అచ్చులో నున్నది.